# ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు

ఫిబ్రవరి 10 – 13
**1977**

కేశవ మెమోరియల్ హైస్కూలు ఆవరణ
హైదరాబాదు

ప్రత్యేక సంచికా సంఘం

అధ్యక్షులు : శ్రీ తిరుమల రామచంద్ర

సంపాదకులు : శ్రీ గోవిందరాజు రామకృష్ణారావు

సభ్యులు :

శ్రీమతి పావలి మణిశాస్త్రి — డా. అక్కిరాజు రమాపతిరావు

డా. అరిపిరాల విశ్వం — శ్రీ మిరియాల రామకృష్ణ

శ్రీ కవిరావు — శ్రీ జి. ఎస్. సూరి

శ్రీ మండలి బుద్ధప్రసాద్ — శ్రీ టి. ఎస్. మూర్తి

**ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు, 1977**

**ప్రత్యేక సంచిక**

ముఖచిత్రం : కుమారి బి. సుధారెడ్డి

బొమ్మలు : శ్రీ బి. వి. సత్యమూర్తి
శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ : వేంకట్రామ్ పేపరు ప్రొడక్ట్సు (ప్రై.) లిమిటెడ్
నారాయణగూడ, హైదరాబాదు - 29

ముఖ చిత్ర ముద్రణ : ప్రభుత్వ పాఠ్యగ్రంథ ముద్రణాలయము
హైదరాబాదు

ప్రతులు : 3000

వెల : రూ.15/-

ప్రచురణ : ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ,
బర్కత్‌పురా, హైదరాబాదు-500027

# విషయసూచిక

# ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలు

**ఫిబ్రవరి 10 – 13, 1977**

**హైదరాబాదు**

## ఆహ్వాన సంఘం

అధ్యక్షులు :

**శ్రీ మండలి వెంకట కృష్ణారావు**

విద్యా, సాంస్కృతిక వ్యవహారాల శాఖా మంత్రి

ఉపాధ్యక్షులు :

**శ్రీమతి దామోదరం కృష్ణవేణీ సంజీవయ్య**

స్త్రీ, శిశు సంక్షేమశాఖా మంత్రి

కోశాధికారి :

**డా. అంతటి నరసింహం**

సాంస్కృతిక వ్యవహారాల శాఖ ప్రత్యేకాధికారి

ప్రధాన కార్యదర్శి :

**శ్రీ న్యాయపతి రాఘవరావు (రేడియో అన్నయ్య)**

నిర్వహణ కార్యదర్శి :

**శ్రీ బుద్ధిగ సుబ్బరాయన్**

## 1. ఆర్థిక సంఘం :

అధ్యక్షులు :

శ్రీ డి. సీతారామయ్య

సమావేశకర్త :

శ్రీ కె. పుల్లయ్య

సభ్యులు :

శ్రీ పి. వి. బి. రావు

శ్రీ టి. ఎల్. కపాడియా

శ్రీ యం. రవీంద్రనాథ్ టాగూరు

## 2. ఆతిథ్య సంఘం :

అధ్యక్షులు :

శ్రీ కొత్తూరి సీతయ్యగుప్త

సమావేశకర్త :

శ్రీ పోలిశెట్టి నరసింహారావు

సభ్యులు :

శ్రీమతి న్యాయపతి కామేశ్వరి (రేడియో అక్కయ్య)
శ్రీమతి మండలి ప్రభావతీ కృష్ణారావు
శ్రీ కల్వ సూర్యనారాయణగుప్త
శ్రీ ఎం. భోజ్ రెడ్డి
శ్రీ కె. పెంచలయ్య
శ్రీమతి కె. సుగుణమణి
శ్రీమతి పి. కమల
శ్రీ కె. ఆర్. అమోస్
శ్రీమతి పి. బి. లక్ష్మి
శ్రీ మసూనా
శ్రీమతి అబిదా బిల్గ్రామి
శ్రీ కె. వి. శివయ్య
శ్రీ కె. ధర్మారావు
శ్రీ ఉద్దల చిన్న వెంకటరావు
శ్రీమతి జి. మాణిక్యమ్మ
శ్రీమతి జె. రాజ్యలక్ష్మి
శ్రీమతి కె. అరుణ
శ్రీమతి కె. రామకుమారి
శ్రీమతి జుబేదా
శ్రీమతి ఎ. కమల
శ్రీమతి కె. సరోజిని
శ్రీమతి ఎ. లక్ష్మి
శ్రీమతి టి. సబితారావు
శ్రీమతి జి. సావిత్రి
శ్రీమతి జి. చూడామణి
శ్రీమతి వై. లలితారావు
శ్రీమతి ఎం. సరస్వతి
శ్రీమతి కె. పద్మావతి
శ్రీమతి కె. రాధ
శ్రీమతి కందా పాపాయమ్మ
శ్రీమతి బి. ప్రేమగోపాల్
శ్రీమతి కె. సావిత్రి
శ్రీ ఆర్. గోపాలరావు
శ్రీమతి ఆర్. జానకీసాగర్
శ్రీమతి కె. శ్యామలాగోపాల్
శ్రీమతి ఆర్. సుభద్రమ్మ
శ్రీ ఎం. సీతారామయ్య
శ్రీమతి ఎం. పి. దేవి
శ్రీమతి టి. శాంతకుమారి
శ్రీ కాపూరి పట్టాభిరామయ్య
శ్రీమతి ఆర్. సీత
శ్రీమతి ఇ. సీతాదేవి
శ్రీమతి వి. విమలాదేవి
శ్రీమతి ఎన్. రాజామణి
శ్రీ ఐ. ఈశ్వరరావు
శ్రీ వి. శ్రీమన్నారాయణ
శ్రీమతి లలితా బాలకృష్ణ
శ్రీమతి బి. జయలక్ష్మి
శ్రీమతి తాళ్లూరి ఇందిర
డా. రామసీత
శ్రీ వి. ఆర్. దేశ్‌పాండే

## 3. కార్యక్రమ సంఘం :

అధ్యక్షులు :

శ్రీ బి. కృష్ణంరాజు

సమావేశకర్త :

శ్రీ వై. గోపాలరావు

సభ్యులు :

శ్రీ సి. ఎస్. రావు

శ్రీ గిరి రెడ్డి

శ్రీమతి వేదవతీ ప్రభాకరరావు

శ్రీ జి. యస్. శర్మ

శ్రీ బి. వి. నరసింహారావు

శ్రీ పాలడుగు నాగయ్య

శ్రీ కె. కోటిలింగం

## 4. చిత్రకళా ప్రదర్శన సంఘం :

అధ్యక్షులు :

శ్రీ పి. టి. రెడ్డి

సమావేశకర్త :

శ్రీ వై. ఆంజనేయులు

సభ్యులు :

శ్రీ జె. ప్రసాదరావు

శ్రీ బి. ఎ. రెడ్డి

శ్రీ ఎల్. ఎస్. బాబ్జి

శ్రీ వి. పూర్ణానందశర్మ

## 5. ప్రయాణ సౌకర్యాల సంఘం :

అధ్యక్షులు :

శ్రీ ఎం. పి. వి. అనంత

సమావేశకర్త :

శ్రీ ఇ. సీతారామయ్య

సభ్యులు :

డా. శ్రీమతి ఎ. వనజాక్షి

శ్రీమతి ఎ. శ్యామలాదేవి

శ్రీ జి. ఎల్. నరసింహం

శ్రీ జి. మునిరత్నంనాయుడు

శ్రీమతి పి. వసుంధరాదేవి

## 6. ప్రచార సంఘం :

అధ్యక్షులు :

శ్రీ సి. వి. నరసింహారెడ్డి

సమావేశకర్త :

శ్రీ సిద్దాని నాగభూషణం

సభ్యులు :

శ్రీ బి. ఏ. వి. శాండిల్య

శ్రీ తిరుమలశెట్టి శ్రీరాములు

శ్రీ పడిద కామేశ్వరరావు

శ్రీ రావూరి భరద్వాజ

శ్రీమతి తురగా జానకీరాణి

శ్రీ ఎన్. రాఘవేంద్రరావు

శ్రీ ఠాకూర్ వి. హరిప్రసాద్

## 7. ప్రత్యేక సంచికా సంఘం :

అధ్యక్షులు :
శ్రీ తిరుమల రామచంద్ర

సమావేశకర్త :
శ్రీ గోవిందరాజు రామకృష్ణరావు

సభ్యులు :
శ్రీమతి చావలి మణిశాస్త్రి
డా. అరిపిరాల విశ్వం
శ్రీ కవిరావు
శ్రీ వండలి బుద్ధప్రసాద్
డా. అక్కిరాజు రమాపతిరావు
శ్రీ మిరియాల రామకృష్ణ
శ్రీ జి. యస్. సూరి
శ్రీ టి. యస్. మూర్తి

## 8. రంగస్థల నిర్వహణ సంఘం :

అధ్యక్షులు :
శ్రీ మొదలి నాగభూషణశర్మ

సమావేశకర్త :
శ్రీ గరిమెళ్ల రామమూర్తి

సభ్యులు :
శ్రీ పి. సూరిబాబు
శ్రీ డి. ఎస్. ఎన్. మూర్తి
శ్రీ పి. ఎస్. ఆర్. అంజనేయశాస్త్రి
శ్రీ కె. ఎల్. నరసింహారావు
శ్రీ ఏకా వి. సుబ్బారావు

## 9. ప్రతిభా పాటవ పోటీల నిర్వహణ సంఘం - 1 :

(ప్రదర్శన కళలు)

అధ్యక్షులు :
శ్రీ పాతూరి శ్రీరామశాస్త్రి

సమావేశకర్త :
శ్రీ టి. వి. భద్రిరాజు

సభ్యులు :
శ్రీమతి వి. కస్తూరిబాయి కృష్ణంరాజు
శ్రీమతి వి. కమలా సుబ్బరాయన్
శ్రీ జి. లక్ష్మీనారాయణ
శ్రీ డి. ఆర్. కె. రాజు
శ్రీమతి జయమణి వేదనాయకం
శ్రీ ఇసుకపల్లి దక్షిణామూర్తి
శ్రీ పాలగుమ్మి విశ్వనాథం
శ్రీ ఎం. చిత్తరంజన్
శ్రీమతి వి. సీతాదేవి

## 9. ప్రతిభా పాటవ పోటీల నిర్వహణ సంఘం - 2 :

(ప్రదర్శనేతర కళలు)

అధ్యక్షులు :
శ్రీ పోతుకూచి సాంబశివరావు

సమావేశకర్త :
శ్రీ ఎస్. వి. రమణరావు

సభ్యులు :
శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ
శ్రీ కె. శేషగిరిరావు
శ్రీ రెడ్డి రాఘవయ్య
శ్రీమతి ఎ. లక్ష్మీరమణ
శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
శ్రీ కె. ఆర్. కె. మోహన్
శ్రీ ఎ. వి. శ్రీనివాసాచార్యులు

## 10. ఆరోగ్య, పారిశుద్ధ్య సంఘం :

అధ్యక్షులు :

డా. పి. తిరుమలరావు

సమావేశకర్త :

డా. హెచ్. పి. సుందర్

సభ్యులు :

డా. ఎ. రామచంద్రన్

శ్రీమతి టి. శాంతాబాయి

శ్రీమతి టి. రత్నాబాయి

శ్రీమతి ఝాన్సీలక్ష్మి

## 11. అంతర రాష్ట్రీ బాలల సంఘం :

అధ్యక్షులు :

డా. పి. ఎస్. ఆర్. అప్పారావు

సమావేశకర్త

డా. ఎమ్. వి. శాస్త్రి

సభ్యులు :

శ్రీమతి రామలక్ష్మి ఆరుద్ర

శ్రీ బాపు

డా. ఎస్. శివరామమూర్తి

శ్రీ సి. రామచంద్రరావు

## 12. సదస్సుల సంఘం :

అధ్యక్షులు :

శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య

సమావేశకర్త :

శ్రీ డి. వి. యస్. శర్మ

సభ్యులు :

శ్రీ మద్దిపట్ల వెంకటరావు

శ్రీ వెలగా వెంకటప్పయ్య

శ్రీ వంగపల్లి విశ్వనాథం

శ్రీమతి మూదిరెడ్డి సులోచన

శ్రీ కోకా రాఘవరావు

కుమారి ఎం. కె. దేవకి

కుమారి ఎం. శేషాబాయి

# కృతజ్ఞత

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీవారు 1977 ఆంధ్రప్రదేశ్ బాలల మహోసభలూ, ఉత్సవాలూ జరపాలని నిర్ణయిస్తూ, ఉత్సవ విజయాంకంగా చిరస్థాయిగా నిలువగల సర్వసమగ్రమైన ప్రత్యేక సంచికను కూడా ప్రకటించాలని సంకల్పించడం ముదావహం. అట్టి అపూర్వ సంచికను సంపాదించి ప్రకటించడానికి ఒక ప్రత్యేక సంచికా సంఘం ఏర్పాటు చేసి ఆ బాధ్యతను మాకు అప్పగించి గౌరవించినందుకు మేము ముందుగా అకాడమీకి మా కృతజ్ఞత తెలుపుకొంటున్నాము

ప్రత్యేక సంచికలో బాలబాలికల రచనలు ప్రకటించడంకంటె ఇంతవరకు తెలుగులో బాలసాహిత్యంలో వివిధ ప్రక్రియలలో జరిగిన కృషి సమీక్షా, ఇకముందు జరుగవలసి ఉన్న కృషికి సంబంధించిన సూచనలూ గల వ్యాసాలూ, వీటితోపాటు ఇతర భారతీయ భాషలలోనూ, ఆంగ్లంలోనూ కనిపించే బాల సాహిత్య పరిణామ వికాసాలను గూర్చిన వ్యాసాలూ, బాలల వ్యంగ్య చిత్రాలూ ప్రకటించడం సముచిత మని ప్రత్యేక సంచికా సంఘం భావించింది; తదనుగుణంగానే శీర్షికలు సిద్ధపరచి బాలసాహిత్యంతో సంబంధం గల ప్రముఖ రచయిత లందరినీ వ్యాసాలకు అర్థించడం, బాలలనుంచి వ్యంగ్యచిత్రాలు కోరడం జరిగింది. వ్యవధి తక్కువగా ఉన్నా మా అభ్యర్థన మన్నించి అమూల్యమైన తమ రచనలను అందజేసి మా కార్యం సుకరం చేసిన వారి కందరికీ మా కృతజ్ఞత!

ప్రత్యేక సంచికాసంఘ సభ్యులు కాకపోయినా మాతోపాటు మా కార్యభారంలో భాగం పంచుకుని సర్వవిధాలా చేదోడువాదోడుగా ఉండి సంచికా సంపాదన కార్యంలో మాతో సహకరించిన శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులకు, శ్రీ రెడ్డి రాఘవయ్యకు మా ధన్యవాదాలు. మేము ఎన్ని అవస్థలు పెట్టినా ఓర్చుకుని, కోరిన విధంగా సకాలంలో చిత్రాలు గీసి ఇచ్చిన శ్రీ బావరాజు వెంకట సత్యమూర్తికీ, శ్రీ శీలా వీర్రాజుకూ, మాతో సర్వవిధాలా సహకరించి సకాలంలో ముద్రణ పూర్తిచేసి ఇచ్చిన వేంకట్రామ్ పేపర్ ప్రొడక్ట్సు (ప్రై) లిమిటెడ్ వారికి, ప్రెస్సు సిబ్బందికీ - అందరికీ మా హృదయపూర్వక ధన్యవాదాలు!

తిరుమల రామచంద్ర  
అధ్యక్షుడు,  
ప్రత్యేక సంచికా సంఘం.

# వినతి

బాలలూ, పెద్దలూ అన్న భేదం కేవలం వ్యావహారికమైనది. నిన్న మొన్నటిదాకా బాలలుగా ఉన్న మనం ఈనాడు పెద్దలమై మన బాలల సాంస్కృతికావసరాలు తీర్చడానికీ, వారిలోని నిగూఢశక్తులు సమగ్ర వికాసం పొందేట్టు దోహదం చేయడానికి బాలల అకాడమీ స్థాపించి, ఈనాడు ఈ ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభలనూ, ఉత్సవాలనూ జరుపుకుంటున్నాం. ఇలాగే ఇవాళ బాలలుగా ఈ ఉత్సవాలలో పాల్గొంటున్న వారు మన కళ్ల ఎదుట పెరిగి పెద్దవాళ్లై డాక్టర్లో, ఇంజనీర్లో, లాయర్లో అయి, మళ్లీ వాళ్లతరం బాలల శ్రేయస్సుకోసం కృషి చేస్తారు. మానవ జీవితం ఎడతెరిపిలేని ఒక నిత్యవాహిని. దీనిలో బాల్యం, యౌవనం, వార్ధక్యం అనేవి కేవలం దశాభేదాలు మాత్రమే.

ఇప్పుడు పెద్దలమైన మనలో చాలమంది బాల్యం అస్వతంత్ర భారతదేశంలో గడిచింది. అప్పుడు మనకు పాఠ్యగ్రంథాలు తప్ప మనం ముచ్చటపడి సరదాగా చదువుకోవాలనిపించే బాలసాహిత్యం ఎక్కువగా లభ్యం అయేది కాదు. బాలలకు కొత్త నీతులు బోధించడానికి రుక్మిణీ పరిణయం, సుమతి శతకాల్లాంటి ప్రాచీన గ్రంథాలూ, శ్రీ కందుకూరి వీరేశలింగం, శ్రీ వావిలికొలను సుబ్బారావు వంటి పెద్దలు బాలలకోసం వ్రాసిన నీతి గ్రంథాలూ మనచేత పెద్దవారు చదివించేవారు. కాని అవి మనల్ని ఎక్కువగా ఆకర్షించి అలరింప గలిగేవికావు. అందుచేత పెద్దవాళ్లకోసం వ్రాసిన అగ్గిరాముడు, భలేరాముడు మొదలైన డిటెక్టివ్ నవలలే పెద్దవాళ్లు చూడకుండా మనమూ ఆ రోజుల్లో చదువుతూ ఉండేవాళ్లం!

శ్రీయుత వెంకట పార్వతీశ్వర కవులు, శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ చింతా దీక్షితులు, డా॥ గిడుగు సీతాపతి లాంటి పెద్దలు ఆ రోజుల్లోనే బాలలకు సరదా కలిగించిచదివించే సర్జనాత్మక రచనలు అవసరమని గుర్తించారు. తెలుగులో బాలసాహిత్య సృష్టికి ఆనాడే అంకురార్పణం జరిగింది. తరువాత స్వతంత్ర భారతదేశంలో ఇతర రంగాలన్నిటిలో లాగానే బాలసాహిత్యాభివృద్ధికి వీలుగా తగినంత ప్రోత్సాహం లభించడంతో శ్రీ న్యాయపతి రాఘవరావు (రేడియో అన్నయ్య), శ్రీమతి న్యాయపతి కామేశ్వరి (రేడియో అక్కయ్య) రేడియోద్వారానూ, బాల పత్రిక ద్వారానూ, దేశమంతటా స్థాపించిన బాలానంద సంఘాల ద్వారానూ బాలలలో నూతనోత్తేజం, నూతనోత్సాహం కలిగించడానికి కృషి చేశారు. 'బాల' పత్రిక, చందమామ, బాలమిత్ర వంటి ఇతర పత్రికలూ బాలసాహిత్య రచయితలకు ప్రోత్సాహాన్నిచ్చి, బాలసాహిత్యం

విరివిగా వెలువడడానికి దోహదం చేశాయి. వివిధ ప్రచురణకర్తలు కూడా బాలసాహిత్యం ప్రకటించేందుకు ముందుకు వచ్చారు.

తెలుగు వాఙ్మయం, తెలుగు కళా ప్రతిభ వివిధ రంగాలలో సర్వతోముఖాభివృద్ధి సాధించాలంటే కేవలం ప్రజల ఉద్యమాలవల్లనే అది సాధ్యం కాదనీ, ప్రజాప్రభుత్వ సహకారం కూడా అందుకు అవసరమనీ గుర్తించి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వివిధ అకాడమీలను స్థాపించింది. తరువాత బాలవాఙ్మయం సమగ్రాభివృద్ధికి తోడ్పడడానికి, తెలుగు బాలలలోని విశిష్ట సర్జనాత్మక శక్తుల వికాసానికి, ప్రతిభా పాటవ పోటీల నిర్వహించి వారిని ఉత్తేజపరచడానికి ఒక బాలల అకాడమీ కూడా స్థాపించాలని సంకల్పించింది. తత్ఫలితంగానే 1976 మార్చినెలలో ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమీ వెలసింది. భారతదేశంలో మొట్టమొదటి బాలల అకాడమీ మనరాష్ట్రం లోనే వెలసినందున తెలుగువారు గర్వపడవచ్చు. ఇంకా ఏడాది కూడా పూర్తిగా నిండని బాలల అకాడమీ సాధించిన దానికంటె సాధించవలసింది సహజంగా ఎక్కువగా ఉంటుంది. శాఖోపశాఖ లుగా అకాడమీ కార్యక్రమాలను విస్తరింపజేసుకునేముందు దేశంలో బాలసాహిత్యాభివృద్ధికి కృషి చేస్తున్న పెద్దలందరినీ సమావేశపరచి తాను సంకల్పించిన కార్యక్రమాల విషయంలో వారి అమూల్యమైన సలహా సహకారాలను పొంది వక్తృత్వం, వ్యాసరచన, పద్యరచన, చిత్రలేఖనం, ఫొటోగ్రఫీ, నాటకాలు, నృత్యం, సంగీతం మొదలైన వివిధ రంగాలలో ప్రతిభ ప్రదర్శించే బాలలనందరినీ రప్పించి, వారికి ఆయా రంగాలలో సిద్ధహస్తులైనవారిచేత సందేశాలు ఇప్పించా లని ముఖ్యంగా ఈ మహాసభలను ఏర్పాటు చేయడం జరిగింది.

మహాసభల సందర్భంగా ప్రత్యేక సంచిక ప్రకటించే సంకల్పంతో వ్యాసాలు పంప వలసినదని అర్థించినదే తడవుగా దేశంలో బాలసాహిత్యాభివృద్ధికి కృషి చేస్తున్న ప్రముఖ రచయిత లందరూ తమ ముఖ్య వ్యాసాలు పంపి మా సంకల్పాన్ని సఫలం చేసినందుకు వారినందరికీ నా కృతజ్ఞత. సంచిక ముఖచిత్రానికి సోవియట్ భూమి నెహ్రూ అవార్డు నందుకొన్న చిరంజీవి బి. సుధారెడ్డి రచించిన చిత్రాన్ని ఎన్నుకొన్నాము. చిరంజీవికి ఆశీస్సులు. చర్చా పదస్సులతో, వినోద కార్యక్రమాలతో బాల చిత్రకళా, పుస్తక ప్రదర్శనలతో నాలుగు రోజుల పాటు జరుగుతున్న ఈ ఉత్సవాలు నిర్దిష్ట లక్ష్యాలు సాధించి, విజయవంతంగా పూర్తికాగలవని ఆశిస్తున్నాను.

మండలి వెంకటకృష్ణారావు

అధ్యక్షులు, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ
విద్యా సాంస్కృతికశాఖామంత్రి.

హైదరాబాదు
10-2-1977

# బాలల అకాడమీ

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ఆధ్వర్యంలో యీ సంచిక వెలువడుతున్నది. ఇందులో చాలామంది బాల సాహిత్యాభిమానుల రచనలు ప్రచురించాం. బాలల సంక్షేమం, బాల వాఙ్మయం, బాలల సాంస్కృతిక ప్రగతి, బాలల కళలు ఇత్యాది విషయాల మీద మీరు యీ సంచికలో వ్యాసాలు చదవగలరు.

అసలు యీ "బాలల అకాడమీ" అంటే ఏమిటి? ఈ అకాడమీ ఏమి చేస్తుంది? దీని ప్రయోజనం ఏమిటి? దీని ఆదర్శాలేమిటి?

ముఖ్యంగా మన తెలుగు పిల్లలకు తమ బడి, పాఠ్యగ్రంథాలు తప్పితే చక్కగా చదువుకునేందుకు వేరే పుస్తకాలు - కథలుగాని, నవలలుగాని, నాటకాలుగాని, విజ్ఞాన విషయాలుగాని, జీవిత చరిత్రలుగాని, సాహస గాథలుగాని, బొమ్మల పుస్తకాలుగాని విరివిగా లేవు.

పాఠ్యగ్రంథాలను ప్రభుత్వం ప్రచురిస్తోంది. బడి పుస్తకాలు బాల వాఙ్మయం కాదేమో! బాలలను పూర్ణ ప్రతిభావంతులుగా చేయడానికి ఇవి చాలవు.

'బాలల అకాడమీ' తెలుగు బాల సాహిత్యం గతులూ, రీతులూ రూపొందించి తాను పుస్తకాలు ప్రచురించడానికీ, రచయితలనూ, ప్రచురణ కర్తలనూ ప్రోత్సహించడానికీ ప్రయత్నిస్తోంది. బాల వాఙ్మయ రచయితలను కూడగట్టుకొని, రచనలను ప్రోత్సహించడం ఒక ముఖోద్దేశం.

రెండవది: మన రాష్ట్రంలో అనేక బాలానంద సంఘాలు ఏర్పడి వున్నాయి. ఆ సంఘాలు పిల్లల సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించి, బాల కళలను ప్రోత్సహిస్తున్నాయి. అట్టి సంఘాలను పటిష్ఠం చేయాలికదా? ఈ పని ఎవరిది! ఈ బాధ్యత ఎవరిది? బాలల అకాడమీ అట్టి బాల సంఘాల నిర్వహణను ప్రోత్సహిస్తుంది. బాలల లలిత కళలను ప్రోత్సహించడం ఒక ముఖ్య ఆదర్శం.

ఇదివరలో మన భారతదేశంలో ఏ అకాడమీ చేపట్టని కార్యక్రమం మన బాలల అకాడమీ చేస్తోంది.

పిల్లల మహాసభలూ, సదస్సులూ, పుస్తక, కళావస్తు ప్రదర్శనలూ, ఇప్పుడు జరుగుతున్న బాలల రాష్ట్రస్థాయి ఉత్సవాల సందర్భంగా ఏర్పాటు చేస్తోంది. భావి పౌరుల సమగ్ర ప్రగతిని, సమస్యలను మేధావులు చర్చించి, ప్రణాళికలను రూపొందిస్తారు.

మన బాలలకు ఒక "సమగ్ర" పత్రిక కావాలి. బాలల పత్రికా ప్రచురణ బాలల అకాడమీ ముఖ్యోద్దేశాలలో ఒకటి.

గత మార్చిలో స్థాపితమై సెప్టెంబరులో పని ప్రారంభించిన బాలల అకాడమీ, చాలా పనులు చేపట్టిందనే చెప్పాలి.

బాలల అకాడమీ గత నవంబరులో జిల్లా స్థాయిలో ప్రతిభా పాటవ పోటీలు నిర్వహించి బాల కళాకారులను ప్రోత్సహించడం ప్రారంభించింది. ఇప్పుడు రాష్ట్రస్థాయిలో కళాత్మక పోటీలను యీ బాలల మహాసభ సందర్భంగా నిర్వహిస్తోంది.

అంతేకాదు, జిల్లాలలోని బాలల మధ్య "నే నెరిగిన ఆంధ్రప్రదేశ్" అనే శీర్షికతో ఒక వ్యాస రచన పోటీని నిర్వహించింది. ఆ వ్యాసరచన పోటీలో గెలిచినవారిని జిల్లాకు ఇద్దరు చొప్పున ఎన్నికచేసి, అకాడమీద్వారా ప్రత్యేక బస్సులో విజ్ఞాన యాత్ర చేయించి, ఆ విజ్ఞాన యాత్రను రంగుల వార్తా చిత్రంగా తీయించాలని సంకల్పిస్తోంది.

మున్ముందు మా అకాడమీ చేపట్టదలచిన ప్రధాన కార్యక్రమాలు :

1. బాలల పత్రిక, 2. బాల వాఙ్మయ సంకలనం,
3. బాలల విజ్ఞాన సర్వస్వం ప్రచురణ.

ఈ సంచికలో చాలామంది రచయితలు తమ వ్యాసాలలో చాలా మంచి సూచనలు చేశారు. ఇంతమంది సహృదయులు చేసిన సూచనలను పరిశీలించి ఆచరణలో పెట్టేందుకు అకాడమీ ప్రయత్నిస్తుంది.

(signature)

ప్రధాన కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ

# ప్రాచీన సాహిత్యములో బాలల పఠనీయాంశములు

– డా॥ దివాకర్ల వేంకటావధాని

బాలబాలికలందరు భాగవతమునందలి కొన్ని ఉపాఖ్యానములనైన తప్పక చదువవలెను. అది వారి తెలుగుతనమునకు వన్నె చేకూర్చును. భావి జీవితమునకు పెంపు కలిగించును.

నన్నయ తిక్కనాదులైన ప్రాచీనాంధ్ర మహాకవులు కావ్యహేతువులైన ప్రతిభా వ్యుత్పత్త్యభ్యాసములు మూడింటికిని పట్టుగొమ్మలై నట్టివారు. వారాంధ్రమున ఎంతటి మహాపండితులో సంస్కృతమునగూడ అంత మహాపండితులు. ఇచ్ఛించినచో వారు సంస్కృతమునగూడ కావ్యసృష్టి చేయజాలిన మహనీయులని చెప్పుటకు సంశయింపనక్కఅలేదు. ఆంధ్రుల అదృష్టవశమున వా రాంధ్రభాషలోనే రచనలు చేయుట సంభవించినది. వారు పండితాఖండలులగుటచే వారి రచన లతిప్రౌఢములైయుండుట సహజమే! అయ్యును వస్తురసాదులను బట్టి వారు సర్వసుబోధమైన రచన సాగించిన పట్టులుకూడ పెక్కు గలవు. అవి బాలురకే గాక పామరులకు కూడ సుగ్రహములై ఇంపు నింపుచుండును.

ఆంధ్ర వాఙ్మయమున ఆది కావ్యము భారతము. అది పంచమ వేదమని ప్రఖ్యాతి గాంచినట్టిది. అందు ధర్మ తత్త్వ నీతి విషయము లనేకము లుండును. తాత్త్వక విషయములను బాలాదు లర్థము చేసికొనలేక పోయినను అందలి ధర్మ నీతి విషయములనెల్లను ఆంధ్రులెల్లరు అవగాహనము చేసికొని ఆనందింపజాలుదురు. నిజమునకు కావ్యములకు ఆనందప్రదానమే పరమ ప్రయోజనమైనను అందెడనెడ ఉపదేశము కూడ కావచ్చుననే యుండును. అందుచేతనే కావ్యప్రయోజనములను ఉపయోగించుచు లాక్షణికులు "కాంతా సమ్మిత తయోపదేశయుజే" అను వాక్యమునుగూడ చేర్చియుండిరి. మన ప్రాచీన కావ్యములలో నిట్టి ఉపదేశముతో కూడిన భాగములు పెక్కు గోచరించును. వాని నన్నిటిని బాలబాలిక లందరు చదివి అధికమైన లాభము పొందవచ్చును. అవి వారి జీవితములను తీర్చి దిద్ది వారిని ధర్మవర్తనులనుగానే కాక భవిష్యన్మహా పౌరులనుగా గూడ చేయజాలును.

నీతి ధర్మాదుల నుపదేశ పూర్వకముగనే చెప్పినచో నవి చదువువారికి కొంత విసుగు కల్పింపవచ్చును. అందుచేతనే భారతమును, పురాణాదులును వానిని కథోపాఖ్యానముల ద్వారా వివరించుచుండును. ఆ కథలను, ఉపాఖ్యానములను పఠించుచున్నప్పుడు బాల బాలికల హృదయములందు కావ్యరసముతోపాటు ఉపదేశసారముకూడ హత్తుకొనిపోవుచుండును.

> శాతముత్తాత లెంతెంత ధనముకూడఁ
> బెట్టి, పెట్టెలనిండుగఁ బెట్టియున్నఁ
> గష్టపడి, తాను న్యాయమార్గమునఁ
> బడయు
> స్వార్జితం బొక గవ్వతో సమముగాదు.
> పరుల నీకు నెట్లు వాంఛింతువో చేయ
> బరుల కట్లు చేయవలయు నీవు;
> సర్వశాస్త్రములను జర్చింపఁ దేలెడు
> సారమైన ధర్మసరణి యిదియె!
>
> -కందుకూరి వీరేశలింగము

ఇది ఒకవిధముగా దేహారోగ్యకరములైన ఔషధములను పంచదార, తేనె మున్నగు ననుపానములతో సేవించుటవంటిది. అందుచే బాలబాలిక లందఱు పూర్వకావ్యములందలి కథోపాఖ్యానములను చదువుట మంచిది. వారికి పఠనీయములైన అంశముల నన్నిటిని పేర్కొనుట కిట చోటు చాలదు. అందుచే కొన్నిటిని మాత్రము స్థాలీపులాక న్యాయముగా సూచింతును.

నన్నయ ఆదిపర్వమున గరుడోపాఖ్యానమును రచించెను. గరుడుడు తల్లి దాస్యమును బాపుటకై దేవలోకమున కేగి అమృతము తెచ్చిన వృత్తాంతమిందు వర్ణింపబడినది. ఇది మాతృభక్తిని బోధించు మంచి కథ. కద్రువ పందెముగెలుచుటకై ఉచ్చైఃశ్రవము తోకకు చుట్టుకొని నల్లని మచ్చ యుండునట్లుగా చేయుమని కుమారులను నియోగించెను. కర్కోటకాదులట్లు చేయుట కంగీకరించిరి. కొందఱు తల్లి చెప్పినను అధర్మము చేయరాదని అట్లు ఒనరించుటకు అంగీకరింపరైరి. అంగీకరింపనివారిని కద్రువ శపించెను. కద్రువ దుష్టురాలు. ఆమె కుమారులను అధర్మము చేయుమని పంచెను. కొందఱైనను బుద్ధిమంతులై ఆ అధర్మము చేయుటకు పూనరైరి. ఈ సందర్భమున తల్లి కుమారులను శపించుట ధర్మముకాదు. అందుచేతనేకాబోలు ఆ శాపము పూర్తిగా ఫలింపలేదు. ఆస్తీకుడు సర్పయాగమునుండి జనమేజయుని ఉడిగించి సర్పములను రక్షించెను. ఈ ఉపాఖ్యానము బాలబాలికలకు మాతృభక్తితోపాటు కొంత ధర్మాధర్మ విచక్షణతనుకూడ కలిగింపజాలును. ఇవి వారికే కాక పెద్దవారికి కూడ ఎంత అవసరమో వేఱుగా చెప్పనక్కఱలేదు.

బృహస్పతి కుమారుడైన కచుడు దేవతల కోరికపై మృతసంజీవని నభ్యసించుటకొఱకు శుక్రాచార్యుని జేరి అతనికి శిష్యుడై పలువిధముల సేవలొనరించెను. దేవయాని తన్ను ప్రేమింపగా నిగ్రహాయుక్తుడై అత డా ప్రేమను నిరాకరించెను. గురువుల నారాధింపవలసిన విషయ మీ భాగమునుండి తెలిసికొనవచ్చును.

తిక్కన ఉద్యోగపర్వమున సంజయుని రాయబారము విఫలమైనపిమ్మట దుఃఖితుడైన ధృతరాష్ట్రునికి విదురునిచే పెక్కు నీతులు చెప్పబడినవి. వానిలో పెక్కు చిన్న కంద పద్యముల రూపమున నున్నవి. విదురనీతి భారతములోని నీతిబోధక ఘట్టములలోనికెల్ల తలమానికమని చెప్పదగినట్టిది. ఆ నీతిరత్నములన్నియు బాలబాలికల వర్తనసౌందర్యమునకింతింతనరాని వన్నె చేకూర్పజాలును. తిక్కన రచించిన ఉపాఖ్యానములలో లుబ్ధకపోతోపాఖ్యానము, హంసకాకీయోపాఖ్యానము మున్నగునవి ఉత్తమ నీతిబోధకములైనట్టివి. అట్టివానిని బాలబాలికలు తప్పక పఠింపవలసియున్నది.

ఎట్టిన అరణ్యపర్వ శేషము చివర యక్ష ప్రశ్న లను భాగము కలదు. ధర్మరాజు యక్షుని ప్రశ్న లన్నింటికిని చక్కని సమాధానము లొసంగియుండెను. ఆ ప్రశ్నోత్తరములు చిన్న చిన్న వాక్యములతోకూడి ఎంతో హృద్యములై యుండును. అందు విశ్వజనీనములైన సత్యవిషయము లెన్నో చెప్పబడియున్నవి. వానిని బాల బాలికలు నేర్చుకొనవచ్చును; వచ్చునేకాదు, వలయును.

శైవ మహాకవులలో పాల్కురికి సోమనాథుడు సుప్రసిద్ధుడు. అతని రచనలలో శైవ మహావేశము సర్వత్ర గోచరించును. ఆవేశము బాల బాలికల కనవసరమన్న మాట నిజమే! కాని, అతడు బసవ పురాణమునందు రమ్యములైన కథలు కొన్ని చెప్పియుండెను. వానిలో కొన్ని నీతిమయములు, కొన్ని ధర్మబంధురములు, కొన్ని భక్తిబహుళములు. బెజ్జ మహాదేవి కథ బాలబాలిక లందఱును చదువదగినట్టిది. అది వాత్సల్యభక్తిని సూచించును. ఇట్టి కథలను చదువునపుడు బాల బాలికల హృదయక్షేత్రములందు భక్తి బీజాంకురములుప్పతిల్లి పెరిగి మహావృక్షములై వారికి పరమార్థము నందించుట కవకాశమున్నది.

మంచన మహాకవి కేయూరబాహు చరిత్రమను కథా ప్రబంధమును రచించెను. అది సంస్కృతమున రాజశేఖరుడు రచించిన విద్ధసాలభంజిక అను నాటిక ననుసరించి వ్రాయబడినది. మంచన మూలకథతో తృప్తిపడక అందు సందర్భము చిక్కినపుడెల్ల మంచి నీతి కథలను చెప్పియుండెను. ఆ కథలు పంచతంత్ర హితోపదేశములందలి కథలను పోలియుండును. వానినెల్ల పిల్లలు చదువవచ్చును అట్లే సంస్కృతమునందలి పంచతంత్ర హితోపదేశములు తెలుగున చంపూ కావ్యములుగా



అనువదింపబడినవి. అందలి కథలన్నియు నీతిబోధకములేకాక ప్రీతిదాయకములుగా కూడ నుండును. వానిని పఠించునప్పుడు బాల బాలికలు పొందు ఆనందమునకు మేరయుండదు. అవి వారికి నీతిబోధనముతోపాటు భాషా పరిజ్ఞానమును కూడ కలిగించును.

శ్రీనాథుడు పెక్కుకావ్యములు రచించెను. అవి పండితైకవేద్యములు. కాని అతడు పల్నాటి వీరచరిత్రమును సుబోధములైన ద్విపదలలో రచించెను. పల్నాటి వీరగాథకు పల్నాటి భారత మను ప్రసిద్ధియున్నది. అందలి బాలచంద్రునకును భారతమందలి అభిమన్యునకును చాల పోలికలున్నవి. బాలచంద్రుని పరాక్రమమును చదువునపుడు బాలబాలికల మేనులు పులకాంకితములగును. దేశరక్షణమునకు యువకులైన మహావీరుల అవశ్యకమెంతో యున్నది. బాలురలో నట్టి వీరవిజృంభణమును ప్రేరేచుటకు అట్టి కావ్యముల పఠన మెన్నో విధముల తోడ్పడును.

శ్రీనాథయుగమునందలి కవులలో అనంతామాత్యు డొక్కడు. అతడు భోజరాజీయ మను చక్కని కథాప్రబంధమును రచించెను. అందులో అసంఖ్యాకములైన కథలున్నవి. అవి అన్నియు బాలబాలికలకు పఠనీయములే! మచ్చునకు అందలి గోవ్యాఘ్రసంవాదము

పొక్కదానినిమాత్రము పేర్కొందును. సత్య ధర్మవర్తనము క్రూరములైన వ్యాఘ్రముల చిత్తములనైన మెత్తబడజేయు ననుట కిది తార్కాణము.

తెనుగున బమ్మెర పోతన రచించిన భాగవతము అమృతకలశమువంటిది. దానిని పఠించినచో నిహలోకమున నమృతము లేదని విచారించవలసిన అవసరముండదు. పూర్వము గజేంద్రమోక్షము, ప్రహ్లాద చరిత్రము, ధ్రువోపాఖ్యానము, అజామిళోపాఖ్యానము, వామన చరిత్ర, అంబరీషోపాఖ్యానము, రుక్మిణీ కళ్యాణము మున్నగువాని పఠనధ్వనులతో నాంధ్ర గృహము లన్నియు ప్రతిధ్వనించుచుండెడివి. ఇప్పుడు భాగవతము చాల మధురముగా నుండునని చెప్పువారే కాని చదువువారు లేరు. పూర్వము రుక్మిణీ కల్యాణము చదివించినచో బాల బాలికలకు వివాహము త్వరగా నగు నను విశ్వాసముండెడిది. ఇప్పుడు దానిని చదివించుటయు లేదు; బాల బాలికలకు త్వరగా వివాహము లగుటయు లేదు. బాల బాలిక లందఱును భాగవతమునందలి కొన్ని ఉపాఖ్యానములనైన తప్పక చదువవలెను. అది వారి తెలుగుతనమునకు వన్నె చేకూర్చును. భావి జీవితమునకు పెంపు కలిగించును.

తెలుగున 12 వ శతాబ్దిలోనే మొదటి శతకము వ్రాయబడెనని చెప్పుదురు. తరువాతనవి తండోప తండములుగా రచింపబడినవి. ఇప్పటికి తెలుగున నున్న శతకముల సంఖ్య సుమారెనిమిది వేలకు మించునని పరిశోధన వలన తెలియుచున్నది. ప్రాచీనాంధ్ర కవులలో గూడ శతకములను వ్రాసినవారు కొందరున్నారు. వృషాధిప శతకము, సర్వేశ్వర శతకము, సుమతి శతకము మున్నగువవి ముఖ్యములైనవి. ఈ శతకములలో నీతి భక్తి ధర్మ తత్త్వాదులనే గాక దేశభక్తిని, మత సిద్ధాంతములను, సంస్కరణమును, కథలను బోధించునట్టివి కూడ నున్నవి.

ఇప్పుడు శతకములు చదివించు నలవాటు పోయినది. దాశరథీ శతకము, శ్రీ కాళహస్తీశ్వర శతకము, భాస్కర శతకము, ఆంధ్రనాయక శతకము, వేమన పద్యములు బాల బాలికలెల్లరు చదువదగినట్టివి. వీనిని పఠించినచో బాల బాలికలకు చిఱుతవయస్సుననే నీతియం దాసక్తితో పాటు భాషయందనురక్తియు కలుగజాలును.



# పూర్వ సాహిత్యంలో బాలల ఆటలు

— డా॥ తిమ్మావజ్ఝల కోదండరామయ్య

తెలుగు జీవితములో ఒక భాగముయిన పిల్లల ఆటపాటలు మన జాతి సంస్కృతి సంప్రదాయములను ప్రతిబింబింప జేయును.

వాఙ్మయంలాగే ఆటలు కూడ జాతి జీవిత ప్రతిబింబాలు. మొదటిది వాగ్రూపమైతే రెండవది క్రియారూపమైనది. మానవునికీ, మానవునికీ పోలికలున్నట్టే ఆటలలోనూ క్వాచిత్కంగా పోలికలుండవచ్చు. కానీ, దేశకాల చరిత్ర ప్రభావంతో జాతి సంస్కృతి సంప్రదాయాలకు అనుగుణంగా అవి రూపు తీర్చుకుంటాయి. అలా రూపొందినవే తెలుగువారి ఆటలు కూడ. తెలుగునాట వెలసిన బౌద్ధక్షేత్రాలలోని శిల్పాలలో కొన్ని తెలుగువారి ఆటలకు మచ్చుతునకలు. మన ప్రాచీన సాహిత్యంలో కూడా ఈ ఆటల ప్రస్తావనలు పదింబదిగా కానవస్తాయి.

తెనుగుజాతి అనాదిగా తన బాల్యమునందు ఎన్నోవిధములయిన ఆటల నాడుకొని ఆనందించింది. కాలము గడవను, గడవను కొత్త ఆటల నెన్నిటినో సృష్టించుకొనియు, ఇరుగు పొరుగులవారినుండి నేర్చుకొనియు ఆటలను గూర్చిన తన పరిజ్ఞానమును పరిపుష్టపరచుకొనింది. ఇంచుమించుగా రెండువేల సంవత్సరములకు పైబడిన చరిత్ర కల ఆంధ్రజాతి బాల్యమున తన వినోదమునకై ఏయే ఆటలను ఆడుకొనుచుండినదో, ఏయేకాలములలో ఏయే ఆటలపై అభిమానము కలిగియుండినదో తెలిసికొనదగు ఆధారములు ఏవీ యితరత్రా మనకు లభించడం లేదు. ఈ విషయంలో శిల్పకళతో బాటు సాహిత్యమే మనకు ప్రధానంగా శరణ్యం అవుతున్నది. మన కవీశ్వరులు తమ కావ్యాలలో బుద్ధిపూర్వకంగా కాకపోయినా సందర్భవశాత్తుగా అక్కడక్కడా తెలుగు బాల బాలికలు ఆడుకొనుచుండిన బాల్యక్రీడలను కొన్నిటిని ప్రస్తావించియున్నారు. వారు ప్రస్తావించిన, పేర్కొనిన ఆ ఆటలలో ఏవో కొన్నిటికి తప్ప తక్కినవాటిని గూర్చిన వివరము లేవీ మనకు తెలియరావడం లేదు. మరి కొన్ని అసలే వ్యవహారంనుండి తొలగిపోవడం వల్ల వట్టి పేర్లు మినహా ఇతర విషయము లేవీ మనకు తెలియవు. ఇట్టిచో అయా పదములకు అర్థములు వ్రాసిన నిఘంటుకారులు కూడా బాల్యక్రీడావిశేషం అనో, బాలికా క్రీడావిశేషం అనో లేక బాలక్రీడావిశేషం అనో పేర్కొని తమ బాధ్యతను నిర్వర్తించామని సంతృప్తి చెందారు.

మన కవీశ్వరులు తమ కావ్యాలలో ప్రసంగవశాత్తుగా వర్ణించిన ఈ క్రీడలకు సంబంధించి

> పిల్లలకే స్వరాజ్యం వస్తే
> పిల్లలకే స్వాతంత్ర్యం వస్తే
> చిట్టితండ్రిని రాజుని చేస్తాం
> చిట్టితల్లిని రాణిని చేస్తాం!
> మాతాత ఒక బొమ్మయితేను
> మాఅవ్వ ఒక బొమ్మయితేను
> బొమ్మలపెళ్లికి రమ్మనమంటాం
> కమ్మని విందులు "గుమ్ము"గ
> తింటాం!
>
> —న్యాయపతి రాఘవరావు

ఒక వింత విషయం చెప్పవలసి ఉంది. విష్ణు పురాణంలో రామకృష్ణుల శైశవక్రీడలను అభివర్ణించే ఈక్రింది పద్యం చూడండి.

సీ. కోలక్రోతులు బిల్లగోళ్లు దూరనగోల
 లందలంబులు మటి కుందికాళ్లు
పుట్టచెండ్లుప్పనపట్టె లాలింకలు
 గుడుగుడుగుంచాలు గుంటచాళ్లు
చీకటిమొటికిళ్లు చిమ్మబిల్లలు నెట్లు
 బొట్టనగోలలు బొమ్మరాలు
కుప్పిగంతులు పిడిగ్రుద్దులాటలు పిల్ల
 దీవులు గొబ్బిళ్లు గూవనాలు
గీ. గుళ్లు దాగిలిమ్రుచ్చులు గోడిపట్టె
వేలపాటలు సరిబేసు లీలకూత
లాదిగా శైశవక్రీడ లాడి రచట
రామకృష్ణులు గోపదారకులఁ గూడి

విష్ణు. పు. ఆ. 2. 202 ప.

ఉత్తరాపథంలో జన్మించిన బలరామ కృష్ణులు తెలుగుదేశంలో తెలుగుపిల్లలు ఆడుకొనే బాల్యక్రీడలతో వినోదించారట!

కుమార సంభవం, బసవపురాణం, సింహాసన ద్వాత్రింశిక, కాళహస్తి మాహాత్మ్యం, పాండురంగ మాహాత్మ్యం మొదలయిన కావ్యాలలో తెలుగు బాల బాలికల ఆటలు ఎన్నో పేర్కొనబడి యున్నప్పటికినీ, అయ్యలరాజు నారాయణామాత్యుని హంస వింశతిలో పేర్కొన బడినన్ని ఆటలు మరెందులోను పేర్కొనబడ లేదు. నారాయణామాత్యుడు ఒక పెద్ద సీసమాలిక (3 ఆ. 147 ప.) లో తనకాలంనాటి పిల్లల ఆటలనన్నిటినీ గుది గ్రుచ్చినాడు. పై సీసమాలికలోని ఆటలలో పెక్కు ఆటలు ఎలాంటివో కూడ మనకు తెలియదు. చిర్రుబుర్రు, ఆకుపీకలు, గిలకలు, చిటికెలు, కీచుబుర్రలు మొదలయిన క్రీడాసాధనములుకూడా క్రీడలుగానే అందు పేర్కొనబడినట్లు తోస్తుంది.

ఇలాగే శ్రీ కాళహస్తి మాహాత్మ్యంలో కూడా తిన్నని కథలో కొన్ని బాలక్రీడలు పేర్కొనబడినవి. ఈక్రింది పద్యం చూడండి.

సీ. చిట్లపొట్లాకాయ సిరిసింగణావత్తి
 గుడుగుడుగుంచాలు కుందెనగుడి
దాగిలిమ్రుచ్చులాటలు గ్రచ్చకాయలు
 వెన్నెలకుప్పలు తన్నుబిళ్ల
తూరనతుంకాలు గిరనగింజలు
 పిల్లది వాలంకి బిల్లగోడు
చెడుగు రువ్వలపోటి చెండు గట్టినబోది
 యల్ల యుప్పనవట్టె లప్పళాలు
గీ. చిక్కనాబిల్లి లోటిళ్లు చిందరాది
యైన శైశవక్రీడా విహారసరణి
చెంచుకొమరులతోడ నుద్దించు కాడుఁ
దిన్నఁ డభినవ బాల్యసంపన్నుఁ డగుచు.

(3 ఆ. 33 ప.)

ఆధునికులలో కూడా జాతీయములయిన ఇలాంటి క్రీడలను ప్రసంగవశాత్తుగా పేర్కొనడం కనిపిస్తుంది. శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారి 'వేగిక్షేత్రము' అనే ఖండికలో కూడా

తెలుగు దేశంలోని బాలల ఆటలు కొన్ని పేర్కొనబడినవి.

మనకు తెలిసినంతవరకు తెలుగు సాహిత్యంలో తొలిసారిగా ఈ ఆటలను పేర్కొని వానికి కావ్యప్రయోగయోగ్యతను కల్పించిన మహాకవి పాలకురికి సోమనాథుడు. అతడు తన కావ్యాలలో అలనాటి సాంఘిక విషయముల నెన్నిటినో తెలిపినాడు. ఆ మహాప్రయత్నంలో కూడ ఈ పిల్లల ఆటలు అతని దృష్టిపథంనుండి తప్పిపోకపోవడం మన అదృష్టవిశేషం. అంతకుపూర్వం నన్నయ భారతంలో-కౌరవులకు ద్రోణుడు అస్త్రవిద్యాచార్యుడు కావడానికి ముందు వారు ఆడిన ఆట చిల్లగోడు లేక బిల్లగోడు అనే ఆట అయిఉంటుందేమో అని శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు అనుమానిస్తున్నారు. కానీ, వారాడిన ఆట అదే అని నిర్ధరించి చెప్పడానికి వీలులేదు. భారతంలో 'బంతియాట యాడిరి' అనే ఉన్నది కానీ కట్టెతో కొట్టి ఆడిరో, లేక కాలితో తన్ని ఆడిరో అందులో స్పష్టంగా తెలపబడలేదు. పాలకురికి సోమనాథకవి పేర్కొనిన ఆటలను ఈ క్రింది పంక్తులలో చూడండి:

'పొందంగ రాగుంజ పోగుంజ లాట
కుందెన గుడిగుడిగుంచంబు లాట
అప్పుల విందులయాట వల్మారు
చప్పట్లు వెట్టెడు సరిగుంజ లాట
చేరబొంతల యాట చిట్లపొట్లాట
గోరెంత లాట దాగుడుమూత లాట'

నన్నెచోడకవి కుమారసంభవంలో పార్వతి బాల్యదశను అభివర్ణించే ఘట్టంలో ఆమె తన స్నేహితురాండ్రతో కలసి కొన్ని ఆటల నాడినట్లు పేర్కొనబడింది. ముఖ్యంగా ఆడపిల్లలు ఆడుకొనే 'బొమ్మలపెళ్లి' అనే ఆట ఇందులో ప్రస్తావించబడింది. ఈ క్రిందిపద్యం చూడండి

తరుణులు చిల్కబొమ్మలును
దంతపుబొమ్మలు మేలిగాజులు
న్నరులును మ్రానిచొప్పికలు
నల్గడ నోలిన పేర్చి లీల చే
కుస బొమరిండ్లఁ జేయసగు
కూళ్లును వండుచు బొమ్మపెండ్లి మా
సరసుగఁ జేసి యాడ నగ
జాత శివార్చన సేయు నయ్యెడన్.
(3 ఆ. 36 ప.)

దీనికి తరువాత నాచన సోమనాథుడి ఉత్తర హరివంశంలో రెండుచోట్ల (4 ఆ. 155 ప; 5 ఆ.) ఉప్పనబట్టెలు అనే ఆట ప్రస్తావించబడింది. ఇదికాక నాచన సోమనాథుడు తన కాలంలో బాగా ప్రచారంలో ఉండిన 'నెత్తము' అనే ఆటను చాలా విపులంగా అభివర్ణించాడు. శ్రీకృష్ణుడు తన భార్యలతో నెత్తమాడినట్లున్న ఆఘట్టమును చూచినప్పుడు అది తెలుగువారు ఆకాలంలో ఆడుకొనుచుండిన ఆటగానే తోస్తుంది. కానీ ఈ ఆట పిల్లలు కాక పెద్దలు ఆడుకొనే ఆట అనడమే సమంజస మవుతుంది.

శ్రీనాథుని పలనాటి వీరచరిత్రలో బాలచంద్రు డాడినట్లుగా కొన్ని ఆటలు పేర్కొనబడినవి. ఈ క్రింది పంక్తులు చూడండి:

'గుమ్మడికాయలు కొంతసే పాడి
చెరుకులపందెంబు చెల్వొప్ప గెలిచి



> ఏనుగు ఎక్కి మనం
> ఏ వూరెళదాం ?
> ఏనుగు ఎక్కి మనం
> ఏలూ రెళదాం !
> గుఱ్ఱం ఎక్కి మనం
> ఏ వూరెళదాం ?
> గుఱ్ఱం ఎక్కి మనం
> గుంటూ రెళదాం !
> మోటారెక్కి మనం
> ఏ వూరెళదాం !
> మోటారెక్కి మనం
> మోటూ రెళదాం !
>
> -గురజాడ అప్పారావు

పోకలాటలచేత పుచ్చుము ప్రొద్దు
అడుడి ముత్యంబు లమరు బంతులును
గుంతమాపల నాడికొని గెల్చికొనుము
కుటిలజంతులఁ దెచ్చి గుడిలోననుంచి
విడిపించి పోరాడు విధమును జూడు
రూకల కుప్పలు రూఢిగ నాడు'

తెనాలి రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యంలోని ఈక్రింది పద్యం చూడండి:

సీ. కనుగట్టి గాంగేయగర్భు డాగురుమూఁత
లాడించె వస్త్రాపహరణవేళ
నాలమందలఁ బ్రోవ శైలమె త్తెడిపూన్కిఁ
గేలిమైఁ గందుకక్రీడ సలిపెఁ
జాటించెఁ గంబాలయాట రాసక్రీడ
నాభీరులకు మధ్యాంకపాళిఁ
దెలియించె యుక్తాతువిహరణం బిలకాధి
రాజకింకరశిరోరత్నరాజి
గీ. దన్నుఁ బిళ్ళాడె నంగుష్ఠదళిత సర్ప
తను సుదర్శననామ విద్యాధరేంద్ర
కఠిన జఠరచ్ఛలమున నగ్రజుఁడుఁ దాను
నందసూనుండు బృందావనంబునందు.

(8 ఆ., 178 ప.)

ఈ పద్యంలో దాగిలిమూత, బంతిఆట, నాలుగు స్తంభాల ఆట, సొగటాల ఆట, తన్ను బిళ్ళాట అనే ఆటల ప్రస్తావన మిక్కిలి రమణీయంగా చేయబడింది.

ఇంకా శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యం, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశిక, మంచన కేయూరబాహు చరిత్ర, అనంతామాత్యుని భోజరాజీయం, పింగళి సూరన కళాపూర్ణోదయం, తాళ్ళపాకవారి కీర్తనలు, పరమయోగి విలాసం, శేషం వెంకటపతి శశాంకవిజయం మొదలయిన గ్రంథాలలో బాలల ఆటలు ఎన్నో సందర్భ వశాత్తుగా ప్రస్తావించ బడినవి. వాటిలో కొన్ని కొత్త ఆటలు కూడా లేకపోలేదు. ఈవిధంగా మన ప్రాచీన సాహిత్యంలో పదింబదిగా ప్రస్తావించ బడిన తెలుగుబాలల ఆటలలో ప్రధానము లయిన వాటిని కొన్నిటిని మాత్రం యిక్కడ కొంత వివరిస్తాను.

1. అచ్చన గండ్లు :

అచ్చనగాయలు, అచ్చనగుండ్లు అనునవి దీని రూపాంతరములు. శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి సంపాదకత్వంలో వెలువడిన 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం'లో ఈ ఆట విపులంగా అభివర్ణింప బడింది. గచ్చకాయలతో గాని, చింతపిచ్చలతో గాని ఈ ఆట ఆడతారు. కళాపూర్ణోదయం, రామాభ్యుదయం, రుక్మిణీ పరిణయం మొదలయిన గ్రంథాలలో ఈ ఆట ప్రస్తావించబడింది.

తాళ్ళపాకవారు తమ కీర్తనలలో బాలల ఆటలను కొన్నింటిని ప్రస్తావించారు. ఈక్రింది కీర్తన చదవండి:

"కొల్చిన బోడ్డు దమ్మిని గుంత
పోకలాడెనట—(వామనగుంటలు)
రచ్చనా చన్నులు బొమ్మరాలు
తానాడేనంట—(బొంగరాలాట)
అరసి నాపేరు దిద్దె ఆడె చక్రపు బిళ్ళంట
(గిల్లెదండ)
గరిమం దొడలు ముట్టి కంబాలాట
లాడెనంట-(నాలుగు స్తంభాలాట)
అల నా కౌగిట నప్పలప్ప లాడెనంట-
(అప్పాలాట)
అలమి శ్రీ వేంకటేశుఁ డాలి మగ
నాటలంట-(పెండ్లియాట)

ఇలాగే రేపల్లెలోని బాలకృష్ణుని 'ఆలరి యాటల'ను వర్ణిస్తూ, బొమ్మపెండ్లి-గురుగుల ఆటలను (4-68) పేర్కొన్నారు. మాడువూరి చెన్నకేశవస్వామి ఆడిన ఆటలను వివరిస్తూ "పిల్లదీపులు, రాసక్రీడలు. చెట్టాపట్టాలు, దాగిలిముచ్చులు, బండివిరిబాటలు (8-470) అనే ఆటలను ప్రస్తావించారు. ఇలాగే ఉద్దగిరి కృష్ణుని బాల్యక్రీడలను అభివర్ణిస్తూ "పిల్ల గోట్లాట, పుట్ట చెండ్లాట, సముద్రబిళ్ళలాట, సిరిసింగనవత్తి, ఉడ్డ గచ్చనకాయలాట మొ॥ ఆటలను వివరించారు. సిరిసింగనావత్తి ఆట చాలా శ్రమపడి ఆడవలసిన ఆట కాబోలు! "చెమటలు గారఁ సిరిసింగనవత్తి యాడేను" అని తాళ్ళపాకవారు వర్ణించారు. తాళ్ళపాక పెదతిరుమలయ్య తన 'శృంగారదండకము'లో (పుట 80) గాలిపటముల ఆటను ప్రస్తావించారు.

తమిళంలో ఈ ఆటనే 'అమ్మానై' అని పేర్కొంటారు. ఈ ఆట ఆడేటప్పుడు పాడుకోవడానికి అనువుగా తమిళంలో రచింపబడిన జానపద గేయములకు 'అమ్మానై'లు అని పేరు. తెలుగులో కూడా ఈ ఆట ఆడేటప్పుడు అందులోని లయకు తగినట్లుగా పాటలు పాడతారు. వాటిలో మచ్చునకు ఒకటి-

'ఒక్కటి ఓ చెలియా
రెండు రోకళ్ళు
మూడు ముచ్చిలకా
నాలుగు నందన్నా
ఐదుం బేడళ్ళు
ఆరుం జవ్వాజి
ఏడు ఎలమంద
ఎనిమిది మనమంద
తొమ్మిది తోకుచ్చు
పది వటనేరు'—

ఇలాంటివే చాలా పాటలు ఈ ఆట ఆడేటప్పుడు పాడతారు.

2. అలంకి :

అలంకి, అలంకి గుడి అనేవి ఒకే ఆటకు సంబంధించిన పేర్లు. తాటిబుర్రలతో బండి కట్టి దానిని యీడ్చుకుంటూ ఆడే ఆట అలంకి. దానినే గుండ్రంగా యీడ్చుకుంటూ పోయి ఆడితే అది అలంకి గుడి.

3. అందలాలు :

ఇద్దరు పిల్లలు ఒకరి భుజములపై మరొకరు



పిల్లలందరు రండి
బళ్లోకి పోయి,
చల్లన్నిగాలిలో
చదువుకొందాము.
పొరుగుపిల్లలతోను
పోట్లాడబోక;
ఇరుగు పిల్లలతోను
యేట్లాడబోక.
చక్కగా నీ చదువు
చదువుకో తండ్రి!
చదువుకొంటే నీకు
సౌఖ్యమబ్బేను!

- వేటూరి ప్రభాకరశాస్త్రి

తమ రెండు చేతులను చాచియుంచి, ఆ చేతులనే అందలముగా చేసి, దానిపై ఒక బాలు నెక్కించుకొని ఆడే ఆట యిది. విష్ణుపురాణంలో ఈ ఆట ప్రస్తావించబడింది.

4. ఈల కూతలు

హంసవింశతిలో పేర్కొనబడిన క్రోవి కూతలు, ఆకుపీకెలు అనేవి ఈ ఆటకే పర్యాయ పదాలో లేక దీనికంటే భిన్నములో తెలియదు. అస లవి ఆటలేనా అని సందేహము. తాటాకుతోనో, కొబ్బరి ఆకుతోనో ఒక పీక (ఈల) తయారుచేసుకుని, దానిని నోటనుంచుకొని, ఊదుతూ ధ్వని వచ్చునట్లు చేసే ఆట కావచ్చు.

5. ఉప్పనపట్టెలు :

ఉప్పనపట్టెలు, ఉప్పట్లు అనికూడా దీనికి వ్యవహారం ఉంది. తొలిసారిగా ఉత్తర హరివంశంలో పేర్కొనబడిన ఈ ఆట కాశహస్తి మాహాత్మ్యం లోను, హంసవింశతి లోను పేర్కొనబడింది. శ్రీ సురవరం ప్రతాపరెడ్డి గారు తమ 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'లో ఈ ఆటను వివరించారు. ఉప్పుగుండు, ఉప్పు కుండము అని మరొక బాలక్రీడా విశేషం మన కావ్యాలలో ప్రస్తావించబడింది. అది ఇదే అగునో కాదో ఇంకనూ తెలియవలసిఉన్నది. ఈ ఆట ఆడే విధానాన్ని శ్రీ భాగవతుల సూర్యనారాయణశాస్త్రిగారు ఇలా తెలిపారు. 'ఈఆటను రెండుజట్లుగా ఆడతారు. ఈ ఆటలో ఎందరయినా ఆడవచ్చు. సాధారణంగా జట్టుకి అయిదుగురు చొప్పున పదిమంది ఆడతారు. మనుష్యులు ఎక్కువ అయితే జట్టులో ఉన్న మనుష్యుల్ని బట్టి గళ్లు పెరుగుతాయి. ఈ ఆటలో ఒకజట్టులో ఒకరు 'చర్ పట్టీ' దగ్గర నుంచుని యుండగా మిగిలినవాళ్లు లోపల ఉన్న అడ్డ బద్దీలదగ్గర ఉంటారు. రెండవజట్టులోవాళ్లు నిలువుబద్దీలదగ్గర ఉంటారు. 'చర్ పట్టీ' దగ్గరగా ఉన్న ఆటగాడు ఉప్పు పట్టుకొని ఒక్కొక్క గడిలో ఉప్పు చేరుస్తూ ఉంటాడు. అలా చేర్చేటప్పుడు కూతపెడుతూ వెళ్లాలి. మధ్యలో కూత ఆగిపోయినా, రెండోజట్టులోవాళ్లకి పట్టుబడినా అవుటయినట్టే. అలాచేస్తూ ఆ ఆటగాడు ఈఉప్పును లోపలనున్న తనజట్టువాళ్లకి అందిస్తాడు. వాళ్లు వెంటనే కూతపెడుతూ ఉప్పు కలపడానికి వెడతారు. ఇలా ఉప్పు తీసుకుని మళ్లీ చర్ పట్టీని దాటనీయకుండా శాయశక్తులా ప్రయత్నిస్తారు. అన్నిగళ్లకీ ఉప్పు కలుపుకొని చివరికి 'చర్ పట్టీ' దాటి 'చర్' అంటారు. అప్పుడు ఆజట్టు గెలిచినట్టు ఖాయపరుస్తారు. ఒక్క గడికేనా ఉప్పు కలపక పోయినా, మధ్యలో పట్టుబడిపోయినా ఓడిపోయినట్టే లెక్క! ఈ ఆటలోకూడా చెడుగుడు వగైరా ఆటలలోలాగే కూతపెట్టేందుకు పదాల్ని వాడుతారు.

6. ఓమనగుంటలు :

ఓమనగాయలు అని కూడా దీనిని వ్యవహరిస్తారు. ఈ ఆటను ఆడటానికి ఉపయోగించే సాధనమునకు 'ఓమనపీట' అని పేరు. ఇది చాలా ప్రసిద్ధమయిన బాలికల ఆట. ఒక కర్ర దిమ్మలో పద్నాలుగు గుంతలు రెండు వరుసలుగా (పదేసి) లెక్కించి, వాటిలో చింతపిచ్చలు పోసి ఈ ఆట ఆడతారు. మన కవీశ్వరులు ఈ ఆటను పదింబదిగా పేర్కొన్నారు. భోజరాజీయం, పాండురంగ మాహాత్మ్యం, యయాతి చరిత్ర మొదలగు ప్రబంధాలలో ఈ ఆట ప్రస్తావించబడింది. దీనిని 'వామన గుంటలు' అనికూడ-వకారాదిగా పేర్కొంటారు. కానీ, ప్రాచీనకావ్యము లన్నిటా ఇది 'ఓమనగుంట' లనియే పేర్కొనబడింది. హోమగుండములందు వ్రేల్చినట్లుగా ఈ ఆటలో ఒక్కొక్క గుంటలోనూ ఒక్కొక్క చింతగింజనో, గచ్చకాయనో, గవ్వనో వేస్తూ ఆడడంవల్ల ఈ ఆటకు తొలుత జనవ్యవహారంలో 'హోమగుంటలు' అని పేరు ఏర్పడి, ఆ తరవాత కాలక్రమాన 'ఓమనగుంటలు' అయిఉంటుందని భావించడం సమంజస మనిపిస్తుంది. పల్నాటి వీరచరిత్రలో 'గుంతమాపలు' అని ఒక ఆట పేర్కొనబడింది అది ఇదే ఆటయో, లేక దీనివంటి మరొక ఆటయో తెలియదు. శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు దానినిగురించివ్రాస్తూ 'గుంతమాపలు అనగా ఒక పలకలో కొన్ని గుంతలు చేసి అందు చింతగింజలు పోసి ఆడు ఆటయై యుండును' అని తెలిపారు. అదే నిజమయితే ఆ ఆట 'ఓమనగుంటల' కంటే భిన్నము కాదు.

7. కనుమూసి గంత :

పాల్కురికి సోమనాథుడు 'దాగుడుమూతలాట' అని పేర్కొనిన ఆట కళాపూర్ణోదయంలో 'కనుమూసి గంత' అని పేర్కొనబడింది. దాగిలి మ్రుచ్చులు, దాగిలిమూతలు డాగిలిమూతలు- ఇత్యాదిగా ఇతర కవులు ఈ ఆటనే పలువిధములుగా పేర్కొన్నారు. కళాపూర్ణోదయంలో 'కనుమూసి గంతనలు, కంబాలాట' అని ఉన్నది. కాని, యట 'కనుమూసి గంత, నలు కంబాలాట' అని పదచ్ఛేదము చేసికొని గ్రహింపవలసి యున్నది. 'నలు కంబాలాట' అనగా నాలుగు స్తంభాల ఆట. కనుమూసి గంత అనుదానిని 'కన్నులు గప్పి ఆడెడి ఆట' అని నిఘంటువులు వివరించినవి. ఒక బాలునికో బాలికకో ఒకగుడ్డ పేలికతో కన్నులు కట్టి వారు ఆటగాండ్రను కావలేక తడవుకొనుచు పోయి తక్కిన ఆటగాండ్రను పట్టుకొనుటకు ప్రయత్నిస్తారు ఆ ప్రయత్నంలో కృతార్థులయి, ఎవరినైతే ముట్టుకుంటారో వారు దొంగ అయి కన్నులకు గంతలు కట్టుకోవలసి వస్తుంది. విష్ణుపురాణం మొదలయిన అనేక గ్రంథాలలో ఈ ఆట ప్రస్తావించబడింది.

విరిసే పూవు రేకుల్లారా !
మురిసే చివురాకుల్లారా
రాగానికి అనురాగానికి
యోగమెపుడో చెబుతారా !

పరువెత్తే హరిణములారా !
ప్రసరించే కిరణములారా !
ఉదయానికి అభ్యుదయానికి
మొదలెచటో చెబుతారా !

అందని అరవిందములారా !
చిందని మకరందములారా !
అందానికి ఆనందానికి
అంచులేవో చెబుతారా !

-జంధ్యాల పాపయ్యశాస్త్రి

ఇలాగే మన ప్రాచీన సాహిత్యంలో బాల బాలికలు ఆడుకొనే ఆటలు ఎన్నో ప్రస్తావింపబడియున్నవి. వాటిలో కొన్నిటికి సంబంధించిన కొన్ని ఆటల స్వరూపములు మాత్రమే మనకు పరంపరగా అంది వచ్చుచున్నవి. తక్కిన ఆటల వివరములను గురించి, వాటి స్వరూప స్వభావములను గురించి యింకను పరిశోధించి తెలిసికొనవలసి యున్నది. తెలుగు జాతి జీవితములో ఒకభాగమయిన పిల్లల ఆటపాటలు మనజాతి సంస్కృతి సంప్రదాయములను ప్రతిబింబింప చేయును. ఈ క్రీడలను బాలక్రీడలు, బాలికాక్రీడలు, ఉభయసామాన్యములయిన క్రీడలు అని మూడువిధములుగా విభజింపవచ్చును. బాహ్యాభ్యంతర క్రీడలు (Indoor and outdoor games) అని వీటిని మరొకవిధంగా కూడా వింగడించుకొని పరిశీలింప వచ్చును. వీటినే క్రీడలు (Sports), ఆటలు (games) అనికూడా వింగడించుకొని ఆ రెండు వర్గములకు సంబంధించిన వాని వివరములను సాహిత్యాద్యాధారములతో పరిశీలింప వచ్చును. వివిధ ప్రాంతములకు చెందిన కవీశ్వరులు తమ కావ్యములందు చేసిన యీ ఆటల ప్రస్తావనలను బట్టి యేయే ఆటలు ఏ యే ప్రాంతములందు బహుళప్రచారము నందుండెనో కూడా తెలిసికొనుటకు ప్రయత్నము చేయవచ్చును.

మొత్తముమీద తెలుగుజాతి జీవితములో ఒక భాగమయిన ఈ ఆటలను గురించి సాహిత్యాదుల ప్రమాణముల ఆధారముతో ఇంకనూ సమగ్రమయిన పరిశోధన జరగవలసియున్నది. పాశ్చాత్యదేశ సంస్కృతుల ప్రభావంతో నేడు అనేకములయిన కొత్త కొత్త ఆటలు, క్రీడలు మన జీవితములో ప్రవేశించినవి. తెలుగువారికి సొంతము అయిన, శతాబ్దముల తరబడిగా సాగివచ్చుచున్న మన పిల్లల ఆటలు ఎన్నో నేడు విస్మరింపబడినవి; విస్మరింప బడుచున్నవి. ఆ యా ఆటలను గూర్చిన వివరములను తెలియజెప్ప గలవారు- ముఖ్యముగా పల్లెపట్టులలోని గ్రామీణ వృద్ధులు- పూర్తిగా వశించిపోక మునుపే ఆ యా విషయముల నెల్ల సాకల్యముగా సేకరించి యొకచో భద్రపరచి యుంచుకొనుట మన తత్క్షణ కర్తవ్యము. అది చేసికొనిననాడు మనకు చెందవలసిన పితృధనమును మనమే చేతులారా పోగొట్టుకొనినవార మవుతాము.



# బాల సాహిత్యంలో తొలి రచనలు

— డా॥ అక్కిరాజు రమాపతిరావు

తెలుగు దేశంలో అన్ని రంగాలలోను పునరుజ్జీవనోద్యమం నూరు నూట పాతిక సంవత్సరాల క్రితమే ప్రారంభమైంది.

పువ్వు పుట్టగానే పరిమళించాలంటే ఆ పూసే మొక్కో, తీగో, చెట్టో, మంచి పూలు పూసేదై వుండాలికదా! నేటి బాలలే రేపటి పౌరులు అన్న సూక్తి అవసరం వచ్చినప్పుడల్లా వినపడుతూనే వుంటుంది. కాని యీ సంఘంలో ముందుతరాలవారికోసం బాధ్యతతో, పట్టుదలతో కృషిచేసే మహనీయుల సంఖ్య తక్కువగానే వుంటుంది.

మేలి విత్తనాలు కూర్చుకోలేని జాతి వ్యవసాయం దుర్వ్యవసాయమే. దౌర్భాగ్యమే. ఇక దుర్భిక్షమే. అందుకని, తెలుగుదేశం సర్వతోముఖంగా ఉన్నతి సాధించాలని తన జీవిత కాలమంతా కృషిచేసిన వీరేశలింగం మహిళాభ్యున్నతికోసం మరింత పాటుపడ్డాడు. వాళ్లు పాదులు. సంఘంలో వికాసం పాదుకోల్పాలంటే సరైన దోహదం చేయడమేకాక, చీడ పీడలనుంచికూడా కాపాడవలసివుంటుంది.

ఆధునికకాలంలో మహిళాభ్యున్నతికోసం త్రికరణశుద్ధిగా కృషిచేయడం, బ్రహ్మసమాజ ప్రభావమేనని భావించవచ్చు. తెలుగుదేశంలో కూడా కిందటి శతాబ్దపు పూర్వార్ధంలోనే మేధావులు బాలబాలికల విద్యాభ్యాసంకోసం, మహిళల మానసిక వికాసంకోసం ఉద్యమించారు. పందొమ్మిదోశతాబ్ది ఉత్తరార్ధం వచ్చేసరికి బాలబాలికలకు, స్త్రీలు చదివి ఆనందించడానికి, మంచి పుస్తకాలు కూర్చాలన్న ఆశయం, గొప్పగొప్ప పండితులైనవారుకూడా ప్రకటించి, అందుకు పూనుకోవడం గమనార్హం. అందువల్లనే గొప్పపండితులైనవారు కూడా నీతిదీపికలు, నీతిమంజరులు, నీతిసంగ్రహాలు, వివేక సంగ్రహాలు ప్రచురించడం జరిగింది. అప్పుడప్పుడే బాలికా పాఠశాలల స్థాపనం కూడా నెలకొనడంతో ఈవిధంగా చిన్న తరగతుల బాలబాలికలకు నీతులు బోధించవలసి ఈ పుస్తకాలు ప్రచురించారు. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రిగారివంటి అసమాన పండితులు స్త్రీ నీతిశాస్త్రమని పదకావ్యాన్ని కూర్చారు. గజ్జెల రామానుజులు నాయనివారు 1874 వ సంవత్సరమున కడపలో డిస్ట్రిక్టు మున్సిఫ్‌గా వుండేవారు. ఇటువంటి ఉన్నతమైన ప్రభుత్వోద్యోగాన్ని చేస్తూకూడా, సతీహిత సంగ్రహం, వివేక సంగ్రహం వంటి చక్కని బాల సాహిత్యం ప్రకటించారు. మొదటి పుస్తకమేమో బాలికలకొరకు, రెండోపుస్తకమేమో

> బ్రతుకన్నది తుదకు కాటికైన
> వల్లకాటికైన
> చావన్నది కోరకు
> బ్రతుకుటే భాగ్యమ్ము!
> నీవు సాధించినదేదో
> తరచి చూడగా
> బ్రతుకున అది నేరపిన
> భవిష్యత్తే నీదవునుగా!
>
> -ఆశాజ్యోతి

బాలురకొరకు ఉద్దేశించినట్లుగా వారే పేర్కొన్నారు.

"సతీహిత సంగ్రహము- ఇది బాలికలకు ఉపయుక్తముగ కడపలో నుండెడు గజ్జెల రామానుజులు నాయనివారిచే రచింపబడి, చెన్నపురి శాఖానగరమగు తిరువల్లిక్కేణిలో నెలకొనియున్న సంజీవని ముద్రాక్షరశాలలో ముద్రింపబడియె. 1874 సం॥ జూన్ నెల 9వ తేది"- అని ముఖపత్ర సమాచారం తెలియజేస్తున్నది. ఈ పుస్తకం ఈవిధంగా రచించటానికి శిష్టు కృష్ణమూర్తిశాస్త్రిగారి సతీహిత సంగ్రహం కూడా ప్రేరకమైందనీ, సహాయకమైందనీ రామానుజులు నాయనివారు పేర్కొన్నారు.

"వివేక సంగ్రహము- బాలుర కొరకు గజ్జెల రామానుజులునాయనివారిచే విరచితమై కొక్కొండ వేంకటరత్నము పంతులచేత పరిష్కృతమై చెన్నపురి శ్రీనికేతన ముద్రాక్షరశాలయందు ముద్రితంబై, కలియుగాబ్దము 4974 వది యగు నాంగిరసనామ సం॥ శ్రావణ శు॥ 18 శుక్రవారమునాడు ప్రకటితమయ్యెను"- అని మొదటి కూర్పులో వుంది. రెండు సంవత్సరాలన్నా తిరగకుండానే రెండో ముద్రణకూడా అవసరమైంది యీ పుస్తకానికి. భావనామ సంవత్సరం అంటే 1874 లో రెండోకూర్పు ప్రకటించబడింది. గరిమళ్ళ వెంకయ్య అనే కవివరుని సహాయం పొంది యీ వివేక సంగ్రహం రచించినట్లుగా రామానుజులు నాయనివారు పేర్కొన్నారు. ఇది చాలా చిన్నపుస్తకమే. అయినా ఇటువంటి ప్రయత్నం కొనియాడ దగిందికదా!! అయితే ఇలాంటివే చిన్నచిన్న శతకాలు బాలబాలికలకోసం కుమారశతకం, సుమతీశతకం లాంటివి ఇంతకుముందు లేవా అంటారేమో?! ఉంటే వుండవచ్చు. వాటిలక్ష్యం కేవలం బాలబాలికల మనోవికాసం మాత్రమేకాదు. లోకవృత్త చిత్రణం కూడా. బాలికా పాఠశాలలు ఏర్పడి పనిచేయడం మొదలైన తరవాత, కేవలం బాల బాలికల కోసమే వ్రాసిన యీ పుస్తకాలు.

గజ్జెల రామానుజులు నాయనివారి వివేక సంగ్రహం, సతీహిత సంగ్రహాలకన్నా కూడా ముందే స్త్రీనీతిసంగ్రహ మనేపేరుతో ఇంకో చిన్నపుస్తకం వెలువడింది. దీని వివరాలివి:

"స్త్రీ నీతి సంగ్రహము- పూర్వము హైయిస్కూలాంధ్రోపాధ్యాయులలో నొక్కరగు కొమ్మి రంగయ్యగారిచే బాలికలకు మిగుల నుపయుక్తంబుగా రచియింపబడిన స్త్రీ నీతి సంగ్రహము, ముందు ప్రతికి సరిగ చిలుకల పొట్టినాయుడుచేత, అబ్బరాజు వెంకట్రాయుల వారి సర్వవిలక్షణ విద్యావిలాస ముద్రాక్షరశాలయం దచ్చువేయించి ప్రకటింపబడియె. 1871 వ సం॥ ఫిబ్రవరి 28 వ తేది" ఈ వివరణలోనే ముందుప్రతికి సరిగా దీన్ని కూర్చడం జరిగిందని ప్రస్తావించివున్నందువల్ల

ఈపుస్తకం 1871 కన్నా ముందే ప్రచురితమై వుండవచ్చు.

ఆరోజుల్లో పాఠశాలల మేనేజిమెంటువారు తమకు నచ్చిన పుస్తకాలను పాఠ్యపుస్తకాలుగా నిర్ణయించుకోగలిగిన అవకాశం వుండేది కాబట్టి, గ్రంథకర్తలకు ఇది ప్రోత్సాహకరంగా వుండేది.

ఆరోజుల్లో గజ్జెలవారి వివేక సంగ్రహానికి మంచి ప్రాచుర్యం వున్నట్లుగా భావించవచ్చు.

'తల్లిదండ్రిగారు ధనవస్తువులుగావు
బంధుజనులు నాత్మభవులుకారు
విద్య తోడునీడ వేయేల దానినే
గన్నవారు సకల మున్నవారు'

(19 వ ప. వివేక సంగ్రహం)

'మంచివారిపొందు మానకచేసిన
జాలమేల గలుగు జనుల కెపుడు
గంధపంకమందు గపురంబు జేర్చిన
నిండు దావి గలిగి యుండునట్లు.

(37 వ ప. ,, )



కొక్కొండ వేంకటరత్నం పంతులవారిచే పరిష్కృతమైనది కాబట్టి, ఆనాటికి వ్యాకరణం తూ. చా. తప్పకుండా పాటించవలసిందే కాబట్టి సంధులు, అరసున్నలూ కూడా యథాశాస్త్రంగా కనబడతాయి వివేకసంగ్రహంలో. ఈనాటిదృష్ట్యా చూస్తే, బాలసాహిత్యమంటున్నారుకదా ఇంకాస్త సారళ్యముంటే బాగు కదా అనిపించవచ్చు. బహుశా వీరేశలింగం గారు దీన్ని దృష్టిలోపెట్టుకొని 'కఠినసంధులు లోనుగా గలవి' విడిచిపెట్టి తేటగా వుండేట్లు వ్రాయడం జరిగింది. వీరేశలింగం పంతులు గారు బాలబాలికలకై నీతిదీపిక, స్త్రీ నీతిదీపిక, నీతికథామంజరి అనే ఈసఫ్ నీతికథలు, చిన్న చిన్న పద్యాలలోను, సులభమైన వచనంగానూ వ్రాశారు. ఇవికాక సతీహితబోధిని అనే పత్రికలోను, ఇంకా కొన్ని పత్రికలలోను కణుదురీగ, బాదంకాయ, వరికంకులు, బ్రాహ్మణి-ముంగిస, పరోపకారము అనే చిన్నచిన్న కథలు వ్రాశారు. అబద్ధమాడకూడదని చెప్పటానికి, అబద్ధాలాడటంవల్ల వచ్చే అనర్థాలు వివరించటానికీ, 'సత్యసంజీవని' అనే పెద్ద కథను వ్రాశారు. మాణిక్యం అని పేరుగల తొమ్మిదేళ్ళ పిల్ల తన అక్క భ్రమరాంబ ముత్యాలహారం అవ్వకూ, అక్కకూ తెలియకుండా మెళ్ళో వేసుకొని, చుట్టాలింటికి భోజనానికి వెళ్ళడం, అక్కడ పిల్లలతో ఆటల సందడిలో వుండగా, ఆ ముత్యాలహారం తెగిపోవడం, ఇక అక్కడినుంచి ఒక అబద్ధాన్ని కప్పిపుచ్చడానికి ఇంకొక అబద్ధం చొప్పున, ఎన్నో అబద్ధాలు చెప్పడం, అవన్నీ చివరకు అక్కరకురాక, అవమానంపాలు కావడం, యీ మొదలైన పన్నివేశాలన్నీ తొమ్మిది ప్రకరణాలలో పంతులుగారు చాలా ఆసక్తికరంగా వ్రాశారు. వీరేశలింగం పంతులుగారు చిన్నపిల్లల మనస్తత్వాన్ని చక్కగా అర్థం

చేసుకొన్న మహానుభావుడు. 'మనం కొత్త వాళ్ళింటికి పిల్లలతోనూ, పెద్దలతోనూ వెళ్ళి నప్పుడు పెద్దవాళ్ళు పెద్దవాళ్ళతోను, చిన్న పిల్లలు చిన్నవాళ్ళతోనూ కబుర్లు చెప్పుకోవ టానికి ఒకచోట చేరుతారు - చూడటంలేదా? మరి చిన్నపిల్లలకూ, ఏళ్ళుపైబడినవాళ్ళకూ పెళ్ళిచేయటం ఏంన్యాయం! ఏం ధర్మం? ఏం సబబు! ఏవయసువాళ్ళ కావయసుకి కొంచెం హెచ్చుతక్కువలైతే ముచ్చటగా వుంటాయి ఆ దాంపత్యాలు'-అని వ్రాశారు పంతులుగారు. చిన్నపిల్లలను చూడండి. తమ యీడు పిల్లలు కనపడితే ముఖాలు మురిసిపోతాయి; విప్పారు తాయి.

ఆధునిక సాహిత్యంలో శాస్త్రీయ దృక్ప థంతో బాలసాహిత్యాన్నికూడా ప్రారంభిం చింది పంతులుగారే. ఈసఫ్ నీతికథలు తొలి సారిగా తెలుగు బాలల కందించింది వీరేశ లింగం పంతులుగారే. ఈ కథలకు బొమ్మలు కూడా కూర్చి ముద్రించారు. ఇంచుమించుగా తొంభై సంవత్సరాలకు పూర్వమే నీతికథా మంజరి పేరుతో, చిత్రపటాలతో రెండు సంపుటాలుగా యీకథలు ప్రచురింపబడ్డాయి. ఈసఫ్ నీతికథలలో మొత్తం 158 కథ లనువ దించారు పంతులుగారు. మొదటి సంపుటంలో 75 కథలు, రెండో సంపుటంలో 83 కథలు చేర్చారు. ప్రతికథకు చివర ఒక చిన్నపద్యం వుంటుంది. రెండు పంక్తుల్లో కథ సారాం శమూ, రెండు పంక్తుల్లో నీతి - కూర్చారు కథలన్నిటి చివరన కూడా.

వసుధ లోపల నరులను బాడుచేయ
స్తోత్ర పాఠుల మించు శత్రువులు లేరు
లాభమొంద ముఖస్తుతు ల్సలుపువారి
వలల దగులక కనుగల్గి మెలగవలయు.

కష్టపడు నట్టివారు లోకంబుతోడ
మొఱ్ఱ వెట్టరు తమ కష్టములను గూర్చి
వట్టివారలె యరతురు మిట్టిపడుచు
గొడ్డుగేదెల కరపులు గొప్పగావె!

అనుభవంబును బట్టియే యవనియందు
జనులకును దెల్వియబ్బుట సహజగుణము
కాలుగాలి శ్రమంపడు గండుబిల్లి
నిప్పువద్దకు బోవునే యెప్పుడైన!

వీరేశలింగం పంతులుగారు ధవళేశ్వరం దేశభాషా పాఠశాలలో కొన్నాళ్లు ప్రధానో పాధ్యాయులుగా పనిచేశారు. అది 1872 వ సంవత్సర ప్రాంతం. అప్పుడాయన చిన్నపిల్ల లకు ఉపయోగపడే నిమిత్తం నీతిదీపికను రచించారు-

'తాత ముత్తాత లెంతెంత ధనము కూడ
బెట్టి, పెట్టెలు నిండంగ బెట్టియున్న
గష్టపడి, తాను న్యాయమార్గమున బడయు
స్వార్జితం బొక గవ్వతో సమము గాదు'.

ఈవిధంగా నీతులున్నాయి ఈపుస్తకంలో. ఈ పుస్తకంనిండా సులభమైన గీత పద్యాలే వున్నవి. కిందితరగతుల బాలురకోసం చాలా

---

గాంధీ తాతయ్యేమన్నాడు ?
శాంతిమార్గమే శరణన్నాడు.
గౌతమ బుద్ధుడు ఏమన్నాడు ?
కోపం జయించుకో అన్నాడు.
అజాతశత్రువు ఏమన్నాడు ?
అంతరాలు తొలగించన్నాడు.
అశోకమహారా జేమన్నాడు ?
అందరి సుఖమును చూడన్నాడు.
బళ్లో పంతులు ఏమన్నాడు ?
వళ్లువంచి పని చేయన్నాడు.

-చెరుకుమిల్లి భాస్కరరావు

కాలం చాలా పాఠశాలల్లో యీ పుస్తకం ఉపయోగించ బడిందని వీరేశలింగంగారే వ్రాశారు స్వీయచరిత్రలో. 1913 వ సంవత్సరానికి ఈ నీతిదీపిక 17 ముద్రణలు పొందడం ఆరోజుల్లో ఈ పుస్తకానికి ఎటువంటి ప్రచారం, విలువ వుండేవో తెలియజేస్తున్నది.

ఈవిధంగా బడిపిల్లలకు యోగ్యమైన పుస్తకాల ఆవశ్యకతవల్ల, పెద్దపెద్ద పండితులు కూడా ఇటువైపు దృష్టి ప్రసరించడం జరిగింది. ఇది చాలా మేలే అయింది. లేకపోతే చాలా గొప్ప పండితులైన, శబ్ద రత్నాకర నిఘంటు నిర్మాతలైన బహుజనపల్లి సీతారామాచార్యులవారి వంటి మనీషివర్యులు చిన్నపిల్లల పుస్తకాలవైపు దృష్టిమరలిస్తారా? ఈ విషయం చిత్తగించండి.

"సతీధర్మ సంగ్రహము-టిప్పణము తోడిది. ఇది విద్యాభ్యాసము చేయు బాలికలకొరకు బ. సీతారామాచార్యుల వారిచే భారతాది గ్రంథములందుండి ఏర్చికూర్చబడినది-1882"

ఇదేవిధంగా కేవలం బాలికలకు మాత్రమే ఉద్దేశించి వీరేశలింగం పంతులుగారు స్త్రీ నీతి దీపిక అనే పేరుతో నీతిబోధకమైన శతకాన్ని రచించారు.

'ఆపదలు వచ్చినప్పుడు నలరుబోండ్లు
తాము ధైర్యంబు విడువక, తక్కుగలుగు
వారి నూరార్చి దుఃఖంబు బాపవలయు
ధైర్యమున నాపద సగంబు తగ్గిపోవు'.

వీరేశలింగంపంతులుగారికి సమకాలికులైన మహావిద్వాంసులు శ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగారు నీతిదీపికను ఎంతగానో ప్రశంసించారు. ఈ వాసుదేవ శాస్త్రిగారు ఆరోజుల్లో బి. ఏ. పరీక్షలో రాజధానికంతా ఫస్టున కృతార్థులై ఇంగ్లీషు పాండిత్యానికి బంగారు పతకం పొందిన మహనీయులు. వీరేశలింగం



గారి వివేకవర్ధనిలో 1875 వ సంవత్సరంలో 'శ్రీ కందుకూరి వీరేశలింగ కృత సంగ్రహ వ్యాకరణ, నీతిదీపికా ప్రశంస' పేరుతో వాసుదేవ శాస్త్రిగారి అభిప్రాయాన్ని చిత్తగించండి. అయితే ఆనాటి సంప్రదాయాన్ని బట్టి, భాష కొంత చమత్కారంగా వుంటుంది. పండితులు ఉత్తరాలు కూడా ఆరోజుల్లో ఇటువంటి భాషలోనే వ్రాసుకుంటూ వుండేవారు.

"బాలుర కుపయోగకరముగా నేతత్కవి విరచితమగు నీ పొత్తంబు సత్తమ చిత్తంబులకు మోదంబు హత్తించెడు. సరిగ బరికించిన నీ నూరు పద్యంబులు నూరువరా లనవచ్చును.

"నీతి యెరుంగని మన బాలురకు దీపము వెలుంగుజూపి పదార్థజ్ఞానంబు గలిగించునట్లు నయానయ వివేకంబు బాల్యంబుననే తెలిపి, పెద్ద పెరిగిన పిదట దుర్నయ వర్తనులు గాకుండునట్లు చేయుట కిది ముఖ్యాధారభూత మనుటకు సందేహ మొక్కింతయును లేదు"— 1875 అక్టోబరు వివేకవర్ధని.

సమకాలికుల మెప్పు పొందడం ఎవరికైనా కష్టసాధ్యమే. అటువంటిది పండితులు, ఉన్నత విద్యావంతులు అయినవారిచే వీరేశలింగం ఆరోజుల్లోనే మెప్పుపొందాడు.

వీరేశలింగం స్త్రీలకోసం సతీహితబోధిని అనే పత్రిక నడిపారు. ఇందులో ఎన్నెన్నో కథలు, వ్యాసాలు, ఆయన ప్రచురిస్తూ వుండేవారు. స్త్రీలలో చదవాలని, తెలుసుకోవాలని

అవ్వా బువ్వా రెండూరావు
పదికావాలో ముందే ఎంచుకో.
ఏదో ఒక దేవుని నమ్ముకు
చేరుము ఏదో ఒక పక్షం.
అటు ఇటు చేరక
గబ్బిలాయిలా
అతితెలివిని చూపించబోతివా
రెంటికి చెడుదువు జాగ్రత్త!
-బుక్ మాన్స్

అభిలాష కలిగించడమే ప్రధానోద్దేశం కాబట్టి, లోకజ్ఞానానికి అవశ్యకమయిన శాస్త్రీయ విషయాలు తెలుసుకోవటానికి ఆయన వ్రాసిన వ్యాసాలలో మధ్యమధ్య చిన్నచిన్న కథలు కూడా కూర్చేవాడాయన. చాలా సులభ శైలిలో, ఆసక్తికరంగా వుండేవి ఈవ్యాసాలు. 'తోటకూరనాడే మందలిస్తే, నాకీ దురవస్థ తప్పేదికదా', అని దొంగతనం చేసి కఠిన దండన ప్రాప్తమైన దొంగ తన తల్లితో మొత్తుకోవడం- ఒక కథగా వ్రాశారు పంతులుగారు. ఈ స్త్రీలకోసం వ్రాసిన సాహిత్యాన్ని కూడా కొంచెం ఇంచుమించుగా బాల సాహిత్యంగానే భావించవచ్చు.

పంతులుగారు నడిపిన చింతామణి, సతీ హితబోధిని, సత్యసంవర్ధని, మొదలైన పత్రిక లలో ఆయనగారు చిన్న చిన్న కథలు వ్రాశారు. 'బాదంకాయ' అనే కథలో ఒక బాదంకాయ కోసం, ఇద్దరు పిల్లలు నాది నాది అని పోట్లాడుకుంటూ వుంటే, కొట్టి పప్పు చెరిసగం పంచుతానని ఒక పెద్దవాడు కొట్టి ఆ పప్పు తానే నోట్లో వేసుకోవటం, రెండు పిల్లులు రొట్టెకోసం వాదులాడి కోతిపాలు చేసిన కథలాగా వుంది. బహుశా యీ కథను దృష్టిలో పెట్టుకొనే వీరేశలింగం బాదంకాయ కథ వ్రాసి వుండవచ్చు. ఇటువంటిదే ఒక తమాషాయైన కథను కల్పించి ప్రహసనంగాను వ్రాసారు పంతులుగారు. 'బులాయశాస్త్రి' అని యీ ప్రహసనం పేరు. లేని పాండిత్యం నటిస్తూ, డాబులు పలుకుతూ, విర్రవీగే ఒక అహంకారి భంగపాటు ఈ ప్రహసనంలో చాలా నవ్వుతెప్పిస్తుంది. కరక్కాయవైద్యం అనే కథలో ఒక వైద్యుడి మూర్ఖత్వం చూసి జాలీ, నవ్వూ కూడా పుట్టేట్లు వీరేశలింగం వర్ణించారు.

జంతుస్వభావ చరిత్ర మనే, శాస్త్రీయ గ్రంథంలో కూడా వీరేశలింగంగారు, కోతు లను గూర్చి, కుక్కలను గూర్చి, చాలా ఆసక్తి కరమైన చిన్నచిన్న కథలు కూడా కూర్చారు.

వీరేశలింగంగారు బాల సాహిత్యానికి సంబంధించిన కృషి ఇంకొకవిధంగా కూడా చేశారు. ఏమంటే చిన్నతరగతుల పిల్లలకు వాచక పుస్తకాలు రచించడం. పంతులుగారిది సలక్షణమైన, సులభమైన వచనరచన. పింగళి లక్ష్మీకాంత మహాశయులీ వాచక పుస్తకాలను గూర్చి ఏమన్నారో చూడండి:

"గద్యతిక్కన అయిదు, ఆరు, ఏడు తర గతులకు వాచకములు వ్రాయబూనుట మహా భాష్యప్రవచనముచేయు పండితుడు, శబ్దమంజ రిని గూడ పాఠము చెప్పుటవంటిది. చిన్నపని యని ఈసడింపక, విద్యార్థిశ్రేయస్సును గోరి ఆయన ఆ వాచకములను వ్రాయదలచు కొనెను గావుననే ఆనాటి విద్యార్థులు వారి వారి వయో బుద్ధులకు అనుగుణమైన భాషను, విషయమును సముపార్జించుకొనగలిగిన భాగ్య శాలురైరి." అని అంటూ తరవాత వచ్చిన లెక్కలేనన్ని వాచకపుస్తకాలలో ఈ మేలిమి

లేదని నిర్మొహమాటంగా ప్రకటించారు లక్ష్మీకాంతం పంతులుగారు. దీనికి కారణం పిల్లల చిత్తవృత్తికి అనుగుణమైన విషయ సంగ్రహణంగాని, భాషా వివేచనగాని, వాచక పుస్తక రచయితలలో లేకపోవడమే అని తమ అభిప్రాయాన్ని తెలిపారు. వాచక పుస్తక రచయితలను తీవ్రంగా విమర్శించారు. వీరేశలింగం పంతులుగారి వాచక పుస్తకాల కాలానికీ ఇప్పటికీ మధ్య సుమారు డెబ్భై అయిదు సంవత్సరాల అంతరమున్నా, బాలసాహిత్యం సర్వసమగ్రంగా అభివృద్ధి చెందవలసిందిపోయి, ఇంకా ముక్కుపచ్చలారని ప్రయత్న స్థితిలోనే వుండడం చాలా విచారకరం!

తెలుగుదేశంలో అన్నిరంగాలలోను పునరుజ్జీవనోద్యమం నూరు, నూటపాతిక సంవత్సరాలక్రితమే ప్రారంభమైంది. కిందటి శతాబ్దపు ఉత్తరార్ధంలోని ఆనాటి సాంఘిక పరిస్థితులకు, నేటి సాంఘిక పరిస్థితులకు ఎంతో వ్యత్యాస మున్నది.

అయినా - బాలసాహిత్యం విషయంలో మాత్రం, అన్య భారతీయ భాషల విషయం నాకు తెలియదుకాని, తెలుగులో జరగవలసినంత కృషి జరగలేదు. ఇంకా ఎంతో ఎంతో సాధించవలసి వుంది.



# బాల సాహిత్యం : వైద్యవిషయాలు

-డా॥ వేటూరి శంకరశాస్త్రి

ప్రాచీన బాల సాహిత్యంలో ఎన్నో నిగూఢమైన శాస్త్రీయ జీవిత రహస్యాలు పారంపర్యంగా చెప్పబడి వున్నవి.

అష్టాంగవిశిష్టమైన ఆయుర్వేద శాస్త్రంలో కౌమారభృత్యము లేక బాలతంత్రము అని ఒక ప్రత్యేకవిభాగం ఉన్నది. "కుమారాణాం భృతిః-కుమారభృతిః, తస్యేదం - కౌమార భృత్యం". బిడ్డల కాపాడుటకు తగిన ఉపచారాదులను బోధించునది కౌమారభృత్య మన బడును. బిడ్డల బాల్యావస్థాభేదములనుబట్టి ఇది ఒక విశిష్టమైన కళగా పేర్కొని శిశువులు, వారి సంరక్షణ పోషణ, వారికి వచ్చే ప్రత్యేకమైన వ్యాధులు, చికిత్సలు వివరిస్తూ సవాలతు గ్రంథం చెప్పారు వైద్య గ్రంథకర్తలు. కౌమారభృత్యమునుగూర్చి భేలుడు భేల సంహిత అనే పేరుతో ప్రత్యేకం ఒక గ్రంథాన్నే రచించాడు, పూర్వపు వైద్యవరులందరు బాలుర సంరక్షణాది విషయములను గూర్చి ప్రత్యేకమైన శ్రద్ధ వహించినట్లు ఇందువల్ల మనకు తెలుస్తున్నది.

"వయో యథా స్థూలభేదేన త్రివిధం బాలం, మధ్యం, జీర్ణమితి. తత్రబాలం, అపరిపక్వధాతుం, అజాతవ్యంజనం, సుకుమారం, అక్లేశసహం, అసంపూర్ణబలం, శ్లేష్మధాతు ప్రాయం, అషోడశవర్షం, వివర్ధమానధాతు గుణం."

వయస్సు స్థూలభేదముచేత బాల్యము, యౌవనము, వార్ధకము అని మూడు విధములుగా నుండును. బాల్యవయస్సులో బాలుడు 16 సం.వరకు ధాతువులు పూర్తిగ పరిపక్వము గాకయు, మీసములు, గడ్డము మొదలగు చిహ్నములు గలుగకయు సుకుమారుడుగను, కష్టమున కోర్వలేకయు, పూర్తి బలము లేకయు శ్లేష్మధాతువు బలిష్ఠముగను ఉండును.

ఈ వివరణమునుబట్టి బాల్యావస్థ 16 సంవత్సరముల వయస్సువరకునని శాస్త్రవిదులు నిర్వచించినారు. బాలికలు బాలురు ఈ వయస్సువరకు కుమారీ, కుమారులుగా పరిగణింపబడుదురు.

అష్టాంగహృదయమనే వైద్యగ్రంథంలో వాగ్భటాచార్యుడు శైశవదశనుగూర్చి కవితాధోరణిలో ఎంత ముద్దుగా చెప్పినాడో చూడండి.

"స్థలద్గమన మవ్యక్తవచనం ధూళిధూసరమ్
అపిలాలావిలముఖం హృదయాహ్లాదకారకమ్
అపత్యం తుల్యతా కేన దర్శన స్పర్శనాదిషు
కింపునర్యద్యశోధర్మమాన శ్రీకులవర్ధనమ్.

-అష్టాంగ. ఉత్తర.

తడబడుచుండు నడక, వచ్చీరాని మాటలు, దుమ్ముతో పూయబడిన శరీరము, చొల్లుగారు చుండు నోరు, ఈలాటి చిహ్నములుగల శిశువును జూచుటవల్లను, తాకుటవల్లను హృదయమునకు మిక్కిలి ఆనందము కలుగును. దీనితో సమానమైన సుఖము, ఆనందము మరొకటి లేదు. యశస్సు, ధర్మము, గౌరవము, సంపద, కులము వీనిని వృద్ధిజేయునట్టి సత్సంతానము మానవుని మనస్సునకు మిక్కిలి సంతోషమును కలుగజేయునని వేరుగా చెప్ప పనిలేదు.

కవికుల గురువు కాళిదాసు- వైద్య విద్యా వాచస్పతి వాగ్భటాచార్యుడు- వీరిలో ఎవరు ముందో, ఎవరువునుకో అచర్చ వదిలితే, శాకుంతలములో కాళిదాసు చెప్పిన

"ఆలక్ష్య దంతముకుళా ననిమిత్తహాసైః
అవ్యక్త వర్ణ రమణీయ వచః ప్రవృత్తీన్,
అంకాశ్రయ ప్రణయినః తనయా న్వహంతో
ధన్యాః తదంగరజనా మలినీభవంతి."

ఆ శ్లోకం జ్ఞప్తికి రాకమానదు. అలాగే ఆంధ్ర మహాభారతములో నన్నయభట్టారకుడు శకుంతలచేత పలికించిన "పుత్ర గాత్ర పరిష్వంగ సుఖము"ను గూర్చిన పద్యము కూడ జ్ఞాపకం వస్తుంది.

ఇదంతా ఎందుకు చెబుతున్నా నంటే శైశవదశ- అందువల్ల తల్లి దండ్రులకు కలిగే ఆనందం అటుండగా, నేటి బాలురే రేపటి పౌరులనే నినాదానికి తార్కాణంగా 16 ఏండ్ల వయస్సుకు లోబడిన బాలుర ప్రాముఖ్యం- వారిని శారీరకంగాను మానసికంగాను, తీర్చిదిద్దే బాధ్యత తల్లి దండ్రుల మీదనేగాక సామాన్య పౌరునిమీద, పౌర సంఘాలమీద, ప్రభుత్వంమీద కలదని, వారి ముద్దు మురిపాలను వారిలో నిగూఢంగా అణగివున్న నైపుణ్య విశేషాలను బహిర్గతం చేసే బాధ్యత మనందరి మీదనే ఉన్నదని తెలియజెప్పుటకే.

బాలుర పోషణ, రక్షణనుగూర్చిన గ్రంథస్థ విషయాలు అటుండగా శైశవ దశలోను, తర్వాతను గూడా దేశ సంప్రదాయాను గుణ్యంగా, ప్రజల చిత్తానికి హత్తుకునేటట్లు జనవాడుకగా పాడుకునే పాటలు, పద్యాలు, సామెతలు, పలుకుబళ్లు కూడా సంప్రదాయ రహస్యాలను వెల్లడించేవిగా కనపడుతున్నవి యెన్నో ఉన్నవి.

వైద్యపరంగా అర్థం చేసుకోవలసిన కొన్ని ప్రాచీనమైన పాటలను, పదాలను మచ్చునకై కొన్ని చూపుతాను :

"హాయీ! ఓయీ! ఆపదలుగాయీ
చిన్నవాళ్ళను గాయి శ్రీరంగశాయీ
ఆడితే ముద్దయ్యా, పాడితే ముద్దు
అందరికి అబ్బాయి అల్లారుముద్దు

---

చిట్టి చిట్టి కమలాలు
చెరువులోని కమలాలు
నవ్వేటి కమలాలు
నాకు తెచ్చిపెట్టే
ఆడుకొంటాను...

తెల్లచీరె కట్టుకొని
మెల్లగాను నవ్వుతున్న
నీటిమీద పండుకొన్న
చిట్టిచిట్టి కమలాలు
అమ్మ తెచ్చిపెట్టె
ఆడుకొంటాను...

-చింతా దీక్షితులు

---

ఏకుల్ల రాటమ్మ ఇంటి కందమ్మ
మా చిన్ని అబ్బాయి మాకు అందమ్మ
జోలల్లుపాడితే బాలలకు నిద్ర
నాగస్వరం పాడితే నాగులకు నిద్ర"

చిన్న పిల్లలు జోలపాట పాడితే నిద్రపోతా రని, నాగస్వరం ఊదితే నాగములు నిద్రపో గలవని, పూర్వం ప్రతియింట ఒక రాటం ఉండి నూలు వడికేవారని ఈ పాటవల్ల తెలుస్తుంది. జోలపాట పాడుతూ తల్లులు ఊయెల ఊపుతూ ఉంటే పిల్లలు నిద్రపోవడం అలా చేయకపోతే పిల్లలు ఏడ్వడం పిల్లలనుకన్న తల్లులు ఎరుగనిది కాదు. అవిదితమైన ఎట్టి హాయిని జోలపాట కూరుస్తుందోగాని, ఇది అనుశ్రుతంగా పిల్లల పెంపకంలో చాలా కాలంనుంచి ఆచారంగా జరుగుతున్నది. ఈ జోలపాటల ప్రాముఖ్యం నవనాగరికులైన స్త్రీలు, ఆస్పత్రులలోని నర్సులు కూడా పాటించవలసిన శాస్త్రీయరహస్యంగా తెలుసు కోవలసి ఉన్నది. పిల్లలు మారాంపట్టి గాని, చికాకుచెంది గాని నిద్రపోని యెడల ఆస్పత్రు లలో ఇచ్చే నిద్రమాత్రలు, బ్రోమైడ్ మిక్చర్ల కంటెను ఇది చాలా మంచిది; ఆరోగ్యకర మైనది. ఆస్పత్రులలో నర్సుల కోర్సులో జోల పాటలు నేర్పడం అవసరమని నామనవి.

## ఆటలు – పాటలు

"చిన్నారి పొన్నారి చిట్టి నాతల్లి
చుక్కల్లో చంద్రుడూ చూడవచ్చాడు
తెలవారవచ్చింది కోడికూసింది
చూచేటి అక్కల్లు చూడరారమ్మ
ఆడేటి అక్కల్లు ఆడరారమ్మ
ఆడుకో రారమ్మ అక్కల్లు మీరు
ఆడేటివారికి అచ్చావు పాలు
పాడేటివారికి పాలు పంచదార."



తెల్లవారి పెందలకడనే లేచి పిల్లలు ఆడు కోవాలని, పాడుకోవాలని, ఆడినవారు అచ్చని ఆవుపాలు త్రాగాలని, పాడనేర్చినవారు పంచ దార పాలు కలిపి త్రాగాలని ఈ పాట చెబు తోంది.

"ప్రవరం జీవనీయానాం
క్షీరముక్తం రసాయనం"

ఆవుపాలు జీవనీయములలో శ్రేష్ఠమైనవి. రసా యన గుణము కలవి. బలకర మైనవీను.

ఆవుపాలు, ఖండశర్కర కలిపి త్రాగితే. స్వరము బాగుపడును. ధాతుక్షీణము గలవారికి, గుండెబలము లేనివారికి మంచిది. ప్రసన్నమైన వర్చస్సునిచ్చి, కంఠస్వరం బాగుపరుస్తుంది.

## కంటికి కాటుక

"పిల్లమ్మ కన్నుల్లు బీరపువ్వుల్లు
అబ్బాయి కన్నుల్లు కలువరేకుల్లు
కలువరేకులవంటి నీకన్నులకును
కాటుకలు పెట్టితే నీకు అందమ్మ
ఏడువకు ఏడువకు వెర్రి అబ్బాయి
ఏడుస్తే నీకళ్లు నీలాలు కారు
నీలాలు కారితే నే జూడలేను
పాలయిన కారవే బంగారుకళ్ల

పిల్లల కంటికి కాటుక పెట్టవలెనని, అంద ముగా నుండువనియు ఈ పాట చెప్పు

-తున్నది. కలువరేకులవంటి కళ్లు కావలెనంటే కంటికి కాటుక పెట్టాలి. అంజనము చిన్నప్పటినుంచి వాడాలని వైద్యశాస్త్రం చెబుతుంది. అంజనము (కాటుక) తయారుచేసే విధానము, అందు చేర్చవలసిన ద్రవ్యములు ప్రత్యేకముగా చెప్పబడినవి. మనయింట ముసలమ్మకు కాటుక చేసే విధానము బాగా తెలుసును. అందు కరక్కాయ గంధము, నేతి దీపపు మసి, ఆముదము, పచ్చకర్పూరము చేరును. కాటుకను తయారుచేయడం ఒక కళ. ముసలమ్మలకే తెలుసును. ఈ అంజనము పెట్టడంవల్ల పిల్లలకు నేత్రవ్యాధులైన దుర్మాంసములు, కండ్లకలక, కంట నీరు గారుట, పుసిగట్టుట - ఇటునంటి వ్యాధులు రావు సరిగదా కండ్లు తేజస్సంతములై మిలమిల లాడుచుండును. ముఖానికిఅందమిచ్చును.

## వల్లప్ప-చెల్లెలు

"వానావానా వల్లప్ప
వాకిలి తిరుగు చెల్లప్ప



కొండమీది గుండురాయి
కొక్కిరాయి కాలు విరిగె
దానికేమి మందు?
వేపాకు పసుపూ, వెల్లుల్లిపాయ
నూనెలో మడ్డి (నూనెమ్మ బొట్టు)
నూటొక్కసారి
పూయవోయినూరి
పూటకొక్కతూరి"

వల్లప్పా వల్లప్పా వాన కురుస్తోందంటుంది చెల్లెలు. బయటకు పోక వాకిట్లోనే ఆడుకోమంటాడు వల్లప్ప. వానలో తిరిగితే కొండమీదినుండి (ఆకాశంనుండి) గుండురాళ్లు (వడగళ్లు) పడి కొక్కిరాయి (అల్లరి పిల్ల) కాలు విరుగును. కాలువిరిగితే దానికేమి మందు? అని చెల్లెలు అడుగుతుంది. వేపాకు, పసుపు, వెల్లుల్లిపాయ, నూనెలో మడ్డి ఇవన్నీ కలిపి నూటొక్కసారి వండిన (ఆవర్తిత తైలం) పూటకొకసారి రాస్తే విరిగిన కాలు, కూడుకుంటుందంటాడు వల్లప్ప. వేపాకు పసుపు, వెల్లుల్లిపాయ ఇవి పుండును శుభ్రముగా నుంచగలవి, అస్థిసంధానకరములై నవీని.

## ఒయ్యారి భామ

"ఒప్పులకుప్పా ఒయ్యారి భామా
మినపాపప్పు మెంతీ పిండి
తాటిబెల్లం తవ్వెడునేయి
గుప్పెడుతింటే కులుకూలాడీ
నడుమూగట్టి నామాలె చిట్టీ.

మరో పాఠం

ఒప్పులకుప్పా, ఒయ్యారిభామా
సన్నాబియ్యం చాయాపప్పు
(మినపాపప్పు - మెరికాబియ్యం)
పాలూనెయ్యిడి పాళంవొండు
నీమొగుడుతింటే - ఆనందమంటే"

> చెవులుంటేసరి-అవి వింటే
> బాలురలోనూ కవులున్నారు
> బాలికలందూ కలరు,
> చెవులుంటేసరి-అవి వింటే !
> కుహూకుహూ అని కోయిల అంటే
> కొక్కొరొకో అని కోడంటుంది.
> అదికూడా మేం కవిత్వమంటాం.
> ఆనందంతో వింటాం.
>
> -దేవులపల్లి కృష్ణశాస్త్రి

ఈ పై పాటలోని విషయం ఒక వృష్య యోగం. పొట్టుతీసిన మినపపప్పు దోరగా వేయించి కొద్దిగా మెంతిపిండి, తగినంత తాటి బెల్లం, నేయి కలిపి తింటే నడుం గట్టిపడు తుందట ! సన్నబియ్యం-చాయ మినపపప్పు, పాలు నేయి వేసి పాయసంగా వండి తింటేను అంతే. ఇక్కడ నడుం గట్టిపడుతుందంటే భార్యాభర్త లిరువురకు రతిసౌఖ్యం కలుగు తుందని తెలియవలెను. ఇందుచెప్పిన ద్రవ్యా లన్నీ వృష్యకరమైనవి.

## కాళ్లగజ్జి

కాళ్లాగజ్జి కంకాలమ్మ (కంకోలమ్మ)
వేపాచెక్క వెలగామొగ్గ
మొగ్గాగాదు మోదుగునీరు
నీరుగాదు నిమ్మలవారి
వారిగాదు వాయింటకూర
కూరాగాదు కుమ్మరిచట్టి
చిట్టీగాదు చాగలమర్రి (ట్ట)
మట్టాతీసి, నీమొగుడు కాలుమొత్త.

కాళ్ళకు గజ్జి (కర్పాణి) వస్తే దానికి మందు ఇందు చెప్పబడింది. కంకాలమ్మ= కచూరాలు, వేపచెక్క; వేగుచుక్క=భావం చాలు; వెలగామొగ్గ=పాదరసం; మోదుగ నీరు=మోదుగ మండలు; నిమ్మలవారి=నిమ్మ రసం; వాయింటాకు, చాగమట్ట ఇవన్నీ కుమ్మరి చట్టిలో కలియగాచి కాళ్ళ కర్పాణికి రాస్తే నయమవుతుంది. (వెలగమొగ్గ అంటే పాద రసమని దివంగతులు వేదాల రామానుజస్వామి చెప్పినారు).

## వాతాపి జీర్ణం

"జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం
గుఱ్ఱాల్ తిన్న గుగ్గిళ్ళరిగి
ఏనుగుల్ తిన్న వెలక్కాయ లరిగి
అర్జునుడుతిన్న అరటిపళ్ళరిగి
భీముడుతిన్న పిండివంట లరిగి
గణపతితిన్నా ఖజ్జా లరిగి
అబ్బాయితిన్న పాలు అముదం అరిగి
పందల్లెపాకి కందల్లే కూర్చొని
నందల్లే నడిచి - గుఱ్ఱమంత పరుగు
ఏనుగంత సత్తువ ఉండేటట్లు
సాకుమీ ! ఈ బిడ్డను సంజీవరాయా !"

దీనికి సంబంధించిన కథ కలదు, వాతాపి ఒక రాక్షసుడు. ఇతని సోదరుడు ఇల్వలుడు. వీరి నగరము మణిమతిపురము. ఇల్వలుడొక బ్రాహ్మణుని తనకు సకల కార్యసిద్ధికరమైన మంత్రము నుపదేశింపుమని వేడెను గాని విఫల మనోరథుడయ్యెను. అ కోపముతో కనుపడిన బ్రాహ్మణులను వధించుటకు ప్రారంభించెను. ఈ సోదరులు బ్రాహ్మణులను భోజనమునకు పిలుచుచుండెడివారు. వాతాపి కామరూపుడు కావున వానిని ఒక మేకనుచేసి యిల్వలుడు బ్రాహ్మణులకు వండి పెట్టుచుండును. వారు భుజించిన పిదప ఇల్వలుడు, 'వాతాపీ! రమ్ము' అని పిలుచుచుండును. వాతాపి బ్రాహ్మణుల ఉదరమును చీల్చుకొని బయటకు వచ్చు చుండును. ఇట్లు మాయోపాయమున బ్రాహ్మ-

ణులను సంహరించుచుండుటచేత, వారు అగస్త్యుల వారితో మొరబెట్టుకొనిరి. అగస్త్యుడును వీరింటికి భోజనమునకు వచ్చెను. యథా ప్రకారమే ఇల్వలుడు గావించెను. అగస్త్యుడు భోజనముచేసి ఉదరము సవరించుకొనుచు "జీర్ణం - జీర్ణం, వాతాపి జీర్ణం" అనియెను. అతని కుక్షిలోనుండిన వాతాపి జీర్ణమైపోయినాడు. ఇట్లు వాతాపి ఇక లేకపోయినాడు. ఇదీ కథ.

ఆంధ్ర దేశమునందు పసిపిల్లలకు ప్రతిదినం ఉదయాన్నే ఉగ్గుపెట్టడం అనే ఆచారం ఒకటి ఉన్నది. తెల్లవారుజాముననే, పసిపిల్ల తల్లులు నిద్రలేచి మంచి వంటాముదము ఉగ్గుగిన్నెను (ఉగ్గుకొరకై ప్రత్యేకము గిన్నె వెండితోగాని, రాతి వెండితోగాని చేయింతురు) నులువెచ్చన జేసి అందులో నాలుగైదుబొట్లు చనుబాలు పిండి బాగా రంగరించి, తల్లులు తమకాళ్లు నిలువుగా సాచి, సాచిన కాళ్ళమీద పిల్లలను వారి తలను తమ తొడలమీద ఆనేటట్లు వెల్లకిల పరుండబెట్టుకొని, ఆ ఉగ్గుగిన్నెడు ఆముదమును త్రాగింతురు. త్రాగించిన తర్వాత ఉగ్గుగిన్నెను అంటియుండు ఆముదమును చేతి వ్రేళ్లతో తీసికొని పసిపిల్ల పొట్టకు, కాళ్ళకు, చేతులకు గట్టిగా దిగరాయుచు 'జీర్ణం జీర్ణం వాతాపిజీర్ణం' ఇత్యాదిగా పయిజెప్పిన పదము పాడుదురు. తరువాత పిల్లను తొట్టిలో పరుండబెట్టి తల్లులు తమపనిపాట్లను చూచుకొందురు. ఇది జరిగిన ఒకటి రెండు గంటలవరకు పసిపిల్లలు హాయిగా నిద్రించి, లేవగానే విరేచనం సాఫీగా రెండు మూడుసార్లు ఝాడించును. ఏరోజు కారోజు, పోషణకు, విరేచనము సాఫీగా నగుటకు ఈవిధముగా ఉగ్గుపెట్టు నాచారము ఆంధ్రదేశమున కలదు. ఆముదమువకు బదులు తూర్పుగోదావరి, విశాఖజిల్లాలలో నేతినికూడ పెట్టుదురు. కొందరు మూనె నేయి, ఆముదము సమభాగములుగా చేర్చి ఉగ్గు పెట్టుదురట! దీనినే 'ముక్కట' మందురు.

ఈ ఆచారము ఇటీవలి నాగరికత బాగా పెరిగిన ఇండ్లలోను, నేటి ఆస్పత్రి కాన్పులకు అలవాటుపడిన వారి ఇండ్లలోను సన్నగిల్లి పోయినది. పల్లెటూళ్ళలో ఇప్పటికిని ఈ అలవాటు కలదు. నేడు డాక్టర్లుకూడా ఆముదం పెట్టడం మంచిది కాదని చెబుతూ మిల్క్-ఆఫ్ మాగ్నీషియా (Milk of magnesia) పోయమంటున్నారు. ఆముదము కేవలం విరేచనానికే ఉద్దేశించినదిగా భావించడం వల్ల ఇది



పెట్టకపోయినా విరేచనం కాగలదనే భావన వల్ల ఇది జరుగుతున్నది. ఆముదం కేవలం విరేచనానికే ఉద్దేశించినది కాదు. వైద్య గ్రంథాల్లో పసిపిల్లలకు మలవిమోచనంతో పాటు బలముకొరకై కేవల స్నేహపానం "బలార్థీ స్నేహానే చా గ్యం" అని చెప్పబడినది. స్నేహపానంవల్ల వాతం అనులోమగతిని పొంది శరీరానికి జవసత్త్వములు చేకూరగలవు. చమురు శరీరానికి ఇంకేటట్టు రాయడంవల్ల కండపుష్టి ఏర్పడగలదు.

## చిప్పము

"చిప్పచిప్ప గోళ్లు సింగరయ్య గోళ్లు
మాతాత గోళ్లు - మందాపురాళ్లు"

చిప్పము-గోటికి సంబంధించిన వ్యాధి. పిప్పిగోళ్లు, చిప్పగోళ్లు రెండూ ఒకటే.

"నఖమాంసమధిష్ఠాయ వాయుః
పిత్తంచ దేహినాం
కుర్వాతేదాహపాకౌచ,
తం వ్యాధిం చిప్ప మాదిశేత్

ఈ చిప్ప (పిప్పి) గోళ్ల నివారణకు చిప్పహారాది లేపనములుకూడా వైద్యగ్రంథాల్లోనే చెప్పబడి ఉన్నవి.

## చేతి కాక

"ఎంతో యెత్తు మరిగినావు ఏమిసేతురా
ఇంతుల చేతి కాకలకు, ఎంతో కందేవు"

ఎప్పుడూ పిల్లలను అతిగా ఎత్తుకోడంవల్ల 'నిక్కా-క' అనే రోగం పుడుతుంది. కాబట్టి పిల్లలను అట్టే ఎత్తుకు తిరగరాదు. బాగా ఆడుకోనివ్వాలి.

ఆంధ్రుల గృహజీవిత విధానంలో కళాభిరుచి, ఆస్తిక్యభావం, సౌమనస్యం, శరీరారోగ్యం, నీతి, నియమం ఇత్యాదిగుణాలు కలిగించాలంటే పిల్లలకు పాటలు, పదాలు నేర్పడం, గృహిణులు అర్థవంతమైన ప్రాచీన సంప్రదాయాలను పాటించడం, యజమానులు అందుకు దోహదం చేయడం అవసరము.

ప్రాచీన బాలసాహిత్యంలో ఎన్నో నిగూఢమైన శాస్త్రీయ జీవిత రహస్యాలు పారంపర్యంగా చెప్పబడిఉన్నవి. వాటిని మనం గ్రహించి, అట్టివాటినన్నిటిని ఆదరించి, సంపాదించి, వాటి ఆంతర్యం అర్థం చేసుకొని ఆచరించడంవల్ల యెంతైనా మేలు చేకూరగలదు. వైద్యపరంగా ఎన్నో సామెతలు, పలుకుబళ్లు కలవు. విస్తరభీతిచేత వివరించలేదు



# ఆయుర్వేద వాఙ్మయంలో శిశు పోషణ

– డా॥ శకుంతలా దవే

శిశు పోషణం కళయే గాక గొప్ప శాస్త్రం కూడా. దీని జ్ఞానం ప్రతి వ్యక్తికి అనివార్యం.

వంశసూత్రం అవిచ్ఛిన్నంగా కొనసాగడానికి సంతతి నితాంతం ఆవశ్యకం. ప్రాణుల ఉత్కృష్టతమభావనకు ఆధారం శిశువే. అందువల్లనే శిశువిహీనమైన గృహం అప్రశస్తమని, అనపత్యులైన దంపతులు భాగ్యహీనులని జనం అనుకుంటారు. అపత్యమహత్త్వమును గురించి వ్యాసభగవానుడిలా అన్నాడు :-

"ఇష్టం దత్త మధీతం వా
యజ్ఞాశ్చ బహుదక్షిణాః,
సర్వం తత్త దపత్యస్య
కలాం నార్హంతి షోడశీమ్.
"తపో వాఽప్యథవా యజ్ఞః
యచ్చాన్యత్ పావనం మహత్,
తత్సర్వ మపరం తాత
న సంతత్యా సమం మతమ్.
సంతానో హి పరో ధర్మః
ఏవ మాహ పితామహః".

(మహాభారతము)

శిష్యునిద్వారా గురునియొక్క ధవలకీర్తి విస్తరించినట్లు, తల్లిదండ్రుల కీర్తిప్రతిష్ఠలు కూడా సంతానంద్వారా ఉజ్జ్వలంగా వ్యాపిస్తున్నాయి. మానవుడు సంతానరూపంలో తనకు శాశ్వతత్వం కలుగుతుందని భావిస్తాడు. అందువలననే వంశపరంపర అవిచ్ఛిన్నంగా కొనసాగడానికి మానవుడు నిరంతరం పరిశ్రమిస్తున్నాడు. "సంతానాన్ని ప్రయత్నపూర్వకంగా పొందాలి" అనే శాస్త్రవచనాన్నిబట్టి, సంతానాన్ని పొందడం ఎంత కష్టమో పొందిన సంతానాన్ని రక్షించడంగూడా అంతే కష్టమని నిరూపితమవుతున్నది.

శిశుపోషణ కళయేగాక, గొప్ప శాస్త్రం గూడా. దీని జ్ఞానం ప్రతివ్యక్తికి అనివార్యం. అనభిజ్ఞులైన తల్లి దండ్రులు సుకుమారులైన శిశువుల అహార విహారాల్లో శ్రద్ధతీసికొనక తమ అజ్ఞానంతో వారిజీవితానికే బాధాకరులు అవుతున్నారు. గర్భస్థ శిశువు, సద్యోజాత శిశువు, వాతాతపాలను సహించని లేతమొక్క వంటివాడు. ఆహార విహారాలందు లోపం ఎంత చిన్నది కలిగినా వీరు నశించిపోతారు.

"తాభ్యామేవ విషమసేవితాభ్యాం
జాతః సద్యః ఉపహన్యతే,

అమ్మంటే ఇష్టం !
బొమ్మంటే ఇష్టం !
అమ్మా బొమ్మా అంటే
ఎంతో నా కిష్టం !
ఎందుకో తెలుసా ?
అమ్మ నన్ను పెంచి పెద్దచేసింది !
ఆటలూ, పాటలూ అన్నీ నేర్పింది !
మంచిమంచీ బుద్ధులెన్నో చెప్పింది !
మంచివానిగా నన్ను తీర్చిదిద్దింది !
-కవుల ఆంజనేయ శర్మ

తరురివ అచిర వ్యారోపితః
వాతాతపాభ్యా మప్రతిష్ఠిత మూలః."
చ. శా. 6-26.

శిశుపోషణ విజ్ఞానం ఎంత ఉపాదేయమైనప్పటికీ, మనదేశంలో ఎక్కువ ప్రచార ప్రసారాలు పొందలేదు. "స్వస్థస్య స్వాస్థ్య రక్షణమ్, ఆతురస్య వికారప్రశమశ్చ" అనే సిద్ధాంతం ప్రకారం ఆయుర్వేదం మానవ స్వాస్థ్య సంబంధమైన సమస్త సమస్యలను చర్చించి, దానికి సమాధాన మిస్తున్నది. త్రికాలజ్ఞులైన ఆయుర్వేద ఋషులు తమ దృష్టిని శిశుపోషణం వంటి మహత్తర సమస్యపైన గూడా ప్రసరింపజేశారు.

శిశువు జీవనం జన్మానంతరంకాక, గర్భంలో అనుప్రవేశించడంతోనే ప్రారంభమవుతున్నది. జీవనమే ఆయువు. ఆ ఆయువును రక్షించడం, వర్ధిల్ల చేయడం, ఆయుర్వేద శాస్త్ర లక్ష్యం. శిశువు గర్భస్థితి, జననాంతరం ప్రారంభదశ, ఆ శిశువు యావజ్జీవనానికి మహత్వపూర్ణమైన, మూలభూతమైన కాలం. ఈ దశ శిశు జీవనానికి ఆధారశిల వంటిది. శిశుజీవన మనే భవన మూలబంధము ధృఢంగా ఉండడానికి ఆయుర్వేదంలో చెప్పిన కౌమారభృత్యమును ఆచరణలో పెట్టడం అవసరం. శిశువు దీర్ఘాయువై బలంగా ఉండడానికి శిశువు గర్భప్రవేశంలోనే గర్భిణి ఆహార విహారాల్లో తగిన కట్టుబాట్లు చేయాలి. త్వరగా జీర్ణంకాగలిగి, శుద్ధము, స్నిగ్ధమైన భోజనమును గర్భిణి సేవించడం వలన ఆమెకు స్వాస్థ్యము చేకూరి, గర్భానికి కూడా స్థైర్యము, ఓజస్సు, బలము కలిగి, భావి శిశువులో సాత్త్విక గుణోత్పత్తికి అవకాశం కలుగుతుంది. గర్భిణి సేవించే ఆహారమే అన్నరసమై ఆమె రక్తంలో ప్రవహించి, గర్భాన్ని పోషిస్తుంది. ఆమెసేవించే ఆహారం పైననే గర్భస్థ శిశువు బలం, సంహననం, ప్రకృతి రూపొందుతాయి. వాత, పిత్త, కఫ ప్రకృతులలో శిశువు ఒక ప్రకృతిలో జన్మించడం ఇప్పటి ఆహారంపైననే అధారపడి ఉంటుంది. అంతేగాక జీవన పర్యంత మదే ఆహారం సాత్మ్యమవుతుంది.

"యదన్న పానం ప్రాయేణ
గర్భిణీ స్త్రీ నిషేవతే
రసో నిర్వర్తతే తాదృక్
త్రిధా చాస్యాః ప్రవర్తతే."
(కాశ్యప సంహిత, లేహాధ్యాయము 1.)

అంతేగాక :

"వ్యక్తీ భవదంగ ప్రత్యంగస్య నాభ్యామ్ ప్రతిబద్ధా నాడీ, నాడ్యా మపరా, తస్యాం మాతు ర్హృదయమ్, తతో మాతృహృదయాదాహార రససారః ధమనీభిః స్యందమానః అపరాముపైతి. తతః క్రమాన్నాభించ,తతశ్చ స పునర్గర్భస్య పక్వాశయే కాయాగ్నినా పచ్యమానః ప్రసాద బాహుల్యాత్ ధాత్వాది పుష్టి కరః సంపద్యతే, తథా రోమకూపై రుపస్నేహ ఏవ ప్రవిశతి. సాక్షాదన్నపానా నను ప్రవే

శాత్, రపస్యవా సమలత్వాభావాత్, గర్భస్య
స్థూల మూత్రపురీషాద్యసంభవః"

(అష్టాంగసంహిత, శారీరము-అ. 2)

ఈవిధంగా గర్భిణి తీసుకొనే ప్రశస్తమైన ఆహారము గర్భస్థశిశువును చక్కగా పోషిస్తుంది. అంతేగాక ఈ ఆహారరసమే భవిష్యత్తులో బిడ్డకుకూడా ముఖ్యమైన ఆహారముగా పరిణమిస్తుంది. ఎందుకంటే గర్భిణీస్త్రీ భుజించిన ఆహారరసము మూడు భాగాలుగా విభక్తమై, ఒకభాగము తల్లి శరీరానికి పుష్టి కలిగిస్తుంది. మరొకభాగము గర్భస్థశిశువును పోషిస్తుంది. మూడవభాగము అవరుద్ధమైన ఆర్తవ స్వరూపము ధరించి పాలిండ్లను పెంచి, శిశువు జన్మించిన తరువాత స్తన్యరూపములో పోషకమౌతున్నది.

"మాతృపుష్ట్యర్థ మేకాంశః
ద్వితీయో గర్భపుష్టయే,
తృతీయః స్తనపుష్ట్యర్థం
నార్యా గర్భస్తు పుష్యతి."

(కా. లేహాధ్యాయము 1)



గర్భస్థితిలో ఉచిత పరిచర్యను, ఉత్తమ ఆహారాన్ని పొందిన శిశువు సర్వాంగ సమృద్ధమై సకాలంలో సుఖపూర్వకంగా జన్మిస్తుంది. గర్భిణి యథావిధిగా ఆహారవిహారాలు సేవించడంవలన దేహస్థ దోషధాతువులు సమస్థితిని పొంది ఆరోగ్యవంతమైన శిశువును సుఖంగా ప్రసవించడానికి తోడ్పడుతుంది.

మమత స్త్రీసహజమైన గుణం. బాలలు సర్వదా మాతృవాత్సల్యానికి అధికారులుగానే ఉంటారు. అచేతనమైన ప్రకృతి పురుష సంపర్కముతో చైతన్యశీల అయినట్లు శిశు దర్శన స్పర్శనాదులతో ఉద్దీప్తమైన మాతృస్నేహాధిక్యంవల్ల అచేతనమైన పాలు, తల్లిపాలిండ్లలో ప్రసరించి శిశుపోషణ తత్పరమవుతుంది. ఈ స్తన్యము గర్భిణీస్త్రీ ఆరగించిన ఆహారరసమే.

"రసప్రసాదో మధురః
పక్వాహారనిమిత్తజః,
కృత్స్నదేహాత్ స్తనౌ ప్రాప్తః
స్తన్యమి త్యభిధీయతే".

(సుశ్రుత, నిదానము 101, 18)

ఈ క్షీరమే శిశువుకు జీవనం. కేవలము ఈ దుగ్ధాహారంతోనే శిశువుకు ధాతుపుష్టి ఏర్పడుతుంది. ప్రశస్తమైన స్తన్యసంపద శిశువు అవసరాలన్నీ తీరుస్తుంది. జన్మించిన శిశువు ప్రపంచానికే క్రొత్త గనుక, ఇతర ఆహారాలేవీ సాత్మ్యమైనవి కావుగనుక, గర్భంలో తొమ్మిది నెలలపాటు శిశువుకు క్షీరంతో పరోక్షంగా సంబంధమున్నందున ఈ స్తన్యం శిశువుకు సరళమైన, సాత్మ్యమయిన ఆహారమవుతున్నది. దీనిపైననే శిశుజీవన నిర్మాణ కార్యక్రమం ప్రారంభమవుతున్నది. కనుక క్షీరానికి జీవన మనే పేరు యుక్తియుక్తమే.

"జరాయుజానాం భూతానాం
విశేషేణ తు జీవనమ్,

క్షీరం సాత్మ్యంచ బాలానాం
క్షీరం జీవన ముచ్యతే".
(కాశ్యప-భోజనకల్పము)

అండజ, స్వేదజ, ఉద్భిజ ప్రాణులకు క్షీరము అవసరములేదు. ప్రకృతి వాని పోషణ పద్ధతిని వేరేవిధంగా కల్పించింది. జరాయుజ ప్రాణులకు క్షీరమే ప్రారంభావస్థలో ఏక మాత్రమైన ఆహారము. పాలనుండే ఆయు ర్వృద్ధి, శరీరంలోని ధాతువులకు బృంహణం (పుష్టి), అవయవ సంహననం (సౌష్ఠవం) కలుగుతున్నవి. శారీరక స్నిగ్ధత్వం, కన్నులలో నిర్మలత్వం కూడా ఈ క్షీరంతోనే కలుగు తున్నవి. అందువలననే పునర్వసు ఆత్రేయ ఆచార్యుడు ఇలా నిర్వచించినాడు:

"జీవనం బృంహణం సాత్మ్యం
స్నేహనం మానుషం పయః,
నావనం రక్త పిత్తేచ
తర్పణం చాక్షి శూలినామ్".
(చ. సూత్రస్థానము 27-224)

ఈ స్తన్యం ప్రథమ ప్రసూత అయిన తల్లికి మూడవనాడు గాని, నాల్గవనాడుగాని పడుతుంది. ఈ మూడునాళ్లు స్తన్యాభావం వలన శిశువు దుర్బలుడు కాకుండా శాస్త్రోక్త విధానాల ననుసరించవలసి వుంటుంది. పున ర్వసు ఆత్రేయుని మతానుసారం మొదటిదినం తేనె, నేయి, సమపాళ్ళలో కాకుండా శిశు వుకు ఇవ్వాలి (సమభాగాలుగా వున్న తేనె, నేయి విషతుల్యమని వైద్యులమతం). ఈ ప్రథమాహారంలో అనంతమూలిక అరగదీసి కలిపి నాకించాలి. రెండవనాడు, మూడవ నాడు "లక్ష్మణ" అనే మూలికతో సిద్ధమయిన నేతిని నాకించాలి. నాల్గవరోజు పాలుపడిన తరువాత శిశువు పాలు తాగవచ్చును. జన్మ కాలంలో శిశువుచే బంగారు నాకించడం, శిశువు బుద్ధిని, జ్ఞాపకశక్తిని, బలాన్ని, రంగును, ఓజస్సును వృద్ధిపరుస్తుంది. పాలు పడడంలో ఆలస్యం కావడంవల్ల, పాలిండ్లలోని ధమనులు విస్ఫారక పోవడంవల్ల శిశువు నూతనావసరం వెంటనే తీరదు.

"ధమనీనాం హృది స్థానాం
విస్తృతత్వా దనంతరం,
చతూరాత్రాత్ త్రిరాత్రా ద్వా
స్త్రీణాం స్తన్యం ప్రవర్తతే.
"తస్మాత్ ప్రథమేఽహ్ని మధుసర్పి రనంత మిశ్ర మంత్రపూతం త్రికాలం పాయయేత్, ద్వితీయే లక్ష్మణా సిద్ధం, సర్పి తృతీయేచ."
(చ. సూత్రస్థానము 10/24, 25)

స్తన్యానికిన్ని, మానసిక భావాలకూ ఘనిష్ఠమైన సంబంధం వున్నది. మానసిక స్థితిలో మార్పు కలిగినప్పుడు స్తన్యంలోని గుణాలు గూడా మారుతాయి. క్రుద్ధ, శోక సంతప్త, భయభీత, క్షుధాపీడిత, రుగ్ణ అయిన

> ఆటపాటలా తోడుగా
> నాటకాలతో పాటుగా
> గోదావరిలో దూకుటా
> గోలుమాలుగా తిరుగుటా
> పందెమువేసి ఈదుటా
> పడవలనే నడిపించుటా
> కుస్తీలలో మెలివేయుటా
> జట్టీలతో పోట్లాడుట
> ప్రాణాపాయము కలిగేటి
> పనులెన్నెన్నో చేయుట
> నిప్పుతోనె చెరలాడుటా-మన
> పంతులుగారికి ఒక సర్దా.
>
> -రెడ్డి చినవెంకటరెడ్డి

తల్లి శరీరంలో ప్రకోపించిన వాతాదిదోషాలు ధాతువులలో వైషమ్యాన్ని కలిగించి, సార భూతమయిన తల్లిపాలను గూడా దూషితం చేస్తాయి. అంతేగాక దూషిత మయిన పాలను తాగడంవల్ల శిశువు శరీరంలోనూ ధాతు వైషమ్యం ఏర్పడి సుకుమార శిశువు స్వాస్థ్యం పాడవుతుంది.

"శోకాకులా క్షుధార్తా చ
శ్రాంతా వ్యాధిమతీ సదా,
గర్భిణీ జ్వరిణీ పథ్య
వర్జితాఽ జీర్ణ భోజనీ,
అత్యుచ్చా నితరాం నీచా
స్థూలాతీవ భృశం కృశా,
ఆసక్తా క్షుద్రకర్మేతు
దుఃఖార్తా చంచలాఽపి చ,
ఏతాసా మన్నపానేన
శిశుః క్వనతి సామయః"

దుష్ట స్తన్యపానం దోషాలను కలుగ జేస్తుంది. స్తన్యపరీక్ష చేసిన తరువాతనే శిశువుకు ఆ పాలు పట్టడం శ్రేయస్కరం. ఆయుర్వేద శాస్త్రంలో ప్రశస్త స్తన్యపరీక్షావిధానం

> వానల్లు కురవాలి
> వరిచేలు పండాలి
> బుడుగో-బుడుగో.
>
> మా గాదె నిండాలి
> మా దాసి దంచాలి
> బుడుగో-బుడుగో.
>
> మా అమ్మ వండాలి
> మా బొజ్జ నిండాలి
> బుడుగో-బుడుగో.
>
> **సేకరణ : ఎల్లోరా**

తెలుపబడి వున్నది. ఆ పద్ధతిలో పరీక్షింప బడిన పాలు శిశువుకు నిస్సంకోచంగా ఇవ్వ వచ్చు. స్తన్యాన్ని నీళ్ళలో వేసి పరీక్షించవలసి వుంటుంది. దోషరహితమైన స్తన్యం నీట మునుగుతుంది, నురుగురాదు దారాలు దారాలుగా విడిపోదు. పైకి తేలదు. ఇది ఉత్తమ స్తన్యం. మధురరస ప్రధానమైన పాల వల్ల శిశువు మలమూత్రాలను ఎక్కువగా విసర్జిస్తుంది. కషాయరస ప్రధానమైన పాలు మలబంధం కలిగిస్తుంది. తైలవర్ణ మగు పాలు శిశువుకు బలవర్ధకం. ఘృతవర్ణ మయిన పాలు ఐశ్వర్య సూచకం. నిర్దుష్టమైనపాలు శిశువును సర్వగుణ సంపన్నం చేస్తుంది.

"అథాస్యాః స్తన్యం అప్సు పరీక్షేత, తచ్చే తత్ శీతలమ్......తను శంఖావభాస మప్సు న్యస్తం ఏకీభావం గచ్ఛతి, అఫేనిల మతంతు మత్, నోత్ప్లవతే, నసీదతి యదుదకేన సహ ఏకతాం గచ్ఛతి, వా తచ్ఛుద్ధమితి విద్యాత్. తేన కుమారస్య ఆరోగ్యమ్ శరీరోపచయో బలవృద్ధిశ్చ భవతి." (సు. శారీరము 10-31).

"బహువిణ్మూత్రతాస్వాదౌ
కషాయే మూత్రవిగ్రహః
తైలవర్ణే బలీ తుల్యః
ఘృతవర్ణే మహాధనః
యశస్వీ ధూమవర్ణేతు
శుద్ధే సర్వగుణాన్వితః."

ఈ పరీక్షలో స్తన్యము దోషయుక్తమని నిరూపిత మయితే దోష శోధనకు ప్రయత్నించాలి. ఈ విషయములో యోగ్యుడయిన చికిత్సకుని సహాయ మవసరం. అయినా సామాన్య పద్ధతిలోనూ స్తన్య శోధన జరుప వచ్చును. దుగ్ధ పరీక్షా సమయంలో మసూరములు (చిన్న కంది), షష్టిధాన్యము, పెసలు ఉలవలు, శాలిధాన్యం, నేయి, ఆవుపాలు,

మనుషులు వేరైనా
మమతలు ఒకటే.
తనువులు వేరైనా
తలపులు ఒకటే.
భాషలు వేరైనా
భావన ఒకటే.
వేషం వేరైనా
దేశం ఒకటే.
చూపులు వేరైనా
రూపం ఒకటే.
ధర్మం వేరైనా
దైవం ఒకడే.

-శ్రీరాజ్

మేకపాలు, కృత్రిమ లవణాదులను తల్లి పుచ్చుకోరాదు. త్వరగా జీర్ణంకాని భోజనం, స్నిగ్ధ ద్రవ్యాలు, మాంసం-వీనిని సేవించడం, పగటినిద్ర క్రోధాదులను వదులుకోవాలి. చికిత్సానంతరం కూడా క్షీర దోషాలు పోనట్లయితే, తల్లిపాలు తక్కువగా ఉంటేనూ, శిశువుకు పాలివ్వడానికి తల్లితో సమానురాలైన దాదిని నియమించాలి. దాదిపాలు తల్లిపాలతో సమానం కాకపోయినప్పటికినీ ఇప్పటి కృత్రిమమైన పోతపాలకంటె నయం. కాని దాది జీవత్పుత్ర అవునా కాదా, ఆమె ఉత్తమ వంశజాత అవునా కాదా, సద్గుణాలు, వాత్సల్యం, సచ్చరిత్రం కలదా, అని తెలిసికొని నియమించాలి.

తల్లిపాలు, దాదిపాలు లేనప్పుడు మేకపాలు ప్రశస్తమని వైద్యులు చెప్పతారు. అవీ దొరకనప్పుడు ఆవుపాలు మంచివి. మేకపాల గుణాలను గురించి సుశ్రుతుడు:-

"అజానా మల్పకాయత్వాత్
కటుతిక్త నిషేవణాత్
నాత్యంబుపానాత్ వ్యాయామాత్
సర్వ వ్యాధి హరం పయః."

(సు. సూత్రస్థానము 45-51).

అన్నాడు. ఇది పాలుతాగే పసిపిల్లల పోషణవిధానం. సంవత్సరం వరకు శిశువును "క్షీరపాయి" అంటారు. కాని వైద్యగ్రంథాలు ఆరునెల్ల తరువాత అన్నప్రాశనం చేయవచ్చునని తెలుపుతున్నాయి.

"షష్ఠేఽన్నప్రాశనం మాసి
క్రమాత్ తత్ర ప్రయోజయేత్".

(వాగ్భట. ఉత్తర-1.)

క్రమంగా శిశువులకు స్తన్యంతో బాటు అన్నం గూడా తినిపించాలి. అట్లు శిశువు అన్నం తినడం అలవాటైై స్తన్యాన్ని వదలిపెడుతుంది. ఈ స్థితిలో శిశువుకు తేలికై త్వరగా జీర్ణముకాదగిన పుష్టికరమైన ఆహారం ఇవ్వాలి. ఈ స్థితిని "క్షీరాన్నాదావస్థ" అంటారు. పండ్లు వచ్చిన తరువాత ఈ ఆహారవిధానంలో క్రమంగా మార్పు వస్తుంది.

"అథైనం జాత దశనం
క్రమేణాపనయేత్ స్తనాత్,
పూర్వోక్తం భోజయేత్ క్షీర
మన్నంచ లఘుబృంహణమ్."

(వా. ఉత్తర 1-37.)

శిశువుకు అన్నంపై అభిరుచి కలుగగానే ఇతర భోజ్య పదార్థాల ఎడల కూడా అభిరుచి కలుగుతుంది. రుచ్యమైన బలవర్ధకమైన ఆహారము పై శిశువు కభిరుచి కలిగించాలి. సారపప్పు, యష్టిమధికం, తేనె, పేలాలు, కండ చక్కెరతో కలిపిన ఉండలు చేసిపెడితే పాలు విడిచిన పిల్లలకు ఇష్టంగానూ, పుష్టికరంగానూ వుంటాయి. ఇవి పాచన శక్తిని గూడా

"బ్రాహ్మీ సిద్ధార్థక వచా
సారిబా కుష్ఠసైంధవైః
సకణైః సాధితం పీతం
వాజ్ మేధాస్మృతికృత్ ఘృతమ్.
ఆయుష్యం పాప్మరక్షోఘ్నం
భూతోన్మాదనిబర్హణం".

(వా. ఉ. 1-42-43.)

బ్రాహ్మీ (సరస్వతి ఆకు), తెల్లఆవాలు, వస, సుగంధపాల, చెంగల్వకోష్టు, సైంధవం, పిప్పళ్లు-వీటిని కల్కంగా నూరి నేతితో కలిపి ఇస్తే శిశువు మేధ, వాక్శక్తి, స్మృతి అభివృద్ధిని పొందుతాయి.

రెండు సంవత్సరాలపాటు ఈవిధంగా ఆహారమిస్తూ ఆ తరువాత శిశువును కేవలం అన్నమే తినేట్లు చేయాలి. అప్పుడు శిశువు జఠరాగ్ని పెరుగుతుంది. ధాతుపుష్టికోసం ఎక్కువ ఆహారము అవసరమవుతుంది. కేవలం పాలతో ఈ అవసరం తీరదు. పాంచభౌతికమయిన శరీరం పాంచభౌతికమయిన ఆహారంతోనే అభివృద్ధి చెందుతుంది. అన్నరసమయకోశరూపమయిన శరీరం అన్నంతోనే అభివృద్ధి చెందుతుంది. "సర్వదా సర్వభావానాం సామాన్యం వృద్ధకారణం" అనే సూక్తిప్రకారం షడ్రసోపేతమయిన ఆహారం, వానియందున్న ద్రవ్యాలతో శిశు శరీరస్థ పార్థివాది ద్రవ్యమయమైన త్రిదోషాలను అభివృద్ధి చేస్తుంది.



# బాలల జీవితం తీర్చిదిద్దే నీతి కథా సాహిత్యం

—టి.వి. నరసింహారావు

పిల్లలు సమగ్ర జీవులు. వారిని మొదటి నుండీ సంపూర్ణ మానవులుగానే భావించి వారికి నైతిక శిక్షణం గరపాలి, లేకుంటే వారు పిల్లలుగానే ఉండి పోతారు.

తెలుగులో నీతికథాసాహిత్యం అనగానే మనకు మొట్టమొదట శ్రీమాన్ పరవస్తు చిన్నయసూరి రచించిన నీతిచంద్రిక, కందుకూరి వీరేశలింగంగారు రచించిన నీతికథామంజరి రెండుభాగాలు స్ఫురణకు వస్తాయి.

సంస్కృతంలోని పంచతంత్ర హితోపదేశ కథలకు రూపాంతరం నీతిచంద్రిక. ఆంగ్లంలోని ఈసపు కథలకు తెలుగుసేత నీతికథామంజరి రెండుభాగాలు. ఇవిగాక వేదం వేంకటరాయశాస్త్రిగారు పంచతంత్ర హితోపదేశ కథలను ఆంధ్ర హితోపదేశ చంపువుగా అనువదించినదికూడ ఒకటి ఉన్నది. చిన్నయసూరి నీతిచంద్రిక మిత్రలాభ మిత్రభేదాత్మకము. వేదమువారి హితోపదేశ చంపువు మిత్రలాభ, సుహృద్భేద, విగ్రహ, సంధిరూపాత్మకము. చంపువు అనగా గద్యపద్యాలతో కూడిన కావ్యం.

మన భాషలో కథాసాహిత్యం అపారంగా ఉన్నది. కాని, నీతికథాసాహిత్యం మాత్రం పరిమితంగానే ఉన్నది. చిన్నపిల్లలకు నీతులు గరపడానికి కథలు వ్రాసినవారినందరిని వరుసగా పేర్కొనడం సాధ్యంకాదు.

అసలు పిల్లలకు నీతికథలు వ్రాయాలన్న సంకల్పం ఒక గొప్ప విషయం. నీతికథాసాహిత్యసృష్టికి కేవలం భాషాపాండిత్యమేకాక లోకవృత్త పరిశీలనం, బాల మనస్తత్త్వ పరిజ్ఞానం, మంచి బోధనానుభవం ఉండాలి. పిల్లలకు తెలుపవలసిన విషయంయొక్క పరిమితి, పద్ధతి ముందు రచయితలకు ఆకళింపు కావాలి. భాష, భావం పిల్లల అంతస్తుకు సరిపడి ఉండాలి.

నీతి అనేది బ్రతుకులో ఒక చక్కని రీతికి మార్గం చూపుతుంది. నీతిలేని మనిషి బ్రతుకు నిరర్థకం. నీతులను కేవలం పిల్లలచేత వల్లె వేయించినంతమాత్రాన అవి వారి ఒంటబట్టవు. జీవితవృత్తంతో వాటిని మిళితంచేసి కథలుగా అందిస్తే పిల్లల మనస్సులలో అవి బాగా హత్తుకుంటాయి. చిన్ననాడు నాటుకొన్నవి చిరకాలం నిలిచి ఉంటాయి.

పిల్లలేకాదు పిల్లలనుపోలిన జనసామాన్యం కూడ కథలంటే ఎంతో ఆసక్తి చూపుతుంది. కథలలోని ఘట్టాలు వారి కంటికి నిజంగా జరిగినట్లు సాక్షాత్కరిస్తాయి. కథలు వింటున్నంతసేపు వారు కరిగి అందులో లీనమౌ

తారు. విద్యావిధానంలో నీతిబోధకు తగినంత అవకాశం అనుస్యూతంగా వస్తున్నది.

సంస్కృత పంచతంత్ర ఖ్యాతి దేశాంతర, ఖండాంతర, యుగాంతరాల వరకు వ్యాపించింది. కథాఫలాన నీతిని, లోకరీతిని, ఉత్తమ భాషాజ్ఞానాన్ని శిశువులకు అలవర్చుటలో హితోపదేశానికి సాటి హితోపదేశమే. పంచ తంత్రం ఒక చంపుకావ్యం. దానిని 17 వ శతాబ్దిలో లఫొంటోన్ అనే ఒక ఫ్రెంచి రచయిత పద్యాల్లోకి అనువదించి అసమానఖ్యాతి నార్జించాడు. తరువాత సర్ ఎడ్వర్డు మార్షల్ దానిని ఫ్రెంచినుండి ఆంగ్ల భాషలోనికి అనువదించడం జరిగింది. ప్రపంచ కథా సాహిత్యాలన్నింటిలో పంచతంత్రానిదే పైచెయ్యి అని ఆర్థర్ రైడర్ అన్నాడు. ఈ పంచతంత్ర హితోపదేశకథలే ఈసపు కథలుగా రూపాంతరం చెందినవనికూడ అంటారు. ఇతివృత్తాలబట్టి, భావాలబట్టి చూస్తే రెండింటిలో ఎన్నో సామ్యాలు గోచరిస్తాయి.

ఈకథ లన్నింటిలో పక్షులు, జంతువులు మనుష్యులు కలిసిమెలిసి ఉండడం, సంభాషించడం హేతు దృష్టికి కొంత విరుద్ధంగా కనబడవచ్చు. పిల్లలను ఆకట్టుకొనే కల్పనా శిల్పం ఇందులో పుష్కలంగా ఉన్నది. నిజానికి పిల్లలది కల్పనా ప్రవృత్తి. వారికి హేతువాదం కొంత మించినదవుతుంది. రష్యాలో విప్లవానంతరం పిల్లలకు హేతువాద దృష్టిని వృద్ధిచేయాలన్న తలంపుతో పిట్టకథలు, కల్పనాకథలు నిషేధించారు. దానివల్ల పిల్లల్లో హేతుదృష్టి పెరగక పోగా, భావనా పటిమ తగ్గిన సూచనలు కనుపించాయట. వెంటనే తెలివైన ఆ పాలకులు తమ తప్పును దిద్దుకొని నిషేధాన్ని తొలగించారు. నేడు రష్యా చిన్నపిల్లల కవసరమైన కల్పనా సాహిత్యంలో ప్రథమ స్థానాన్ని గడించుకొన్నది.

> బళ్లో గంటలు
> గబగబగబ
> జెళ్లో గంటలు
> ఝణఝణఝణ
> గుళ్లో గంటలు
> దబదబదబ
> మెళ్లో గంటలు
> గలగలగల
> ఊళ్లో గంటలు
> ఘణఘణఘణ
>
> -బెల్లంకొండ చంద్రమౌళిశాస్త్రి

నీతి చంద్రిక మూలానికి దాస్యంచేసే దండాన్వయం లాంటిది కాదు. తెలుగుదనం నిండుగా సంతరించుకొన్న స్వతంత్ర రచనను తలపించే కావ్యం. ప్రసన్నమైన శైలితో నవ్యంగా భవ్యంగా సాగిన తొలి తెలుగు వచనకావ్యం అది. వచన రచనకు శ్రీకారం చుట్టినవాడు చిన్నయసూరే. భాష గ్రాంథికమైనా వాక్యనిర్మాణం సరళంగా వ్యావహారిక పద్ధతిని ఉండాలనుకొన్న అతని దృష్టి చాలా దూరదృష్టి యని చెప్పాలి. కవిత్రయం రచించిన ఆంధ్రమహాభారతం సర్వవేదసారం అన్న మాటేమోగాని సూరి విరచిత నీతిచంద్రిక మాత్రం సకల కావ్యసారం, సర్వనీతిసారం అని ఘంటాపథంగా చెప్పవచ్చు. నీతులకు, సామెతలకు, లోకోక్తులకు నిధి నీతిచంద్రిక. తెలుగు వచన వాఙ్మయ గంగావతరణానికి భగీరథు డనదగినవాడు పరవస్తు చిన్నయసూరి.

ప్రతిజ్ఞాదికంలో చిన్నయసూరి ఈవిధంగా వెల్లడించాడు-



గీ॥ ఒనరగా పంచతంత్ర హితోపదేశ
ములను పరికించి వానిలో వలయు నంశ
ములను గొని కొంత అభినవంబుగనుగూర్చి
కృతి యొనర్చెద నీతిచంద్రిక యనంగ.

ఇంకా, విద్యవలన వినయం, వినయం వలన అర్హత, అర్హత వలన ధనం, ధనంవలన దానం, దానంవలన ఇహపరసౌఖ్యం కలుగుతుందన్నాడు.

ముదిమి మృతి లేనివాని వలె బుద్ధిమంతుడు ధనాన్ని విద్యా ధనాన్ని గడించాలని, మృత్యు వెప్పుడు కలుగుతుందోనన్న భయంతో దానం ఆచరించాలని చెప్పాడు.

అవినీతికి మించిన కీడులేదు, నీతిలేనివానిని లోకులు నిందిస్తారు. కాబట్టి ప్రయత్నించి ప్రతిమానవుడు నీతివిద్యను తప్పకుండ నేర్వాలని వక్కాణించాడు.

పచ్చికుండమీద వ్రాసిన రంగుల చిత్రం చెరగకుండునట్లు, బాల్యంలో బోధించిన విద్య పదికాలాలపాటు నిలిచి ఉంటుంది. కాబట్టి కథల రూపంలో బాలురకు నీతి వచనాలు బోధింపబూనుకొన్నా నన్నాడు.

మన వాఙ్మయంలో నీతికథా సాహిత్యానికి ప్రత్యేకమైన, విశిష్టమైన స్థానం ఉన్నది. నీతికథలు ప్రపంచంలోని శుభబుద్ధిని దర్పణం పట్టి చూపుతాయి; బాలురకు భద్రతను, పరిపుష్టిని కలిగిస్తాయి.

కథ అన్నది ఒక కళాస్వరూపం. చిత్రణం లాగ, సంగీతంలాగ దాని సందేశం సౌందర్యయుతం, ఆనందమయం. కథా సాహిత్యం వలన ఎంతో విద్యా ప్రయోజనాన్ని సాధింపవచ్చు. దాని ఆశయం ఆనందమే అయినా, దాని గమ్యం జ్ఞానప్రదానం. కథా శ్రవణం వలన శ్రమకలుగదు సరిగదా పైగా శ్రమ నివారణ మవుతుంది. ఉత్సాహం, ఊహాబలం పెరుగుతుంది.

విద్యాప్రాంగణంలో నీతికథలకు నిర్ణీత స్థానమున్నది. తాత్కాలికానందం కలిగించే అద్భుతకథలు, హాస్యపుకథలు, చిట్టికథలు, పొట్టికథలకంటె జీవితంలో శాశ్వతముద్ర వేసే నీతికథలబోధ ఎంతో వాంఛనీయం. విద్యార్థులను నీతిమంతులుగ సత్ప్రవర్తకులుగా తయారుచేయడం విద్యయొక్క పరమ ప్రయోజనం. నీతిని బోధింపని విద్య నిరర్థకం. కేవలం అక్షరజ్ఞానం ఒకటే విద్య అనిపించుకోదు. విద్యకు వినయం మారుపేరు. ఒకడు విద్యావంతుడైనాడంటే వినీతుడైనాడని అర్థం.

కౌతుకం ఉట్టిపడేలాగ కథలు చెప్పగలిగిన ఉపాధ్యాయుడు ఎట్టి విద్యార్థులనైనా ఇట్టే ఆకర్షించి తనవైపుకు త్రిప్పుకోగలడు. తాను తన బోధనక్రియను నేర్పుగా నిర్వహించుకోగలడు. కథాకథనం గురుశిష్య సంబంధాన్ని గొప్పగా పెంపొందిస్తుంది. క్రమశిక్షణకు కావలసినమార్గాన్ని పర్పరుస్తుంది. క్రమశిక్షణ, విధేయత అన్నవికూడ అలవాట్లే. నీతికథాబోధనవల్ల అలాంటి అలవాట్లు పిల్లల్లో చల్లగా మెల్లగా పాదుకొంటాయి.

నీతిచంద్రికలోని సారాంశం ఇలా ఉంటుంది.

మిత్రలాభంకంటె మించిన లాభం ప్రపంచంలో వేరేదీ లేదు. వంశానికి యశం తెచ్చినవాడే పుత్రుడు. మూర్ఖులైన నూర్గురు పుత్రులకంటె గుణవంతుడైన ఒక్క పుత్రుడు చాలు. తమబిడ్డలకు విద్యాబుద్ధులు చెప్పించని తల్లిదండ్రులు దోషులు. పురుషకారముచేత కార్యం సిద్ధిస్తుంది. ఎట్టిరత్నమైనా సానబెట్టక ప్రకాశింపదు. సాధుసాంగత్యం సర్వశ్రేయాలకు మూలం. ధన సాధనసంపత్తి లేనివారయ్యు బుద్ధిమంతులు పరస్పరమైత్రి సంపాదించుకొని స్వకార్యాలు సాధించుకుంటారు. ఈర్ష్యాళువు, జుగుప్సాపంతుడు, నిస్సంతోషి, క్రోధనుడు, నిత్యశంకితుడు, పరభాగ్యోపజీవి అనే ఆరుగురు దుఃఖభాగులు. తన్నుమాలిన ధర్మం, మొదలుచెడ్డ బేరం ఉండదు. తాను బ్రతికి సమస్త పురుషార్థాలు సాధించుకోవాలి. శరీరం క్షణభంగురం. గుణాలు కల్పాంత స్థాయులు. ఏది ఎవ్వరితో తగునో వారితో బుద్ధిమంతుడవి చెయ్యాలి. సజ్జన దర్శనం సమస్త దోషాలను పోగొట్టుతుంది; సర్వశుభాలను కలిగిస్తుంది. కులశీలాలు తెలియకుండా ఎవ్వరికీ తావీయకూడదు. శుచిత్వము, త్యాగము, శౌర్యము, సుఖదుఃఖములయందు సామాన్యము. దాక్షిణ్యము, స్నేహము, సత్యవర్తనము సుహృద్గుణాలు. దారిద్ర్యంకంటె మరణం మేలు. అనృతమాడడంకంటె మౌనం మేలు. అర్థనాశనం, మనస్తాపం, గృహంలోని దుశ్చరితం, వంచనం, పరాభవం-వీటిని ప్రకాశింపజేయదగదు. సేవావృత్తి మానాన్నివలె యాచనావృత్తి సమస్త గౌరవాన్ని హరిస్తుంది. లోభం చాల చెడ్డది. బుద్ధిమంతుడు దానికి లోబడడు. ధనలోభం సర్వాపదలకు మూలం. లోభంవల్ల మోహం, మోహంవల్ల దుఃఖం కలుగుతుంది. సంసారవిషవృక్షానికి రెండుఫలాలు అమృతతుల్యాలు: కావ్యామృతరసపానం ఒకటి, సజ్జనసంగతి యొకటి. యౌవనము ఝరీవేగతుల్యం. జీవితం బుద్బుదప్రాయం. ప్రియవచనాలతోడి దానం, గర్వసహితంగాని జ్ఞానం, క్షమాసహితమైన శౌర్యం, త్యాగయుక్తమైన విత్తం-ఈనాలుగు లోకంలో దుర్లభాలు. వివేకహీనునికి శాస్త్రజ్ఞానం గ్రుడ్డివాని చేతిలోని దీపంలా నిష్ఫలం. సర్వదానాలు, సర్వవ్రతాలు, సర్వయాగాలు శరణాగత రక్షణంతో సరిగావు. హితమాడువాడు దుర్లభుడు. హితవాదికంటె హితశ్రోత మరీ దుర్లభుడు. ఎంత కష్టమైన పనియైనా సాధింపవచ్చుగాని తగిన మిత్రుని సంపాదించుకోవడం కష్టం.

దీనినిబట్టి చిన్నయసూరి అపారపాండిత్యం అనుపమ లోకజ్ఞానం, ఉత్తమ హితదృష్టి విదితమౌతుంది.

ఈసపు కథలలోని సారాంశం ఇలా ఉంటుంది. బిడ్డలకు విద్యాబుద్ధులు చెప్పించడం తల్లిదండ్రుల విధి. తల్లిదండ్రులయెడ కృతజ్ఞత చూపడం బిడ్డల విధి. తల్లిదండ్రుల ఉపేక్షాభావంవల్ల, అతి గారాబంవల్ల సాధారణంగా పిల్లలు పాడైపోతారు. తాము పెరిగి పెద్దవారై అనుభవం గడించుకొనేవరకు పిల్లలు

చిక్కు చీకట్లలో దీపాలు నవ్వినవి
నీలాల నింగిలో చుక్కలే నవ్వినవి
విశ్వమంతా నిండి వెన్నెలలు నవ్వినవి
పురిటింటిలో పాప బోసిగా నవ్వినది
తీరుబడిలో మొగ్గ మూగగా నవ్వినది
చిక్కనగు వెన్నెలల చిరుగాలి నవ్వినది.

-మిరియాల రామకృష్ణ

తమ తల్లిదండ్రుల ఒద్దికలో ఉండాలి. వారు చెప్పిన బుద్ధులు వినాలి.

మిత్రలాభానికి మించింది లేదు. భుజబలం కన్నా బుద్ధిబలం మిన్న. దేహ సౌందర్యం కన్న హృదయసౌందర్యం మిన్న. చేసిన వాగ్దానం చెల్లించుకోవాలి. ఎవరి పని వారు చేసికోవడం మంచిది. ప్రజాసేవకులు సురక్షితులు కారు. మిత్రుని నిజాయితీ కష్టకాలంలో తెలుస్తుంది. అనుభవానికి మించిన గురువు లేదు. అధైర్యానికి మించిన అవగుణం లేదు. చేయలేని పనుల్లో చేయి దూర్చరాదు. దీర్ఘ కాలాగతాచారాలు రెండవస్వభావంగా తయారవుతాయి. తానేది ఇతరులకు చేస్తే, ఇతరులు తనకది చేస్తారు. కాబట్టి ఎప్పుడూ ఇతరులకు మేలే చేయడం మంచిది. పరుల పాటునుచూచి నేర్చుకుంటాం. స్వతంత్ర జీవనం సర్వదా శ్రేయం. కష్టపడి పని చేసేవారికి గౌరవం లభిస్తుంది. అల్పులకు పగ సాధించడం ఆనందం. ఉత్తములకు మేలుచేయడం ఆనందం. లోభికంటె దరిద్రుడు లోకంలో లేదు. మూర్ఖులను దగ్గరచేర్చుకుంటే ముప్పు వాటిల్లుతుంది. స్తోత్రపాఠకుల్ని దూరంగా ఉంచాలి. అసంపూర్ణంగా అనేకం నేర్చుకోవడంకంటె సంపూర్ణంగా ఒక్కటి నేర్చుకుంటే చాలు.

> పకపక నవ్వే పాపల్లార
> చకచక సాగే చిగురుల్లార
> పడిపడి విద్యల నేర్వండి
> అడుగిడి ముందుకు సాగండి
> గౌతమబుద్ధుని గాథల నెరిగి
> గాంధీ నెహ్రూ కథలను నెరిగి
> మహమ్మదు క్రీస్తు మర్మము నెరిగి
> మదిలో రాముని కొలవండి.
>
> -పాలడుగు నాగయ్య

మనుష్యుడు తనకొరకే పుట్టలేదు. అతడు సాటివారిని సేవించడానికి పుట్టాడు. అందుచేత స్వార్థం విడిచిపెట్టాలి. అర్హతను మించిన అధిక్యాన్ని అభినయించరాదు.

జ్యోతిష్యుని చక్కగా విమర్శించడం ఈసపు కథల్లో ఒకటిరెండు తావులందు జరిగింది. ఇతరుల అదృష్టాలను చెప్పబూనుకొన్న జ్యోతిష్యులు తమ అదృష్టాన్ని తెలుసుకోలేరు. మంత్రతంత్రాలవల్ల అందరికీ మహాసిరులు కూర్చదలచుకొన్నవారు, రాగిడబ్బులకు అమ్ముడుపోయేవారు ఆ సిరులన్నీ తామే కూర్చుకోవచ్చునుకదా ! ఇవన్నీ వంచనలు.

ఇలాంటి విశేషాలు ఈసపు కథలనిండా చూడవచ్చు. అందుకే ఈ కథలకు ప్రపంచ వ్యాప్త ఖ్యాతి కలిగింది. 19 వ శతాబ్ది చివరలో ప్రచురింపబడిన వీరేశలింగంగారి నీతి కథామంజరి రెండుభాగాలు అనేక ముద్రణ లందుకొన్నవి. ఆంధ్రుల ఆదరాభిమానాలకు పాత్రమైనవి.

పిల్లలు సమగ్రజీవులు. వారిని పెండటినుండీ సంపూర్ణ మానవులుగానే భావించి వారికి నైతికశిక్షణం గరపాలి. లేకుంటే వారు పిల్లలుగానే ఉండిపోతారు, ఏమీ తెలియని స్థితిలో. కేవలం పిల్లల స్మరణమీద, ధారణ మీద భారం మోపకూడదు. వారి ఆలోచనా శక్తిని, కల్పనాశక్తిని తగినరీతిగా వృద్ధిచేయడానికి మార్గాలు అన్వేషించాలి. మన విద్యాలయాల్లో జ్ఞానేంద్రియ శిక్షణ కంటె, బుద్ధీంద్రియ శిక్షణకు ప్రాధాన్య మియ్యాలి. విద్యా శిక్షణ మన్నది జీవితంతో విడివడని సంబంధం కలది.

క్రొత్తగా విస్మయం, కౌతుకం, ప్రీతి పలుదిక్కులనుండి తమశిరస్సులను ఎత్తిచూచే తరుణంలో భావ సమీకరణం ప్రసరిస్తే పిల్లల

బ్రతుకులు సఫలమవుతాయి; సమగ్రపరిణతిని సమకూర్చుకుంటాయి.

సకాలంలో క్షేత్రానికి వర్షం అవసరం. అకాలంలో అది ఎన్నిమార్లు కురిసినా లాభం లేదు. అలాగే వయో వికాసానికి ఒక అదను ఉన్నది. అట్టి సమయంలో సాహిత్యాకాశం నుండి నిర్మల నీతిధారలు వర్షిస్తే బ్రతుకు సుభిక్ష మవుతుంది.

పెద్దలమైన మనం నేడు కేవలం బజారు మనుష్యులుగా తయారై బహు బాధ్యతా బంధాల్లో చిక్కుకొన్నాము. కల్పనా ప్రవృత్తిని కఠిన మనస్కతతో నిరోధింపబూనుకొన్నాము. దీనికి కారణం బాల్యంలో మనం విశాలవిశ్వ మధ్యంలో విశ్వజననీ ప్రత్యక్ష లీలాకారుణ్య మాన్యులంకావడమే. ఇటువంటి స్థితిని భావితరానికి చెందిన బాలలకు ఎన్నడూ కల్పించకుందుము గాక!

బాల్యంనుండి భాషాశిక్షణంతో పాటు, విషయవిజ్ఞాన బోధనతో పాటు భావశిక్షణ, నైతికశిక్షణ జరిగి, దానివల్ల జీవితం నియమమార్గాన నడిచినట్లయితే ఒక యథార్థ సామంజస్యం, కృత్రిమ రహితమైన మానవత్వాభివృద్ధి కూర్చుకోవడానికి అవకాశం కలుగుతుంది. ఖాద్యాలు ఒకప్రక్క, కడుపులోని ఆకలి ఒకప్రక్క అన్నట్లు విద్యాసాగరాదు. చింతాశక్తి, భావనాశక్తి అనేవి రెండూ జీవిత యాత్రా నిర్వహణానికి అత్యావశ్యకాలు, నీతి కథలు వింటూంటే అందులోని సారం అలవోకగా పిల్లల మనఃక్షేత్రాల్లో నిండుకుంటుంది.

ఆకర్షిస్తాయికదా అని అవాంఛనీయ కథలను పిల్లలకు వినిపించడం చాల అపాయం. అంధ విశ్వాసాలతో కూడుకున్న కథలను పిల్లలకు అందిస్తే వారి భవిష్యజ్జీవితం పాడవుతుంది. వయసుమళ్ళి తాత్త్విక చింతన ముదిరిన కొందరు పిల్లలకు ఆదినుండి దేవునిగురించి మతాన్ని గురించి కర్మ సిద్ధాంతాన్ని గురించి బోధింప బూనడం ఈనాడు ఎంతవరకు సమంజసం అన్నది ఆలోచింపవలసిన విషయం.

తర్బర్ అన్న అమెరికన్ వ్యంగ్య రచయిత ఈనాటి కవసరమైన నీతికథలను చిత్రంగా పేర్కొంటాడు. కొన్ని భావాలు మచ్చుకి— గతంలో లాగ ఈనాడు చిన్నపిల్లలనైనా మోసపుచ్చడం చెల్లేవిషయం కాదు. కొన్ని ప్రశ్నలడగవచ్చు గాని, వాటికన్నిటికి సమాధానా లాశించడం సబబుకాదు. విచారమంటూ ఎరగని వాడెవ్వడూ ఇప్పుడులేడు; ఎప్పుడూలేడు. వెనుకంజ వేసినవాడు ఒకప్పుడు రక్షింపబడవచ్చు. చాలాకాలం నీవు చాలామందిని మాయబుచ్చవచ్చు.

తర్బర్ రచించిన ఒక నీతికథ ఇలా ఉంటుంది. అది ధ్రువప్రాంతం. అక్కడ సీలు జంతువులు వాసంచేస్తున్నాయి. ఆ సీలు జంతువులకు నీటిలో ఈదడం ఒక్కటే వచ్చు. ఇంకే కళలూ రావు. ఈదడం వాటికి అలవాటుగా అజన్మసిద్ధంగా వచ్చిన కళ. అందులో ఒక

> చెప్పేదిదేమో
> చింతన చేయక
> చెప్పకు బిడ్డా!
> ముందు వెనుకలూ
> చూడకనే దిశ
> సడుషకు వత్సా!
> మంచీ చెడ్డా
> గుర్తిడకేమియు
> చేయకు బాబూ.
>
> —వల్లభనేని

సీలు పట్టణానికి పోయి, అక్కడ కొంతకాలం ఉండి కొన్ని క్రొత్తకళలు, వేషాలు నేర్చుకుంటుంది. తన స్వస్థలానికి తిరిగివచ్చి తోటి వాళ్లతో తాను నేర్చిన వివిధ విద్యలగురించి డాబులు పలుకుతుంది. తనతో ఏఒక్క విద్యలోనైనా పోటీకిరమ్మని సవాలుచేస్తుంది. మిగిలిన అమాయిక సీలుజంతువులు తమకేగొప్ప విద్యలూ రావని, తాము పోటీకి రామని అంటాయి. అయితే తానే వారు రమ్మన్న ఏవిద్యలోనైనా పోటీకి రాగలనంటుంది. అప్పుడు మిగిలినవి తమకువచ్చిన ఒక్కఈతలో పోటీకి రమ్మని సముద్రంలో చెంగున దూకుతాయి. మన డాబులరాయుడు తన హేటూ బూటూ సూటుతోసహా ఈదడానికి నీటిలో దూకి ఒంటినున్న దుస్తులు అడ్డురాగా, తాను మునుపు నేర్చిన ఈతను మర్చిపోగా మునిగి చనిపోవడం జరుగుతుంది. దీనిలోని నీతి ఏమిటంటే-పుట్టెడు సుగుణాన్ని మర్చిపోయి పెట్టుడు అవగుణాలతో మనిషి కీడు తెచ్చుకుంటాడు అని.

సత్ప్రవర్తనకు మూలకందమైన నైతిక శక్తిని చిన్నతనంనుండి ప్రతిమానవుడు పెంపొందించుకోవాలి. అందుకు సాయపడే చక్కని నీతికథాసాహిత్యం నిర్మాణంకావాలి. నీతులనేవి ఎన్నడూ మార్పు చెందకుండా నిలిచి ఉంటాయనుకోవడం పొరపాటు. కాలాన్నిబట్టి అవి మారకతప్పదు. మతం, సంప్రదాయం, సాంఘిక రాజకీయ వ్యవస్థలు నీతిని శాసిస్తాయి. వాటికి కర్త మానవుడే. మనిషి ఆలోచనలో, భావనలో మార్పు వచ్చినపుడు అతడు సృష్టించేవీ మారితీరతాయి; అలాగే నీతివిధానమున్నూ మారుతుంది. ఏమైతేనేమి ఒక్కటిమాత్రం సత్యం-నీతి అన్నది మానవ జీవితానికి వెలుగై, అది కల్యాణకరం, సుఖకరం కావాలి అన్నది.



# బాలలకు అవసరమైన జీవిత చరిత్రలు - దేశ చరిత్రలు

- ఇల్లిందల సరస్వతీదేవి

బిడ్డల మనస్సులను ప్రబోధకరమైన, ఆదర్శయుతమైన జీవిత చరిత్రలూ, ఇతరములయిన విజ్ఞానదాయక విషయాలతోపాటు ఆసక్తికరమైన విషయాలతో నింపవలసి ఉంటుంది.

బాలసాహిత్యంలో ఏ ప్రక్రియ అయినా సులభశైలిలో - సుబోధకంగా పిల్లలతో మాట్లాడినట్టుగా-వాళ్లను ఆకర్షించేటట్టుగా మాత్రసమ్మితంగా ఉండటమే కాకుండా పిల్లల మానసికారోగ్యాన్ని కలిగించేదయి ఉండాలి. ఈ విషయం మన దేశంలోని సనాతనులతోపాటు ఆధునిక విద్యావేత్తలూ, మనస్తత్వ శాస్త్రజ్ఞులూ అంగీకరించిన సత్యము. మూఢులయిన రాజకుమారులకు కేవలము కథలద్వారానే అనేకవిధాలుగా ప్రాపంచిక జ్ఞానాన్ని అతివేగంగా కలిగించిన పంచతంత్ర కథలు బాలసాహిత్యంలో మణిమాణిక్యాల వంటివని పాశ్చాత్యులుకూడా అంగీకరించారు.

బాల వాఙ్మయాన్ని ఇదివరలో బిడ్డల వయసునుబట్టి విషయ విభజనను అంతగా పాటించకపోవటం జరిగింది. క్రమంగా విద్యావేత్తలు దీనికి కొన్ని విధానాలను సూచించి నిర్ణయం చేశారు. కాని మనస్తత్వ శాస్త్రజ్ఞులు వాటిని ఆమోదించలేదు. బిడ్డలకు బాల్యదశలో కూడా శారీరక పరిణామమూ, మానసిక పరిమాణమూ వివిధ కాలాలలో జరుగుతాయి. కనుక ఆ మార్పులకు తగినట్టుగా విజ్ఞానబోధ కావాలన్నారు. వీరి సిద్ధాన్తాలను అనుసరించి బాల్యదశ 19 సంవత్సరాల కాలం. దీనిలో కూడా బిడ్డల మనః ప్రవృత్తిలో ప్రత్యేకమయిన మార్పులుకలిగే ఘట్టాలు- ఆరు - పదమూడు సంవత్సరాల మధ్య కాలం. కనుక ఈదృష్టితో బాలవాఙ్మయాన్ని సృష్టిచేయాలని అభిప్రాయపడ్డారు. శాస్త్రజ్ఞులు చేసిన విభజనను అనుసరించి బిడ్డలకు మూడు సంవత్సరాల నుంచి ఆరు లేక ఏడు సంవత్సరాల వరకూ మానసికమైన పెరుగుదల కలుగుతుంది. ఆరు లేక ఏడు నుండి ఎనిమిది సంవత్సరాల వరకు శారీరకమైన పెరుగుదల, తిరిగి ఎనిమిది నుండి పన్నెండు సంవత్సరాల వరకు మానసికమైన పెరుగుదల అని వారి నిర్ణయము.

బిడ్డల మానసిక పరిస్థితి పద్దెనిమిది సంవత్సరాల వరకు అనేకమైనమార్పులు చెందుతుంది. కనుక ఆ మార్పులనుబట్టి తరగతులుగా శాస్త్రజ్ఞులు విభజించారు. దీనిని బట్టి మూడు సంవత్సరాల వరకూ పసితనంక్రింద లెక్కకట్టారు (శైశవం). మూడు సంవత్సరాల నుండి బాల్యావస్థ, పదకొండునుండి పదహారు సంవత్సరాల వరకూ కౌమారదశ. పదహారు నుండి పద్దెనిమిది సంవత్సరాలవరకు కౌమార

జాబిలీగ జాబిలీగ
జాబిలీగ
పూయవేమె పూయవేమె
వేగ వేగా
వసంతుడు వచ్చినాడు
వనంలోకి చొచ్చినాడు
చెట్లన్నీ చిగురించి
సింగారం చేసినాయి.
కోవెలలూ కూసినాయి
మామిడులూ పూసినాయి
రంగుపూలతో పొదలు
తొంగితొంగి చూచినాయి.

- దా శ ర థి

దశకూ యౌవనావస్థకూ మధ్యదశ. సాధారణంగా పిల్లల మనః ప్రవృత్తిలో ప్రత్యేకమయిన ఘట్టాలు ఆరు- పదకొండు సంవత్సరాల మధ్యవయసులో కనుక బాలవాఙ్మయం ఈ మార్పుల ననుసరించి సృష్టింప బడవలెనని సిద్ధాన్తీకరించారు.

బిడ్డలకు బోధించే విజ్ఞానాన్ని నాలుగువిధాలుగా విభజించి నట్లయితే ఉపయుక్తంగా ఉంటుందని నిర్ణయింప బడినది. మొదటిది శ్రుతం, రెండవది దృశ్యం, మూడవది పదం, పాటలు మొదలైనవి, నాలుగవది పఠనం. వీటికి అనుకూలమయిన ప్రక్రియలను సృష్టి చేయాలని విద్యావేత్తలు నిర్ణయించారు. ప్రథమశ్రేణిలో నోటితో చెప్పదగినట్టుగా కథలు, రెండవదానిలో నాటకాలు, మూడవదానిలో గేయకథలూ, పదాలూ పాటలూ, నాలుగవది పఠనయోగ్యమైన విజ్ఞానయుతమైన గ్రంథాలుగా విభజనచేయటం జరిగింది.

పిల్లలకు ప్రతివిషయాన్నిగురించి తెలుసుకోవాలన్న కుతూహలం ఎక్కువగా ఉంటుంది కనుక ఆ తృష్ణ తీరేటట్టుగా అద్భుతరసం, హాస్యరసం, చమత్కారం, వినోదం, సాహసం మున్నగువానితో మేళవింపబడిన గ్రంథాలు అవసరం. దేశచరిత్రలు, భూగోళశాస్త్రాలు, జీవితచరిత్రలు, సాహసకార్యాలతో యాత్రలు చేసిన వీరుల గాథలు, విజ్ఞానశాస్త్రాన్ననుసరించిన కథలు మొదలైనవి ఆకర్షణీయంగా కథారూపంలో మాతృసమ్మితంగా ఉండాలి.

జీవితచరిత్రలూ, దేశచరిత్రలూ పిల్లలకు వారి భవిష్యజ్జీవితాలలో బాటలు నిర్మించేవి. ఆదర్శ ప్రభువుల చరిత్రలు, వీరుల గాథలూ యాత్రికుల సాహసయాత్రలు, వివిధదేశాల చరిత్రలూ వింటుంటే, చదువుతుంటే బిడ్డల మనస్సులు ఉప్పొంగిపోతాయి. బిడ్డల మనసుల్లో మాయనిముద్రలు వేయటమేకాకుండా భావోద్దీపన, ప్రేరణ కలుగుతాయి. మనసులు ప్రభావితమవుతాయి.

బిడ్డల మనసును ఏవిధంగా మలచదలచుకుంటే అలా మలచుకోవచ్చు. బిడ్డల మనస్సులను ప్రబోధకరమైన-ఆదర్శయుతమైన-జీవితచరిత్రలూ, దేశచరిత్రలూ, ఇతరములయిన విజ్ఞానదాయక విషయాలతోపాటు ఆసక్తికరమైన విషయాలతో నింపవలసి ఉంటుంది. అప్పుడు ఆ చిన్నారి హృదయాలలో వీటి ముద్రలు శిలాక్షరాలవుతాయి.

జీవితచరిత్రలు పిల్లలకు ముఖ్యాతిముఖ్యమైనవిగా బాలసాహిత్యంలో పరిగణించబడ్డాయి. రామాయణము ఆనాటి ఆదర్శప్రభువైన రాముడి జీవిత చరిత్ర. ఆ కథవల్ల రామునివంటి కొడుకు, భరత లక్ష్మణ శత్రుఘ్నులవంటి తమ్ములు, సీతవంటి భార్య, సత్యానికి కట్టుబడి, బాధపడుతూ కూడా అడవులకు కొడుకును పంపిన తండ్రి, లోకనిందలకు భయపడకుండా రాముడికి కర్తవ్యజ్ఞానము కలిగిం

చిన సవతితల్లి, పెనిమిటి-సత్యసంధతకొరకు కన్నకొడుకును కారడవులకు పంపుతుంటే కన్నీరు కారుస్తూ నిలబడిన తల్లి-ఇలాంటి పాత్రలుగల ఆ కథ బిడ్డల మనసులమీద తప్పకుండా మాయని ముద్రలు వేస్తుంది. ఆదర్శాలతోపాటు మానవ బలహీనతలనుకూడా తెలియచేస్తూ వాటి నధిగమించటానికి వారు అనుసరించిన మార్గాలను ఎత్తిచూపుతుంది. అలాగే ధర్మరాజాదులు న్యాయానికీ, ధర్మానికీ కట్టుబడిన వీరాధివీరులు. గెలుపే ముఖ్యంగాని న్యాయమూ ధర్మమూవంటి గుణాలను త్రోసిపుచ్చే కౌరవులు, ఉద్రేకపడవలసిన సందర్భాలలో కూడా సంయమనం (అంటే ఉద్రేకాలను అదుపులో పెట్టుకోవటం) చూపిన పాండవులు - న్యాయంకోసం ధర్మంకోసం యుద్ధం చేసి తన రక్తబంధువుల నాశాన్ని కూడా లెక్కచెయ్యకుండా తమ కర్తవ్యపాలన చేయటమే ధర్మమన్న విషయాలను గురించి బోధించేది భారతం. ఈ భారతంలోని వీరులగాథలు తెలుసుకుంటే ఎన్నెన్నో లౌకికమైన విషయాలు తెలుస్తాయి. కర్తవ్యపాలన విధిగా జరగాలని అవగాహన మవుతుంది.

అలాగే సత్యంకోసం మహారాజయిన హరిశ్చంద్రుడు అబద్ధ మాడలేక తానమ్ముడుపోయి, భార్యాబిడ్డలను అమ్మి, అష్టకష్టాల పాలవుతాడు. ఈ కథవల్ల దృఢమైన మనసంటే ఏమిటో, కఠోరమైన దీక్ష అంటే ఏమిటో పిల్లలకు అర్థ మవుతుంది. అలాగే దాతృత్వానికి శిబిచక్రవర్తి, కర్ణుడు ఆదర్శం. వాగ్దానం చేసిన తరువాత వెనుకాడరు. ఇలాగే మన పురాణ కథలన్నీ ఏదో ఒక రకమయిన నీతినీ, ధర్మాన్నీ బోధిస్తాయి.

దైవభక్తుల చరిత్రలు ఒకవిధమైన నీతిని ప్రబోధిస్తాయి. దేశభక్తుల చరిత్రలు మరొక



విధమైన నీతిని ప్రబోధిస్తాయి. దేశంకోసం సర్వమూ త్యాగము చేసినవారి చరిత్రలు చదువుతుంటే వారి త్యాగానికి ఒళ్లు పులకరిస్తుంది. గాంధీజీ జీవితచరిత్ర చదువుతుంటే, అబ్రహాములింకన్ జీవితచరిత్ర చదువుతుంటే ఎన్నో విషయాలు తెలుస్తాయి. ప్రతి చిన్న విషయములోనూ వారు చేసిచూపిన ప్రయోగాలు చిత్ర విచిత్రంగా కనబడతాయి. గాంధీజీ స్వభావములోని పిరికితనము దానిని పోగొట్టుకొనటానికి ఆయన అవలంబించిన మార్గాలు, ఆయనకున్న సభా కంపం, దానిని అధిగమించటానికి ఆయన చేసిన ప్రయోగాలు ఆయనకు విదేశాలలో అడుగడుగునా జరిగిన అవమానాలు, రోషమూ అభిమానమూతో ఆయనచేసిన స్వయంకృషి, వ్యామోహాన్ని గెలవటానికి ఆయన పడినపాట్లు, నీళ్ళనుంచి డబ్బువరకూ ఆయనచేసిన పొదుపూ, పక్షపాతరహితమైన ఆయన దృక్పథమూ, బ్రిటిషు

పచ్చని చెట్లపై
వెచ్చగా నుండేటి
ఓ చిట్టి చిలకమ్మ
ఒయ్యారి చిలకమ్మ.
ఆ కొమ్మ ఈ కొమ్మ
ఆ రెమ్మ ఈ రెమ్మ
అంతటా తిరిగేటి
అందాల చిలకమ్మ.
మా యింటిలో ఒక్క-
దినముండి పోవమ్మ
మా తోటలో మంచి
ఫలము లున్నాయమ్మ.
పరుగు పరుగున వచ్చి
పండ్లారగించమ్మ
ముద్దుపలుకులు పలికి
మురిపించి పోవమ్మ.
-పులిపాటి

వారి వెదిరించినా వారిపట్ల గల గౌరవమూ ఇలా ఎన్నో అంశాలు, మరింకెన్నో నూతనాంశాలు అవగాహన మవుతాయి.

ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన మన పంచతంత్ర కథలు కథలో కథ-కథలో కథ-ఇలా గొలుసుకట్టులా ఉండే ఆ కథలు ప్రాపంచిక విజ్ఞానాన్నీ, లౌకిక నీతినీ తెలుపుతాయి. తెలివిగా బ్రతకటానికి బాటలు చూపిస్తాయి.

దేశచరిత్రలు బిడ్డల విజ్ఞానాన్ని విస్తృత పరచేవి ఏ దేశం దేనికి ప్రాధాన్యం వహిస్తుంది? ఆ దేశం మొదటినుండీ ఈనాడు కనబడుతున్నట్టుగా నాగరికతతో మిలమిల మెరసిపోతున్నదా? ఆదిలో ఎట్లా ఉండేది? ఎవరు దీనిని అభివృద్ధి చేశారు? ఎవరి కాలంలో ఎటువంటి మార్పులు జరిగాయి? అవి దేశానికి మేలు కలిగించాయా? ప్రతిదేశమూ క్రమక్రమంగా అభివృద్ధి చెందిందా? లేక కొన్ని ఇంకా అట్లాగే ఉన్నాయా? ఏ దేశంలో ఏ ఆదర్శము నిలిచింది? ఎన్నో దేశాలు అభివృద్ధి చెందినట్లే చెంది పతనమైన కారణాలు ఏమిటి? రోము దేశచరిత్ర ఏమిటి ? పతనమయిన దేశాలు తిరిగి అభివృద్ధిని ఎలా పుంజుకున్నాయి? ఐరోపా దేశాలన్నీ ఎటువంటిమార్పులకు లోనైనాయి? ఎన్ని రకాల పరిణామాలకు గురిఅయ్యాయి? నియంతలు దేశాలను ఎలా పాలించారు ? వారంతా ఏమయినారు? ఇలా అనేకవిధాలుగా దేశాల చరిత్రలు, జరుగుతున్న చరిత్రలు బిడ్డలకు సుబోధకరంగా రసవత్తరంగా రచించి, ఆ విజ్ఞానాన్ని అందించితే పరిపూర్ణమయిన విజ్ఞానం కలుగుతుంది.

ఏదేశంలోని బిడ్డలకు, ఏ ప్రాంతంలోని బిడ్డలకు ఏ ఏ చరిత్రలు ముఖ్యంగా తెలుసుకొనతగినవి, దేశాన్ని దాస్య శృంఖలాలనుండి విముక్తను చేసినదెవరు? అసలు దేశము దాస్యానికి ఎందుకు లోనైంది? స్వాతంత్ర్య సంపాదనకు నడుము గట్టిన వీరులెవరు? వీరికి నాయకులెవరు ? ఎవరెవరు ఎలాఎలా అభివృద్ధిచేశారు? స్వాతంత్ర్యమంటే ఏమిటి ? హక్కులేనా? బాధ్యతలుకూడా ఉన్నాయా? ఆదర్శవంతులైన పౌరులు కావాలంటే ఏమేమి తెలుసుకోవాలి ?

ఇలాంటి ప్రశ్నల కన్నిటికీ బిడ్డల మనస్సులలో సర్వసాధారణంగా ఉత్పన్నమయ్యే ప్రశ్నలకు దేశచరిత్రలు తగిన సమాధానాలిస్తాయి

బిడ్డల నడవడిని తీర్చిదిద్దటానికి మనదేశంలో తెలుగుభాషలో అనుభవజ్ఞులు అనేకవిధాలుగా కృషిచేశారు. ఆర్య కథానిధి అనేకభాగాలుగా వెలువడ్డది. కుమార శతకము,

కుమారీ శతకము ప్రచురించ బడ్డాయి. అయితే అవి ఆయాకాలాల ధర్మాలను అనుసరించి వ్రాయబడినవి. వాటిని మనం ఈనాడు శల్యపరీక్ష చేసి త్రోసిపుచ్చ నవసరంలేదు. కాని వారుచేసిన కృషిని అభినందించవలసిన బాధ్యత మాత్రం ఉన్నది.

మన పూర్వపు బాలసాహిత్యం సులభ శైలిలో లేదు. బిడ్డలకు సులభగ్రాహ్యం కాని శైలిలో ఉన్నది. మన బాలసాహిత్యంలో ఈనాటికీ జీవిత చరిత్రలూ దేశ చరిత్రలూ తక్కువే. బాలసాహిత్యమంతా పిల్లలను ఎదుట కూర్చుండబెట్టుకుని కథలు కథలుగా చెప్పుతున్నట్టుగా, అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్టుగా ఉండాలి

ఆంగ్లభాషలో పిల్లల ఎన్‌సైక్లోపీడియా పది వాల్యూములకు పైగా ఉన్నది. అది పిల్లలకే కాదు పెద్దలకు కూడా విజ్ఞానబోధ చేస్తుంది. అటువంటిది తెలుగు భాషలో బిడ్డల కొరకు తయారయితే మన బిడ్డలెంతో అదృష్టవంతులు. అది వివిధరీతుల విజ్ఞానాన్ని కలిగిస్తుంది. అదిలేని కొరతను తీర్చగలిగినది బాలల ఎకాడమీ ఒక్కటే.



# మన సంస్కృతి ప్రవంతిలో
# పిల్లల ఆటపాటలు

— ఏదిద కామేశ్వరరావు

పిల్లలకు మాటలు రావాలే గాని, అసలు మాటలాడటంచేత నవ్వాలే గాని వారి నోరు వూరుకోదు. వాళ్ళకు వచ్చిన ఏవో కొన్ని అక్షరాలనో, మాటలనో గుదిగుచ్చి అనేస్తుంటారు.

బాలవాఙ్మయం, బాలక్రీడాసాహిత్యం అనే మాట చెవిని పడగానే, నాకు ఒక పాట స్ఫురణకు వస్తూవుంటుంది:

"దోరముగ్గినపళ్లు-దోసిళ్ల పళ్లు
విచ్చివిచ్చని పూలు-విచ్చెల్లపూలు
వచ్చిరానీ మాటలు-లచ్చపూదేనెలు"

దోరముగ్గిన పళ్లు, విచ్చీ విచ్చని పూలు, వచ్చీ రాని మాటలు, అచ్చమైన పూదేనెలు- ఇవన్నీ ఒకే కోవకు చెందుతాయని ఈ గేయకారుడు ఊహించాడు.

వచ్చీరాని మాటలు దోరముగ్గిన పళ్లలాగ, విచ్చీ విచ్చని పూవుల్లాగ ముద్దుగా ముచ్చటలు గూరుస్తూ వుంటాయి. 'వచ్చీరాని మాటలు' అనేవి బాలలోకానికి చెందినట్లుగానే-ఆలోకం లోని బాలలు కూడా విచ్చీవిచ్చని పూవుల్లాగ మొగ్గనిగ్గులు తేరుతూ తీయగా గుబాళిస్తూ వుంటారు; కన్నులపండువు చేస్తూవుంటారు.

పిల్లలకు మాటలు రావాలేగాని, అసలు మాటలాడటం చేతకావాలేగాని, వారి నోరు వూరుకోదు; వాళ్ళకు వచ్చిన ఏవో కొన్ని అక్షరాలనో, మాటలనో గుదిగుచ్చి అనేస్తూ వుంటారు...అ అనడం కూడా ఒక రాగంలో (అది రాగం అయినా, కాకపోయినా) పాడేస్తూనే వుంటారు...! ఆ పాడటం కూడా, కళ్లూ, చేతులూ, కాళ్లూ త్రిప్పుతూ ఒక లయలో (అది లయ అయినా కాకపోయినా) ఆడేస్తూ వుంటారు...!

ప్రకృతి శ్రుతిజన్యమైనది; లయబద్ధమైనదిని. పంచభూతాలూ అట్టివే! సృష్టి అంతా దీనికి నిబద్ధమైవుంది. దీనికి భిన్నమైన ప్రాణి సిద్ధీవమే అవుతుంది; సజీవంగా మనజాలదు. ఈ రహస్యాన్ని గుర్తెరిగిన మన పూర్వులు దానిని అక్షరబద్ధంచేసి, ఆత్మోద్ధ్యమ్నానికి దోహదంచేసే కొన్ని పాటలను, ఆటలను రూపొందించి మనకు అందించిపోయారు.

అనే బాలభాష, బాలగేయాలు, బాలక్రీడలూనూ. తల్లినుండి పిల్లకువచ్చే వారసత్వమది. అతి పవిత్రము, అనుశ్రుతము అయిన ఈ కళ మన మహా సంస్కృతి ప్రవంతిలో ఒక పాలపాయగా, అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తూ వస్తున్నది! మనం పెట్టిపుట్టిన ఐశ్వర్యమూ అదృష్టమూ అదే! దాని ఫలితమే, దాని పరిణామమే...పదిమంది పిల్లలు ఒకచోట చేరి నారంటే...

"చెమ్మచెక్క । చారెడేసి మొగ్గ ।
అట్లుపోయంగ । ఆరగించంగ-"

-అంటూ ఒక లయలో చప్పట్లుచరుస్తూ, ముందుకూ వెనుకకూ గెంతుతూ ఆడు కొంటూ వుంటారు.

"ఒప్పులకుప్ప। వయారిభామా।
వన్నెలచిన్ని। వగలమారి భామా..."

-అంటూ పరికిణీ అంచులను చేతివేళ్ళతో పట్టుకుని, వయారంగా చేతులు త్రిప్పుతూ ఒకరి వెంట ఒకరు ఒకపద్ధతిలో తిరుగుతూ ఆడుకొంటారు.

"తప్పట్లోయ్, తాళాలోయ్
దేమునిగుళ్ళో బాజాలోయ్
పండూ ఫలమూ దేముడికోయ్
పప్పుబెల్లం పాపలకోయ్..."

-అంటూ, ఆ చప్పట్లుతోనే మరో విధంగా ఫణితికూర్చి, పద్ధతి మార్చి, ఆడుకొంటూ నవ్వుల నారబోస్తారు.

"గుడుగుడుగుంచం, గుండారాగం
పామునిపట్టం, పడగారాగం
కాలూ తీసి గట్టున పెట్టు
కత్తెయ్యనా, దెబ్బెయ్యనా?
...............
వేడినీక్లు కావాలా? చలినీళ్లు కావాలా?
..................?"

-అంటూ, ఒకళ్ళ చెవులను మరొకళ్లు పట్టుకుని, చక్కగా కూర్చుని, గుండ్రంగా వూగుతూ, సన్నగా సంగీతాలు తీస్తూ ఆడుకొంటారు.

ఆరుబైట ఇలా ఆడుతూ, పాడుతూ - ఇంత మన్నో, ఇసుకో కుప్పలా పోగు చేసుకొని, ఓ చిన్నపుల్లముక్కను అందులోదూర్చి, రెండు అరచేతులనూ ఆ పోగుపైకప్పి—

"దూదూపుల్ల దురాయ్‌పుల్ల
చూడాకుండా జాడాతియ్
ఊదాకుండా పుల్లతియ్..."

అంటూ పాడతారు. ఆ పుల్ల ఆ యిసుకలో ఎక్కడవుందో కనిపెట్టి పైకి తీయాలి. అలా తీయగలిగితే పందైనట్టు, లేకపోతే పచ్చి అయినట్టూను!

ఈ "కనుక్కోవడం" అనేది ఓ పెద్ద ప్రజ్ఞ క్రింద లెఖ్ఖ. పిల్లల ఉత్సుకతకు, తెలివి తేటలకు ఇది ఒక కొలబద్ద. ఈ "కనుక్కోగల" శక్తిని ప్రేరేపించే ఆటలు - బాల క్రీడలలో చాలావున్నాయి.

పదిమంది పిల్లలూ ఒకచోట చేరతారు. వాళ్ళలో కొంచెం పెద్దపిల్లను 'తల్లి' అంటారు. ఆతల్లి ఒకచోట కూర్చుని, ఇంకో పిల్లను తన ఒడిలో కూర్చోబెట్టుకుని కళ్లు మూసి పాడుతుంది; హెచ్చరిక పాట...

"దాగుడుమూత దండాకోర్
పిల్లి వచ్చె ఎలుక భద్రం!
ఎక్కడిదొంగ లక్కడే-గప్‌చిప్..."

ఇలా ఆ 'తల్లి' పాట పాడేలోగా, మిగిలిన పిల్లలందరూ తలొకచోటా దాంకుంటారు. తలుపు వెనకాల, మంచంక్రింద, పెట్టెచాటుని ఎవరికీ కనపడకుంటా వుండాలని నక్కి కూర్చుంటారు. అంతట ఆ 'తల్లి' తన చేతు



లను తీసేస్తుంది. కళ్లు తెరుచుకున్న ఆ పిల్ల దాక్కున్నవాళ్లను పట్టుకోవడానికై వెతుకుతుంది. కొందరు పట్టుపడతారు. మరికొందరు పట్టుబడరు. వారిలో ముందుగా పట్టుబడిన పిల్ల దొంగయై, తల్లి ఒడిలో కూర్చుంటుంది. కళ్లు మూయించుకోవడానికి...మళ్లీ ఆ 'తల్లి' అమ్మకళ్లు మూయడం, పాట పాడటం, పిల్లలందరూ దాక్కోవడం...ఇలాగే సాగిపోతుంది ఆ ఆటా, పాటాను!

'పులి-మేక' ఆటకూడ ఇలాగే ఉత్సుకతను రేకెత్తించేదే! అయితే, అందులో 'కనుక్కోవడం' కంటె పట్టుకొనగలిగే చాకచక్యానికి ఎక్కువ ప్రాధాన్యం వుంటుంది. పదిమంది పిల్లలు ఒకళ్లచేతులను మరొకళ్లు పట్టుకొని, గుండ్రంగా నిలబడతారు. 'మేక' అనుకొనే పిల్ల ఆ చేతుల గొలుసు వలయంలో నిలబడుతుంది. 'పులి' అనుకొన్న బాలుడు ఆ వలయానికి బయట తిరుగుతూ, లోపలికి దూరడానికి ప్రయత్నిస్తూవుంటాడు.



"పులివచ్చె, మేకపిల్ల కుయ్యోకుయ్యో" అంటూ చేతులు పట్టుకొని వలయంగా నుంచున్న పిల్లలు పాడుతూవుంటే-

"మేకాను పడతాన్! కాళ్ళిరగగొడతాన్" అంటూ జవాబుగా పాడుతూ తిరుగుతూ వుంటాడు. అలా తిరుగుతూ, తిరుగుతూ, చటుక్కున ఓ చేతులగొలుసుక్రిందనుండి లోపలకు దూరడానికి ప్రయత్నిస్తే, ఆ చేతులను క్రిందకంటూ అదిమి, 'పులిగాడిని' లోపలకు చొరనీయకుండా అడ్డుంటారు. ఇలాగే కొన్ని విఫల ప్రయత్నాలు చేసి, ఎప్పుడో ఒకప్పుడు కొంచెం ఆదమరపించి, ఆ 'పులిగాడు' వలయంలోకి దూరిపోతాడు. అది గమనించి, ఆ 'మేకపిల్ల' గబుక్కున బైటకు పారిపోతుంది- ఇలాగ ఈ ఆట సాగిపోతుంది.

ఇవికాక మన పరిసరాలను, పశువులను, జంతువులను పిల్లలకు చక్కగా పరిచయం చేస్తూ ఆటపాటలు కొనసాగించే గేయాలు ఎంతో సరదా కలిగిస్తూ వుంటాయి.

"కాకీ కాకీ కళవళ కాకీ..."

... ... ...

"పిచుకా పిచుకా రావమ్మా..."

... ... ...

"వూరకుక్క వూరకుక్క వూరెళ్లావా?"

... ... ...

"పిల్లీ పిల్లీ పిల్లీ మ్యావ్...
నల్లపిల్లీ పిల్లీ మ్యావ్..."

... ... ...

"చీమా చీమా ఎక్కడికే ?
చిట్టి పరుగులు ఎక్కడికే ?..."

... ... ...

"ఆవూ ఆవూ తువ్వాయికి
ఆవూపాలూ బువ్వాయికి..."

పశుపక్ష్యాదులను పరిచయం చేస్తూనూ, వాటి యెడ దాక్షిణ్యానురాగాలను కలిగించే భావాలను కల్పిస్తూనూ మాత్రమేకాక, వాటివాటి సహజగుణాలను సూచించే గేయసముచ్చయం ఎంతో వుంది. వీటి నన్నిటిని పాటలుగా మాత్రమే వుంచక, వాటిని అభినయ రూపంలోనో, లేక ఆటలరూపంలోనో పిల్లలకు అలవరచే ప్రక్రియ ఈ బాలసాహిత్యంలో అపారమైనదిగా వున్నది.

ఆటపాటల్లో వినోదాన్ని గుప్పించడమే గాదు; అంకెలను లెక్కలను, అనగా గణిత విజ్ఞానాన్ని ఒప్పించారు. చిన్నచిన్న చిట్కా వైద్యాన్ని చిలికి పోశారు.

ఆటపాటలో వైద్యంతోపాటు - గణితం కూడాను-"ఒక్కం జగును...", "ఒక్కం బొక్కెన్న"-అంటూ అంకెలను, వాటి వరుస క్రమాన్ని సూచించే పాటలను పాడుతూ పిల్లలందరూ కూర్చుని, ఒక్కొక్కరికి ఒక్కొక్క అంకె నిస్తూ, ఒక వరుసలో అంకెలను త్రిప్పుకొంటూ పది అంకె వచ్చినవాళ్లు పండినట్లు అనుకొంటూ ఆడుకొంటారు.

ఈ భావాన్నే మరికొంత విస్తృతము, అర్థవంతమూ చేయాలనే అభిప్రాయంతో నేను వ్రాసిన పాటలను, సందర్భవశాత్తూ - ఒకటి రెండు పేర్కొంటాను.

"రూపాయి ఇదిగో, రావె పాపాయి!
రూపుమాడవె, గుండ్రవందము!
దీనికెంత బడాయో, చూడు పాపాయి॥

... ... ...

"సున్న చుట్టగలవా, పాపా!
చుక్క పెట్టగలవా?
సున్న ప్రక్కలను చుక్క పెట్టగా
స్థానము మారు, సంఖ్యలు పెరగు" ॥సు॥

... ... ...

అంకెలకు పాటలతో అంకెలు కలిపి, ఆటలుగా మలచడంలో విశేషమైన పరమార్థం వుంది. అంకెలను అంకెలుగా చెప్పడంకంటె- అంకెలను ఒక పాటగా పాడించి, దాని నిక ఆటగా ఆడించినట్లయితే, వారికి అంకెలు చాలా సులువుగా, త్వరగా వచ్చేస్తాయి. పాట ఆట సరదాతో వారు అంకెలను కూడా నేర్చుకొంటారు. ఆట పాటలతో అన్నీ నేర్చుకోవడమే ఇందలి పరమార్థం. ఆట పాటలతో విజ్ఞాన వినోదాలను రంగరించి పిల్లలకు ఉగ్గుపాలతో అందియడమనే ప్రయత్నం అనాది నుండీ వస్తూనే వుంది.

సంధ్యవేళ ఆరుబైట పిల్లలందరూ చేరి ఆడుకొనే ఆట పాట——

"కొంగలమ్మా కొంగలోయ్
కొల్లేటి కొంగలోయ్——"

అంటూ ఒకళ్ళ చేతులను మరొకళ్ళు పట్టుకొని, బారలు చాచుకొని, బారులు తీరి, ఒక

ఓహో! ఓహో!
బాలికలారా! బాలకులారా!
మీరు-మేము పలికే భాష
వ్రాసే భాష - ఏమో చెప్తారా?
మన భాషేదో చెప్తారా?
ఆహా! ఆహా!
వెలుగు వెలుగులో తేనెలూరగ
తేటతెలుగున మీరు మేము
పలికే భాష - తెలుగయ్యా!
మనభాష - తెలుగయ్యా!

-లక్కాన మల్లిఖార్జునుడు

నిర్మల గగనం పాపాయీ
నా పసిహృదయం పాపాయీ
పున్నమి జాబిలి పాపాయీ
నా చక్కని వదనం పాపాయీ.
చంద్రుని గుడియే పాపాయీ, నీ
సిగలో పూవులు పాపాయీ
చల్లని వెన్నెల పాపాయీ
నీడారు నవ్వులు పాపాయీ
తళతళ తారలు పాపాయీ
నా పలువరుసలు పాపాయీ
కలువరేకులే పాపాయీ
నీ కనుదోయి పాపాయీ.

-లతిక

వరుసలో తిరుగుతూ, మొదటి ఇద్దరి చేతుల బార క్రిందనుండి దూరి వెడుతూ ఆడుకొంటారు. పాము మెలికలు తిరుగుతూ ఆరుబయలంతా ఆడేస్తారు. అసలు ఆకాశంలో కొంగలబారు ఒక వరుసక్రమంలో, నెలవంక వంపులో ఎగురుతూ వుంటే ఎంతో చూడ ముచ్చటగా వుంటుంది. అలాగే పిల్లలు యీ పాట పాడుతూ బారులుతీరి, తలలు వెనుకకు వంచి, ఆకాశంలోకి చూస్తూ తిరుగుతూవుంటే ఆ పక్షుల తోరణాలు క్రిందకు దిగినవా అనిపిస్తుంది. ఇంతేకాదు - ఈ పాటలో మరొక విశేషంకూడా వుంది.

"కొల్లేరు కొరవనీరు
మల్లేరు మరువనీరు
ఉప్పుటేరు చేరాయోయ్
పిల్లాజెల్లా మారేయోయ్—
—కొంగలమ్మా, కొంగలోయ్
కొల్లేటి కొంగలోయ్—"

కొల్లేటి నాశ్రయించి జీవించే పక్షుల ప్రవర్తన చిత్రంగా వుంటుంది. ఒక ఋతువులో కనిపించే పక్షులు మరొక ఋతువులో మనకు కనిపించవు. నీరులేని రోజుల్లో, అవి యేటిని వదలిపెట్టి నీరున్న తావులకు వలసపోతూ వుంటాయి. ఈ భావాన్ని సూచనమాత్రంగా చెప్పడం ఈ సాగే ఆటలోని చందం అటువంటిది.

"బీరాయి పువ్వుల్లు పూసేటివేళ
కాకరపూవుల్లు కాసేటివేళ
ఆకుఆకుమధ్య అవి మెరిసేవేళ
ఆకాశతారలు నవ్వేటివేళ-
చూడవే ఈ సృష్టి చూడవే పాపా!
పాడవే ఈ సొగసు పాడవే పాపా॥"

... ... ...

"తెల్లతెల్ల పూలమ్మ । చంద్రకాంతం
ఎర్రఎర్ర పూలమ్మ । సూర్యకాంతం
పచ్చపచ్చ పూలమ్మ ! ముద్దబంతి
లేతపచ్చ పూలమ్మ । రేకబంతి"

... ... ...

"ఎగిరింది ఎగిరింది మా గాలిపటము
పైపైకి ఎగిరింది మా గాలిపటము
గగనాన ఎగిరింది మా గాలిపటను
గగనాలు తిరిగింది మా గాలిపటము
గమనాలు సాగింది మా గాలిపటము"

... ... ...

"సిరెండ ప్రొద్దుల్లో
మారెండ మలుపుల్లో
రంగురంగుల హద్దుల్లో
నింగిని చూడ ముద్దుల్లూ
-నింగి సింగారమెంతో ముచ్చట్లు-"

... ... ...

సాయంసమయపు చక్కదనాలు, బాలపాపల ఆటపాటల ఆనందాలు చిలికిపోసే ఇలాంటి పాటలు ఎన్నెన్నో వున్నాయి.

అసలు ఆటపాటలలో కోలాటం పాటలకు ఒక ప్రత్యేక స్థానమున్నది : అది, త్రిశ్ర, చతురశ్ర గతుల్లోను, చాపుతాళంలోనూ కర్రలతో కోలాటం కొడుతూ, వలయాకారంలో నృత్యం చేస్తూ పాడే పాటల తీరు, ఆడే ఆటల సొరూ చూస్తూవుంటే, వాటి కవే సాటి అనిపిస్తుంది.

"అటవీస్థలముల కరుగుదమా !
వటపత్రంబులు కోయుదమా"

... ... ...

"రారె గోపభామినులారా । రారెరారే
రారె గోపీగోపకులారా । రారెరారే
పూలు విరిసెను బృందావనిలో। రారెరారే
పాలుకురిసెను వ్రేపల్లెలో । రారెరారె
పాలూపూలూ గోపాలునికి ।
కొలుపున కోలాటములాడగ
రారెరారే॥

... ... ...

"గోపాలుడే బాలగోపాలుడే
గోవులను కాచేటి గోవిందుడే
అరవిందఫాలాన । గురివింద బొట్టల్లె
కరవీరకస్తూరి । పూలతిలకమువాడె॥

... ... ...

కోలాటం పాటల్లాగ, గొబ్బి పాటలు తాళ ప్రధానములే కాక, నాట్య ప్రధానములు కూడాను. పండుగ సంప్రదాయాల్లో గొబ్బి పాటలు ఒక ప్రత్యేక సంస్కృతి. చక్కగా రంగవల్లులు దిద్ది, పేడ గొబ్బిళ్ళకు పసుపు కుంకుమ లద్ది, పూలఅలంకారాలు చుట్టి-పాపలు చప్పట్లు చరుస్తూ, పాటలు పాడుతూ-గుండ్రముగా తిరుగుతూ వుంటే - అవ్యక్తమైన ఆనందం వెల్లివిరుస్తూ వుంటుంది.

"ఏల వచ్చెనమ్మ కృష్ణు డేలవచ్చెనే।
మాయదారి కృష్ణుడొచ్చి మహిమ జూపెనే॥
ఉట్టిమీద పాలు వెన్న లెట్లు దించెనే।
బాలుడు కాదమ్మ, పెద్దవాడమ్మా॥"

... ... ...

"గొబ్బియళ్ళో, గొబ్బియళ్ళో
దుక్కు దుక్కా దున్నారంట
ఏమిదుక్కా దున్నారంట
రాజుగారి తోటలోన,
జామిదుక్కా దున్నారంట.
ఆనాటి అక్కల్లార,
చంద్రగిరి భామల్లార
భామల గిరి గొబ్బిళ్ళో—"

ఇలాగ ప్రశ్న, ప్రత్యుత్తరం రూపంలో వ్యవసాయ విజ్ఞానం గొబ్బిళ్ళ పాటల్లో గోరుముద్దలుగా సాగిపోవడం ముచ్చటనేగాదు - ఆశ్చర్యానందాలనుకూడా కలుగజేస్తుంది. ఈ గొబ్బిళ్ళ పాటలు విజ్ఞాన వినోద క్రీడలు. ఇక గుజ్జన గూళ్ళు, అన్నాలాటలు, తాటాకు బొమ్మల పెళ్ళి ఆటలు - ఇన్ని అన్ని కావు.

"బుజబుజ రేకుల పిల్లుందా?
బుజ్జా రేకుల పిల్లుందా?"

... ... ...



పెద్దపెద్ద రెండెడ్లు కొంటా
బండీనాగలి చేయించేస్తా
ఎండాకాలం ఎరువు తోలుతా
తొలకరి వానకు స్వాగతమిస్తా
ఏరువాకకూ సంతోషిస్తా
కోడికూతతో నాగలి కడతా.

**-మేడిచర్ల ఆంజనేయమూర్తి**

"మా-పిచుకతల్లి పెళ్ళికూతురాయెనె-
మా-మిత్రులందరు పెళ్ళిపెద్దలాయెనె-
తూతూ-తూతూ-తుతుతు తుతుతు తూతూ
-ఓ సన్నాయి చిన్నమ్మా-రాగదే...

... ... ...

"ఓం ఓం ఓం - ఓం ఓం ఓం
ఓ మూత మా మాత జేజేలో మా మూత
బాలపాపలు ఎక్కు మా బాల పల్లకీ
బంగారు పల్లకీ, రంగారు పల్లకీ.
ఒంకర టింకర సోల!
టింకర వంకర ఓం!!
ఓం ఓం ఓం, ఓం ఓం ఓం..."

... ... ...

అన్నాలాటలు, పెళ్ళి ఆటలు పిల్లలు ఆడుతూ పాడుతూ వుంటే - మన సంసార తాపత్రయ మంతా, పిల్లల ఆటల్లో, 'ఆటలో అరిటి పండు'లా సాగిపోతున్నదా? అనిపిస్తుంది.

పిల్లల ఆటపాటల్లో - అనితర మధురంగా వెలిగిపోయేది చందమామ! చందమామ లేని బాల సాహిత్యము, బాల క్రీడాసాహిత్యము రాణించదు. ఆ సాహిత్యమే వెన్నెలంత చల్లనిది; పున్నమి అంత తెల్లనిదీని!

"చందమామ రావె। జాబిల్లి రావె
కొండెక్కి-రావె। కోటిపూలు తేవె"

"దాయిదాయిదాయి ఓ చందమామ
దాయిదాయి రావోయి అందాలమామ
అందచందాలు నీకు అవి ఎక్కడివోయి
చక్కని చుక్కల రెక్కల చిక్కని
కళలోయి

... ... ...

"గుడి కట్టినాడా చందమామ లేక
బడిపెట్టినాడా చందమామా
గుండుసున్నా చుట్టి గూడుకట్టాడా
బండిసున్నా పెట్టి బడిపెట్టినాడా-"

... ... ...

అంటూ చందమామను పిలుస్తూ పాపలు అనుభవించే ఆనందానికి అవధులుండవు. అసలు పిల్లల ఆటపాటలకు ఓనమాలూ, ఆనమాలూ అక్కడే నేమో!

పాపల బుగ్గల్లో, పాలపాటల్లో ముసిముసి నవ్వుతూ మురిసిపోయే చందమామలాగ, పిల్లల ఆటపాటలు నిత్యనూతనంగా కలకల్లా డుతూవుంటాయి. అవి చిరంజీవులు, చంద మామల్లాగ.

పాటలు హృదయానికి ఆనందాన్ని కలి గిస్తే, ఆటలు శరీరానికి ఆరోగ్యాన్ని సమ కూర్చుతాయి. అందుకే ఆటపాటలను ఆత్మ, శరీరములాంటి వని పెద్దలు అంటూవుంటారు.

ఆటపాటల్లో ఆరోగ్యం ప్రతిఫలిస్తుంది!

ఆటపాటల్లో ఆనందం తొణికిసలాడు తుంది !!

ఆటపాటల్లో అమరత్వం సిద్ధిపొందుతుంది!!!

తరతరాలుగా తరగలెత్తి వస్తూవున్న మన మహాసంస్కృతి స్రవంతిలో ఇటీవల మరొక కొత్త తరంగం మోసులెత్తుతూ వున్నది.

ఇది వైజ్ఞానికయుగం. 'సైన్సు' తాకని జీవితరంగం ఈనాడు ఒక్కటికూడా లేదనడం

అతిశయోక్తికాదు. అసలు, అన్నీ ఇకనుండి "సైన్సు ఓరియంటెడ్"గా వుండాలంటూ పెద్దలగు విద్యావేత్తలు అంటూ వున్నారు. అందుకు అనుగుణమైన కొన్ని చర్యలు కూడా అటనట తొంగిచూస్తూవున్నాయి కూడా!

"విశ్వమొక్క విద్యాలయము।
ప్రకృతొక పరిశోధనాలయము"

... ... ...

"గిరగిరా, గిరగిరా - తిరుగుతోంది।
కాలము, ఈ కాలగమనము తిరుగుతోంది....
రాట్నచక్రము తిరుగుతోంది।
తనలోనె తా తిరుగుతోంది।
తనచుట్టు తా తిరుగుతూనే
దారమంతను త్రిప్పుతోంది।
గిరగిరా...గిర...గిరా...గిరగిరా..."

"భూగోళము ఒక గోళము।
విశ్వాంతరాళములో -
బహుళ గోళములలో,
భూగోళము ఒక గోళము..."

... ... ...

వైజ్ఞానిక దృష్టి, తాత్త్విక దృక్పథం విస్తరించాలని హేతువాదం, మానవతావాదం పెంపొందాలని చెబుతూ, దానికి 'సైన్సు' ఉపకరణం కావాలనే ప్రబోధం, ప్రచారం ఈనాడు ప్రబలమవుతూ వున్నాయి. ఈ ప్రబోధాలను, హెచ్చరికలను దృష్టిలో వుంచుకొని చేసే రచనలే నిజమైన 'సైన్సు' వాఙ్మయం అవుతుందని అది జాతి పురోభివృద్ధికి దోహదకారి అవుతుందని చెప్పకోకతప్పదు.



# వైజ్ఞానిక కాల్పనిక సాహిత్యం

– వసంతరావు వేంకటరావు

విజ్ఞానంలోని శాఖలన్నీ కాల్పనిక రచనలకు ఉపయోగపడతాయి. అద్భుతావహమైనప్పటికీ రచయిత సూచించే పరిణామం భవిష్యత్తులో సిద్ధించవచ్చు.

అనేకంగా ఉన్న సాహిత్యశాఖలలో కాల్పనిక శాఖ ఉత్తేజకరంగా ఉంటుంది. అందులో అద్భుతాల, ఇంద్రజాలాల వర్ణన ప్రధానమైనది. విషయం వైజ్ఞానికమైనప్పుడు అది వైజ్ఞానిక కాల్పనిక రచన అవుతుంది. కథ సూటిగా సాగిపోయినా అందులోని అభూత కల్పనలను విజ్ఞానశాస్త్ర మాధారంగా, సమర్థించడానికి చేసే ప్రయత్నం దాని ప్రత్యేకత; ఉపయోగించే సాంకేతిక పదజాలం మరో ప్రత్యేకత. దేహాలు విడిచి కాంతిగోళాలుగా ఆత్మలు సంచరించడం, పెరిగిపోతూన్న విశ్వంతో ఒకభాగమందు సంకోచం మొదలయి, ప్రపంచం గాఢాంధకారంలో మునిగిపోవడం వంటివి ఊహాపథంలో కాకుండా విజ్ఞానసమ్మతంగా జరుగుతాయి.

వైజ్ఞానికకల్పనకు ముఖ్యావసరాలు అద్భుతం, బీభత్సం, రక్తం కరడుకట్టించే భయం మొదలైనవి. తెలుగులో విక్రమార్కుని కథలు, కాశీమజిలీ కథలువంటి అద్భుత రచనలను మించి ఉంటుంది వైజ్ఞానిక కల్పన. రాజకుమార్తెలను రాక్షసులు ఎత్తుకొనిపోవడం, రాక్షసుల నన్వేషిస్తూ వీరాధివీరులు దూరప్రయాణాలు చేయడం, మాంత్రికులసహాయం పొందడం వంటి సంఘటనలు అద్భుతగాథలకు ఆధారాలైతే, ఫ్లయింగ్ సాసర్లు, పేలిపోయే నక్షత్రాలు, పరస్పరం ఢీకొనే గ్రహాలు, మారణ తరంగాలు, ఒకమనిషి మెదడు మాత్రమే మిగలగా మెదడునుంచి వచ్చే విద్యుత్ స్పందనాల నాధారంగా చేసికొని నిర్మించిన శరీరాలు, మానవ హృదయాలను చదువగల శక్తిసామర్థ్యాలున్న పరలోకవాసులు, కాల యంత్రాలు మొదలైనవి వైజ్ఞానిక కల్పనలో కథావస్తువు లవుతాయి.

విజ్ఞానంలోని శాఖలన్నీ కాల్పనిక రచనలకు ఉపయోగపడతాయి. అద్భుతావహమైనప్పటికీ రచయిత సూచించే పరిణామం భవిష్యత్తులో సిద్ధించవచ్చు. దానికి బలవత్తరమైన వైజ్ఞానికాధార ముంటుంది. ఇందులో వినియోగపడే వస్తువులకు, సంఘటనలకు అంతం లేదు. స్త్రీపాత్రలకు పెద్ద స్థానంలేదు. విషయప్రాధాన్యమేకాని వ్యక్తిప్రాధాన్యం తక్కువ కాబట్టి పాత్రల చిత్రీకరణ పేలవం కావచ్చు.

మాటకు కుజగ్రహ విషయం యోచిద్దాము. గ్రహపరిస్థితుల గురించి అవగాహన ఉంటేకాని దానికి సంబంధించిన కాల్పనిక సాహిత్యం అర్థంకాదు. జీవపరిణామక్రమం ఆధారంగా విజ్ఞానులు కొన్ని అభిప్రాయాలకు వచ్చేరు. ఒకప్పుడు, అంటే భూలోకంలో

కంటె చాలాముందు, కుజునిలో జీవముండేదనీ, గొప్ప నాగరికత వెలసిందనీ, ఇప్పుడు బహుశా, వాతావరణపు మార్పులవల్ల అది అంతర్ధానమై యుండవచ్చుననీ ఒకభావముంది. అది ఆధారంగా చేసుకొని **Five Balloons** అనే వ్యాసం రే బ్రాడ్‌బరీ వ్రాసేరు. భూలోక ఫాదరీలు కుజలోకానికి పోయి అచటి పాపాత్ములను శుద్ధిచేసే ప్రయత్నం నిర్ధరింపబడింది. ఫాదర్ ఫెరిగ్రిన్, ఫాదర్ స్టోన్‌లు మరికొంత మందితో కుజలోకం చేరుకొంటారు.



వీరికి స్వాగతమివ్వడానికి కుజలోకపు మొదటి నగర మేయర్ హాజరౌతాడు. కుజవాసుల గురించి తెలుసుకొనే కుతూహాలం చూపించిన ఫాదర్ పెరిగ్రిన్‌కి మేయర్ చెప్పేదేమంటే: అక్కడ రెండు జాతులున్నాయనీ, అందులో ఒకటి లుప్తమౌతూండగా కొద్దిమంది ఎక్కడో దాక్కున్నారనీ, రెండవజాతివారు మానవులు కారనీ, కొండలలో నివసించే జ్యోతిర్మయ గోళాలనీ, కాని, బుద్ధి ఉన్నట్లే ప్రవర్తిస్తారనీ. ఆ మాటలకు ఆశ్చర్యచకితుడైన ఫాదర్ పెరిగ్రిన్ మొదట కొండలవైపే పోయి, ఆ నీల కాంతి గోళాల విషయం తెలుసుకోడానికే నిర్ణయిస్తాడు.

ఫాదర్ స్టోన్‌కు అటు పోవడం నచ్చక పోయినప్పటికి గత్యంతరంలేక ఫాదర్ పెరిగ్రిన్‌ను అనుగమిస్తాడు. ఈ అగ్నిగోళాలకు అర్థమయ్యేటట్లు ఒక చర్చి నిర్మిస్తారు. ఫాదర్ పెరిగ్రిన్ కాంతిగోళాలను ఆహ్వానిస్తాడు. కొంతసేపటికి అవి దిగుతాయి. పెరిగ్రిన్ సంతోషించి వాటితో మాట్లాడటానికి ఉద్యుక్తుడవుతుండగా అవి అంటాయి: "మీతో కొద్దిగా మాట్లాడాలి. ఇదివరకే అది జరిగిఉండేది కాని మీగురించి పట్టించుకోకపోతే మీదారిన మీరు పోతారని ఆశించేము. మేము చాలా పాతకాలంవాళ్ళము. చక్కటి నగరాలను ఎప్పుడో విడిచిపెట్టి, ఐహిక సౌఖ్యాలకు తిలోదకాలిచ్చి, ఈ స్వరూపాలను దాల్చి కొండలలోకి పోయేము. మీలాగే ఒకప్పుడు మాకు శరీరాలు, కాళ్లు, చేతులు ఉండేవి. మేము మనుష్యులమే. మాలో ఒకరు మానవుని ఆత్మను, బుద్ధిని శరీరంనుండి విడదీసి, రుగ్మతల నుండి, వేదననుండి, జరామరణాలనుండి విడిపించగల విధానం కనుక్కొన్నాడని ప్రతీతి. అప్పటినుండి మేము తటిల్లతారూపం, నీల కాంతి రూపం ధరించి గాలిలోను, ఆకాశంలోను, కోనలలోను అవిచ్ఛిన్నంగా జీవిస్తున్నాము. మాకు మమతాహంకారాలు లేవు, మాలో న్యూనాధిక తారతమ్యాలు లేవు. ఇతర కుజలోక వాసులనుండి విడివడి ఈ జీవనవిధానం అవలంబిస్తున్నాము. అయితే ఇదెట్లా మాకు సాధ్యమయిందో గుర్తులేదు. ఏ ప్రక్రియవల్ల ఈ రూపాలను సాధించేమో ఆ ప్రక్రియలు పూర్తిగా లుప్తమైనాయి. శారీరక పాపాలను విసర్జించి భగవదనుగ్రహంతో జీవిస్తున్నాము. ఒకరి ఆస్తిని ఆశించము, మాకు ఆస్తి లేదు. మేము దొంగిలించము, చంపము; మాకు కామం లేదు, ద్వేషం లేదు. మేము ఆనందంగా జీవిస్తాము. మాకు ఆకలిదప్పులు లేవు, పునరుత్పత్తిసాధనం లేదు, యుద్ధభావమే లేదు.

మా శరీరాలను విసర్జించినప్పుడు వాటితో బాటే కామక్రోధాలను, దౌష్ట్యాన్ని, పాప సర్వస్వాన్ని విడిచిపెట్టేము. ఫాదర్ పెరిగ్రిన్, మేము విడిచిపెట్టిన పాపాలన్నీ ఎండుటాకుల్లాగ భస్మమైనాయి మేమిప్పుడు చక్కటి వాతావరణంలో, పుష్టికరమైన భావప్రపంచంలో ఉన్నాము. మాకోసం కట్టిన దేవాలయానికి సంతోషించేము. కాని, మాలో ప్రతి ఒక్కరు ఒక దేవాలయమే; ప్రత్యేకంగా పాప జాళనానికి కొక మందిరం అక్కరలేదు ఇంతకుముందే మీదగ్గరకు రానందుకు క్షమించండి. అయితే మేము విడివడి దూరంగా

> తెల్లని మేఘం తేలుచుండగా
> అంబర మెంతో అందం అందం.
> నల్లని మబ్బులు నాట్య మాటగా
> తెల్లని చంద్రుడు అందం అందం.
> ఆకాశంలో తారక అందం.
> అమ్మ ఒడినిగల తమ్ముడే అందం.
> అమ్మా నాన్నా ఆశలు తీర్చే
> పిల్లలు ఎంతో అందం అందం.
>
> -తాడి వెంకట కృష్ణారావు

ఉన్నాము. గత 10,000 సంవత్సరాలుగా ఎవరితో మాట్లాడలేదు. ఈ లోకంలో ఎవరితో జోక్యం చేసుకోలేదు. దయతో ఈ దేవాలయ భాగాలను మీ క్రొత్తపట్టణాలకు తీసుకొని పోయి, అచటి పాపాత్ములకు సహాయపడండి. మామట్టుకు మేము సుఖంగా ఉన్నామని హామీ ఇస్తున్నాము." విస్మయంతో ఫాదర్ పెరిగ్రిన్ బాలునిలాగ వాపోయాడు.

ఈ కల్పనలో వేదాంతం మిళితమైంది. మానవజాతి ఇంకా ఉత్కృష్టమైన జాతిగా పరిణమించగలదని, ఎప్పటికైనా ద్రవ్య సంపర్కంలేని విశుద్ధాత్మలుగా జీవులు మనగలరని ఉన్న విశ్వాసాన్ని ఈ రచన చిత్రీకరిస్తుంది. వైజ్ఞానికంగా ఇది సాధ్యం కావచ్చునన్న భావం అంతర్యామిత్వమై ఉంది.

విశ్వరూపానికి సంబంధించిన దొకటి జూలియన్ హక్స్‌లీ వ్రాసేడు. బాహ్యకాలంతో నిమిత్తం లేకుండా ఆంతరంగిక కాలాన్ని సూచ్చగల "కాలయంత్రం"తో ప్రయోగాలు చేసిన వైనం కథావస్తువు. కాలయంత్రాన్ని భుజాలకు తగిలించుకొన్న కథానాయకుడు దాని లీవర్ ఒకప్రక్క నొక్కితే ఆంతరంగిక కాలం మందగిస్తుంది. తన గుండె ఒకసారి కొట్టుకొనేలోపున బాహ్యకాలంలో రోజులు, మాసాలు గడచిపోతున్నాయి, "తన్మాలంగా ప్రాతఃకాల హిమబిందువులు తలెత్తి సాయంసమయాన దించడం వాని కొక లిప్తలో సంభవిస్తూంది, వసంతకాలం భయానక జీవశక్తిస్ఫోటంగాను, వృక్షాలు చిగిర్చిపెరగడం దుర్నిమిత్తంగాను పరిణమించింది. వాని ప్రగతి మారుతున్న కొద్దీ ఒక్కొక్క నాడీస్ఫురణంలో అత్యధిక పరివర్తనం గోచరిస్తూంది. సుమనోజ్ఞకుసుమాలను త్రెంపుదామని చెయ్యిచాచేలోపున అవి వాడి జీర్ణించి, భూపతన మొందుతున్నాయి, శరత్కాల ఫల సంతతి వాని చేతిలోనే కుళ్ళుతూంది. వాని అనుభవంలో అహస్సొక క్షణద్యుతి, రాత్రి ఒక రెప్పపాటు. అహోరాత్రులొక వింతకాంతిగా మేళవిస్తున్నాయి...

"అప్పటికీ విచిత్రపరిణామంలో వాని కానక్తి పోయింది. మీటను విడిచిపెట్టేడు. దేనినైతే స్థూలంగా ఊహింపకలిగిన్ని సంపూర్ణ స్వరూపమెరుగలేక ఆత్రంతో ఆకాంక్షిస్తున్నాడో ఆ అనుభవం అప్పు డనుగమించింది. తన సామాన్య స్థితిలో వివిక్ష దివ్యవాయు

(ethor) సంఘాతాలెట్లు సాంద్రీకరించి అనవరతమైన కాంతిభారం కలిగించేయో, అట్లే, ఇప్పుడు ప్రకృతి సంఘటనలు ఏకీభూతములై నూతన వస్తువులను ప్రదర్శిస్తూ నూతన జ్ఞానం కలిగిస్తున్నాయి. వివిక్తకాంతి తరంగాలట్లు ప్రవర్తిస్తూన్న వివిధ పురుషాంతరాలు మేళవించగా, జీవజాతులు మారుతూ, పరిణామ మొందుతున్న సమగ్ర చిత్రం వాని మానసిక నేత్రానికి కనిపిస్తుంది.

"ఇతర అనుభవాలు వాని కత్యంత హృదయంగమంగా లేవు. అపూర్వమైన ఇంద్రియ జ్ఞానం కలుగుతూన్నట్లు వానికి చైతన్యముంది; అది బహుశా శక్తి వితరణలో సంభవిస్తూన్న మార్పులేమో అనుకొన్నాడు. మరికొన్ని ప్రత్యక్షంగా గ్రాహ్యమవుతున్నాయి. తన పరిసరాలలో వాటిల్లుతూ ఉన్న మానసిక ప్రవృత్తులు ఆత్మజ్ఞానంవల్ల విశదమవుతున్నాయి. అదంతా అద్భుతంగా వుంది. అయినప్పటికీ ఈ క్రొత్త స్థితిలో మనగల అవకాశాన్ని కనుగొన్నట్లైతే, ఈ నూతనానుభవాలను క్రమంగా సాధించి, మున్నెన్నడును లభ్యంగానట్టి జగత్తుయొక్క ప్రత్యక్ష చిత్రాన్ని అవగాహన చేసికోగలనను విశ్వాసం కలిగింది.

"వేరు వేరుగా నున్న తరంగాల కలయికవల్ల కాంతిభావం కలిగినట్లును, వాయువులోని వివిధ అణువుల వేర్వేరు సంఘాతాలు కలిసి సమాన పీడనం కలిగించినట్లును, క్రమంగా గమించు సంవత్సర పరంపర ఏకీభూతమై దృగ్గోచర కాలభావం కలిగించింది. ఆ విపరీత రీతిని పనిచేస్తూన్న ఇంద్రియాలు మెదడు కలిసి, అనంతశాఖలుగా నున్న జీవజాతులను వాటి అంతస్సంబంధాలతో ఒక సమగ్రమైన జీవజాతిగా మేళవించేయి. ఏకైక జీవం ఒకేవిధంగా మంద పరిణామ మొందుతున్నట్లు వానికి వ్యక్తమైంది. మీటను పూర్తిగా నొక్కాడు.

"వాని జీవితలయతో విశ్వంయొక్క లయ కూడా మారుతుంది. జగత్తేమో యథాప్రకారంగానే ఉంది; కాని, వాని అనుభూతికి వస్తూన్న జగత్తు క్షణక్షణం మారుతూంది. ఆకాశార్ణవంలో సూర్యునివంటి మహోజ్జ్వల గోళాలు జనించి లయ మొందడం, నెబ్యులాలు సాంద్రీకరించడం, పరిణామ విధులు మందగించడం, ఉద్వేగిస్తూండడం, ఇవన్నీ




వాని ప్రత్యక్షానుభవం లోనివే! దుర్లభమైన మనస్సంబంధమైన ఆత్మజ్ఞానం అధికమౌతుంది. తన్మాత్రలంగా, అంతః ప్రవృత్తిగల అవయవాలతో కూడిన ఏకమూర్తిగా జగత్తు వ్యక్తమౌతూంది. ఆ బృహత్తమ విశ్వరూపం యొక్క రేఖా లక్షణాలు మంద కాంతిలో మానసిక దృష్టికి గోచరిస్తున్నాయి; అపరిమితమై, ఊహాతీతమై మంద మంద పరిణామ మొందుతున్నాయి

"ఎంత కష్టపడినా దాని యథార్థ రూపం కనబడదు. ఆ విశ్వమూర్తి ఒకప్పుడు ప్రకాం

తంగాను, ఒకప్పు డుదాసీనంగాను, మరొకప్పుడు చంచలాత్మక ప్రమత్తతతో కూడినట్లును, ఇంకొకప్పుడు భయానకమైన దుర్దాంత శక్తితో సర్వవ్యాప్తమైనట్లును గోచరిస్తూంది. తన యంత్రాన్ని మరికొంత వేగీకరించినట్లైతే! ఈ దృశ్యం యథార్థమా? దాని సత్యం తెలిసికొందామని వానికుంది. కాని, ఈ దృశ్యంలోని వివిధ భాగాలు ఏకీభూతమై, ఏకైక సాతత్య భావం కలిగిస్తేకాని అది సాధ్యంకాదు. అందుకై మెర్కాప్పను యావచ్ఛక్తిని వినియోగిస్తున్నాడు. యంత్రం ఝుంకారంతో ఊగులాడుతూంది. కాని, లాభం లేకపోయింది, విశ్వరూప సందర్శనం సుస్పష్టంగా చేయుభాగ్యం కలిగిందికాదు."

విశ్వరూపాన్ని మానవుడే విధంగాను చూడలేడన్న వైజ్ఞానిక భావాన్ని ఇది బలపరుస్తుంది. గెలక్సీల పలాయనం కారణంగా కొంతదూరం పోయినవాటినుండి వచ్చేకాంతి ఎప్పుడూ భూమిని చేరలేదు. అందుకే ప్రకృతి ఒక "విశ్వయవనిక" వేసిందని, దానివెనుకనున్నవి కనిపించవని విజ్ఞానులంటారు.

ఇటీవల అమెరికాలో ఒక రూపకం బ్రాడ్‌కాస్టు చేసేరు. కుజలోక వాసులు భూమిపై దండెత్తుతారు. అది వినినవెంటనే శ్రోతలు భయకంపితులై నిజంగా కుజవాసులు వచ్చేరేమో అని ఇళ్లు విడిచి పరుగెత్తేరు. హెచ్. జి. వెల్స్ వ్రాసిన గ్రంథాలలో కాలం గురించి, చంద్రునిలో మొదటి మనుష్యుల గురించి అనేక విషయాల వివరణ ఉంది.

ఇట్టి వైజ్ఞానిక కాల్పనిక రచనలు తెలుగులో చాలా తక్కువగా ఉన్నాయంటే ఆశ్చర్య పడవలసిన అవసరంలేదు. విజ్ఞానంలో నిష్ణాతులైనవారు తప్ప వాటిజోలికి పోలేరు. మనదేశంలో కారణా లేమైనప్పటికి, వైజ్ఞానిక ధీమంతులకు వారి జ్ఞానాన్ని జనసామాన్యంతో పంచుకోవాలనే కుతూహలం లేదు. లేకపోతే, విజ్ఞానశాస్త్ర శాఖలన్నింటిలోను, ఇంతవరకు తెలుగులో దాదాపు 2000 పుస్తకాలకంటె వెలువడలేదంటే మరోకారణమూహించలేము. వైజ్ఞానిక రచనలకు మంచి భవిష్యత్తు ఉండగలదని ఆశిద్దాను!



# బాలసాహిత్యశైలి

**— మసూనా**

**బాల సాహిత్యంలోనూ శైలి అత్యంత ప్రాముఖ్యం వహిస్తుంది. బాల పాఠకుల్ని ఆకట్టుకొనే శైలి పట్టుబడటం సులభసాధ్య మేమీ కాదు. అది ఒక తపస్సు.**

శైలి రచనకు ఆయువుపట్టు. బాలసాహిత్యానికైనా, వయోజన సాహిత్యానికైనా శైలి ప్రధానాంగం.

అల్లసాని 'అల్లిక జిగిబిగి', ముక్కుతిమ్మన ముద్దుపలుకు శైలి, శ్రీనాథుని సీసాలు, పోతన్న భాగవత వృత్తాదులు శైలికి మచ్చు. కాల గర్భంలో కలిసిపోకుండా నిలవగల్గిన గ్రంథాలన్నిటినీ కాపాడ్డంలో శైలీప్రభావం అధిక ప్రాధాన్యం వహిస్తుంది. రచనా పరిపూర్ణతకు వస్తువైవిధ్యంతోపాటు కథాకథన వైచిత్రి మిళితమైన శైలీ ముఖ్యమైనదే!

## ఆధునిక సాహిత్యం-శైలి

యువహృదయాలను ఉర్రూత లూగించే చలంగారి కథనం, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, మల్లాది రామకృష్ణశాస్త్రిగార్ల రచనల్లోని మధురమైన పలుకుబళ్లు శైలి. జాషువా, పాపయ్యశాస్త్రిల కవితాప్రాశస్త్యాలకు శైలీ మనోహరత్వమే ఆధార మౌతుంది. పింగళి, కాటూరుల 'సౌందరనందం', రామిరెడ్డిగారి 'కృషీవలుడు' రసవత్తర రచనాశైలికి ప్రతిబింబాలు.

## బాలసాహిత్యశైలి ఎట్లా పట్టుబడుతుంది?

బాలసాహిత్యంలోనూ శైలి అత్యంత ప్రాముఖ్యం వహిస్తుంది. బాల పాఠకుల్ని ఆకట్టుకునే 'శైలి' పట్టుపడడం సులభసాధ్యమేమీ కాదు. అది ఒక తపస్సు. బాలహృదయాలను తెలియందీ, చిన్నారి పొన్నారి చిట్టి ఊహల తీరుతీయము తెరుగనిదీ బాలసాహిత్య శైలి అందుబాటు కాదు.

చిన్నిపాపల వెన్నమనసుల చిందులాడే చిలిపిచేష్టలు, పసిడిపలుకులు వెలువరించే వెక్కుచోద్యపు చిక్కుప్రశ్నలు నిదానంగా, నేర్పుగా అవగాహన చేసుకొనే భావుకులకే యీ శైలి స్వాధీన మవుతుంది.

ప్రతిభావంతులగు రచయితలకైనా సుకుమార హృదయాకర్షకమగు కుసుమపేశలమైన శైలి పట్టుపడనిదే బాలసాహిత్య రచన పరిపుష్టం కాదు; ప్రాచుర్యమూ పొందలేదు.

తెలుగులో బాలవాఙ్మయానికి అలంకారప్రాయమైన రచన లందించి ప్రశంస లందుకున్నవారు యీ శైలీ విన్యాసాన్ని ప్రదర్శించినవారే!

## బాలసాహిత్యం

ముప్ఫై, నలభై ఏళ్లక్రిందట తెలుగులో విశేషించి చెప్పదగిన బాలసాహిత్యం గ్రంథరూపంలో లేదనే చెప్పాలి. ఒకటీ, అరా పుస్త

కాలు తప్పించి, వాచకాలు, ఉపవాచకాలు మాత్రమే పిల్లల పుస్తకాలుగా చెలామణీ అయేవి.

అచ్చయిన తొలి పిల్లల పుస్తకం ఏది? బాలసాహిత్యానికి శ్రీకారం చుట్టిన ఆద్యులెవరు? అనే చారిత్రక సత్యాలు ఇప్పుడు చర్చనీయాంశాలు కావు.

## ప్రథమ గణ్యులు :

చింతా దీక్షితులుగారు, గిడుగు సీతాపతి గారు. బాలపాఠకుల్ని తన్మయుల్ని చేసిచదివించిన మధుర మనోహరమైన పుస్తకాలు రచించిన శ్రీ చింతా దీక్షితులుగారు బాలసాహిత్యకారుల్లో ప్రథమగణ్యులుగా చెప్పకతప్పదు. గిడుగు సీతాపతిగారు దీక్షితులుగారితో సమంగా గౌరవించతగ్గ పెద్దలు.

గ్రీసు దేశమందు కలదు
ఈసపు అను బానిసీడు
ఏసుక్రీస్తువలెనె వెన్న
పూసవంటి మనసువాడు.

పిట్టలపై, పిల్లులపై,
పొట్టేలపై, నక్కలపై
పెట్టినాతడు నీతి గలపు
కట్టుకథలు చెప్పుచుండు.

దైనందిన జీవితమున
మానవులకు పనికివచ్చు
జ్ఞాన మతని కథల పూల
దేనె లట్టుల దాగియుండు.

సామ్రాజ్యము లంతరించి
సమ్రాట్టులు నమసిపోయి
శతాబ్దాలు గడచె గాని
నమసిపోవ దతని కీర్తి!

-నండూరి రామమోహనరావు

వేంకట పార్వతీశ్వరకవులు, నాళం కృష్ణారావుగారు, వేదుల సత్యనారాయణశాస్త్రి, ఏటుకూరిగార్లు మున్నగు కవులు సరళ సుందరమైన శైలిలో పద్యరచన చేసి బాలలకు సన్నిహితంగా సాహిత్యాన్ని తీసుకువచ్చేరు.

వెంకట పార్వతీశ్వర కవులు బాలలకోసం రామాయణ భారతాలు, నీతికథలు కూడా చక్కని వచనంలో రచించి అందించేరు.

వావిలికొలను సుబ్బారావుగారు పురాణ కథలను పిల్లలకు సుబోధకమైన చిన్న పుస్తకాలుగా ప్రచురింప జేసేరు.

## బాలానందం-లక్క పిడతలు

గిడుగు సీతాపతిగారి "బాలానందం" ప్రచురణ బాలల పుస్తకాలకు తొలిపండువు-తెలుగు బాలలకు కనులపండువు చేసింది. రైలుబండిపాట, చిలుకమ్మపాట పిల్లలు పాడుకున్నారు.

చింతా దీక్షితులుగారి "లక్కపిడతలు" పిల్లలకు ఇంకా ముచ్చట కొలిపింది. దీక్షితులుగారి శైలి అనితరసాధ్యమైంది!

లీలాసుందరి కథ, గోపమోహిని నవలా, శంపాలత, బంగారుపిలక, సూరీ-సీతీ-ఎంకీ గొప్ప పుస్తకాలు! అచ్చమైన పిల్లల పుస్తకాలు!

ఇంతవరకూ ఇంత చక్కని పిల్లల పుస్తకాలు వ్రాసినవారు లేరనే చెప్పాలి.

## నార్ల చిరంజీవి-శ్రీవాత్సవ-బాల్జీ

అయితే-ఇట్లాంటి కమ్మని శైలిని సాధించిన గొప్ప రచయిత నార్ల చిరంజీవిగారు. వాస్తవంగా బాలల బంగారు భవిష్యత్తుకోసం కలలు గని, బాలసాహిత్యకృషికి జీవితాన్ని అంకితం చేసిన నిజమైన "బాలకవి", బాలల రచయిత చిరంజీవిగారు.

తెలుగు పూలు, జాబిల్లీ పాటలు, మందార బాల, కీలుబొమ్మ మొదలైన పుస్తకాలు కీర్తి శేషులైన చిరంజీవిగారిని బాలసాహిత్య లోకంలో శాశ్వతంగా నిలుపుతాయి.

ఇట్లాగే ఆకర్షణీయమైన శైలిలో బాల హృదయాలకు ఇంపుసొంపులు గొల్పిన పుస్తకాలు రచించినవారు శ్రీవాత్సవగారు. "రతనాల నవ్వు", "జల్తారు జాబిలి" చాల చక్కని పుస్తకాలు.

పిల్లలకోసం తపనపడి మధురమైన శైలిలో రచనలు చేసిన మరో మంచి రచయిత సూరిసెట్టి సాంబశివరావు పంతులుగారు.

**శ్రీ బి. వి.**

బాలసాహిత్యరంగానికి ప్రత్యేక గౌరవ ప్రతిపత్తి కల్గించడానికి మూడు దశాబ్దాలు కృషి సాగించిన బాలబంధు బి. వి. నరసింహారావుగారికి తెలుగు బాలసాహిత్యంలో విశిష్ట స్థానం వుంది.

ఆటలతో, పాటలతో పిన్నలను, పెద్దలను తనియింపజేసిన శైలి బి. వి. గారిది. పాలబడి పాటలు, చిన్నారిలోకం, అవూ-హరిశ్చంద్రుడు, నా కథలు-మున్నగువారి పుస్తకాలు ప్రత్యేక శైలితో ఒప్పుతాయి.

**శ్రీ ఏకుమళ్ల - శ్రీ బాలన్నయ్య**

ఏకుమళ్ల కామేశ్వరరావుగారు తెలుగు బాలలకు ఉత్తమ సాహిత్యాన్ని సమకూర్చిన మరొక బాలసాహిత్య బంధువు.

సుమారు ఇరువదేడులు 'బాల' పత్రిక ద్వారా లక్షలాది బాలపాఠకులకు విజ్ఞాన వికాసాలిచ్చే రచనలు అందించిన బాలన్నయ్య అక్కయ్యల కృషి మరువరానిది.

**బాలసాహిత్యకారులు**

ప్రత్యేక శ్రద్ధాసక్తులతో వివిధ ప్రక్రియలలో కృషిచేసి తెలుగులో ఉత్తమ బాలసాహిత్య సృష్టిచేసిన ప్రసిద్ధ రచయితలు ఇంకా ఎందరో ఉన్నారు.



శ్రీయుతులు ఏడిద కామేశ్వరరావు, కె. సఖా, కపిలరావు, వేజండ్ల సాంబశివరావు, ఉత్పల సత్యనారాయణాచార్య, రావూరి భరద్వాజ, సమతారావు, అలపర్తి వెంకట సుబ్బారావు, పిల్లా సుబ్బారావు, నండూరి రామమోహనరావు, పాలంకి వెంకట రామచంద్రమూర్తి, ముళ్లపూడి వెంకటరమణ, ముద్దా విశ్వనాథం, మధురాంతకం రాజారామ్, మిరియాల రామకృష్ణ, చల్లా రాధాకృష్ణమూర్తి, బొమ్మకంటి సింగరాచార్య, వాసమూర్తి, రెంటాల గోపాలకృష్ణ, మాల్యశ్రీ, నోరి రామశర్మ, ఎల్లోరా, జూలూరి హనుమంతరావు, మద్దిపట్ల వెంకటరావు, వెలగా వెంకటప్పయ్య, [illegible] రామం, పి. వి. యస్ పాత్రో, తాళ్లపూడి వెంకటరమణ, ఘనమూర్తి, లతిక, కవుల ఆంజనేయ శర్మ, క్రోవి, ఆరిపాక, నానిశెట్టి, కస్తూరి, శైరి, నాగవోలు మున్నగువారు, శ్రీమతులు

అందంగా ఆనందంగా నీ
డెందము పరమానందంగా
ఉండాలని నీ ఆశయమైతే
పండించుమ నీ హృదిలో మంచిని.
హర్షంతో ఆహ్లాదంతో నీ
బ్రతుకుబాటనే వెలుగు బాటగా
దిద్దాలని నీ దీక్షయె అయితే
తీర్చుమ దీనుని దీనాలాపం.
చురుకుగాను మరి పదునుగాను నీ
జీవిత నావను కాలవాహినిలో
నడిపించాలని నీ వనుకుంటే
శయనించుము వేగమె రాతిరి
కను తెరువుము వేకువజామున.

-నర్రావుల వెంకటసుబ్బారావు

ఇల్లిందల సరస్వతీదేవి, నాయని కృష్ణకుమారి, కోడూరి లీలావతి, కనకదుర్గా రామచంద్రన్, గంగరాజు సుశీలాదేవి, ఎ. లక్ష్మీరమణ, కె. రామలక్ష్మి మున్నగు రచయితలు, రచయిత్రులు బాలలకోసం ఒక విశిష్టశైలిని రూపొందించుకొని రచనలు చేసేరు. అందరి బాల సాహిత్య కృషినీ అభినందించడం తప్ప పేరు పేరునా అందరినిగూర్చి పేర్కొనడం ఈ చిన్ని వ్యాసంలో సాధ్యంకానిపని.

బాలసాహిత్యంలో కొన్ని తరాలవరకైనా రచన నిలువగల్గాలంటే ప్రత్యేక శైలి రూపొందించుకోవాలి రచయితలు, రచయిత్రులు.

## రచనా వస్తువు - శైలి

రచనా వస్తువు కంటె శైలి పాఠకుల్ని పుస్తకం పట్టించి చదివిస్తుంది. పుస్తకం చదివించలేని నీరసశైలి రచనా ప్రయోజనాన్ని వ్యర్థ పరుస్తుంది.

కొత్తగా పుస్తకం పట్టే బాలపాఠకులకు పాటలు, పద్యాలు, కథలూ నవలలూ చదివే అభిరుచి పెంపొందించే శైలి బాలసాహిత్యంలో అత్యంతావశ్యకం.

## బాలసాహిత్య రచయితలు ఎట్లా కాగలరు?

బాలల సమస్యలపట్ల సానుభూతి, వారి దైనిక జీవిత సంఘర్షణలలో తాదాత్మ్యం బాలలకు ఉత్తమ రచనలు సృజింపజేస్తుంది. పసివారిపట్ల సహనం, ప్రేమ, కారుణ్యం, కల్గిన మాతృ హృదయములు, బాలల ఉన్నతి పట్ల, భద్రతపట్ల, నిరంతర దృష్టి కల్గిన పితృ హృదయాలు, బాలల విద్యాబుద్ధులపట్ల శ్రద్ధాసక్తులు, వారి కష్ట నిష్ఠురాలపట్ల సాదరమైన ఉదారవైఖరి కల్గిన గురుదేవులు,- ఉత్తమ బాలసాహిత్యకారులు కాగలరు. వీరు బాలలతో ప్రత్యక్ష సంబంధం కల్గివుంటారు కనుక భావావేశ పూరితములైన స్వచ్ఛ సుందర మగు 'శైలి'తో రచనలు చేయగల్గుతారు.

## బాలసాహిత్యకారులకు దోహదం

బాల సాహిత్యకారులకు రచనా శిక్షణ శిబిరాలు ఏర్పాటుచేసి రచనా పద్ధతులలో శిక్షణ నివ్వడం కూడా నిర్దుష్టమైన సాహిత్యశైలి పెంపొందించుకోడానికి దోహదం చేస్తుంది.

"శుశ్రూష" వంటి ప్రాచీన సంప్రదాయములు బాలసాహిత్య రచనానుభవాన్ని ఇనుమడింపజేస్తాయి. అంటే రచనానుభవం కల్గిన బాల సాహిత్యకారుల సలహా సంప్రదింపులు తీసుకుంటూ బాలరచయితలు తమ రచనల్లో ప్రగతి సాధింపవచ్చును.

భాషా శక్తి పెంపు చేసుకోవడానికి ప్రాచీన ఆధునిక గ్రంథ పఠనం ద్వారా ఆయా కవుల శైలీ విన్యాసాల అవగాహన అత్యంతమూ అవసరమౌతుంది. బాల రచయి

తల భాషా పాటవం ఆర్జించడం ఎంతో ఉపయోగిస్తుంది; మేలుచేస్తుంది.

**పాటలు-కథలు**

తెలుగులో బాలగేయాలు రచించినవారే అధికంగా కానవస్తారు. మన బాలకవులు కమ్మనిశైలిలో పిల్లల పాటలు వ్రాసే సాధన చేశారు. వచనశైలిలో చక్కని పుస్తకాలు రచించినవారు కొంతవరకూ అరుదుగనే వున్నారనిపిస్తుంది.

పాటలకంటె కథలు, నవలలూ రచించడానికి, ఇతర విజ్ఞాన విశేషాలు బాలలకు అందించేందుకు ఆకర్షణీయమైన శైలిని అలవరచుకుంటే బాలవాఙ్మయ విస్తృతికి సహకరించవచ్చు.

సరళమైన భాష ఒక్కటే బాలసాహిత్యానికి చాలదు. సారళ్యానికి తోడు ఆకర్షణీయమైన అపురూపపు బాణీకూడా శైలిలో ఒప్పినపుడే ఆ రచయిత గ్రంథం బాలలను ఆకర్షిస్తుంది.

**అందమైన పిల్లల పుస్తకాలు**

శైలి- వస్తువు- చిత్రాలంకరణ- అందమైన ముద్రణ- సరసమైనధర- అన్నీ క్రమబద్ధంగా సమన్వయ పడినపుడే ఉత్తమ బాలసాహిత్యాన్ని తెలుగు బాలలు అందుకోగలరు.

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ యీ మహత్తర, బృహత్తర కృషికి అంకితం కాగలదని విశ్వసిస్తాను.



# బాలగేయాలూ-వస్తువూ

-మిరియాల రామకృష్ణ

బాలగేయాలపై చిత్రి ఎక్కడుందంటే, అవి బాలలకు వాళ్ళ వయస్సుయొక్క స్థాయిలో కేవలం రసానందాన్ని మాత్రమే అందిస్తూ, పెద్దదిగాక, వాళ్ళు తిరిగి వాటిని స్మరించుకోగలిగితే, వాటిలో అప్పటి ఆ వయస్సుకు తగిన వ్యాఖ్యలు స్ఫురించడంలో వుంది.

బాలగేయాలంటే బాలలకోసం గేయాలు; బాలలు పాడుకొనే పాటలు; బాలలు చదువుకునే కవిత్వం.

బాలలను గురించి రాసిన కవిత్వమంతా బాలలు చదువుకోడానికీ, పాడుకోడానికీ పనికి రాదు. బాలల గేయాలకు కొన్ని విశిష్టధర్మాలుండాలి. (1) భావన (2) రసభావం (3) భాష (4) ఛందస్సు (5) ఔచిత్యం-ఈ అయిదు ధర్మాలూ బాలగేయాలకు పంచప్రాణాలు. ఏ కవితకైనా ఈ అయిదూ ముఖ్యమే. మొదటి నాలుగింటికీ బాలగేయాలలో బాలలకు తగినట్టుగా విన్యాసం ఉండాలి. ఈ నాలుగింటికీ ఔచిత్యం ప్రధానమైన అలంకారం.

ఈ శతాబ్ది మొదట్లోనే తెలుగులో బాలగేయాలు రాయడానికి కవులు పూనుకున్నారు. అనామధేయులుగా మిగిలిపోయిన జానపద కవులూ, కవయిత్రులూ ఎవరెవరో బాలలకోసం గేయాలు అల్లారు. బాలలచేత పాడించారు. బాలలతో పాడుకున్నారు. వాళ్లు వాటిని పుస్తకాల్లో భద్రపరచాలనీ, ఇంత కీర్తి గడించుకోవాలనీ అనుకోలేదు. బాలల ఆటలకోసం అల్లి బాలలకు వాటిని పాడటం నేర్పి వివిధ రసానుభూతులను వాళ్లకు కలిగించి తరతరాల జాతికి వారసత్వంగా అర్పించిన గేయాలివి. నిజానికి పుస్తకాలుగా రచించిన గేయాలకన్నా వీటికి వ్యాప్తి, ప్రచారం ఎక్కువ. తల్లుల ఉల్లాలు, తండ్రుల చిత్తాలు వీటికి నిలయాలు. బాలలకు అనవసరమైనవీ, అర్థం కానివీ, రసానుభవాన్ని ప్రసాదించలేనివీ అయిన విషయాలు ఈ గేయాల్లో సామాన్యంగా ఉండవు. నూటికి నూరుపాళ్లూ ఈ గేయాల కూర్పులో కళాదృష్టి ఉంది. లయ ఉంది. ప్రాస ఉంది. గతి ఉంది. శ్రుతి ఉంది. ఉక్తివైచిత్రి ఉంది. పదబంధసౌందర్యముంది. భావనాచాతుర్యముంది. అనుభూతి ప్రకంపనముంది. అయితే జానపద గేయాలకు బాలలు పాఠకులు కారు; వారు శ్రోతలు, గాయకులూ కూడా.

ఈ తరతరాల జానపద గేయాల్లో వస్తువేమిటి? అసలు కవిత్వానికి ఒక నిర్దిష్టమైన వస్తువుండాలా? అప్పుడది సంకుచితమయి పోదా? వస్తువున్న కవిత్వం ఒకటి; వస్తువులేని కవిత్వం ఒకటి-అని కవిత్వాన్ని రెండు రకాలుగా లాక్షణికులూ భావించారు. వస్తుకవిత్వ

మంటే కథ నొకదాన్ని తీసుకుని దాన్ని వర్ణిస్తూ కవిత్వీకరించి చెప్పడం. కవి తనకు కలిగిన ఒక భావాన్ని, ఒక స్పందనని, ఒక దర్శనాన్ని ఒక ప్రత్యేక సంవిధానంతో, ఒక ప్రక్రియారూపంలో చెప్పడానికి కథావస్తు వక్కర్లేదు. జానపద బాల గేయరచయిత లెవరూ కథావస్తువును తీసుకోలేదు. వాళ్లు రచించినవన్నీ క్రీడాగేయాలు; ఆటలపాటలు. కథను చెప్పవలసివచ్చినప్పుడు వాళ్లు వచనాన్నే ఎన్నుకున్నారు. ఆ వచనంలో నేర్పు చూపించారు. ఉదాహరణకు "ఈగకథ". దీన్ని ఎవడో జానపదుడు వచనంలో చెప్పాడు. అది ఈనాటికీ అదే వచనలయవిన్యాసంతో జాతిలో ప్రవహిస్తోంది. వచనం చెప్పలేని దాన్ని దేన్నో చెప్పేదే కవిత్వం. నీలో నాలో నిద్రిస్తున్న భావాల వాసనలకు మేలుకొలుపులు పాడేది కవిత్వం. నవ్వించేది, ఏడ్పించేది, జాలి కలిగించేది, కోపం తెప్పించేది కవిత్వం. కానీ తమాషా ఏమిటంటే అదంతా ఆనందంగానే మారిపోవడం. కవిత్వం ఒక ఆర్ద్రమైన చిత్తవృత్తిని కలిగిస్తుంది. అలంకారికుల పరిభాషలో చెప్పాలంటే చిత్తవికాసాన్ని చిత్తవిస్తారాన్ని చిత్తద్రుతినీ కవిత్వం కలిగిస్తుంది. ఇందుకు ఒక కథ, కొన్ని పాత్రలు, వాటి సంభాషణలు, వాటి అనుభవాలు వర్ణింపబడితే అది వస్తుకవిత్వ మవుతుంది. అప్పుడది ఒక పెద్ద కావ్యమైపోతుంది. కానీ బాలలకు కావలసినవి పెద్దకావ్యాలు కావు. పరిమితిలో అవి చిన్నవై ఉండాలి. కథలు బాలల కిష్టమైనవే కావచ్చు. కానీ ఆ కథాకథనాన్ని వచనం తన భుజస్కంధాలమీద బాగా మోయగలదు. మరి కవిత్వం కూడా దానికై పోటీ పడనక్కర్లేదు. అచ్చమైన కవిత్వం అదొక కళానైపుణ్యంతో మెరుస్తూ ఉంటుంది.



'బుర్రుపిట్ట బుర్రుపిట్ట తుర్రుమన్నది
అత్తతెచ్చిన కొత్తకోక కట్టనన్నది
మామతెచ్చిన మల్లెపూలు ముడవనన్నది
పడమటింటి కాపురం చెయ్యనన్నది'

ఇందులో కథ చెబుతూన్నట్లు ఒక విధానమైతే ఉందికానీ కథమాత్రం లేదు. కథాకథనమంటే, కథాశ్రవణమంటే పిల్లలకు వల్లమాలిన మోజు కనుక, కవిత్వం వైచిత్రీయుతంగా ఉంటేనేగానీ పిల్లలు వినరు గనుక ఈ విధమైన భావనావైచిత్రితో కథను చెబుతున్నట్లు కవి నటిస్తున్నాడు. ఆ పదాల లయల హొయలలో బాలలు తన్మయత్వం చెందుతున్నారు. నిజానికి ఇక్కడ కవి తీసుకున్న వస్తువు బాలల కుచితమైంది కాదు. ఇందులో ఒక పెంకిపిల్ల కాపురం చేయడానికి ఎలా మొరాయిస్తోందో ధ్వనింపబడింది. 'బుర్రుపిట్ట'మీద ఆరోపించి కవి సమాజంలోని గయ్యాళి కొత్తకోడళ్లను అధిక్షేపిస్తున్నాడు. ఆ కోడలికి పెట్టిన వేళాకోళపు పేరు బుర్రుపిట్ట. పిల్లలకు కావలసిన వస్తువు కాదిది.

బాలభానుని యొక్క
  బంగారు దీప్తిలో
రంగుగా నీ రూపు
  తొంగి చూచింది.
నిండార బోసిన
  పండు వెన్నెలలోన
మెండుగా నీ మూర్తి
  మేళవించింది.
విశ్వ ప్రభుడ నీవు
  విశ్వంబు నిండ
విశ్వరూపుడ వౌచు
  వెలయుచున్నావు.

-మడుపు శేషారావు

'మొన్న రాతిరి నాకు వచ్చిన
  మొదటికలలో కదలిపోయిన
రెక్కలుండే గుర్రములకై
  ఎక్కడని వెదకాలి నేను ?
నిన్నరాతిరి నాకు దొరికిన
  నీటిమబ్బులలోని రంగుల
కుంచె లిప్పుడు కంటికే కని
  పించవేమిటి వింతగా !
నేటిరాతిరి ఏడుసంద్రాల్
  దాటగా నను మోయగల్గే
పంచరంగుల చిలకమీదే
  సంచరింపగ నాకు సరదా'

(స్వప్నలోకాలు : బాలాభిరామం.)

ఇందులో 'కలలు' వస్తువు. కథలాగ చెప్పబడిన కవిత్వమేగానీ ఇందులో కథ ఏమీలేదు. మొన్నరాత్రి, నిన్నరాత్రి, నేటిరాత్రి అని మూడు రాత్రులను తీసుకోవడంలో ఒక వైచిత్రి ఉంది. ఇది 8-12 ఏళ్ల మధ్య పిల్లలకు ఉద్దిష్టమైన గేయం. రెక్కలుండే గుర్రం ఎక్కడుంటుంది ? కానీ పిల్లల కది ఆశ్చర్య కుతూహలాలను కలిగించే కల్పన. నీటిమబ్బుల లోని రంగులు (హరివిల్లు) ఏడు. ఆ ఏడు రంగులకూ ఏడు కుంచెలు. ఆ ఏడు కుంచెలూ బాలుడికి నిన్నరాత్రి దొరికాయి. తెల్లారాకా వాటితో బొమ్మలు వేద్దామని ఉవ్విళ్లూరాడు. కానీ అవి ఏవీ ? ఏడు సముద్రాలను దాటించి ఎక్కడికో తెలియని లోకాలకు-కొత్తలోకాలకు-తీసుకుపోయే పంచరంగుల చిలకను గురించి జానపద కథల్లో ఉంటుంది. పంచరంగుల చిలక బాలుడికి కుతూహలం కలిగించేది. సప్తసముద్రాలు దాటాలని అతనికి సరదా ఉంది. అది ఎలా లభ్యమవుతుంది. నేటిరాత్రి కలలో కనిపించకూడదా అనుకుంటాడు. కనిపిస్తే దానిమీద సంచరించదల్చుకున్నాడు. పిల్లలు ఊహాజీవులు. వాళ్ల మనస్సులు అద్భుత కల్పనాశక్తికి ఆలవాలాలు. లేనిదాన్ని, కనిపించనిదాన్ని చూడగల శక్తి కవులకుమల్లేనే బాలలకూ ఉంది. వాళ్ల భావనాశక్తినీ, ఆశలనూ, కోరికలనూ ఈ ఖండిక మేలుకొల్పుతుంది.

బాలగేయాల వైచిత్రి ఎక్కడుందంటే అవి బాలలకు వాళ్ళ వయస్సు యొక్క స్థాయిలో కేవల రసానందాన్ని మాత్రమే అందిస్తూ, పెద్దదిగాక వాళ్లు తిరిగి వాటిని స్మరించుకోగలిగితే, వాటిలో అప్పటి ఆ వయస్సుకు తగిన నవ్యార్థాలు స్ఫురించడంలో ఉంటుంది. ఇది ఉత్తమోత్తమ బాలగేయాల విశిష్టలక్షణాల్లో ఒకటి.

ఏ వస్తువునుగానీ ఏ భావాన్నికానీ అచ్చమైన కవిత్వం వర్ణించదు, వాచ్యం చేయదు; ధ్వనిస్తుంది; స్ఫురింపజేస్తుంది. చెప్పినదానికన్నా చెప్పనిదేదో ఆ మాటల వాతావరణం వల్ల మన చెవుల్లో గుసగుస లాడుతుంది. ఇది గొప్ప కవిత్వం యొక్క లక్షణం. 'స్వప్న

లోకాలు' అనే పై ఖండికనే చూద్దాం. వాస్తవం వల్ల కలిగిన అసంతృప్తి, అసామాన్య వస్తువులకోసం అన్వేషణ ఈఖండికలో ధ్వనిస్తున్నాయి. ఈ వ్యంగ్యార్థం పెద్దవాళ్లకు కానీ తెలియదు,

'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ
నిశమ్య శబ్దాన్ పర్యుత్సుకో భవతి'

అన్నట్లు ఆ స్వప్నసీమలలో కనిపించిన సౌందర్యాన్ని చూసి జీవి పొందిన పర్యుత్సుకత్వం ఇందులో సూచింపబడింది.

బాల్యంలో కూడా దుఃఖాలు పొందే వారెందరో ఉన్నారు. వాళ్ళ కిదొక అనుభూతి కలిగించి ఓదారుస్తూ ఉంటుంది. చివరి గీతంలోని ఏడు సంద్రాలు ఏడు జన్మలుగానూ పంచరంగులు పంచేంద్రియాలు గానూ ఊహించుకున్నప్పుడు అన్యా దాలోచనా మాత్రమ్ అనిపిస్తుంది. ఈ గేయంలోని పనితనం, పదశిల్పం బాలలస్థాయికీ, పెద్దలస్థాయికి కూడా ఉద్దేశింపబడ్డాయి. సంస్కృత పదాడంబరం లేకపోవడం వల్ల బాలల కాస్వాద్యమవుతోంది. చిన్న పాదాలు గల ముత్యాల సరం చిన్నపిల్లలకు అందుబాటులో ఉంటుంది. ఖండిక నిడివి అంతా కలసి పన్నెండు పాదాలలో ముగియడం వల్ల బాలలకు విసుగు కలగదు. యతిప్రాసలు లయపరిపోషకాలయ్యాయేగానీ మొక్కుబడులు కాలేదు.

ఈ వివరణవల్ల తేలే దేమిటంటే బాలగేయాలకు ఈ వ్యాసం మొదట చెప్పిన పంచలక్షణాలూ ఏవిధంగా ఒకదానితో ఒకటి పెనవేసుకుని ఉండాలో తెలుస్తోంది

బాలగేయాల్లో వస్తువు (కథావస్తువు) తీసుకోవడమా లేదా అనేది కవి అభిరుచిమీద ఆధారపడి ఉంటుంది. కవి దగ్గర కథా కలితార్థ యుక్తి ఉంటే కథలు చెబుతాడు.




కానీ ఔచిత్యంలేని కథాకథనం కన్నా కథలు చెప్పకపోవడం చాలా మంచిది. గత ముప్ఫయేళ్ళ బాలగేయాలను గురించి ఆలోచిస్తే కొందరు బాలగేయ రచయితలమని పేరుపెట్టుకున్నవారు పెద్దపెద్ద సాంఘిక సమస్యలు, కులమత విషయాలు, శ్రాద్ధకర్మలు, ప్రణయ కలహాలు, కుటుంబ కలహాలు, వంటి విషయాలను తమ గేయాల్లో చేర్చడం జరిగింది. ఒక ప్రసిద్ధమైన పురాణాన్ని ఒక కవి బాలలకోసం తిరిగి గేయరూపంగా రచిస్తున్నాడనుకుందాం. అందులో ఏ విషయాలు బాలలకు చెప్పనక్కర్లేదో, ఏవి వారి మానసికారోగ్యానికి భంగకరాలో, ఏవి వారికి జీర్ణశక్తిని కలిగించవో అటువంటి వాటిని పరిహరించడం అవసరం. అవసరమైతే నూత్న కల్పనలు చెయ్యవచ్చు. బాలగేయాలకు మితి, ఔచితి- ఈ రెండూ శరీరమూ, మెదడూ లాంటివి.

అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్. బాలగేయాలు (బాలసాహిత్యమంతా) రాసే రచయితలు ఈ ఔచిత్యాన్ని పాటించలేకపోతే పెద్దల సాహిత్యంలోకి వలసపోవడం ఉభయతారకం. వాళ్ళ సుకుమారశైలి, గాన

తెలుగు పాప రావే
తేనె గ్రోలి పోవే
తేనె పాలూ త్రాగి
పాటలెన్నో పాడి
పిచ్చి ముచ్చటాడి
ముద్దుగొల్పి పోవె.
చదువులెన్నో చదువ
ఆటలెన్నో ఆడ
పాటలెన్నో పాడ
బడికి పోవ రావే.

-బి. కోటయ్య

యోగ్యత మాత్రమే వాళ్లకు బాలసాహిత్య సర్జనార్హతను సంపాదించి పెట్టవు.

కొందరు కవులుంటారు. వాళ్లు పెద్దల కోసం కవిత్వం రాస్తున్నారని లోకం భావిస్తూ ఉంటుంది. కానీ వాళ్ల కవితాఖండాలు కొన్ని పెద్దలకూ, పిల్లలకూ కూడా సమానంగా అనుభూతి నిస్తాయి. ఇదీ మహాకవి లక్షణం. ఏక కాలంలో సమాజంలోని అన్ని వయస్సుల వాళ్లనీ-ఆబాలగోపాలన్నీ ఆనందింపజేయగల కవులు కొందరే ఉంటారు. ఇటువంటివారు తేలికగా చెప్పడానికి తపస్సు చేశారు.

బాలగేయాలకు, వస్తువుకాదు; ప్రాణం సంవిధానం. వస్తువు లేక విషయం ఎంత చిలిపిగా, అర్థరహితంగా ఉన్నా బాలగేయానికి లోటురాదు.

'అగడం పగడం కవిలికి దంతం
గిరగిర చక్రం గింజప్ప
ఆహ్ ఊహ్
కళింగపాపడు కడ్డీ కడ్డీ కడ్డీ'

ఇదేదో సాంకేతికమైన భాషలా కనిపిస్తుంది. ఇందులో ఉన్నది ఆకతాయితనం; నిరర్థకపద ప్రయోగం, ప్రాసలయ వైచిత్రి ఉన్నాయి. దీనికర్థం చెప్పడం ఎలాగ? కానీ దీనివల్ల బాలలకు కలిగే ఇంద్రియప్రీతి (ఏదో నములుతున్న అనుభూతి, ఏదో విచిత్ర యంత్రధ్వని వింటున్న ఆశ్చర్యం) చిత్రమైనది. మొదటి పాదంలోని డండం, మూడోపాదంలో ఆహ్, ఊహ్, నాలుగో పాదంలోని ద్విత్వడకారపు త్రిరావృత్తి ఇవన్నీ పరిహాస దరహాసాలను కలిగిస్తున్నాయి. ఇందులో పదాలతో ఆట ఉంది. ఈ మాటలకు సమష్టిగా అర్థం ఏమిటి అనేది అనవసరం బాలలకు. పరిహాస పదజాలం తనంత తాను కవితగా పిల్లలకు కనిపిస్తుంది. పదక్రీడలు ఒక అవ్యక్త మధురానందానుభూతులకు దారితీస్తాయి. అర్థం పర్థం లేని కొన్ని వాక్యాలు, మాటలు, ధ్వనులు పిల్లల ఆటల్లో దొర్లుతూనే ఉంటాయి. ఇటువంటివి సాహిత్యంలో అవ్యవస్థకు దారితీయవా అనడం సబబుకాదు. నిజానికి మన సమస్తానుభూతులనూ వ్యక్తం చేయడానికి వ్యవస్థిత అభిధేయ పదజాలం సమర్థంకాదు. అనుభూతులను అవయవాల చలనాలు చెప్పగలిగినట్లే విచిత్ర ధ్వనులు కూడా చెబుతాయి. వీటిని సర్రియలిజం వంటి ఆధునికసాహిత్యోద్యమాలు కొంత వరకూ వాడుకున్నాయి. ఈ ఉద్యమాలకు బాలల విచిత్ర మనస్తత్త్వం కొంత దారి చూపించింది కూడా. విచిత్రమే సౌందర్యంగా భావింపబడింది.

పిల్లల మాటల్లో ఉండే నత్తి, వెక్కిరింపు మొదలైనవాటిని ఎలా సర్రియలిస్టు శ్రీశ్రీ అనుకరించాడో చూడండి :

"హోష్ హూష్ హూష్ హోష్ అని
కేకలు వేసి
కావ్ కావ్ మ్యావ్ మ్యావ్ అందాం
గమ్మత్తుగా

న...న...న...న...నత్తిమాటలుకూడా
మ...మ...మ...మ...మన వ్రాతల్లో
ఉండొచ్చు."

ఈ 'కొంటెకోణాలు' చిన్నపిల్లలకు వినోదం కల్పిస్తాయి. కావ్‌కావ్‌లు కాకినీ, మ్యావ్ మ్యావ్‌లు పిల్లినీ (రోజూ పిల్లలు చూసే జంతువులు) జ్ఞాపకం తెచ్చి ఫక్కున నవ్విస్తాయి.

'హాంగ్‌కాంగ్‌లో
కింగ్‌కాంగ్‌తో
ఒరాంగ్‌టాంగ్ ఆడిన
పింగ్‌పాంగ్‌లాగు !'

ఇందులోని వృత్త్యనుప్రాస కేవలం శబ్దక్రీడ. దీని ప్రయోజనం వినోదం.

నిజానికి బాలల కవిత్వం బాలలే రాసుకునే రోజులుకూడా రావాలి. అందుకు తగిన వాతావరణం, దోహదం ఇంకా ఈ దేశంలో ఏర్పడలేదు. తరచుగా పాఠ్యపుస్తకాల్లో వేసే బాలగేయాలు బాలలకు కవిత్వంమీద విముఖత్వాన్ని కలిగించేవిగా ఉంటున్నాయి.

వాచక పుస్తకాల్లో నీతులు, సుభాషితాలు వేస్తూ ఉండటం కద్దు. వాటిలో కవిత్వం కుండేటికొమ్ము. నీతులు పద్యగేయాలుగా రాయడం జ్ఞాపకంకోసం పనికివస్తుందిగాని కవితానందం కలిగించదు. నీతుల్ని సుందరంగా చెప్పడం మంచిదే కానీ సుందరమైన నీతులూ, కవిత్వమూ ఒకటికాదు. కవిత్వం జీవితంలోంచి లయాత్మకంగా వెలువడేభాష. అది కళ. ఆ కవిత్వం ద్వారా నీతిబోధ చేయదలిస్తే ఉత్కృష్టమైన రచన లెన్నుకోవాలి. రచయితలు ఒక నీతినో, సత్యాన్నో చెప్పాలని కవిత్వరచన కుపక్రమించ కూడదు. కవి సంస్కారంలోంచి ఆ సత్యం వ్యక్తంకావాలి.

చింతా దీక్షితులుగారి 'ప్రజావాఙ్మయం' అనే గ్రంథానికి పీఠికరాస్తూ చలం అంటాడు "పిల్లలకి పాటలు రాయడమంటే సామాన్యమైన పనికాదు. మహాకవి కావడం సులభమైన పని". బాలలకోసం రాసిన గేయాలు మానవుడు చిరంజీవిగా ఉన్నంతకాలం ఉంటాయంటాడు టాల్‌స్టాయ్.

ఏ వస్తువైనా కవికి కవితావేశం కలిగిస్తేనే కవితావస్తువుగా మారుతుంది. బాలగేయాలను ఒక సంకలనకర్త దృక్పథంతో వస్తువునుబట్టి వింగడించదలిస్తే అవి డజను వర్గాల్లో ఇమిడిపోతాయి. (1) కాలం (2) యంత్రాలు (3) ప్రకృతి (4) ఆకాశం (5) జంతుపక్షి కీటకాదులు (6) పురాణేతిహాసాలు (7) పండుగలు (8) ఆటలు (9) అనుభూతులు (10) ప్రాచీనవైభవం (11) దేశం-సమాజం (12) సంకీర్ణములు.

"చేవలేని కవితలూ జావగారే కథలూ
బాలసాహిత్యం అనిపించుకోవు".

(సి. నా. రె.)



# బాల విజ్ఞాన శాస్త్రగ్రంథాలు

— ఏ.వి.ఎస్. రామారావు

పిల్లలకు అందించే జ్ఞానం సహేతుకమై ఉండాలి. పిల్లల మనస్సులలో ప్రశ్నలు రేకెత్తుతుంటాయి. ఆ ప్రశ్నల కన్నింటికీ సమాధానాలు ఆ పుస్తకాలలో లభ్యం కావాలి.

పోలండు దేశస్థుడైన కోపర్నికస్ 1543వ సంవత్సరంలో సూర్యకేంద్ర సిద్ధాంతాన్ని ప్రతిపాదించడంతో విజ్ఞానయుగం ప్రారంభమైనదని చెప్పవచ్చు. ఈ యుగంలో సత్యాన్ని ఆవిష్కరించడానికి విశిష్టమైన పద్ధతి ఒకటి ఉంది. ఊరి ప్రకృతిని పరిశీలించడం, ఆ పరిశీలన ఫలితమైన కార్యానికి ప్రయోగరీత్యా కారణాన్ని కనుగొనడం, దానిని రుజువుచేసి సిద్ధాంతం చేయడం- ఈ పద్ధతిలోని ముఖ్యాంశాలు.

సుమారు రెండువందల సంవత్సరాల పరాయిపాలన తర్వాత గాంధీ మహాత్ముని నాయకత్వంలో స్వాతంత్ర్యయోధులు గావించిన త్యాగంవలన ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం భారతదేశం స్వాతంత్ర్యాన్ని ఆర్జించుకొన్నది. కష్టపడి ఆర్జించుకొన్న స్వాతంత్ర్యం స్థిరంగా ఉండాలంటే, మన దేశం కూడా ప్రపంచ దేశాలలో గణుతికెక్కాలంటే, మనదేశం కూడా వైజ్ఞానికంగా అభివృద్ధిచెందాలి. ఇందుకు చేపట్టవలసిన కార్యక్రమంలో ముఖ్యమైన అంశం బాలబాలికల ఆలోచనా సరళిలో మార్పు తీసుకురావడం, వారిలో వైజ్ఞానిక దృక్పథాన్ని అలవరచడం.

తెలుగులో విజ్ఞాన శాస్త్ర గ్రంథాలే తక్కువ. అందులోనూ బాలవిజ్ఞాన శాస్త్ర గ్రంథాలు మరీ తక్కువ. తెలుగులో బాలబాలికలకై విజ్ఞానశాస్త్ర గ్రంథాలను వ్రాయడానికి ఇంతవరకు కృషిసల్పిన వారిలో శ్రీ యస్. యల్. నరసింహారావుగారు, శ్రీ విస్సా అప్పారావుగారు, శ్రీ ఏ. వి. యస్. రామారావుగారు ముందుగా గుర్తుకు వస్తారు. శ్రీ వసంతరావు వేంకట్రావుగారు కూడా బాలలకై బాలల పత్రికలలో కొన్ని వైజ్ఞానిక వ్యాసాలు, గేయాలు వ్రాసేరు.

శ్రీ యస్. యల్. నరసింహారావుగారు ఉన్నత పాఠశాల విద్యార్థులకు జీవశాస్త్రాలను బోధించిన ఉపాధ్యాయులు. బాలుర మనస్తత్త్వము, విజ్ఞాన విషయాలను రంజకంగా వారికి చెప్పే తీరు ఆయనకు బాగా తెలుసు. దక్షిణభాషా పుస్తకసంస్థవారు బాలసాహిత్యానికి ఏర్పరచిన పోటీలో ఆయన వ్రాసిన 'జంతు దర్శనం' అనే వ్రాతప్రతికి బహుమతి లభించింది. వారి "జంతుపురాణా"నికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు బాలల పుస్తకాల కిచ్చే బహుమతి వచ్చింది. ఈ పుస్తకాలలో శ్రీ నరసింహారావుగారు కొన్ని జంతువుల జీవితా-

లలో ఉండే వైచిత్ర్యాలను పిల్లల మనస్సులకు హత్తుకొనేటట్లు వర్ణించి చెప్పారు.

శ్రీ విస్సా అప్పారావుగారు రచించిన 'ఆకాశం' అనే పుస్తకానికి కేంద్ర విద్యా మంత్రిత్వశాఖవారు బాలసాహిత్యానికై నిర్వహించిన పోటీలో బహుమతి వచ్చింది.

శ్రీ ఏ. వి. యస్. రామారావుగారు బాలలకై తెలుగులో చాలా విజ్ఞానశాస్త్ర గ్రంథాలు వ్రాసేరు. వీరు రచించిన బాల విజ్ఞానశాస్త్ర గ్రంథాలలో సూర్యకుటుంబ చరిత్ర, పరమాణువు కథ, విశ్వరహస్యం, అంతరిక్ష విజయం అచ్చయ్యాయి చంద్రలోకయాత్ర, ఆకాశాన్ని చూద్దాం, విద్యుత్తు కథ వంటివి అచ్చుకావలసి ఉన్నాయి. ఈ పుస్తకాలలో కొన్ని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు బాల సాహిత్యానికై ఏర్పరచిన పోటీలలో ఉత్తమ గ్రంథాలుగా ఎన్నిక చేయబడి బహుమతులు బడసేయి.

దక్షిణభాషా పుస్తకసంస్థవారి సహాయంతో తమిళంనుండి రెండు బాలవిజ్ఞాన శాస్త్ర గ్రంథాలు - కణుపులో గారడీ, ఆకాశంలో అద్భుతాలు- తెలుగులోనికి అనువదింపబడి ప్రచురింపబడ్డాయి.

డాక్టర్ మహీధర నళినీమోహన్ రావుగారు కూడా బాల విజ్ఞానసాహిత్యరంగంలో కొంత కృషి చేశారు.

ఇతర సాహితీరంగాలలోకంటె విజ్ఞాన శాస్త్రరంగంలో బాలలకు పుస్తకాలు వ్రాయడంలోను, ప్రచురించడంలోను చాలా యిబ్బందులు ఉన్నాయి. మన బాలలకు బాల్యంనుంచీ కూడా దేవుళ్ళతోను, పురాణ పురుషులతోను, ఇళ్ళలో గోడలకు తగిలించిన పటాలద్వారానేమి, దేవాలయాలలో ఉండే విగ్రహాలవలననేమి, తాతయ్యలు, అమ్మమ్మలు



ఒడులలో కూర్చుండబెట్టుకొని చెప్పే పురాణ గాథలవలననేమి పరిచయం ఏర్పడుతుంది. ఆ దైవాల చిత్రాలు, ఆ పురాణపురుషుల చిత్రాలు వారి మనఃఫలకాలపై ఏర్పడతాయి. అందువలన ఆ విషయాలనుగురించి వ్రాసిన పుస్తకాలు బాలలను సులువుగా ఆకర్షిస్తాయి. కాని విజ్ఞానశాస్త్ర గ్రంథాలు వీటికి పూర్తిగా విరుద్ధం.

విజ్ఞాన విషయాలు మన పిల్లలకేగాక పెద్దలలో చాలమందికి కూడా అపరిచితమైనవి. పైగా ఎంత తేలికగా వ్రాసినా బాలవిజ్ఞాన శాస్త్రగ్రంథాలలోకూడ సాంకేతిక పదాలను కొన్నింటినైనా వాడవలసి వుంటుంది. ఈ సాంకేతిక పదాలు బాలలకు క్రొత్తవి. ఈ విధంగా విషయమూ, పదాలూకూడా క్రొత్తవి కావడంచేత వైజ్ఞానిక విషయాలను తెలుసుకోవాలనే కుతూహలంగల బాలలకేగాని అందరికీ యీ పుస్తకాలు సామాన్యంగా రుచించవు. ఎక్కువమంది బాలలను ఆకర్షించేటట్లుగాను, వారికి రుచించేటట్లుగాను బాలవిజ్ఞాన శాస్త్రగ్రంథాలు ఉండాలంటే ఆ గ్రంథాల్ని

పాప బడిలో చేరింది
పలకా బలపం పట్టింది
'అ ఆ' లన్నీ నేర్చింది
'క ఖా' న్నీ దిద్దింది.

మాటలు చక్కగ రాలేదు
ముక్కున కోపం పోలేదు
'పలకా బలపం' అనవే అంటే
'బలకం కలపా' అంటుంది.

'రఘుపతి రామా' అని చెబితే
'లఘుపతి లామా' అంటుంది
గణపతి ముక్కుకి పేరేమంటే
'టొండము' 'టొండము' అంటుంది.

బడిలో పిల్లలు విన్నారు
ఫక్కున అందరు నవ్వారు
పాపకు రోషం హెచ్చింది
కోపం ముంచుకు వచ్చింది.

—గాలి ప్రభావతి

రచనలోను, ముద్రణలోను ప్రత్యేక శ్రద్ధ వహించాలి.

బాలవిజ్ఞానశాస్త్ర గ్రంథాలు ఆకర్షణీయంగా ఉండేటట్లు చేయాలంటే ఆ పుస్తకాలలో విరివిగా చిత్రాలు ఉండాలి. ఆ చిత్రాలు పెద్దవిగా ఉండాలి. ప్రతి అంశాన్ని స్పష్టంగా వివరించేవిగా ఉండాలి. చిత్రాలు ఎంత ఎక్కువగా ఉండి, విషయం ఎంత తక్కువగా ఉంటే చిన్న పిల్లలను అంత ఎక్కువగా ఆ పుస్తకాలు ఆకర్షిస్తాయి.

బాలవిజ్ఞానశాస్త్ర గ్రంథాలలో విషయాన్ని లోతుగాను, వివరాలతోను చర్చించకూడదు. స్థూలమైన జ్ఞానాన్ని మాత్రమే ఆ పుస్తకాల ద్వారా పిల్లలకు అందివ్వాలి. పిల్లలకు అందించే జ్ఞానం సహేతుకమై ఉండాలి. పిల్లల మనస్సులలో ప్రశ్నలు రేకెత్తుతుంటాయి. ఆ ప్రశ్నలన్నింటికీ సమాధానాలు ఆ పుస్తకాలలో లభ్యం కావాలి. బాలల పుస్తకాలన్నింటివలెనే బాల విజ్ఞానశాస్త్ర గ్రంథాలనుకూడ ఆకర్షణీయంగా అచ్చువేయించాలి. దళసరి కాగితంపై పెద్ద అక్షరాలతో మంచి సిరాతో అచ్చుతప్పులు లేకుండా అందంగా అచ్చు వేయించిన పుస్తకాలు పిల్లలకు ఆకర్షణీయంగా ఉంటాయి.

బాల విజ్ఞానశాస్త్ర గ్రంథాలను తెలుగులో వ్రాయడానికి, ప్రచురించడానికి వాతావరణం ఏమాత్రమూ రచయితకు ప్రోత్సాహకరంగా ప్రస్తుతం లేదు. రచయితల భావాల కనుగుణంగా వైజ్ఞానిక చిత్రాలను వ్రాసి యివ్వగలిగిన చిత్రకారులు తక్కువగా ఉన్నారు. వారైనా సామాన్యంగా రచయితకు అందుబాటులో ఉండరు. ఇక రచయితకు కూడా వారికి తగు పారితోషిక మిచ్చి చిత్రాలు వ్రాయించుకొనే శక్తి ఉండదు.

నేడు బ్లాకులను చెయ్యడానికి ఖర్చులు విపరీతంగా పెరిగాయి. కాగితంధర, ముద్రణ ఖర్చులు కూడా బాగా పెరిగాయి. ఈ పరిస్థితిలో మంచి కాగితంమీద మూడురంగుల ముఖచిత్రంతో, ఎక్కువ బొమ్మలతో, గట్టి అట్టతో అందంగా పాశ్చాత్య దేశాలలో వెలువడే బాలల పుస్తకాలకు దీటుగా తెలుగులో బాలల పుస్తకాలు అచ్చు వేయించాలంటే వాటి కిట్టుబాటుధర చాలా ఎక్కువగా ఉంటుంది తెలుగుదేశంలో ఏ తల్లి దండ్రులు అంత యెక్కువధర పెట్టి తమ పిల్లలకు పుస్తకాలు కొంటారు ?

తెలుగులో వెలువడుచున్న మాసపత్రికలు, వారపత్రికలు, బాలల పత్రికలు కూడ బాల విజ్ఞానశాస్త్ర రచనలకు ప్రోత్సాహమివ్వడం

లేదు. కారణం యేదైనా అదిమాత్రం నిజం. ఇక మన ప్రచురణకర్తలు రచయితలకిస్తున్న ప్రోత్సాహం ఎంతో అందరికీ తెలిసిందే!

తెలుగులో బాల విజ్ఞానశాస్త్ర గ్రంథాలు రావాలంటే ప్రభుత్వం రచయితలకు తగిన చేయూత నివ్వాలి అమెరికా సంయుక్త రాష్ట్రాలవంటి పురోగామి దేశాలలో ప్రతి గ్రంథాలయంలోను బాల గ్రంథాలయ విభాగం ప్రత్యేకంగా ఉంటుంది. అటువంటి గ్రంథాలయ విభాగం మనదేశంలో కూడ ప్రతి గ్రంథాలయంలోను ఉండాలి. జిల్లా గ్రంథాలయ సంస్థలు, పాఠశాలలలోని విద్యార్థుల గ్రంథాలయాలు, గ్రామ పంచాయితీలకు చెందిన గ్రంథాలయాలు ప్రభుత్వంచే ఎన్నిక చేయబడిన బాల విజ్ఞానశాస్త్ర గ్రంథాలను విధిగాకొనే యేర్పాటు ఉండాలి. స్తోమతగల తల్లి దండ్రులు తమ బాలలకై విరివిగా బాల విజ్ఞానశాస్త్ర గ్రంథాలను కొనాలి. 'బాలల అకాడమీ' బాలల పత్రికను ప్రచురించి అందులో కొంతభాగాన్ని విజ్ఞానశాస్త్ర రచనలకు కేటాయించాలి. అకాడెమీ కూడా బాల విజ్ఞానశాస్త్ర గ్రంథాల ప్రచురణకు పూనుకోవాలి. రచయితల నుండి అల్పమూల్యానికై సర్వస్వామ్యములు కొనకుండా అమ్మకమైన పుస్తకాల విలువలో కొంత శాతం వారికిచ్చే పద్ధతిని అది ప్రవేశపెట్టాలి. ఆ శుభసమయం కోసం ఎదురుచూద్దాం!



# పిల్లలకు ఏ కథలు ఇష్టం?

— పాలంకి వెంకటరామచంద్రమూర్తి

బాలలు కథాగమనంలో వేగాన్ని వాంఛిస్తారు. చిలవలూ, పలవలూ వాళ్ళకు కిట్టవు. కుదించడానికి కిక వీలు లేనంత సంక్షిప్తంగా, సూటిగా పోవాలి కథనం.

పిల్లలను దృష్టిలో ఉంచుకుని చెప్పిన ప్రతి కథా వాళ్ళకు ఇష్టంగానే ఉంటుంది. ఈ ఇష్టం కలిగించడం అనేది కథకుల సామర్థ్యం మీద ఆధారపడి ఉంటుంది.

అప్పటికప్పుడు కొత్తకొత్త కథలు కల్పించి చెప్పడం సాధ్యంకాదుకనక కథలు చెప్పమంటూ వచ్చిన పిల్లలకు పాతకథలనే (అప్పటికింకా ఆ పిల్లలకు తెలియనివాటిని) ఎన్నుకుని చెప్పవచ్చు. పాతకథలు తిరిగి చెప్పడం కూడా ఒక కళ గనుక, ఈ పునఃకథనంలో మనం ప్రత్యేకమైన శ్రద్ధ వహించాలి.

బాలలు కథాగమనంలో, వేగాన్ని వాంఛిస్తారు. చిలవలూ పలవలూ వాళ్ళకు కిట్టవు. కుదించడానికింక వీలులేనంత సంక్షిప్తంగా సూటిగా సాగిపోవాలి కథనం. "ఆవటాన", "అప్పుడేంజరిగిందంటే", "చెపుతా వినండి", "ఇందాకా చెప్పేను చూడండి"-ఇలాంటి పడికట్టు ప్రయోగాలతో కాలయాపన చేస్తే 'బోర్' అనిపిస్తుంది పిల్లలకు. కథనంలో పిష్టపేషణం తగదు.

ఇదివరకు బాలలు కథలు వినడమే కాని ప్రత్యేకంగా వాళ్ళు చదువుకోడానికని ఆట్టే పుస్తకాలు ఉండేవికావు. వావిలికొలను సుబ్బారావుగారి 'ఆర్యకథానిధి', రెంటాల సుబ్బారావుగారి 'చిత్రకథామంజరి', వంగూరి సుబ్బారావుగారి 'అరేబియన్ నైట్స్', వేదం వెంకట్రాయశాస్త్రిగారి 'కథాసరిత్సాగరం'- ఇలాంటివి కొన్నిమాత్రమే ఉండేవి. మధిర సుబ్బన్న దీక్షితులుగారి కాశీమజిలీ కథలు చదవాలనిపించేదికాని పిల్లలకా గ్రాంథికభాష బోధపడేది కాదు. భారత భాగవత రామాయణాలు వచనంలో వచ్చినా ఆ భాషకూడా క్లిష్టంగానే ఉండేది. ఈ వచన పురాణాలు కూడా పెద్దవాళ్ళకోసమే ఉద్దేశింపబడడంవల్ల పద్యకావ్యాలలోని శృంగారమూ, అశ్లీల కథాభాగములూ యథాతథంగా దిగుమతి చేయబడి, బాలలు చదువుకోడానికి పనికివచ్చేవి కావు. దరిమిలా బాలరామాయణాలూ, భారత భాగవతాలూ, భీష్మాది వీరులపై విడివిడిగా పుస్తకాలూ వచ్చాయి కాని పిల్లలకే కదా అన్న ఉపేక్షాభావంతో ఏదో రాసి ఇవ్వడమూ, ప్రచురణకర్తలు అచ్చువేయించడమూ జరిగింది. అంతేకాని బాలలకోసం రాయడం ఒక కళగా భావింపబడి కృషి జరుగలేదు.

పూర్వం పుస్తకాలు లేకపోయినా కథలు చెప్పడంలో నేర్పుగల అమ్మలూ, నాయనమ్మలూ, తాతలూ ఓర్పుతో పిల్లలను చేరదీసి కథలు చెప్పేవారు. నేటి పెద్దలకు ఆ నేర్పూ ఓర్పూ లేవు గనుక పిల్లలకు కథాసాహిత్యాన్ని విరివిగా పుస్తక రూపంలోనే అందించవలసి ఉంది. మన సంస్కృతికి పునాది పురాణ సాహిత్యమే కనుక ప్రథమంగా పురాణాలను పిల్లలకోసం సులభమైన వ్యావహారిక భాషలో రచించాలి. ఉత్తమ సాహిత్యానికి ఉండవలసిన పాత్ర పోషణ, విషయ విభజన మొదలైన లక్షణాలన్నీ ఈ బాలసాహిత్యానికి పట్టేటట్లు రచయితలు శ్రద్ధ వహించాలి. పిల్లలు పెద్దవాళ్లయి ప్రాచీన సాహిత్యాన్ని అర్థంచేసుకో గలగడానికి పురాణ కథలతో పరిచయం కలిగి ఉండడం అవసరం. పిల్లలకు ఇష్టమైన ఇతివృత్తాలేవో, వాటినీ ఏ రీతిలో ఎలాంటి భాషలో చెప్పాలో తెలుసుకోవాలి.

నా అనుభవం చెబుతాను. ఏ కథ ఐనా రాయడం పూర్తి కావడంతోనే మా పిల్లలను ఇరుగు పొరుగువారి పిల్లలను కూర్చోబెట్టి ఆ కథ చదివి వినిపించేవాణ్ణి. కథలో ఆ బాలలకు అర్థం కాలేదని తేలిన పదం ఉంటే దానిని కొట్టివేసి సులభమైనమాట వేసేవాడిని. భావం క్లిష్టంగా ఉన్నదన్న పేరాగ్రాఫులను తిరిగి రాసేవాడిని. పూర్వకాలంలో రచయితలు తమ కథలను ఆమోద ముద్రకోసం కాంచీపుర మండలి ఒక పండిత సభకు పంపేవారట. నేను రాసిన కథలను ముందుగా మా బాల సదస్సులో వినిపించి, వాళ్లకా కథ నచ్చినదన్నాకనే దానిని ప్రచురణార్థం పత్రికలకు పంపేవాడిని.

ఈ బాలశ్రోతలు తమకు ఏ కథ ఐనా నచ్చనప్పుడు నిర్మొగమాటంగా చెప్పేసేవారు. నేను బాగా రాశాననుకున్న ఒక విషాదగాథ ఈ పిల్లలకు నచ్చలేదు. ఉత్తము



కొండల పుట్టి కోనలు తిరిగి
గిర్రున కిందికి గిరవాటేస్తూ
సుర సుర పొంగీ గబ గబ లేచీ
బిరబిర చకచక పరుగులు తీస్తూ
చెంగున చప్పున గంతులు వేస్తూ
జలజల గలగల అల్లరి చేస్తూ
అల్లీ బిల్లిగ సుళ్లు తిరుగుతూ
శరవేగంతో చకచక పారే
సెలయేరంటే నేనేనోయ్ !

-సిద్ధాంతి మల్లికార్జునం

డైన ఆ కథానాయకుడు దుర్మరణం పాలు కావడం వాళ్ల లేత మనసులకు కష్టమనిపించింది. అలాగని విషాదాంతమైన ప్రతికథా ఆ బాలలకు నచ్చలేదని కాదు. లోభులు, మూర్ఖులు, దుర్మార్గులు తమ ప్రాణాలు పోగొట్టుకున్నారనో కష్టాలలో చిక్కుకున్నారనో విన్నప్పుడు 'బాగా జరిగింది శాస్తి!' అని బాలశ్రోతలు మెచ్చుకునేవారు. ఒకచెట్టు నీడలో లేడి ఒకటి విశ్రమిస్తో కనపడగా వేటగాడు దానిని చంపడానికి బాణాన్ని గురిపెడతాడు. ఆ ధ్యాసలో ఆ కిరాతుని పాదం నేల మీద పోతూవున్న ఒక తేలుమీద పడడం జరిగి, ఆ వృశ్చికం వాణ్ణి పుటుక్కున కుడుతుంది. వాడు బాధతో కదలడంతో బాణం గురితప్పి ఆ సాధుజంతువు లేడికి ఆపద తప్పుతుంది... కథ అంతటితో పూర్తికాలేదు. గురితప్పిన బాణంవెళ్ళి అవల చెట్టుతొర్రలో ఉన్న పక్షి పిల్లలను భక్షిద్దామని పైకి ఎగబ్రాకిపోతూన్న ఒక త్రాచుపాముకు తగలడంతో ఆ దుష్ట సర్పం మరణిస్తుంది! ఈ కల్పిత కథ ఆపిల్లల కెంతగానో నచ్చింది. దుష్టశిక్షణా, శిష్టరక్షణా జరగడమే కాక కథ అనుకోని విధంగా ముగిసినట్లైతే బాలల ప్రశంసకు పాత్రమౌతుంది

సజ్జనులలోనూ, దుర్జనులలోనూ శూరులుంటారు. సజ్జనుల శౌర్యమూ, ప్రతాపమూ దుర్జనుల దౌష్ట్యాన్నీ, క్రౌర్యాన్నీ రూపుమాపినట్లు చెప్పిన కథలు బాలలను ఆకర్షిస్తాయి. దుష్టశిక్షణలో, దేశరక్షణలో ప్రాణాలు త్యజించిన త్యాగమూర్తులైన వీరుల కథలన్నా బాలల హృదయాలు స్పందిస్తాయి. తానాజీ, ఝూన్సీ లక్ష్మీబాయి మున్నగు త్యాగమూర్తుల చరిత్రలు బాలశ్రోతలను ఆకట్టుకున్నాయి.

అద్భుత గాథలంటే పిల్లలు ఇష్టపడతారు. సింద్‌బాద్ తక్కిన నావికులతోపాటు ఒక ద్వీపంలో దిగి పొయ్యిలో నిప్పురాజేసి వంట చేసుకుంటూంటే, ఆ 'ద్వీపం' కదలడం ప్రారంభించి మరో కొన్ని నిముషాలకు సముద్రంలో మునిగి మాయమైందట! 'ద్వీపం మాయమవడ మేమిట'ని ఆశ్చర్యపోతూన్న బాలపాఠకులకు తర్వాత వాక్యంలో-ఆ వర్తకులు 'ద్వీపం' అనుకుని వంట ప్రారంభించిన ఆ విశాల ప్రదేశం అచలమైన భూమి కాదనీ, ఒక 'పెద్ద తిమింగిలంయొక్క నడ్డి' అనీ, ఆ వంటపొయ్యిలలో మంటలు తగిలి వీపు చుర్రుమనడంతో ఆ తిమింగిలం బుడుంగుమని మునిగిపోయిందనీ తెలియడంతోనే 'కథ బలేగా ఉంది!' అనిపిస్తుంది.

జొనాథన్ స్విఫ్ట్ ఆంగ్లంలో రచించిన 'గలివర్స్ ట్రావెల్స్'-అతడు వాటిని పిల్లల కోసం రాయకపోయినా - పిల్లలకు ఎంతో ఆనందాన్ని కలిగిస్తాయి బాలలను ఆరంగుళాలకన్న ఎత్తు ఉండని మరుగుజ్జుల (లిలిపుట్స్) కథ ఎంతగా ఆకట్టుకుంటుందో, అరవై తొమ్మిదడుగుల ఎత్తుండే మహా

కాయుల (బాల్డింగ్‌నాగ్స్) కథ కూడా అంత గానూ ఆకర్షిస్తుంది.

పిల్లలు ఎదుగుతూన్నకొద్దీ వాళ్ల మెదడులు కూడా ఎదిగి, అభిరుచుల స్థాయి పెరుగుతుంది. జంతువులూ, పక్షులూ, జలచరాలూ పాత్రలుగా ఉన్న పంచతంత్రం కథలూ, ఈసపు కథలూ, ఏండర్సన్ టేల్స్ అంటే ఇష్టపడే పిల్లలు క్రమంగా చారిత్రక గాథలంటే ఎక్కువ ఆసక్తి చూపుతారు. వైజ్ఞానిక దృక్పథం పెరుగుతూన్న కొలదీ 'మిరకుల్స్' అన్నా మహిమలన్నా నమ్మకం సడలడం ప్రారంభించి వాస్తవిక సంఘటనలవైపు దృష్టి మళ్లుతుంది. మహాపురుషుల జీవిత చరిత్రలు జరిగినవి గనుక వాటిపై మక్కువ పెరుగుతుంది. ఈ సందర్భంలో రచయితలు ఒక విషయం గమనించాలి. ఏ మహాపురుషుని జీవితచరిత్ర కూడా మొదటినుండి చివరిదాకా ఆకట్టుకోలేదు. కొన్ని సంఘటనలు మాత్రమే చదవబుద్ధి పుట్టేటట్లు ఉంటాయి. బాల సాహిత్య రచయితలు జీవిత చరిత్రలలోని ఆసక్తిజనక సంఘటనలు మాత్రమే ఎన్నుకొని పిల్లలకు కథలుగా రాయాలి.

భక్తుల జీవితాల నుండీ మత గ్రంథాల నుండీ కూడా ఇతివృత్తాలు తీసుకొని బాలలకు కథలు రాయవచ్చు. కొన్ని వేదాంత రహస్యాలను కూడా కథల ద్వారా పిల్లలకు తెలుపవచ్చు. ఇద్దరు మునికుమారులు అడవి నుండి పండ్లు తెస్తున్నారు. వారిలో చిన్నవాడు పెద్దవానితో, "అన్నా, దేవు డెక్కడున్నాడో చెప్పగలిగితే, నేను నా పండ్లనుండి నీ కొకటి తీసి ఇస్తాను" అన్నాడు. పెద్దవాడు "తమ్ముడా, నీవు దేవుడెక్కడ లేడో చెప్పగలిగితే నీకు నేను- ఒకటి కాదు, రెండుపండ్లు ఇస్తాను!" అన్నాడు. ఈకథను వినిపించి "దీని వలన మీకేమి తెలిసింది?" అని నేను మా బాలశ్రోతలను అడుగగా వాళ్లు, "దేవుడు ఎక్కడపడితే అక్కడే ఉన్నాడు" అని చెప్పగలిగారు.

అన్ని వయసుల బాలలనూ- బాలలేకాదు, నడి వయస్కులనూ, వృద్ధులనూ కూడా- ఎక్కువగా ఆకర్షించే పిల్లల కథలు చమత్కార కథలు. బీర్బల్ సమయస్ఫూర్తినీ, మర్యాదరామన్న యుక్తినీ, తెనాలి రామలింగని చమత్కారాన్నీ ప్రదర్శించే కథలు నవ్వించి 'టానిక్కు'లా పనిచేస్తాయి. 'బాలలకు ఇష్టమైన కథలు ఏవి?' అని అడిగినప్పుడు ముఖ్యంగా హాస్యకథలనే చెప్పాలి.

అవసరమైనంత బాల సాహిత్యాన్ని తయారుచేయడానికి సమర్థులైన రచయితలూ, రచయిత్రులూ మనలో లేకపోలేదు. కాని వారి రచనలను అచ్చు వేయించడానికి పెద్ద టైపూ, మంచి కాగితమూ కావాలి; విరివిగా చక్కగా బొమ్మలు వేయించాలి; ఎక్కువ సంఖ్యలో కాపీలు ముద్రించి తక్కువధరకు అందజేస్తేనే కాని బాలసాహిత్యం అమ్ముడు కాదు.



# బాలల నాటకాలు, నాటికలు

— కె.ఎల్. నరసింహారావు

**నాటకం గానీ, సినిమా గానీ పరిణతి చెందిన కొందరు మేధావులకు నచ్చడమే ముఖ్యం కాదు. మనం ఎవరిని ఉద్దేశించి వ్రాస్తున్నామో, ఆ సామాన్యునికి అర్థమైందా, నచ్చిందా అనేదే ముఖ్యం.**

ప్రతి సాహిత్య ప్రక్రియకూ ఎంతో ప్రయోజనముంది. నవల, నవలిక, కథ, కథానిక, పద్యం, గీతం, వ్యాసం-ఇవన్నీ అలాంటివే. అయితే-వాటి ప్రయోజనంమటుకు చదువు వచ్చిన పాఠకులకు మాత్రమే పరిమితం. వ్రాసిన రచనను బట్టి-ఆ రచనల ప్రభావం విడివిడిగా ఆయా పాఠకులమీద పడుతుంది.

వీటన్నిటికంటే ప్రత్యేకమైన సాహిత్య ప్రక్రియ నాటకం. నాటకమంటే - కేవలం సంభాషణరూపంలో చదువుకొని ఆనందించేదీ, రేడియో, టెలివిజన్లద్వారా ప్రసారమయ్యేదీ వున్నా-మనమిక్కడ ప్రదర్శన కనుకూలమైన దానినిగురించే చర్చిస్తున్నాం.

ప్రదర్శన కనుకూలమైన నాటకాలంటే-చదివి ఆనందించడానికి తగినవి కావని అనుకోనక్కర్లేదు. అటు చదువుకోవడానికీ, ఇటు చూడడానికీకూడా ఉపయోగిస్తాయి. అంటే-వీటి ప్రయోజనం అటు నవల, కథలకన్నా ఎంతో ఎక్కువన్నమాట. అంతేకాదు-ఇతర ప్రక్రియల్లో ఆ రచనలలోని భావాన్ని ఎవరికి వారు అందుకోవలసిందే. నాటకం అలాకాదు. నాటకం-చదువుకున్న వారికి ఎవరికి వారికే ఆ భావం అందడమేకాక-ప్రదర్శనంద్వారా ఒకేమారు నాటకంలోని భావాన్ని వందలాది, వేలాది ప్రేక్షకులకు ఉమ్మడిగా, కొటతెల్లంగా అందజెయ్యవచ్చు. అందులోనూ మరో ప్రత్యేకత ఏమిటీ అంటే-మారుమూలనున్న చదువురాని సామాన్యునికికూడా ఆ భావాన్ని అందజేసే సులువు ఇందులో వుంది.

కనుక నాటకం ప్రయోజనం ఇంతా అంతా కాదన్నమాట. అక్షరాస్యత తక్కువగాగల-అందులోనూ నాగరికతకు దూరమైన పల్లెటూళ్లు ఎక్కువగాగల మనదేశానికి నాటకం ఆవశ్యకత ఎంతో వుంది.

అయితే, నాటక ప్రయోజనం, అవసరం ఎంతవుందో-నాటక ప్రచారం, ఆదరణమటుకు అంత తక్కువగా వుంది. కారణం అందరికీ తెలిసిందే. రంగస్థల నాటకాన్ని ఒక్క పత్రికలో ప్రచురించడం, పుస్తకంగా వెలువరచడంతో సరిపోదు. దాని ప్రదర్శన కూడా వున్నప్పుడే సంపూర్ణ ప్రయోజనం పొందే వీలుంది. మనకు ప్రదర్శించే హంగులు లేవు. గనుక, పత్రికలుకూడా (పిల్లల పత్రికలు కూడా) ఎక్కువగా వాటి జోలికి పోవడం

లేదు. అందువల్లనే నాటకాలు బాగా వ్రాయగలిగిన రచయితలు కూడా వాటిపై ఎక్కువ కృషి చేయడంలేదు. అందుకే కాబోలు-వివిధ సాహిత్యప్రక్రియల్లో నిపుణులైన శ్రీ కొడవటిగంటి వారు ఒకమారు "నాటకం వ్రాయడమంత శుద్ధ దండుగపని మరోటి లేద"నే ధోరణిలో అన్నట్లు గుర్తు.

నిజమేమరి. సినిమా కథనుగానీ, నాటక కథనుగానీ ప్రచురించినంతమాత్రాన లాభం లేదు. సినిమాను థియేటరులోనూ, నాటకాన్ని రంగస్థలంమీదనూ చూడాలి; అనుభూతినీ, ఆనందాన్నీ, ప్రయోజనాన్నీ పొందాలి.

ఖర్చు మోతాదులో తేడా అని తప్ప-సినిమాకు ఎంత హంగు కావాలో - నాటకానికీ అంత కావాలి. సినిమా కెలాగైతే నిర్మాణం, పంపిణీ, ప్రదర్శనశాఖ లున్నాయో-నాటకానికి కూడా ప్రదర్శన టెక్నిక్‌తో కూడిన రచన, ప్రాక్టీసు చేసే సమాజం, ప్రదర్శనకు హాలు కావాలి.

బాలలే 'భావి భారత పౌరు'లని మనం ప్రతిసారీ అంటుంటాంగాని-'భారత పౌరుడ'ని గర్వించేవిధంగా ఎదగడానికి అవసరమైన విజ్ఞానాన్ని పిల్లవాని మనస్సుకు హత్తుకునే పద్ధతిలో మనం ఏం అందజేస్తున్నామని ? ఆ పని ప్రదర్శనరూపంలో వున్న సినిమా, టెలివిజన్, నాటకంద్వారా మాత్రమే చేయగలం.

టెలివిజన్ ఇప్పుడప్పుడే పల్లె పల్లెకూ సాధ్యంకాదు; సినిమా ప్రతి పల్లెకూ అందడం లేదు; ఇక నాటకానికి ప్రోత్సాహమే లేదు. ఇక పాపం! పిల్లలకు విజ్ఞానాన్ని అందజేసే సాధనం ఏది ?

అక్కడికీ మన రచయిత లెందరో పిల్లలకు ఉపయోగపడే అద్భుత, హాస్యరసాలతో



కూడిన, నీతిదాయకమైన, వినోదప్రదమైన, ప్రయోజనాత్మక నాటికలు కొన్ని వ్రాశారు. కాని అవెంతమాత్రం సరిపోవు. సినిమాథియేటర్ లేనిది సినిమాలు తీసి కూర్చోవడంవల్ల లాభంలేనట్టు- ఏవో కొద్దిగా వ్రాసినంత మాత్రాన వాటిలో ఒకటో, అరో అక్కడక్కడా ప్రదర్శింపబడినంత మాత్రాన ఇంత పెద్ద రాష్ట్రంలో ఆ ప్రదర్శనలు ఏమూల ? చాలా చాలా తక్కువని చెప్పాలి. కనుక నాటక రచన అనగానే ముందు ప్రదర్శన విషయం ఆలోచించాలి. దాని అవకాశాలు పెరిగిననాడు రచనలకేం? ఎన్నో వస్తాయి. సందేహం లేదు. కావాల్సింది నాటక ప్రదర్శనకు ఏర్పాటు.

నిజానికి ఈపని ప్రత్యేకంగా ప్రభుత్వం చేపట్టవలసి వుంది, ఎందుకంటే ఎన్నెన్నో మూఢాచారాలు, దురలవాట్లు, కులాలు, మతాల బోధలకు గురవుతూ- నిరక్షరాస్యత, అజ్ఞానం, అనారోగ్యం, దారిద్ర్యంలో మగ్గుతున్న మన పిల్లల అలవాట్లనూ, పరిసరాలనూ మార్చి- ప్రజాస్వామ్యాన్ని ప్రేమించే పౌరులుగా రూపొందించాలంటే ఎంతో భారమైన

> సతతము మీరు రిక్కల్లారా
> గగనంలోనే ఉంటారేమి !
> మహిపై కొకపర్యాయంబైన
> దయచేయగ రారేమి ?
> నిగ నిగ లాడుచు
> దగ దగ మెఱయుచు
> పరుగున రారేమి ?
> మహిపై కొకసారి !
>
> -అ ల ప ర్తి

పని. ఆ పనిని ప్రభుత్వమే చేపట్టాలి, చక్కని నాటకాలు వ్రాయించి వేయించే ఏర్పాటు చేయాలి.

మన పిల్లలకు రామాయణం, భారతం లాంటి కథలతో కూడిన పండుగలపట్ల వున్నంత కుతూహలం- జనవరి 26, ఆగస్టు 15 లాంటి కొత్త పండుగులపట్ల లేదు. ఉపాధ్యాయులు చెబుతున్నారు గనుకా, మిఠాయీలు పంచుతున్నారు గనుకా, ఏదో మొక్కు చెల్లించుకునే పనిగా వాటిని భావిస్తున్నారు. అంతేకాని- ఈ పండుగుల ప్రాధాన్యంలో వాళ్లు కలుసుకోలేక పోతున్నారు.

కారణం- ఈ పండుగల వెనకాల కూడా రామాయణం, భారతంలోలాగా మంచికోసం పోరాడిన, కృషి చేసిన, త్యాగం చేసిన, ప్రాణాలర్పించిన మహనీయు లెందరో వున్నారన్న విషయాన్ని పిల్లలకు చిన్ననాడే వారి మనస్సుకు హత్తుకునే పద్ధతుల్లో ప్రదర్శన రూపంలో చెప్పలేదు గనుకనే. మారుమూల వున్న గ్రామాల్లో లతులాది పిల్లలకు ఈ విషయాలను చెప్పడానికి మార్గం- నాటక ప్రదర్శనలు.

నాటక ప్రదర్శన అనేసరికి చాలాఖర్చుతో కూడిందిగనుక ప్రయివేటు వ్యక్తు లెవరూ ముందుకు రాలేరు. అందుకే ప్రభుత్వమే ఈ పనిని చేపట్టాలి. దానికి నాందిగానే ప్రభుత్వం బహుశా ఈ 'బాలల అకాడమీ'ని నెలకొల్పిందనుకుందాం. అలాంటి బృహత్తర కార్యక్రమం నిర్వహించడానికి అకాడమీ ప్రభుత్వానికి తగు పథకాల నందజేయాలి:

నిజానికి ఈపని మనం స్వాతంత్ర్యం రాగానే చేపట్టవలసినంత అతి ముఖ్యమైనది. ఎందుకంటే- పిల్లలకు చిన్ననాడు అబ్బేవిద్య పెద్దయ్యాక అబ్బడం కష్టం. ఇప్పుడిప్పుడే స్వాతంత్ర్యం వచ్చాక పుట్టిన బిడ్డలు- బిడ్డలకు తల్లి దండ్రులయ్యారు. కనుక ఇప్పటికే ఎంతో ఆలస్యం చేశాం. ఇకనైనా ఆలస్యం చేయక మన పిల్లలకు నేటి కొత్త 'భారత' కథలు నాటకరూపంలో ప్రతి గ్రామాని కా గ్రామం అందేందుకు ఏర్పాట్లు చేయాలి.

ఆఏర్పాట్లు వున్ననాడు పిల్లలకు ఎలాంటి నాటకాలు, నాటికలు కావాలని చర్చించుకోవడం ఎంతసేపు ? అయినా క్లుప్తంగా ఆ విషయంకూడా ముచ్చటించుకుందాం.

నాటకమంటె- ముందే అనుకున్నాం: చూచే ప్రేక్షకుని ఉద్దేశించి వ్రాసిందేవని. అలాంటప్పుడు మన నాటకాలకు బాలప్రేక్షకులెవరు ? నాగరికత, భాష, భావం, చప్పన అవగాహన చేసుకునే బస్తీ పిల్లలా ? లేక చదువురాక, భావాన్ని చప్పన అందుకోలేని పల్లెల్లో ఎవరికిందనో జీతం చేసుకుంటూ పొట్ట పోసుకునే పిల్లలా?

ముందు అది తెల్సుకోవాలి. దాన్ననుసరించి రించి, ప్రేక్షకుల ననుసరించి విభాజించుకొని అందులో ప్రత్యేకత సంపాదిస్తూ నాటకాలు వ్రాయించుకోవాలి. 'కోరస్' లాంటి గొప్ప సినిమా పల్లెల్లో ఆడుతుందా? 'బాలరాజు' లాంటి చిత్రం బస్తీ మేధావులకు నచ్చుతుందా?

ఇందులో ఒకటి మంచీ, రెండవది చెడ్డా అని ఎంతమాత్రమూ భావించకూడదు. 'మాలపిల్ల' తీసిన అభ్యుదయ భావోపాసకుడు శ్రీ గూడవల్లి 'మాయలోకం' తీశాడు; కారణం-చూచే ప్రేక్షకుడి స్థాయినిబట్టి తీశాడు.

ఈ దృష్టినుంచే మన నాటక రచన కూడా జరగాలనిపిస్తుంది నాకు. అంటే మనం చెప్ప దలచుకున్న అభ్యుదయ భావాన్ని ప్రేక్షకుడికి అలవాటైన శైలి, పాత్ర, భాష, వేషంద్వారా కలిగించాలి.

నాటకంగానీ, సినిమాగానీ పరిణతిచెందిన కొందరు మేధావులకు నచ్చడమే ముఖ్యం కాదు. మనం ఎవరి నుద్దేశించి వ్రాస్తున్నామో ఆ సామాన్యుడికి అర్థమైందా? నచ్చిందా? అనేది ముఖ్యం. వారు మన నాటకాన్ని చివరంటా ఓపికగా కూర్చుని చూస్తే అదే దాని మంచిచెడ్డల తీర్పు.

నాటకమన్నాక-పసందైన విందుభోజనంలా వుండాలి; బాలలవైనాసరే. అంటే-చమత్కారమైన సంభాషణలు, అభినయాని కవకాశం కల్పించే సన్నివేశాలు, కడుపుబ్బ నవ్వించే హాస్యం, అవసరమైనచోట్ల సృత్యాల కనుకూలమైన పాటలు, కొన్ని పద్యాలు, పిల్లలను ఆకర్షించే విచిత్రమైన వేషధారణ, అన్నింటినీ మించి-అతి తేలికగా అర్థమవుతూ-అభ్యుదయపథంలో వేగంగా సాగే కథా-ఇవన్నీ ముఖ్యం.

ఇక-కథలేవీ అంటే-ఒకటేమిటి? నూతన ప్రజాస్వామ్య భారతదేశాన్ని పటిష్ఠపరచగల అన్నిరకాల సమస్యలూ-మనపిల్లలకు ఓనమాలనుండి చెప్పవలసినవి ఎన్నో వున్నాయి. అవేకాక 'పంచతంత్రం'లోని మన పాత నీతికథలు కూడా పిల్లలకు నాటకాలుగా, ఆయా పాత్రలరూపాలతో ఆకర్షణీయంగాచెప్పవచ్చు.

ఏమైనా, ఇలాంటి బాలల నాటకాలు, నాటకలను కూడా మన పిల్లలు, పెద్దలతోసహా తమంతట తాముగా టిక్కెట్టు కొనుక్కొని చూచే స్థాయికి రావాలి. అలాంటివి మన గ్రామగ్రామాన ప్రదర్శింపబడాలి. అప్పుడే మన రచనల ప్రయోజనం సిద్ధిస్తుంది. అయితే, ఇది అంత తేలికైన విషయం కాకపోవచ్చు. కాని, మనమంతా ఈ ధోరణిలో ఆలోచించి కృషి ప్రారంభించిననాడు ఇది అసాధ్యం కూడా కాదు. ప్రభుత్వం కూడా అలా ఆలోచించే ధోరణిలో వుందిగనుక దానికి సంబంధించిన తగిన పథకాలను అకాడమీ, ఇతర పెద్దలు ప్రభుత్వానికి సూచించాలి. ప్రారంభిస్తే ఏదైనా అవుతుంది.



# ఉత్తర భారతంలో పిల్లల ఆటలు


-చాగంటి తులసి
-ఉపద్రష్ట అనూరాధ


భారతదేశం అంతటా పిల్లలు ఇంచు మించు ఒకే రకం ఆటలు ఆడుకుంటారని ఉత్సాహాన్నిచ్చే, ఉల్లాసం కలిపించే హాస్యంతో కూడిన పాటలు ఆటల ఊపుకు తగ్గవి పాడుకుంటారని తేటతెల్ల మవుతుంది.

తల్లి ఒడిలోంచి పాపాయిలు ముద్దుమాటలతో ఆటలు ఆడుతూ పాటలు పాడుతూ భాషను నేర్చుకుంటారు, శారీరకంగా పెరుగుతారు; మానసికంగా ఎదుగుతారు. ఆసేతుహిమాచలం మన మున్నీ-మున్నాలు, కున్నీ-కున్నాలు, చిట్టీ-చిన్నారులు, మామునీ-ఖోఖో బాబులు ఆడే ఆటల్ని చూస్తే ఒకే తల్లి పిల్లకి ఆటలు నేర్పించిందా? ఒకే ఒడిలో పిల్లు పెరిగేరా? అనిపిస్తుంది.

దక్షిణభారతాన్ని వదలి, కేవలం ఉత్తరాదిని మన పిల్లలు ఆడే ఆటల్ని చూసినా మన సంస్కృతి మనల్నందరిని ఏవిధంగా ఏకం చేసిందో చక్కగా విదితమౌతుంది. పిల్లలంతా ఆడుకునే ఆటలు ఇంచుమించుగా ఒక్కలాటివే. అందులో ఆడపిల్లల ఆటలన్నీ ఒక రకంగా ఉంటే, మగపిల్లల ఆటలన్నీ ఒక రకంగా ఉంటాయి.

తూర్పున ఉన్న ఉత్కళ, వంగ ప్రాంతాలు, పశ్చిమాన ఉన్న మహారాష్ట్ర, గుజరాత్ ప్రాంతాలు పరిశీలించిచూస్తే భాషలు వేరైనా ఈ నాలుగు ప్రాంతాలలో ఆడపిల్లలు చిన్నతనంలో కొద్దోగొప్పో తేడాతో ఒకేరకమైన ఆటలు ఆడతారని తెలుస్తుంది. ఈ నాలుగు ప్రాంతాలే కాదు-ఉత్తర ప్రదేశ్, మధ్య ప్రదేశ్, పంజాబ్, గుజరాత్, అస్సామ్, మణిపూర్ ప్రాంతాల పిల్లలూ కొంచెం మార్పులతో ఆ రకమైన ఆటలే ఆడతారు.

బొత్తిగా చిన్నపిల్లలు ఎలాంటి ఆటలు ఆడతారో చూద్దాం. మన తెలుగు పిల్లలు కాళ్లాగజ్జీ, గుడుగుడు గుంచం, ఒప్పులకుప్పా ఆడతారే, సరిగా వాటికి దగ్గర ఆటలు ఉత్తర భారతంలో ఆడపిల్లలూ ఆడతారు. ఓఢ్ర దేశంలో చిన్నపిల్లలు అరచేతులు బోర్లా నేల మీదుంచి ఒక్కొక్క వేలూ ముడుస్తూ మన తెలుగు పిల్లలు "చింతకాయ, బొంతకాయ" అన్నట్లుగా ఈక్రింది పాట పాడుతూ ఆడతారు.

ఇటికిలి మిటికిలి పుటిగొల్ల కాయించొ
తుమెరొ అమెరొ నాల్లి పాయించొ
నల్లి పే పే బొబాయి హీరా
గొటికొ ముండొరె గొటియె సిరా.

బోర్లించిన చేతులమీద పిడికిలితో కొడుతూ ఆడుతున్నప్పుడు పాడే పాట-

దుదులు దుమా చుడా పాహురిణి
పితొళొ సొమా ఆగొ నాహికి పొచ్చొ
నాహి.

బెంగాలీ పిల్లలు "కాళ్లాగజ్జి" ఆటలాంటి ఆటని, మఠం వేసుకుని కూర్చొని చేతితో మోకాళ్ళమీద తడుతూ దిగువ పాటను పాడుతూ ఆడతారు.

అగడుం బొగడుం
ఘోడారె డిమ్ సాజె
... ... ...
ఘానొ ఘానొ డాటారే నామ్
చొంద్రొముఖి గాఛేర్ నామ్.

"ఒప్పులకుప్ప - ఒయ్యారిభామ" ఆటా ఉత్తరభారతంలో ఉంది. అయితే ఒరియా పిల్లలు చేతులు క్రాసుచేసి పట్టుకొని ఒప్పుల కుప్ప తిరగరు. ఎదురుబొదురుగా నిలబడి ఒకరి చేతులు ఒకరు పట్టుకొని ఆడతారు. అయితే కుడిచేతితో ఎడమచేతిని, ఎడమచేతితో కుడిచేతిని అరచేతులవైపు ఒకరినొకరు పట్టుకుని తిరుగుతారు. వాళ్లూ తిరుగుతూ తిరుగుతూ పాడుకుంటారు. ఏమనంటే-

చొకా చొకా భొవురీ
మామూ ఘొరొ ఛావురీ
మామూ మొత్తె మారిలె
మాయి మొత్తె దుధొ భాతొ ఖొయిలె.

మహారాష్ట్ర ప్రాంతంలో దీన్ని "ఫుగడి" అంటారు. ఆ పిల్లలేం పాడుకుంటారంటే-

ఘుండే ఘుండే హాథ్
నవరా కరీ భాత్
కాగ్ మేతే జేవత్ నాహిం
మారూం కాగ లాత్.

పంజాబీ అమ్మాయిలు ఆడే "కికలీ" ఒప్పుల కుప్ప ఆటే! వాళ్లూ సరదాగా పాడుతూ తిరుగుతారు.

కికలీ కలీర్ దీ
పగ్ మేరే వీర్ దీ
దుపటా మేరే భాయీ దా
ఫిరే ముంహ్ జవాంయిదా.

పంజాబీ అమ్మాయిలే ఆడే ఇంకొక ఆట "రోషన్‌దా" కూడ తమాషాగా ఉంటుంది. ఇద్దరు పిల్లలు ఎదురెదురుగా నిల్చొని రెండు



సంఖ్యాబలముచే గెలుపు కాదని
సత్యము ప్రక్కనె జయము తథ్యమని
కురుక్షేత్రమే తెలిపెను గాదా
మరచితివేమి కృష్ణుని బోధ?
భారతదేశము భాగ్యదేశమూ
భారత వాసిగ జనించినందుకు
సగర్వంబుగా బ్రతకాలోయ్!
విశ్వఖ్యాతిని పెంచాలోయ్!
-కె. రామశేషయ్య

చేతులెత్తి ఒకర్ని ఒకరు పట్టుకుంటూ ఇలా పాడతారు.

రోషన్ దా ఖాయీ రోషన్ దా
డాకుం వోం నే క్యా కియా
సదర్ బజార్ సే ఘడీ చురాయీ
తబ్ తో జేల్ మెం జానాహీ పడేగా.

తక్కిన పిల్లలంతా ఆ చేతులక్రిందనుండి దూరి వెళ్తూంటారు. పాట పూర్తయ్యేసరికి సరిగ్గా చేతులకింద ఉన్నమ్మాయి దొంగ అవుతుంది.

దొంగాట ఆడని పిల్లలు దేశం మొత్తాన్ని కనబడరు. ఒరియాలో ఇది "లుచుకొలి ఖేలొ" అయితే, బెంగాలీలో "లుకొచోరి". బిహారీలో "చోరియా నుకియా" అంటే, పంజాబీలో "లుకన్‌మీచ్" అంటారు. ఇదే మరాఠీలో "లపండావ". మన తెలుగుదేశంలోలాగే పిల్లలు పంటవేసుకుని ఆట ఆరంభిస్తారు. "ఐకుం బైకుం తాడాతాడి" లేదా "ఒక్కా చొక్కా టింటలక్కా" అని బెంగాలీలు పాడితే, "ఇరింగ్ బిరింగ్ కె తారాహై, సాజన్ ఘర్ కె లడకీహై" లేదా "ఏక్ దో తీన్ చార్ పాంచ్ బజానా" అని హిందూస్తానీ పిల్లలు పాడతారు. ఈవిధంగా ఒక్కొక్క ప్రాంతంలో ఒకొక్కక్క రకమైన పాట వాడుకలో ఉంది.

సరే, తల్లి లేందే ఆట ఎలాగ అవుతుంది? వాళ్లు తల్లిని వాళ్లభాషలో 'మా' అనో, 'ధాయీ' అనో అంటారు. ఆవిడని ముట్టుకుంటే ఆటలో అవుట్ అవరు. దాక్కోవటం, వెతకడం, తల్లిని ముట్టుకోవడం అంతా మన లాగే ఆడతారు.

ఉత్తరభారతమేమిటి? దక్షిణభారతమేమిటి? ఆడపిల్లలకి అతి యిష్టమైన ఆట ఐదురాళ్ల ఆట! చింతపిక్కలాట! ఈ ఆట ఆడుకోని పిల్లలు అరుదేను! ఒరియా అమ్మాయిలు "కుంతేయి ఖెళొ" అయిదురాళ్లతోనే ఆడతారు. వీళ్లు చింతపిక్కలతో "ఎక్కా-దుక్కా" అనే ఆటనికూడా ఆడతారు. చింతపిక్కల కుప్పని అరచేతితో మూసి "ఎక్కా? దుక్కా?" అని అడుగుతారు. సంఖ్య ఎంతో సరిగ్గా చెప్పగలిగితే ఎదుటివారు ఆ కుప్ప యావత్తూ గెలిచినట్టు; లేకపోతే అన్ని పిక్కలు లెక్కపెట్టి యిచ్చుకోవాలి. పంజాబీ పిల్లలు "నుతా" అని ఈ రాళ్ళ ఆటనే ఆడితే, బెంగాలీ అమ్మాయిలు "గూటీ ఖేలా" అని ఆడుతూంటారు. బీహార్‌లో "ఆతా బగ్రా", "గాడా" అని అంటే మహారాష్ట్రలో "సాగోతా" అంటారు. ఈ సాగోతా ఓ రకమైన పిక్క. ఇది కోలగా తెల్లగా ఉంటుంది. ఎంతో నైపుణ్యంతో పిక్కకి పిక్క తగలకుండా మరాఠీ అమ్మాయిలు సాగోతా ఆడతారు.

ఆడపిల్లలు, అన్నానికి పిలచినా రాకుండా, అతి వెర్రిగా ఆడే ఆట "గిరాట". దీన్నే "పెంకాట" అనికూడ అంటారు. ఈ ఆటా ఉత్తరభారతం అంతా కనపడుతుంది. ఓఢ్రంలో దీనిని "చుట్టా - ఖెళొ" అని, మరాఠీలో "లంగడీ" అని, పంజాబీలో "అఢీ ఛడప్పా" అనీ అంటారు. ఒరియా అమ్మాయిలు ఈ ఆటలో చెడుగుడులో కూత పెట్టినట్లు "తి

కి తా" అనో, "మోల్ మోల్ డేగ్చి" అనో కూత పెడుతూ ఒంటి కాలితో పెంకుని గదుల్లోంచి తోస్తూ ఆడతారు. దీన్నే బెంగాలీలో "ధాలీ ఖేల్" అని అంటే, పంజాబీలో "స్టాపూ" అంటారు.

గవ్వలాటా ఆడపిల్లలాటే. ఒరియా అమ్మాయిలు "కాచో కౌడి ఖేళో" అని అంటే, బెంగాలీ అమ్మాయిలు "కౌడి ఖేలా" అంటారు. మన పచ్చీసు పాళీని, అష్టా చెమ్మాని "ఆఠో పొచ్చిసి" "దోస్ పొచ్చిసి" అంటారు ఒరిస్సాలోనూ, బెంగాల్‌లోనూ వామన గుంటలు ఆడతారు. సీతామ్మవారు ఆడిన ఆట మరి! ఒరియాలో దీన్ని "కంజి గాత్తొ ఖెళొ" అంటారు. మహారాష్ట్రలోను, బీహార్‌లోను పిల్లల్ని గవ్వలతో ఆడనివ్వరు. వాళ్లు ఈ ఆటని జూదంగా భావిస్తారు. లక్ష్మీదేవి ఇంటి నుండి వెళ్ళిపోతుందని అంటారు. పులీ-మేకా ఆట ఒరిస్సా అమ్మాయిలు "బాఘొ-ఛెళి" అని ఆడతారు. వైకుంఠపాళీ, లుడో, పేక కూడ ఆడతారు.

బువ్వాలాట, లక్కపిడతలతో వండడం, బొమ్మల పెళ్ళిళ్ళు చేయడం దేశం అంతటా కనబడుతుంది. ఒరియాలో 'కుంపా కొండెయి' అని లక్కపిడతలని అంటారు. మహారాష్ట్రలో "భాతుకలీ" ఆట వంట సామాన్లు స్టెయిన్‌లెస్ స్టీల్‌వి కూడ పెట్టుకుని ఆడుకుంటారు. ఒరియాలో "కొంఢియి బహాఘరా" అని, బెంగాలీలో "పుతూల్ బిఏ" అని బొమ్మల పెళ్ళికి అంటారు. బెంగాల్‌లో బొమ్మలకే కాక కప్పలకి కూడ పెళ్ళి చేస్తూ పిల్లలు ఆడతారు. "బెంగేర్ బియె" అని రెండు కప్పల్ని పట్టి తీసుకుని వచ్చి రెండు గోతుల్లో వాటిని వేరు వేరుగా ఉంచి పెళ్ళి తతంగం అంతా చేస్తారు. బీహార్లో శ్రావణ, భాద్రపద మాసాలు తప్ప మిగిలిన నెలల్లో బొమ్మల పెళ్లి ఆట ఆడతారు. రెండంతస్తులు, మూడంతస్తుల బొమ్మరిళ్లు కూడ కడతారు. దీసావళినాడు ప్రతీ ఇంటా బొమ్మల పెళ్లి తప్పకుండా చేస్తారు. పిల్లలు ఉత్తుత్తి వంటకాలు వండించుకుని పెళ్లి భోజనాలు చేస్తారు.

తెలుగుదేశంలో పిల్లలు ఆడే స్తంభాలాట లాంటి ఆట ఒరిస్సాలోనూ ఉంది. దాని పేరు "దొహి-చూడా"(పెరుగు-అటుకులు). అయితే ఇక్కడ స్తంభాలు ఉండవు. మధ్య సున్నాలో



బొమ్మలమ్మ బొమ్మలూ
రంగురంగుల బొమ్మలూ!
బంగారూ బొమ్మలూ
బలే బలే బొమ్మలూ!!
దసరాకి సరదాకి
బొమ్మలెన్నొ పెడతామూ
అందులో మా చిట్టిపాప
నొక బొమ్మగ చేస్తాము.
-శ్రీనివాస కాశ్యప

ఒక పిల్ల-దాని చుట్టూరా ఉన్న నాలుగు సున్నాల్లో నలుగురు పిల్లలు ఉంటారు. చుట్టూ నిల్చున్న పిల్లలు ఒక సున్నానుండి మరొక సున్నాకి మారుతూ ఉంటారు. సమయం చూసుకుని మధ్యపిల్ల చుట్టూరా ఉన్న సున్నాల్లో ఒకదాంట్లోకి వెళ్లాలి.

ఒరిస్సాలో ఉన్న మరో ఆట "గవూగవూ రాణీ". గుండ్రంగా పిల్లలు నిల్చుంటారు. మధ్యలో ఉన్న పిల్ల పాట పాడుతూ తన అవయవాలను చూపెడుతూ "నేనింతవరకు మునిగిపోయేను, ఇంతవరకు మునిగిపోయేను" అని చెప్తూఉంటుంది. చుట్టూ ఉన్న పిల్లలు "గవూగవూ రాణీ" లేదా "గొంగా-రాణీ, ఎతికి ఎతికి పాణీ" అని పాడుతూ ఉంటారు. ఆఖరికి మధ్యనున్న పిల్ల "శిరస్సువరకు మునిగిపోయాను-శిరస్సువరకు నీళ్లు వచ్చేయి" అని చుట్టూ ఉన్న పిల్లల్ని తప్పించుకపోవడానికి చూస్తుంది; తప్పించుకుపోతుంది. చుట్టూ ఉన్న పిల్లలు గవూగవూరాణీ అని మధ్యపిల్ల పాడిన దానికి ప్రతిసారీ జవాబుగా పాడుతారు.

మధ్యపిల్ల: అంగుళి అంగుళి పాణీ
అంతుయె అంతుయె పాణీ
జంఘే జంఘే పాణీ
ఛాతీ ఛాతీ పాణీ
ముండె ముండె పాణీ
చుట్టూ పిల్లలు: బుడిగొల్లా (మునిగిపోయింది)

ఇదే ఆటని గుజరాతీ పిల్లలు "గోల్ గోల్ రాణీ కెటల్ కెటల్ పానీ" అని పాడుతూ ఆడతారు. కెటల్ కెటల్ అంటూ శిరస్సు వరకు వెళ్ళిన తరవాత ఒకరిని ఒకరు పట్టుకోవడానికి పరుగెడతారు. ఈ ఆటంటే బెంగాలీ, బీహారీ అమ్మాయిలకి సరదాయే!

బెంగాలీ అమ్మాయిలు ఆడే ఆటలైన "బూఢీ చోర్", "కుమీర్ కుమీర్ ఖేలా" పైన చెప్పిన ఆటలకి దగ్గరవేను. "బూఢీ చోర్" లో "దొంగముసలమ్మ" మధ్యని ఉంటుంది. దాని చుట్టూ పిల్లలు దాని తలపై వేలు పెట్టి తిరుగుతూ పాడతారు. "ఏక్‌టా బాజిలో బూఢీ ఎలో నా" అని మొదలుపెట్టి పదకొండువరకు "బూఢీ ఎలో నా (ముసలిది రాలేదు) అని పాడి, ఆఖరి పంక్తి "బారోటా బాజిలా బూఢీ ఎఖోన్ ఎలో) (పన్నెండు గంటలయింది. ముసలమ్మ ఇప్పుడే వచ్చింది) అని పాడి అంతా పారిపోతారు. మధ్యనున్న "దొంగ ముసలమ్మ" అయిన పిల్ల వాళ్లని తరిమి పట్టుకోవాలి. పట్టుబడిన అమ్మాయి "బూఢీ చోర్" అవుతుంది.

"కుమీర్ కుమీర్ ఖేలా" అనే ఆటలో ఎనిమిదినుండి పదిమందివరకు పిల్ల లుంటారు. కుమీర్ అంటే మొసలి. చుట్టూ గీతలు గీసి చెరువు అంటారు. ఒక అమ్మాయి మొసలి అయి చెరువులో ఉంటుంది. మిగిలిన పిల్లలు "కుమీర్ కుమీర్ తుమార్ పుకూరె నెమేఛి" (మొసలీ! మొసలీ! నీ చెరువులోకి ఒచ్చేనోచ్!) అంటూ చెరువులోకి వెళ్తూంటారు. మొసలి

అయిన అమ్మాయికి దొరికిన పిల్ల తిరిగి మొసలి అవుతుంది.

"కానా మాఛీ" ఆట కూడ దొంగాటే. పంట వేసుకుని ఒక పిల్లని దొంగ - కానా మాఛీని (గుడ్డి ఈగని) చేసి కళ్లకు గంతలు కడతారు. మిగిలిన పిల్లలు ఆ పిల్ల చేతులు లాగుతూ పాట పాడతారు.

కానా మాఛీ భొ భొ
జాకె పారి తాకె ఛువ్

(గుడ్డి ఈగా! గుడ్డి ఈగా! జుమ్ జుమ్! ఎవర్ని ముట్టుకో గలిగితే వారిని ముట్టుకో). బెంగాల్ కి చెందిన ఈ ఆటని ఒరిస్సాలోనూ ఎక్కువగా ఆడతారు. ఒరిస్సాలో "పుఛీ", "ఓియా పుఛీ" చిన్నపిల్లలకి చాల యిష్టమైన ఆట. పుఛీ ఆడేటప్పుడు నేలపై గొంతికిళ్లా కూర్చుని పాదాలని జరుపుతూ, పాదాలమీద బరువుంచి శరీరాన్ని కుడినుండి ఎడమకి, ఎడమనుండి కుడికి ఊపుతూ, రెండు చేతులూ ఆ ఊపుకి తగ్గట్టుగా తిప్పుతారు. పిల్లలు ఆడుతూంటే బాతులు నడుస్తూన్నట్లు ఉంటుంది కనుక దీన్నే డక్ డ్యాన్స్ అని కూడ అంటారు. దీనికి పాట ఉంది:

కొళా కొళా చైగొణొ,
ధొళా ధొళా కొవుడీ
మొ సంగొరె జె లాగిబొ
మారి దెచి కొహుణీ!

ఈ పాట పిల్లలంతా కలిసి పాడాక పుఛీ ఆట ఆరంభిస్తారు.

"ఓియా పుఛీ" లో పిల్లలు నిల్చుని నడుం మీద రెండుచేతులు పెట్టుకుని శరీరాన్నంతా తిప్పుతూ కూర్చుంటూ లేస్తూంటారు. ఈ ఆట మొదలుపెట్టేముందు పిల్లలు ఇలా పాడతారు:



"ఓియా పుఛీ నారొంగొ,
గొడొ జుడాకొ సారొంగొ,
నారొంగొ బాడి జాయిథిల్లి,
సారొంగొ పుంజె ఆణిథిల్లి,
ఒథె పొడిలా కొంచా,
ఒథె కొల్లి భొజా,
ఒథె కొల్లి ఝురు ఝురా.

"బోవూ చోరీ" ఆట అంటే ఒరియా అమ్మాయిలు నిద్రాహారాలు మర్చిపోతారు. హైస్కూల్ పిల్లలుకూడ ఏమాత్రం సందు దొరికినా ఈ ఆట ఆడుతూ కనిపిస్తారు. పిల్లలంతా రెండు జట్లుగా విడిపోతారు. ఒక జట్టు పిల్లలు ఒక పెద్ద గడి గీసి అందులో నిల్చుంటారు. ఆ గడికి సుమారు ఎనిమిది అడుగుల దూరంలో ఒక సున్నా గీసి దానిలో తమ జట్టుకి చెందిన పిల్లని బోవూ (కోడలు)గా కూర్చోపెడతారు. రెండో జట్టు పిల్లలు (దొంగలు) ఆ సున్నాలో ఉన్న బోవూ లేచి పెద్దగడిలోకి పారిపోకుండా కాపలా కాస్తారు. మొదటి జట్టు పిల్లలు వంతులవారీగా ఒకరి తరవాత ఒకరు చెడుగుడులోవలె "కిత్ కిత్ కిత్" అంటూ కూతపెడుతూ, రెండో జట్టు పిల్లల్ని బోవూ దగ్గరకు రానియ్యకుండా దూరంగా తరుముతుంటారు. సందుచేసుకుని బోవూ పారిపోయి పెద్దగడిలోనున్న తన జట్టు

> చలి చలి చలి గుండెలోన
> జగత్తు కంపించెడి చలి
> అబ్బబ్బా! ముందు వెనుక
> లడుగులు పడనియ్యని చలి
> మృత్యువును జయించిన మే
> మే లోకారాధ్యుల మంటూ
> విజేత సైన్యంలా
> మీదకు దూకే దీపాలివి.
>
> —పన్నాల

పిల్లలని చేరిపోతే మొదటి జట్టు గెలుస్తుంది. దొంగే దొరికిపోతే రెండవ జట్టు గెలుస్తుంది. ఆట నియమాలన్నీ కూడ చెడుగుడు ఆటకి చెందినవే! బెంగాల్లో ఈ ఆటనే "గొల్లా ఛుట్టీ" అంటారు.

థాపితా-నాగేశోరో, తుమ్మెండా-లెమ్మెండా, తుమ్మెండా-నాగేశోరో, టిప్‌టి ఖెలా-అని ఎన్నో పేర్లు వేరువేరు ప్రాంతాల్లో ఉన్నా ఆటమాత్రం ఒకటే! ఆంధ్రలో లాగే బెంగాల్లోనూ, ఒరిస్సాలోనూ పిల్లలు ఈ ఆట ఆడతారు. దొంగకి దొరక్కుండా తప్పించుకుంటూ పిల్లలు పరుగెడుతూంటారు. దొంగకి దొరికిపోయేటట్లైతే కూర్చోవాలి. కూర్చున్న వెంటనే దొంగ ఆ పిల్లని "థాపితా" లేదా "తుమ్మెండా" అని ముట్టుకుంటుంది. మరో పిల్ల వచ్చి "నాగేశోరో" లేదా "లెమ్మెండా" అని లేపేవరకు ఆ పిల్ల లేవడానికి వీలులేదు. దొంగ ఆ పిల్ల లేవకుండా చూస్తూంటే మిగిలిన పిల్లలు లేవదీయడానికి ప్రయత్నం చేస్తూ ఉంటారు.

చాకలి పద్దాటని ఒరియాలో, బిహారీలో, బెంగాల్‌లో కూడా "రుమాల్ చోరీ" అనే అంటారు.

తాడాట (స్కిప్పింగ్) అన్ని ప్రాంతాల బాలికలకి అతి ప్రియమైంది. దీన్నే మరాఠీలో "డోరీ-చాపుడయ" అని, పంజాబీలో "రస్సీ టప్‌నా" అని అంటారు.

ఆడపిల్లలకి ఉయ్యాల లూగడం అంటే ఎంతో ఇష్టం. ఒరియావారి "దోళి", పంజాబీవారి "పింగ్", ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్‌లలో "ఝూలా" ఈ ఉయ్యాలావే. ఇది ఆడపిల్లని ఎంతగానో ఆకర్షిస్తుంది.

మరాఠీ, గుజరాతీ అమ్మాయిలు కోలాటం కూడ ఆడతారు. చప్పట్లు చరుస్తూనో, కోలాటం కర్రలతోనో ఆడతారు. మరాఠీలో దీన్ని "ఝిమ్మా" అని గుజరాతీలో "రాస్" అని అంటారు.

ఒరిస్సాలోని "పూరో పొడి", "గుడులుచ్చాణి", బెంగాల్‌లోని "చొమ్మి", పంజాబ్‌లోని "రోడా ఛిపానా" కొద్ది తేడాలు కల ఒకే ఆట. ఒక జట్టు పిల్లలు పక్కపక్కనే వరసగా కూర్చుంటారు. కుడికాలుని ఎత్తిపెట్టి (పెళ్లికూతురు కూర్చున్నట్టు) కూర్చుని రెండు చేతులతో మోకాలి చిప్పని పట్టుకుంటారు. జట్టు నాయకురాలు తన జట్టుకి చెందిన ప్రతీ పిల్లదగ్గరకి వెళ్లి, ఆ పిల్లచేతిలో తన చేయి పెడ్తూ వెళ్తూ ఒక పిల్లచేతిలో చిన్న రాయిని పెడ్తుంది. రెండో జట్టు నాయకురాలు ఏ పిల్ల చేతిలో రాయి ఉందో పోల్చుకోవాలి. కనుక్కోలేకపోతే, రాయి దాచిన పిల్ల తాను గెంతగలిగినంత దూరం ఎదుటి జట్టువైపు గెంతి అక్కడ కూర్చుంటుంది. ఈ మారు రాయిని దాచడం రెండవ జట్టువారి వంతు. ఇలా ఆట జరగ్గా, జరగ్గా, ఒక జట్టు పిల్లలందరూ కూడా రెండో జట్టుకి చేరిపోగలిగితే, రెండోజట్టువారి ఇల్లు కాలిపోయిందంటారు. మొదటిజట్టు ఆట గెలిచినట్టు!

ఇంకొక ఆటలో పైన చెప్పినవిధంగానే రెండు జట్ల పిల్లలు ఎదురెదురుగా కూర్చుంటారు. ఒక జట్టు నాయకురాలు రెండో జట్టు పిల్లల్లో ఒకరి కళ్లు మూస్తుంది.

చుంగిడీ జాలు జాలు

... ... ...

ఆ గులాబా నాకో ఛిండి జా

అనే పాట పాడుతూ తన జట్టు పిల్లను వచ్చి కళ్లు మూసిన పిల్ల ముక్కు గిల్లి పారిపొమ్మంటుంది. కళ్లమించి చేతులు తీశాక ఆ పిల్ల గిల్లినవారిని పోల్చుకోవాలి. ఈ ఆట కూడ ఒరిస్సాలో ఎక్కువగా ఆడతారు. ఆంధ్రలోకూడ ఇదేమాదిరి ఆట ఉంది.

ఇక మొగపిల్లల ఆటలకి వద్దాం. ఇవికూడ అన్ని ప్రాంతాల్లో కొద్ది తేడాలో ఒకేలాగ ఉంటాయి. పిల్లిమొగ్గలు, బిళ్లాకర్రా, గోలీలు, చెడుగుడు, దొంగాట, కోతికొమ్మచ్చి, కుస్తీలు, గాలిపటాలు, పేకాట-ఇవంటే మగ పిల్లలందరికీ ఎంతో ఆసక్తి! ఈ ఆటలన్నీ అన్ని రాష్ట్రాలలోనూ ఆడతారు. ఒరియాలో బిళ్ళాకర్రని "గుల్లీదండీ" లేదా "గిల్లీదండీ" అనీ, పంజాబీలో "దండాగుట్టీ" అని, మరాఠీలో "విటే-దాండూ" అనీ, బెంగాలీలో "దండాగుట్టీ" లేదా "గుల్లీదండా" అని అంటారు. గోళీలని ఒరియాలో "బట్టీ" అంటే, మరాఠీలో "గోటీ" అంటారు. అదే పంజాబీలో "బంటా". చెడుగుడు (కబడ్డీ)లో కూత ఒక్కొక్కచోట ఒక్కొక్కరకంగా పెడతారు. మహారాష్ట్రలో "హూతూతూ" అంటే, బెంగాల్‌లో "హాడుడు" అని అంటారు. డూడూ అని, కబడి కబడి అని కిత్ కిత్ అని, ఆంచ్ అంచ్ అనికూడ కూత పెడతారు. "చెగాయ్‌హుంబి", "కెల్లాతుగైచి" "చైచెక్‌కోట్ని", "ఉరోచి" అనేవి మణిపూర్‌లో పిల్లలు ఆడే ఆటలు.

పంజాబ్‌లోని భాంగడా నృత్యం ఎంతో ప్రసిద్ధిచెందినది; చాల కష్టమైనది కూడ. పిల్లలు చిన్నవయస్సులోనే ఈక్రింది పాట పాడుతూ లయప్రకారం పాదాలు వేస్తూ భాంగడా ఆట ఆడతారు:

ఖటన్ గయాసీ, ఖటకే లియా థా
ఖట ఖటకో లియాథా ఆలూ
చాచా నెహ్రూనే భంగడా కీతా చాలూ!

బెంగాలీ అబ్బాయిలు ఆడే "దారియా బాంధా" ఆట చాల ఆసక్తికరమైంది. దారియా బాంధా అంటే గీత కట్టెయ్యడం




లేదా ఆట కట్టెయ్యడం అని అర్థం. పయి విధంగా గీతలు గీసుకుని పిల్లలు రెండు జట్లుగా విడిపోయి ఆడతారు.

మొదటిజట్టు పిల్లలు నలుగురూ ముందు గడిలో ఉంటారు. రెండోజట్టు నలుగురు పిల్లలు గడికి గడికి ఉన్న మధ్య స్థలంలో నిల్చుంటారు. మొదటిజట్టు పిల్లలు తమ గడి

నుండి రెండవగడికి, రెండోగడినుండి మూడో
గడికి, మూడోగడి నుండి నాలుగోగడికి
రెండోజట్టు పిల్లలకి దొరకకుండా రావాలి.
తిరిగి నాలుగవ గడినుండి మూడవ గడిలోకి
వెళ్లాలి. ఇలా క్రమంగా తమ గడికి చేరాలి.
మధ్యనున్న సన్నటి జాగానుండి వీరు వెళ్ళ
డానికి వీలులేదు. రెండోజట్టు పిల్లలు తమ
స్థానాలనుండి పటంలో చూపిన విధంగా
చుట్టూ పరుగెడుతూ కుడినుండి ఎడమకి ఎడమ
నుండి కుడికి వెళ్లాలిగాని గదుల్లోంచి వెళ్ల
కూడదు. పిల్లల సంఖ్య పెరిగినకొలదీ గదుల
సంఖ్య పెంచుకుంటూ ఆడతారు.

బెంగాలీ అబ్బాయిలు ఆడే ఇంకో ఆట
"పనచిక్". ఇది పధ్నాలుగురు పిల్లలు ఆడ
తారు. ఇదికూడ పై ఆటలాంటిదే. ఇందులోనూ
ఒక జట్టు పిల్లలు రెండో జట్టువారి ఆట కట్టి
స్తారు. బొమ్మలోలాగ ఎనిమిది గీతలు గీస్తారు
నేలమీద. మొదటిగదిలో A జట్టు పిల్లలందరూ
ఉంటారు. ఇంటు గుర్తులు పెట్టినచోట B
జట్టు పిల్లలు ఏడుగురూ నిల్చుంటారు. A జట్టు
పిల్లలు ఒకరితరవాత ఒకరు ఒకటవ గదినుండి
బయల్దేరి ఒక్కొక్కగది దాటుకుంటూ తమ
స్థానానికి తిరిగి చేరుకోవాలి, వారిని తాకడానికి




B జట్టు పిల్లలు కాపలా కాస్తారు, వారిని వెళ్ల
నీయకుండా అడ్డుపడతారు. B జట్టు పిల్లలు
తాకిన అబ్బాయి అవుట్ అవుతాడు.

బెంగాలీ అబ్బాయిలదే "చొక్కి ఖేలా"
అనే మరొక ఆటకూడ. ఈ ఆటకి లక్ష్యసిద్ధి
కావాలి. పిల్లలంతా ఈ ఆటకోసం చొక్కీలని
కూడబెట్టుకుంటారు. మధ్య కన్నం ఉన్న
చిన్న ఇనపచక్రాలే ఈ చొక్కీలు. చొక్కీలు
చిన్నవి, పెద్దవికూడ ఉండాలి. ఒక సున్నా
గీసి, మొదట చిన్నసైజు చొక్కీలను ఒకరి తర
వాత ఒకరు ఆ సున్నాలోకి విసురుతారు. తర
వాత పెద్దసైజు చొక్కీతో సున్నాలో ఉన్న
చిన్న చొక్కీలని గీత యివతలకి వచ్చేటట్లుగా
గురిచూసి కొడతారు. ఆ కొట్టడానికి కూర్చున్న
భంగిమ, ఒడుపూబట్టి ఆటగాని సామర్థ్యం తెలు
స్తుంది. గీత బయటికి వచ్చిన చొక్కీలని గెల్చు
కుంటూ ఈ ఆట రోజంతా విసుగన్నది లేకుం
డా ఆడతారు. ఈ ఆట మన తెలుగు అబ్బా
యిలూ రోడ్డుమీదా, సందుల్లోనూ ఆడుతూ
కనబడతారు. ఇదే ఆటని ఒరిస్సాలో ఖాళీ సిగ
రెట్టు పెట్టెల్ని పెట్టి, కొన్నికొన్ని ప్రాంతా
లలో నాణేలని కూడ పెట్టి ఆడతారు. చొక్కీ
లకు బదులుగా సిగరెట్ పెట్టెలని వాడి ఆడడం
తెలుగు అబ్బాయిలకు కూడ కొత్త కాదు.
పంజాబ్‌లోని మగపిల్లలుకూడ ఇంచుమించుగా
ఇదే ఆటని ఆడతారు. సున్నామధ్య కన్నంలేని
ఏడు ఇనుప చక్రాలని పెట్టి బంతితో వాటిని
ఒకబ్బాయి కొడతాడు. చెల్లా చెదరైన ఆ
చక్రాలని అతడు అవతల వారు బంతి తెచ్చి
తనని కొట్టేలోగా పేర్చాలి. లేదా అవుట్
అయిపోతాడు. పంజాబీలో ఈ ఆటను
"పిట్టూ" అంటారు.

బీహార్‌లో "కరోడ్ కరోడ్" ఆట
అబ్బాయిలందరికి చాలా ఇష్టమైన ఆట.

వేలాం వెర్రిగా దీన్ని ఆడతారు. కోటీశ్వరులు కావాలని, డబ్బు సంపాదించాలని అబ్బాయిలకి ఉంటుంది కదా! ఈ ఆటలో (కరోడ్ పతి) అవడమే పంట పండటం. ముందుగా పిల్లలందరు వేరువేరుగా తమ యిష్టంవచ్చిన అంకెలను వేరువేరు జాగాల్లో రహస్యంగా రాసి వస్తారు. తరవాత అందరు కలసి ఆ అంకెలు వెతుకుతారు. ఎవరూ కనుక్కోలేని విధంగా సంఖ్యవ్రాసిన అబ్బాయి, ఆసంఖ్యతో సమానమైనన్ని రూపాయలను గెల్చినట్టు లెక్క. కోటిరూపాయలు గెలిస్తే పంట పండుతాడు.

ఇంతేకాక కేరమ్స్, లూడో, చైనీస్ చెక్కర్, వర్డ్స్ బిల్డింగ్, చదరంగం, క్రికెట్, ఫుట్ బాల్, వాలీబాల్, బాస్కెట్ బాల్. బాడ్మింటన్, షటిల్ కాక్, టెన్నిస్, రింగ్ టెన్నిస్, టేబుల్ టెన్నిస్, ఖోఖో మొదలైనవి యావత్తు భారతదేశంలోని పిల్లలు ఆడతారనే విషయం అందరకు తెలిసిందే.

భారతదేశం అంతటా పిల్లలు ఇంచుమించు ఒకేరకం ఆటలు ఆడుకుంటారని, ఉత్సాహాన్నిచ్చే, ఉల్లాసం కలిగించే హాస్యంతోకూడిన పాటలు, ఆటల ఊపుకు తగ్గవి పాడుకుంటారని ఈ పరిశీలనవల్ల తేటతెల్లమవుతుంది.



# రేడియో-దూరదర్శిని బాలల నాటికలు

-మద్దిపట్ల వెంకట్రావు

రేడియో రచన అనేది ఒక ప్రత్యేక ప్రక్రియ. శ్రవ్య రచనకీ, రేడియో రచనకీ అట్టే తేడా లేకపోయినట్లు కనిపించినా యివి రెండూ ఒకటి మాత్రం గాదు.

"రారండోయ్....రారండోయ్..పిల్లల్లారా" అంటూ కని, ఆదివారాలలో రేడియోలో వినడమే తడవుగా బాల, బాలికలు అంత వరకూ తాము ఏమిచేస్తున్నా సరే, అక్కడి దక్కడే వదిలేసి, రేడియోలచుట్టూ మూగడం, క్లాసులో పాఠంకన్నా అతిశ్రద్ధగా వింటూ ఉండటం మనం చూస్తూనే ఉంటాము. బాల, బాలికలకు ఆ రెండురోజులు ఎంతో సరదా, ఆనందం! ఆ కార్యక్రమాలు విని తాము వాటిని మళ్లీ, మళ్లీ జ్ఞాపకం చేసుకుంటూ తాముకూడా అలాగే ఆ కార్యక్రమాల్లో పాల్గొనాలని సరదాపడుతూంటారు. హైదరాబాదు, విజయవాడ, మద్రాసు రేడియో కేంద్రాలు ప్రసారం చేసే బాలానందం-పాలవెల్లి; బాలవినోదం; బొమ్మరిల్లు; ఆటవిడుపు; బాలవిహార్ కార్యక్రమాలు పిల్లల్ని ఆకట్టుకొంటున్నాయి. ఇవేగాక ఈమధ్య ప్రసారం అయ్యే మాధ్యమిక, ప్రాథమిక పాఠశాలల కార్యక్రమాలు కూడా పిల్లల్ని ఆకర్షిస్తున్నాయి. అంతేగాకుండా ఈమధ్య ఉపగ్రహ భారత టెలివిజన్ ప్రయోగానంతర ప్రసారాలు కూడా ఆసక్తిజనకంగా ఎందరినో ఆకర్షించాయి.

ఈనాడు నాటక నాటికా వస్తువును ప్రజల జీవితం నుంచి తీసుకోవాలి. నాటకం అనేది ఈనాడు మనం సజీవ వ్యక్తులకోసం, సమాజ వికాసంకోసం వ్రాయాలి. ప్రదర్శించాలి. నాటక ప్రయోగంలో ఏడు ముఖ్యాంశాలున్నాయి: రచన. దర్శకత్వం, నటన, సీనరీలు, దుస్తులు, కాంతి, ధ్వని-ఇవన్నీ స్టేజిపై ఆడే నాటకాల విషయం.

రేడియో రచన అనేది ఒక ప్రత్యేక ప్రక్రియ. శ్రవ్య రచనకీ, రేడియో రచనకీ అట్టే తేడా లేకపోయినట్లు కనిపించినా, యివి రెండు ఒకటిమాత్రం గాదు. శ్రవ్యరచన రేడియోలో ప్రసారం కావాలంటే సాంకేతికంగా కొన్ని మార్పులు చేయాలి. రంగస్థలం మీద నాటకం ప్రదర్శించేటప్పుడు ప్రేక్షకుల్ని ఎలా దృష్టిలో పెట్టుకుని వ్రాస్తామో అలాగే రేడియోకి వ్రాసేటప్పుడు శ్రోతల్ని దృష్టిలో ఉంచుకోవాలి! ముఖ్యంగా వర్ణనలు తక్కువగా ఉండాలి. కథలో గమనం హెచ్చుగా ఉండాలి. సంగీత నాటకాలలో సంగీతానికి

-అనువుగా సంభాషణలు ఉండాలి. నాటికలలో సంభాషణలు సహజంగా, సజీవంగా ఉండాలి. శ్రోతల శ్రవణేంద్రియానికి తృప్తికలిగించాలి. శ్రోతల ఆలోచనకి అవకాశం యివ్వాలి. కాబట్టి భాష విషయంలో చాలా జాగ్రత్త వహిం చాలి. శ్రవ్యనాటికలలో, దృశ్యనాటికల్లా కొన్ని పరిధులలో కాకుండా ఏరకమైన సన్ని వేశం కావాలన్నా, ఏరకమైన 'ఎఫెక్టు' కావా లన్నా ప్రవేశపెట్టవచ్చు: కాసేపు హైదరా బాద్‌లోనూ, అక్కడనుంచి విమానంలో అమెరికాలోనూ కథను చిత్రీకరించవచ్చు. కథని ఎంతో వేగంగా నడపవచ్చు. కాబట్టి రేడియో నాటికకు ముఖ్యంగా ఆధారం సంభాషణలు, "ఎఫెక్టులు". అయితే రంగస్థల నాటకాల్ని రేడియో నాటకాలుగా చేయ కూడదా అంటే, చేయవచ్చు గాని అన్నీ మాత్రం బాగా రాణించకపోవచ్చు.

ఇదేవిధంగా శ్రవ్య, దృశ్య నాటికలను రెం డింటిని మేళవిస్తేగాని టెలివిజన్ నాటికగా తయారుకాదు. ఇందులో చాలా పరిశ్రమ చేయాలి.

రేడియో నాటికలో పాల్గొనే పిల్లలకి కేవలం 'వాయిస్' బాగుండి, సంభాషణలు సరిపడేటట్లుగా చెబితే సరిపోతుంది. కాని టెలి విజన్‌లో అలా కాకుండా యిటు సంభాషణ చాతుర్యం, అటు పాత్రకుసరిపోయిన ఆకారం అందచందాలు అవసరం. రేడియోలో 'వాయిస్ మాడ్యులేషన్' తో ఎన్నయినా గమ్మత్తులు చేయవచ్చును. అయితే టెలివిజన్ లో 'వాయిస్'తో బాటు నటన ప్రధానాం శంగా ఉంటుంది. టెలివిజన్ నాటకాల్లో "స్టేజి' నాటకాల్లోలా "ప్రాంప్టింగ్" గాని రేడియోలోలా తుడిచేసి మళ్ళీ రికార్డుచేయటం గాని జరుగదు. సినిమాల్లోలా "టేక్స" లా

తీసుకుని టెలివిజన్ కార్యక్రమం రూపొందే టంత అభివృద్ధి మనం ఈమధ్య ప్రసారంచేసిన టెలివిజన్ కార్యక్రమాల సమయానికి రాలేదు.

అయితే ఒక నాటిక వ్రాసి దానిని రేడి యోలో గాని, టెలివిజన్‌లో గాని ప్రసారం చెయ్యాలంటే చాల కష్టతరమైన పనేమరి. మొదట నిర్ణయించిన థైముప్రకారం నాటక వస్తువును కుదించుకోవాలి. తర్వాత దాని ప్రకారం పిల్లల భాషలో - అంటే వాళ్ళ కర్థ మయ్యే భాషలో వాళ్ళకి సంబంధించిన సంఘ టనలు, సన్నివేశాలు అందులో చేరుస్తూ 'స్క్రిప్టు' తయారుచేసుకోవాలి. తర్వాత



దానికి కావలసిన పిల్లలను ఎన్నుకొని, వాళ్ళంద రికీ 'పోర్షన్లు' రాసిచ్చి వాళ్ళందర్నీ కూచో పెట్టుకుని వాళ్ళచేత' రిహార్సల్స్' చేయించాలి. మొదట్లో ఎవళ్ళ పాత్రల తర్వాత ఎవరో వాళ్ళ కర్థమయింతర్వాత, సంభాషణలు ఎలా చెప్పాలో వాళ్ళచేత ఒకసారి చెప్పించి వాళ్ళని అనమంటే వాళ్ళు యిట్టే అర్థం చేసుకుని తయారయిపోతారు. ఇలా నాలుగయిదుసార్లు రిహార్సలు అయిన తరువాత ఆ నాటికకు సంబంధించిన ఎఫెక్ట్సు, మ్యూజిక్, 'ఇంటర్ లూడ్స' వగైరాలు సిద్ధం చేసుకుంటేప్ఁయిక

రేడియో స్టేషన్‌లో రికార్డుచేసి ప్రసారానికి సిద్ధం చేసుకోవచ్చు. కాకపోతే "లైవ్ ప్రోగ్రామ్"గా ప్రసారం చెయ్యొచ్చు. అయితే ఇలా పిల్లల్ని ఒకచోట చేర్చడం, రిహార్సలు చేయించడం ఎంత కష్టమంటే అది అనుభవిస్తేతప్ప వర్ణిస్తే అర్థంకాదు. ఇందులో ఒకళ్ళో, యిద్దరో ఆ సమయానికి జ్వరం వచ్చిందని, మా బంధువుల యింట్లో పెళ్లి కెడుతున్నామని-యింకా యిలాగే ఎన్నో విధాలుగా యిబ్బందులు పెడుతూనే ఉంటారు. అలాగే సర్దుకుపోయి మరొహాళ్లతో ఏదోలా కార్యక్రమాలు నడిపిస్తూండాలి.

అలాగే, టెలివిజన్ కార్యక్రమాలకు సంభాషణలు చెప్పడమే గాకుండా దానికి తగ్గ నటన కూడా పిల్లలకు నేర్పాలి. రాజులా, రైతులా, మాష్టారులా, అల్లరి పిల్లాడిలా, పిల్లవాడిలా, తల్లిలా, రాణీలా......యిలా ఆయా పాత్రలకు తగ్గట్టు పిల్లలకు సంభాషణతోపాటు నటనకూడా నేర్పాలి. ఒకప్పుడు నాట్యం, సంగీతం...యింకా సర్కసుకూడా అవసరమవుతూనే ఉంటుంది కొన్ని కార్యక్రమాలకి! కాబట్టి యిక్కడ టెలివిజన్‌లో 'పెర్‌ఫెక్టు' ప్రోగ్రాం తయారుచెయ్యాలి. 'ప్రాంప్టింగ్'ఉండకూడదు. 'సెట్'లో కావలసిన సామాన్లన్నీ మొదటే సిద్ధం చేసుకోవాలి. ఒక కార్యక్రమంలో యిలాగే అన్నీ సిద్ధం అని మొదలుపెట్టిన తరువాత సెట్‌లో ఉన్న ఆసామి జేబులో కార్డు ఉండాలి కాని అది లేదు! నాటకం అంతా దానిమీదే ఆధారం. అక్కడికి ఆపేసి మళ్ళీ మొదట్నుంచీ దానిని తీసుకోవాల్సి వస్తుంది. కాబట్టి టెలివిజన్ నాటకాల్లో ఎంతో శ్రమ అవసరం

మనం రంగస్థల నాటకాల విషయంలో ఎన్ని ప్రయోగాలు చేసినా రేడియో, టెలివిజన్ నాటకాల విషయంలో యింకా ప్రాథమిక దశలోనే ఉన్నామనిపిస్తూ ఉంటుంది. ప్రత్యేకం పిల్లలకోసం నాటకాలు వ్రాసేవాళ్లే చాలా తక్కువ. అందులోనూ రేడియోలోనూ, టెలివిజన్‌లోనూ నాటకాలు వ్రాసేవారు మరీతక్కువ. కాబట్టి రేడియో, టెలివిజన్ నాటకాల రచన, నిర్వహణ విషయాల్ని గురించి కొన్ని సదస్సులు, కార్యగోష్ఠులు ఆకాశవాణి వారుగాని, దూరదర్శన్ వారుగాని, బాలల అకాడమీ గాని పూనుకొని చేస్తేగాని మనకి కావలసినంత స్థాయిలో పిల్లల కార్యక్రమాలు రావు! బాలసాహిత్య రచయితలు కూడా యిందుకు పూనుకొని కొన్ని రచనలు, ప్రయోగాలు చేస్తేగాని రేడియో, టెలివిజన్ కార్యక్రమాల అభివృద్ధి జరుగదు.



# గ్రంథాలయాల్లో బాలల విభాగం

— కె.ఎస్. ప్రకాశం

బాలలకు చక్కని గ్రంథాలయముల నేర్పాటు చేయుట ప్రజాస్వామిక సంస్థల ధర్మము. వాటిని తమ పిల్లలు ఉపయోగించునట్లు చూచుట తల్లిదండ్రుల బాధ్యత.

నేటి బాలలే రేపటి పౌరులు. వారి సర్వతోముఖాభివృద్ధికి ప్రభుత్వములు, సమాజములు శాయశక్తుల పాటుబడుట అత్యవసరము. గ్రంథాలయములు పౌరులకు విద్యా, విజ్ఞానములకు తోడు ముఖ్య సమాచారముల నందించి వారిని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దుటకు ఉపయోగపడు ఆలయములు. వినోదముతో విద్య-విద్యతో విజ్ఞానము-విజ్ఞానముతో వికాసమును పంచిపెట్టు విద్యాలయమే నేటి గ్రంథాలయము. ప్రజాస్వామిక ప్రభుత్వములలో ప్రతి పౌరుడు తమ పవిత్రమైన ఓటు హక్కును సద్వినియోగము చేయుటకు అతనికి దేశకాలపరిస్థితులు, సాంఘికమైన మార్పులను తెలుపు ముఖ్య సమాచారములు ఎప్పటికప్పుడు అందించుట చాలా ముఖ్యము. అన్ని విషయములను తెలిసికొన్న పౌరులుగల సమాజములు ప్రజాస్వామిక సంస్థలను, ప్రభుత్వములను జయప్రదముగా నిర్వహించగలవు. అభివృద్ధి చెందిన దేశములు బాలల పురోభివృద్ధికి అత్యంత ప్రాధాన్యము నిచ్చుచున్నవి.

బాలల మనస్సులు మిగుల సున్నితములైనవి. వారికి అభిరుచులు ఎక్కువ. కొందరికి క్రీడలు. మరికొందరికి సంగీత, నాటక సాహిత్యములు, మరికొందరికి చిత్రకళలు, సర్జనాత్మక-విజ్ఞాన విశేషములపై కొందరికి అభిమానము. బాలల భిన్నరుచులను వృద్ధిచేయుటకు ఇంటియందు తల్లిదండ్రులు, పాఠశాలయందు ఉపాధ్యాయులకుతోడు నేటి గ్రంథాలయములు ముఖ్యమైన పాత్రను నిర్వహింపవలసినవిగా నున్నది.

బాలలు చిన్ననాటి అలవాట్లను పెద్దవారైనను మరువజాలరు. చిన్ననాటి అనుభవములు-అభిరుచులు వారి సున్నితమైన మనస్సులందు శాశ్వతముగా నుండును. ప్రతిపౌరుడు తన పిల్లల విజ్ఞానాభివృద్ధికి పాఠ్యాంశములనే గాక ఇతర విజ్ఞాన విషయములతో, వారిలో దాగియున్న కళాభిరుచులను అభివృద్ధిచేయు ఉత్తమ గ్రంథములపై వారి అభిరుచులను పెంపొందించుట అత్యవసరము.

ఇంతవరకు వెనుకబడిన దేశములలో పౌర గ్రంథాలయములలో బాలల విభాగములను వారి మనస్సులను ఆకర్షించునట్లుగా తీర్చిదిద్దు

టకు ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొనలేదు. నేడు ఈ లోపమును సరిదిద్దుటకు "యునెస్కో" వారి మార్గదర్శకత్వమున తీవ్రప్రయత్నములు జరుగుచున్నవి. ఇది ముదావహము. నేడు పౌర గ్రంథాలయము లన్నిటను ప్రత్యేకమైన బాలల విభాగములను ఏర్పరచుటకు ఆంధ్ర రాష్ట్రమునందు, దేశములోని ఇతర రాష్ట్రముల కంటె గట్టి చర్యలు తీసుకొనబడినవి. కొన్ని బాలల విభాగములయందు వారికి వారి పాఠ్యగ్రంథములు, ఉపవాచకములు, అభిమాన గ్రంథములేగాక ప్రత్యేకముగ క్రీడావిభాగములను (Indoor games), మట్టి నమూనాలను చేయుట, సంగీత నాటక కార్యక్రమములు,



వ్యాసరచన, వక్తృత్వపు పోటీలు, అహ్లాదకరమైన కథలను చెప్పుటవంటివి కొంతవరకు నిర్వహించు చున్నవి. పాఠశాలల యందలి గ్రంథాలయముల కంటె, పౌర గ్రంథాలయములలోని బాలల విభాగములను బాలలు ఎక్కువగా దర్శించుచున్నారు. కారణము పాఠశాల గ్రంథాలయము తన ఉపాధ్యాయుని పలుబడిలో నున్నందున వాటిని తరచు ఉపయోగించుటకు బాలలు వెనుకాడుచున్నారు. పౌర గ్రంథాలయములలోని బాలల విభాగపు "లైబ్రరియన్" తమ మిత్రుడుగా వ్యవహరించు చున్నందున బాలలు వాటిని నిర్భయముగా దర్శించుచున్నారు. పై కార్యక్రమములందు గూడ ఉత్సాహముతో పాల్గొనుచున్నారు. బాలలయందు దాగియున్న సర్జనాత్మక అభిరుచులను పెంపొందించుటకు బాలల విభాగములు ఎక్కువ ఉపయోగములుగా నున్నవి. కాన పై కార్యక్రమములను అన్ని బాలల గ్రంథాలయములందును విరివిగా నిర్వహించి బాలురను, బాలల విభాగములకు ఆకర్షింపజేసిన, చిన్ననాటినుండి వారి గ్రంథపఠనాభిలాష క్రమముగా వృద్ధినొంది పెద్దవారైన పిదపను వారి అభిమాన విషయములయందు గ్రంథాలయముల ద్వారా స్వయముగా విజ్ఞానమును సంపాదించుకొనుటయేగాక ఉత్తమ పౌరులుగా తమ బాధ్యతలను నిర్వహించి సమాజమునకు, దేశమునకు ఉపయోగకారులుగా మనుగడ సాగించుటకు ఆ విభాగములు తోడ్పడును. నేటి అణుయుగములో మానవుడు తరచు అంతరిక్షయానములు విరివిగా చేయుచు నిముస నిముసమునకు ఊహించలేనంత విజ్ఞానశాస్త్రాభివృద్ధిని విస్తరింప జేయుచున్నాడు. అంతరిక్షయాత్రా సమాచార విశేషముల నందించు బాలల విభాగములు బాలలయందు దాగియున్న శాస్త్రాభిమానమును పెంపొందించి రేపటి శాస్త్రవేత్తల నెందరినో సమాజమునకు అందించి లోక కళ్యాణమునకు తోడ్పడు దేవాలయములేగదా!

బాలలకు చక్కని గ్రంథాలయముల నేర్పాటు చేయుట ప్రజాస్వామిక సంస్థల ధర్మము. వాటిని తమ పిల్లలు ఉపయోగించునట్లు చూచుట తల్లిదండ్రుల బాధ్యత. అవకాశమును వినియోగించుకొని దేశప్రతిష్ఠను పెంపొందించు కవులుగా, పండితులుగా, కళాకారులుగా, శాస్త్రవేత్తలుగా, దేశనాయకు

లుగా రూపొందుట రేపటి పౌరుల అదృష్టము.

నేడు మన రాష్ట్రములో హైదరాబాదు నగరమునను, అన్ని జిల్లా ముఖ్య కేంద్రములలోను, అన్ని నగరములలోను ప్రత్యేక బాలల గ్రంథాలయములున్నూ, ఇతర పట్టణములలో దాదాపు ఆరువందల బ్రాంచి లైబ్రరీలలో బాలల విభాగములున్నూ పనిచేయుచున్నవి.

నవసమాజ నిర్మాణానికి, సమాజస్థాపనకు
దర్శించు గ్రంథాలయం
కలదందు విజ్ఞానవిధి గ్రంథసముదాయం.
అదియే ఉత్తమ ప్రజాస్వామిక సేవాసంస్థ
అచ్చట లేవు కుల, మత, వర్ణ, వర్గ
పండిత పామర భేదాలు
లేదందు స్త్రీపురుష వివక్షత
కలవందు సమానావకాశాల్, విజ్ఞాన
సముపార్జనంతో
అచ్చట విజ్ఞానం జాతిపరం
నేటి దేవాలయం, బాలల గ్రంథాలయం.
దీక్షబూని సాగిపొమ్ము ప్రగతిపథంలో.



# బాలల చిత్రకళ

**- వెల్లటూరి పూర్ణానంద శర్మ**

పసి హృదయాల నుండి వచ్చీ రాని మాటలు ఎంత మురిపిస్తాయో, వారి చేతి మీదుగా వేసిన గీతలు అంత మనోహరంగా అలరిస్తాయి.

చిత్రకళపైన బాలబాలికలకు చిన్నతనం నుండే-తమకు తెలియకుండా అభిమానం ఏర్పడుతుంది. దాన్ని తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు గుర్తించి ప్రోత్సహించాలి.

బాలలకు ప్రాథమిక విద్యాదశలో చిత్రకళ నేర్పేందుకు సామాన్యంగా ప్రత్యేకమైన ఉపాధ్యాయులు వుండరు. అదే పెద్ద లోటు! మామూలు క్లాసు టీచరు పిల్లలను ఆహ్లాదపరచటానికి ఎప్పుడైనా ఒక బొమ్మ వేసి దాన్ని చూసి వెయ్యమనవచ్చు. సెకండరీ విద్యాభ్యాసంలో మాత్రం చాలా స్కూళ్లలో చిత్రకళోపాధ్యాయులు వుంటారు. వారు కూడా ఏదో ఒక బొమ్మని వేసి, పిల్లల్ని చూసి వెయ్యమంటారు. కాని అది సులభంగా ఎలా వెయ్యాలో చెప్పరు. అందుచేత ఇష్టమైన వాళ్లు-కుదిరినట్లు వేస్తారు; లేకపోతే లేదు. కానీ ప్రత్యేకమైన శ్రద్ధ వహించడం అరుదు.

నిజానికి బాలల అభిరుచులను తెలిసికొని, వాళ్లస్థాయికి వెళ్ళి నేర్పితేగానీ రానిది "చిత్రకళ"! బాలల మనస్తత్త్వాన్ని అర్థం చేసుకొని, వాళ్లకి ఎలా నేర్పితే ఒక చిత్రాన్ని వేయించగల్గుతారో తెలుసుకోవటం అనుభవం పైనగాని తెలియదు. పసిహృదయాలనుండి వచ్చీరాని మాటలు ఎంత మురిపిస్తాయో, వారి చేతిమీదుగా వేసిన గీతలు అంత మనోహరంగా అలరిస్తాయి! అయితే అవి అర్థం చేసుకోగల నేర్పు రసజ్ఞులైనవారికే వుంటుంది! సామాన్యుల దృష్టికి అవి పిచ్చిగీతలుగానే కనపడవచ్చు. కాని అవి వేసిన పిల్లలకి కలిగే ఆనందం 'అంతా-ఇంతా' గాదు. కారణం అది వారి సర్జనాత్మక శక్తికి ప్రతిరూపం!

బాలల చిత్రాలు వారి హృదయాలవలె నిష్కపటంగానూ, నిరాడంబరంగానూ వుంటాయి. బాలలకి చిత్రకళలో శిక్షణ అతి చిన్నతనంనుండే అవసరం. ప్రతి ప్రాథమిక పాఠశాలలోనూ చిత్రకళోపాధ్యాయుణ్ణి నియమించాలి. బాలలకు చిత్రకళాసాధనవలన ప్రయోజనం ఏమిటి? అనుకోవచ్చు కొందరు చిత్రకళవలన బాలలకు చక్కని దస్తూరి, తాము చేపట్టిన పనిని పూర్తిచేయాలనే పట్టుదల, తన వస్తువులను, పరిసరాలను పరిశుభ్రంగా వుంచుకోవాలనే నేర్పు లభించుతాయి. అంతేగాక పిల్లలకి తమపైన తమకు ఆత్మవిశ్వాసం ఏర్పడుతుంది. వారి సర్జనాత్మక శక్తిపై వారికి నమ్మకం కల్గుతుంది. ఇలా బాలల భవితవ్యంపైన చిత్రకళాసాధన చక్కని ముద్ర వేస్తుంది; దాన్ని తీర్చిదిద్దగల అధ్యాపకుడు లభించినప్పుడు!

ఇక మనదేశంలో "బాలల చిత్రకళ"కు గుర్తింపు, విలువ స్వాతంత్ర్యం లభించాకనే కలిగాయని చెప్పవచ్చును. ప్రఖ్యాత వ్యంగ్య చిత్రకారుడు శ్రీ శంకర్ పిళ్లై పిల్లల రచనలతోబాటు బాలల చిత్రకళలోకూడా ప్రపంచ స్థాయిలో పోటీలను ఢిల్లీలో నిర్వహిస్తున్నారు. దానిని మన ప్రథమ ప్రధాని చాచా నెహ్రూజీ చూచి అచ్చెరువు నొంది బాలల సర్జనాత్మక శక్తికి చిత్రకళకూడా 'గీటురాయి వంటి' దనుకొన్నారు. అప్పటినుండి మనదేశంలోనూ అనేక సంస్థలు (ఎకాడమీలు) బాలల చిత్రకళ అభివృద్ధికి కృషిచేస్తున్నాయి.

మనదేశంలో బాలలకి చిత్రకళ నేర్పే సంస్థలు చాలా అరుదు. అయినా బాల చిత్రకళను ప్రోత్సహించటానికి అనేక సంస్థలు ఉన్నాయి. లోగడ పంజాబ్‌లోని అమృతసర్ ఇండియన్ ఎకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్టువారు 1965-68 వరకు అఖిలభారత స్థాయిలో చిత్రకళలో పోటీలు నిర్వహించారు. తర్వాత అఖిలభారత స్థాయిలో హైదరాబాద్ ఛైల్డు ఆర్టు క్లబ్బువారు, వెల్లటూరు నవరంగ్ చిత్రకళా నికేతన్‌వారు, గోల్కొండ కేంద్రీయ విద్యాలయంవారు, తదితరులు నిర్వహిస్తున్నారు.

మన రాష్ట్రస్థాయిలో సిద్దిపేట లలితకళా సమితివారు, భీమవరం అంకాల ఆర్టు ఎకాడమీవారు, విశాఖపట్నం చిత్ర, లలితకళా పరిషత్తులవారు, విజయవాడ ఆంధ్ర ఎకాడమీవారు, మచిలీపట్నం చిత్రకళా సంసద్‌వారు పోటీలు, ప్రదర్శనలు నిర్వహించి ప్రోత్సహిస్తున్నారు.

బాలలకు చిత్రాలు వేయటం ఇష్టమే **అయినా ఎలాంటి చిత్రాలు వేయాలి? ఎలా వేయాలి? అనేది పెద్ద సమస్య! కొందరు** బాలలు తాము చూసినవానిలో తమకు నచ్చిన, తాము మెచ్చిన 'బొమ్మల'ను వేయాలని ప్రయత్నిస్తారు. కుదరకపోతే వాటిమీదే ట్రేస్ తీసి తాము వేసినట్లుగా సంతోషపడతారు. కానీ, అది సరైన పనికాదు. బాలలు రోజూ ఎన్నో పనులు చేస్తుంటారు. ఎన్నో సంఘటనలు, వస్తువులు, విషయాలు చూస్తుంటారు. ఆడుతారు, పాడతారుకదా! అవన్నీ తమ అనుభవంలోకి తెచ్చుకోవాలి. అందులో తనకు పరిచితమైన వస్తువును, విషయాన్ని సంఘటనను చిత్రించటం మంచిది.

మనం యింట్లో నిత్యం వాడుకొనే వస్తువులు, మన సౌకర్యానికి అమర్చుకొన్న పనిముట్లు అంటే బల్లలు, కుర్చీలు, ఇళ్లూ, వాకిళ్లూ, గుళ్లూ-గోపురాలు మొదలు ఇంట్లో మనం కాఫీ తాగే కప్పులు, సాసర్లు, కెటిళ్లు, గ్లాసులు ఇంకెన్నో అందమైన వస్తువులు వుంటాయి. వాటిని వేయటం సంతోషమైన విషయమేగదా! వాటి సముదాయాన్ని అందంగా చిత్రించటంకూడా ఒక గొప్ప కళ! దీన్ని "అబ్జక్ట్ డ్రాయింగ్" అంటారు.

మన సంస్కృతి చాలా పురాతనమైనది!



'సంక్రాంతి'
ఎస్. కృష్ణవేణి (14) వెల్లటూరు

అమ్మలాగ అగుపిస్తుం
దా మామిడిచెట్టు నాకు
కొమ్మ కొమ్మ నందముగా
కోటి చిన్న బిడ్డలతో.
ఎండబడిన వా రందరికి
నెంతో ప్రేమ చేరబిలచి
నీడ నొసగి సేద దీర్చి
నిశ్చలముగ నిలిచియుండు.
త్యాగము ఓరిమి ప్రేమయు
బాగుగ నెరిగిన తల్లి
అమితముగ పేరుగన్న
మంచియమ్మ మామిడమ్మ.
-బి. వి. నరసింహారావు

గొప్పది! మన పూర్వులు మనకోసం ఎన్నో వేదాలు, పురాణాలు, ఇతిహాసాలు, కథలు, గాథలు వ్రాసియిచ్చి వెళ్లారు. వాటినిండా ఎన్నో ఇతివృత్తాలు. వాటిని మనం చక్కగా చిత్రించవచ్చును గదా? ఇంతేగాక సమాజ పరంగా చూస్తే-మనం ఎన్నో పండుగలు, పర్వాలు, ఉత్సవాలు చేసుకొంటున్నాము. ప్రాంతానికో ఆచారం, వ్యవహారం. అన్నీ ఆకళింపు చేసుకొంటే ఎన్నో చక్కని చిత్రాలు వెయ్యవచ్చును. నేడు శాస్త్రవిజ్ఞానం ఎంత గానో వెల్లివిరుస్తున్నది. ఇది రోదసీ యుగం. మానవుడు ప్రకృతిని జయించటానికి చేస్తున్న ప్రయోగాలు అప్పుడప్పుడు మనం పత్రికల్లో చూస్తున్నాము; రేడియోలో వింటున్నాము. అవన్నీ మనం జీర్ణం చేసుకొని చిత్రిస్తే మన సమకాలీన జీవనానికి దర్పణం పట్టినవారం అవుతాం గదా ?

ఇకపోతే మాధ్యమం (రంగుల మీడియం) : బాలలకు మరీ చిన్నతనంలో అనగా 9 సం॥ లోపువారికి వాక్సు, క్రేయాన్సు, ఆయిల్ ప్యాస్టెల్సు ఉపయోగించటం చాలా సులభం ! వాటిని సరాసరి పేపరుపైన వాడ వచ్చును. వాటికి కుంచెలూ, రంగుపాత్రల పని లేదు.

నీటిరంగులు : ఇవి 9 నుండి 12 సం॥ల వారికి అనుగుణంగా వుంటాయి, ఈ రంగులు ఎంతో ఆకర్షణీయమైనవి. నీటిరంగులు బిళ్ల ల రూపంలోనూ, ట్యూబుల ఆకారంలోనూ లభించుతాయి. వీటిని నీటితో పలుచగా కలిపి కుంచెతో వేయాలి. సాబిల్ హెయిర్ బ్రష్షులు చక్కగా పాయింట్ వస్తాయి. చిత్రాన్ని వేయటానికి కనీసం రెండు కుంచెలు అయినా కావాలి. వీటికి నెం. 1, 3, 5 అనువైనవి.

13 నుండి 16 సం॥ల వయస్సుగల బాల బాలికలకు పోస్టర్ కలర్సు, టెంపరా కలర్సు చాలా బాగా వుపయోగపడతాయి. ఈ రంగులు కూడా నీటితో కలిపి కుంచెతో వేసేవే! వీటిని నీటిరంగులవలె మరీ పలచగా కాకుండా కొంచెం మందంగా కలిపి వాడితే మనం రంగు వేయవలసిన ప్రదేశం (సర్ఫేస్) ను ఒక్కసారితో చక్కగా నింపివేయవచ్చును. వెలుగునీడలు కావాలంటే కొంచెం పలుచగా కలుపుకోవాలి. ఈ రంగులు ఎంతో నిండు గానూ, గంభీరంగానూ వుంటాయి. చిత్రానికి ఈ రంగులు వేసి ప్రతి భాగానికి అవుట్ లైను దిద్దితే చక్కగా వుంటాయి.

తైలవర్ణాలు :-16 సం॥ల నుండి పైవారు ఆయిలు కలర్సుకూడా వాడవచ్చును. ఇవి కూడా ట్యూబులలో సరఫరా చేయబడు తాయి. ఈ రంగులను "లిన్ సీడ్ ఆయిల్", "టర్పంటైను" (అవిసినూనె-కర్పూరతైలం) కలిపి వాడాలి. వీటికి ప్రత్యేకమైన కుంచెలు ఉంటాయి. ఈ రంగులు కలుపుకోటానికి

పాలెట్ (చెక్కఫలకం), చాకు వుపయోగిస్తారు. ఈ రంగులు మామూలు డ్రాయింగ్ పేపరుపైన గాక కాన్వాసు (ఒకరకం గుడ్డ) లేక 'ఆయిల్ స్కెచ్చింగ్ పేపరుపై వాడతారు. ఈ రంగులతో చక్కని వెలుగునీడలను, దూరతీరాలను చూపించవచ్చును.

ఇక చిత్రాన్ని ఎలా వేయాలి? మనం ఒక చిత్రాన్ని వేసేముందు, వేయదలచిన భావాన్ని పూర్తిగా మనఃఫలకంపైన రూపుదిద్దాలి. అంటే బాగా వూహించాలి! ఆ భావాన్ని మొదట చిన్న కాగితంపైన "స్కెచ్" వేసుకోవాలి. దాన్ని మాస్టారికి చూపించి, వారి సలహాలను పొంది పెద్దసైజు పేపరుపైన (కావలసిన సైజు) పెన్సిల్‌తోగానీ, సరాసరి రంగులలోగానీ వేయాలి. మొదట తేలికగా స్కెచ్ వేసుకొని దాన్ని తర్వాత రంగులతో పూర్తిచేయాలి. ఈ పేపరును ముందు కదలకుండా ఒక డ్రాయింగ్‌బోర్డుకు పిన్నులతో బిగించాలి. చిత్రానికి రంగులు వేయటం పూర్తిఅయిన తర్వాత నల్లరంగుతోగానీ, మరి ఏదైనా ముదురురంగుతోగాని "అవుట్‌లైను" దిద్దితే బాగుంటుంది.

పైది సంప్రదాయ పద్ధతి. అయితే ఇప్పుడు చిత్రకళలో అనేక ఆధునిక పద్ధతులు వెలసినవి! అసలు 'బాల చిత్రకళ' నుండే ఆధునిక చిత్రకళ ఉద్భవించినది. ఎందువలనంటే బాల చిత్రకళలో ఎంతో స్వేచ్ఛ, స్వాతంత్ర్యం వుంటుంది. వారి చిత్రాలలో విషయానికన్నా రంగుకి ప్రాధాన్యం వుంటుంది. దీన్ని నేడు ఎంతోమంది పెద్దపెద్ద చిత్రకారులు ఉపయోగించుకొంటున్నారు. బాలలు కేవలం రంగులతోనేగాక ఈనాడు వివిధ పదార్థములతోనూ చక్కని చిత్రాలు తయారుచేస్తున్నారు. చిత్రలేఖనానికి రంగురంగుల గుడ్డపీలికలు, ఈకలు,



'త్రిజట స్వప్నం'
పి. భూలక్ష్మి (16) వెల్లటూరు

ఇసుక, గాజుపెంకులు, రంగు తగరములు, రజము, చమ్‌కీ వాడుతున్నారు. వీటిని అంటించటానికి జిగురు వాడతారు. ఇలాటి చిత్రాలను "కొల్లేజి" అంటారు.

ప్రస్తుతం మన తెలుగు బాలలు అనేక బాల చిత్రకళాపోటీలలో గణనీయమైన బహుమతులు పొందుతున్నారు. ముఖ్యంగా బాల చిత్రకారులు గోల్కొండ కేంద్రీయ విద్యాలయంనుండి, వెల్లటూరు నవరంగ్ చిత్రకళా నికేతన్‌నుండి తయారు అవుతున్నారు. ఇవిగాక రాజమండ్రి రామారావు ఆర్టు స్కూలు, కాకినాడ ప్రభుత్వ బధిరుల పాఠశాల, సిద్దిపేట, విజయనగరం, గుంటూరు, మచిలీపట్నం, భీమవరం పరిసర ప్రాంతాలలోనూ తయారు అవుతున్నారు. ఇలాంటివారిలో కొందరు బాల చిత్రకారులను, వారు వేసిన చిత్రాలను పరిచయం చేస్తాను.

గుడిలోన జేగంట
గణగణ మ్రోగింది
వడివడిగ అందరూ
గుడిలోని కేగారు!
అమ్మ వడిగాను "నే
ఒత్తాను నీతోను"
"ఒద్దు బాబూ చాల
రద్దిగుంటా" దంది.
మారాముచేసి మా
అమ్మతో వెళ్లాను
గుడిలోన దేవుణ్ని
కొలిచి సేవించాను.

-తాళ్లపూడి వెంకటరమణ

గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకా వెల్లటూరులో తయారైన బాల చిత్రకారులను గురించి తెలుసుకొందాము. అక్కడ వున్న నవరంగ్ చిత్రకళా నికేతన్ తరఫున ఈ వ్యాస రచయిత శిక్షణలో 1968 నుండి అనేకమంది బాల చిత్రకారులు ప్రశంసనీయమైన విజయాలను సాధించారు. వరుసగా చెప్పాలంటే పి. అరుణకుమారి అనే 10వ తరగతి బాలిక వేసిన "పల్లెపడుచు" అనే నీటిరంగుల చిత్రానికి హైదరాబాద్‌లో జరిగిన లాల్‌బహాదూర్ స్మారక బాల చిత్రకళా పోటీలో స్వర్ణపతకం లభించినది. ఈమెకే 1968 లో స్టాండర్డ్ కన్ఫెక్షనరీ కంపెనీవారు నిర్వహించిన "కలరింగ్ కాంటెస్టు"లో ప్రథమ బహుమతి "సైకిలు" లభించినది. చి॥ వి. రఘువేశ్వరరావు (15 సం. అప్పుడే అమృత్‌సర్‌లో జరిగిన చిత్రకళా పోటీలో ఒక ప్రథమ బహుమతినీ, పుంగనూరులో జరిగిన రాష్ట్రీ బాల చిత్రకళ పోటీలో ఒక రజత పతకాన్ని పొందాడు. తర్వాత ఇతడు హైదరాబాద్ ఫైన్ ఆర్టు కాలేజీలో కమ్మర్షియల్ ఆర్టులో డిప్లమో పొంది ప్రస్తుతం హైదరాబాద్‌లోనే 'ఆర్టిస్టు'గా పనిచేసున్నారు. అతని సహపాఠి అయిన యస్. చలపతిరావు కూడా చక్కని ఊహా చిత్రాలను వేసేవాడు. ఇతను కూడా అమృతసర్ బాల చిత్రకళ పోటీలోనూ, విశాఖపట్నం వెల్లటూరు పోటీలోనూ బహుమతులు పొందాడు. ప్రస్తుతం విశాఖపట్నం షిప్‌యార్డు సాంకేతిక విభాగంలో పనిచేస్తున్నారు. మరో విద్యార్థి చి॥ కె. ధనంజయరావు 1969 లో జరిగిన ఒలెంపిక్ ఆటల పోటీల సందర్భంలో నిర్వహించబడిన అంతర్జాతీయ బాల చిత్రకళ పోటీకి వేసిన "హాకీప్లే" అనే చిత్రానికి "గ్రండిగ్" రేడియోను బహుమతిగా పొందినాడు.

అతర్వాత 1970 నుండి తయారైన బాల చిత్రకారులలో పి. భూలక్ష్మి (16), వి. శాంతిశ్రీదేవి (15), బి. రామమోహనరావు (15), ఎస్. కృష్ణవేణి (14) ఎస్. మధుసూదనరావు (15), వి. బసంత్‌కుమార్ (12), వి. విజయకుమార్ మొదలైనవారు పేర్కొనదగిన



బొమ్మల కొలువు:
నవరంగ్ చిత్రకళా నికేతన్, వెల్లటూరు

చగినవారు. వీరిలో పి. భూలక్ష్మికి భీమవరము, సిద్దిపేట, వెల్లటూరులలో జరిగే చిత్రకళా ప్రదర్శనములలో ప్రథమ బహుమతులు లభించినవి. తర్వాత ఈమె 2 సం॥లు హైదరాబాద్ ప్రభుత్వ లలితకళాశాలలో శిక్షణ పొందినది. వి. శాంతిశ్రీదేవి తన 9 వ ఏటనే జపాను అంతర్జాతీయ బహుమతిని పొందినది. 1973 లో ఈమెకు అఖిలభారత స్థాయిలో జరిగిన బాల చిత్రకళాపోటీలో స్వర్ణ పతకము లభించినది. తర్వాత ఈమె శంకర్స్ అంతర్జాతీయ బాల చిత్రకళ పోటీలోనూ, న్యూట్రిన్ కలరింగ్ పోటీలోనూ, భీమవరం, పాలకొల్లు, సిద్దిపేట మొదలైనచోట్ల అనేక బహుమతులు పొందినది. ప్రస్తుతం గుంటూరు ప్రభుత్వ స్త్రీల కళాశాలలో ఇంటర్ చదువుచున్నది.

ఇంకనూ యస్. కృష్ణవేణి, ఇ. బి. టి. సుంద కూడా చక్కని చిత్రాలు వేశారు.

ఇక గోల్కొండ కేంద్రీయ విద్యాలయం లో ప్రముఖ చిత్రకారులు శ్రీ బి. ఎ. రెడ్డిగారి శిక్షణలో అనేకమంది బాలబాలికలు చిత్ర కళలో ఘనవిజయాలను సాధించారు. వారి దేశంలో బాల చిత్రకళ పోటీల్లోనేగాక ప్రతి ఏటా జపాను, రష్యా, శంకర్స్ అంతర్జాతీయ పోటీల్లో బహుమతులు లభిస్తుంటాయి. ముఖ్యంగా వారి పాపలు పద్మారెడ్డి (18), సుధారెడ్డి (11) ప్రతిసంవత్సరం శంకర్స్ పోటీల్లో బహుమతులు పొందుతూంటారు. మరి మీరూ తీరిక వేళ చక్కని చిత్రాలు వేసి మంచిమంచి బహుమతులు పొందాలి.



తిరుపతి జోగి: వి. శాంతిశ్రీదేవి (14) వెల్లటూరు

# పిల్లల నాటికలు ఎలా ఉండాలి?

వి. ప్రభావతి

ఏ నాటికి అయిననూ పిల్లల పరిభాష నుండి వారికి జ్ఞానమును పెంపొందింప జేయుట అవసరము.

పసిహృదయులు బాలురు. వారిలో జిజ్ఞాస మెండుగా ఉంటుంది. లోకమునందలి ప్రతి విషయాలను తమ చిన్నారి మనస్సుతో అర్థము చేసుకొని తమ చిన్నారి మాటలతో పలుకవలెనని తలుస్తారు. అనగా వారిలో చూచినదానిని అనుకరించవలెనను ధ్యాస మెండుగా ఉంటుంది: అందులకే పిల్లలకు ఉదాత్తమైన విషయములను బోధించవలెనను నానుడి యేర్పడినది. వీరికి కంటికి అందముగా కనబడు వస్తువులపై ఆకర్షణ మెండుగా ఉంటుంది. అందులకే పిల్లలకు పఠనీయములగు కావ్యములకంటె దృశ్యములగు నాటికలపై మోజు అధికముగా ఉండుంది. గాంధీజీ తన ఆత్మకథలో తాను చిన్నతనమున సత్య హరిశ్చంద్రుని నాటకమును, శ్రావణకుమారుని పితృభక్తి నాటకమును చూచిన పిమ్మట అవి తన హృదయములో శాశ్వతముద్ర వేసినవని వ్రాసినాడు:

కావ్యములు దృశ్యములని, శ్రవ్యములని రెండువిధములు. ఇందు దృశ్యములకే రూపకములని నామాంతరము. పాత్రలు రూపమును ధరించుదురుగావున వీనికి రూపకములని పేరు వచ్చినది. మొదట మన తెలుగుదేశమున వెలువడిన నాటికలు సంస్కృతసంప్రదాయము ననుసరించి నాందీప్రస్తావనాది నియమములతో బరువుగా వెలువడినవి. ఇవి పిల్లలకుగాక కేవలము సాహిత్యవేత్తలకు మాత్రమే అందుబాటులోనున్నవి. కాని ఆంగ్ల సంప్రదాయము తెలుగు సాహిత్యముపై ప్రభావము చూపిన పిమ్మట సంస్కృత నాటక లక్షణములను నడలి కొత్తనియమములలో తేలికయగు 'నాటికలు' ఏర్పడినవి. ఇందు అంక విభజనము బదులుగ రంగవిభజనము ఏర్పడినది. క్రమముగా ఇందు 'ఏకాంకికలు' కూడ యేర్పడినవి. కేవలము పఠన యోగ్యములగు కావ్యములకంటె దృశ్యరూపములగు ఈ నాటికలపై పిల్లలకు ఆకర్షణ ఎక్కువగా ఉంటుంది. కావ్యములను తమంతట తాము చదివి అర్థము చేసికొనుట కష్టమేగాక ఒక్కొక్కప్పుడు వ్యతిరేకభావముకూడ వారికి ద్యోతకమగును. ఒకొ్కక్కప్పుడు వారికి విసుగుకూడ జనించును. కాని నాటికలలో సంభాషణ రూపమున అర్థము స్పష్టపడుటయే గాక పాత్రపరముగా చెప్పబడుచుండుటచే పిల్లలకు ఆనందము ఎక్కువగా కలుగుటకు-

అవకాశము కలదు. అంతియేగాక ఏ విషయమైనను 'నాటికల' రూపమున బోధించుటచే వారికి జ్ఞాపకము కూడ ఎక్కువగా నుండును.

సాధారణముగా వెలువడిన సాహిత్యమును అర్థము చేసుకొను శక్తిలేనివారు బాలురు. అందులకే వారికి ప్రత్యేక సాహిత్యము చాల అవసరము. వారి వయస్సునకు, జ్ఞానమునకు, అభిరుచులకు అనుగుణముగా నాటికలను సృష్టించుట ముఖ్యము. అంతియేగాక ఆ నాటికలు కేవలం ఆనందమిచ్చుటేగాక పసిహృదయములను వికసింపజేయునవి, వారికి ముందు మార్గమును చూపునవికూడ నై యుండవలెను. అట్టి ప్రయోజనము కలిగియున్ననాడే మనము పిల్లలను అభివృద్ధిపరచువారము కాగలము.

ఇట్టి పిల్లల నాటికలు ఎట్లుండవలెనను విషయము ముఖ్యముగా గమనింపదగినది. ఏ నాటిక అయినను ముఖ్యముగా బాలుర జ్ఞాన శక్తికి మించి యుండరాదు. అది సుదీర్ఘమై విసుగు జనియింప సీయరాదు. ఈ నాటికలు ముఖ్యముగా ఆనందమును కలిగించునవియై వీరికి ఉత్సాహమును అధికమునుచేయునవియై ఉండవలెను. పిల్లలను ముఖ్యముగా ఆకర్షించునది హాస్యము, వీరము. వీరికి శృంగారమును అర్థము చేసుకొను శక్తి అంతగా నుండదు. అంతియేగాక అసభ్యమైన శృంగార రస ప్రధానములైన సన్నివేశములు, సంభాషణలు కూడ బాలుర భవిష్యత్తుకే గొడ్డలిపెట్టు కాగలవు. అందులకే అసభ్యమైన, ఆవేశకరమైన సన్నివేశములను, సంభాషణములను తొలగించుట చాల అవసరము. ఈ నాటికలు కేవలము ఆనందమునేగాక సర్జనాత్మకమైన భావనల పెంపొందింపజేయుట అత్యావసరము. ఆ శక్తి పెంపొందింపజేయుటకు వారికి కథలో, సంభాషణలో మిళితమై తల్లి ఆదరముతో ఉగ్గును త్రాగించునట్లుగా బోధించుట ప్రధానమైన విషయము. శివాజీ తల్లియైన జిజియాబాయి అట్లు బోధించుటవలననే శివాజీ అట్టి వీరుడయ్యెనని తెలియుచున్నది కాలము మారిన నేడు కేవలము మత, భక్తి వీర, శృంగార, హాస్య రస ప్రధానములైన నాటికలకంటె ప్రస్తుతకాలమునకు అనుగుణమైన నాటికలు వెలువడుట చాల ముఖ్యము. భావి పౌరులైన బాలురకు ప్రస్తుత దేశకాల పరిస్థితులను అనుసరించి ఉత్తమ జ్ఞానమును పెంపొందించునవిగా నుండవలయును. అవి విజ్ఞానశాస్త్రమును కూడ బోధించునవియై యుండుట చాల అవసరము.

నేటికాలమున ఈ నాటికలు నాలుగు రూపములలో ముఖ్యముగా కానవచ్చుచున్నవి. 1. ఆకాశవాణి నాటకములు, 2. రంగస్థల ప్రదర్శనీయములు, 3. టెలివిజను నాటికలు, 4. పఠనీయ నాటికలు. ఈ నాలుగు రూపములందును నాటికలు వెలువడుట చాలముఖ్యము.

1. పఠనీయ నాటికలు :-ఇవి కేవలము చదువుటకు వీలయినవి. ప్రదర్శనీయమంత ఆకర్షణను పిల్లలలో కలిగించదు. కాని ఇవి ముఖ్యముగా ఇతర నాటికలకంటె పిల్లలకు



తెలుగు పాపా రావె
పూలుగొని పోవే
పూజనీయులు వీరు
పూజించి పోవే.
అఖిలాంధ్ర జగతికే
ఆనంద మొసగు
అక్టోబ రొక్కటీ
అరుదెంచె నమ్మా!
మెలకువలో గాని
కలలోన గాని
మన జాతి నాయకుల
మరువదగ దమ్మా.
—మధురాంతకం రాజారామ్

ఏకాగ్ర శక్తిని, ఆలోచనాశక్తిని పెంపొందించునని చెప్పుటలో అతిశయోక్తి కానరాదు. ఒంటరిగా కూర్చుని ఆ నాటికను చదివి అర్థము చేసుకొనవలసిన అవసరము పిల్లలపై నుండుటచే తమంతటతాము బాగుగా ఆలోచించుశక్తి వారికి ఏర్పడును. బుద్ధివికాసమునకు, స్వతంత్ర శక్తికి ఇది చాల అవసరము. అంతియేగాక రకరకముల మనస్తత్వముగల పిల్లలలో కొందరికి ఒంటరిగా కూర్చొనుట, ఆలోచించుట, పఠించుట ఇష్టముగా నుండును. అట్టి వారికి ఈ నాటికలు చాల అవసరము. అందుచే ఇవి సుదీర్ఘములుగాక సంభాషణములు తేలికగా సాగుచు ఉండవలయును. కంటికి ఎదురుగ పాత్రలు కానరావు. కావున పిల్లలు తామే చదువుచు అర్థము చేసుకొను అవసరము కలుగును. బాలసాహిత్య కావ్యము లెన్నియో ఉండగా పఠనీయములగు నాటికల ప్రయోజనమేమి యను ప్రశ్న జనించును. ఇందు కథ స్పష్టముగా తెలియుచు కథ కావ్యములో వలె మరుగుపడి యుండదు. అందుచే ముఖ్యమైన ఆకర్షణ వారికి కలుగును. ఇవి వారిలోని సర్జనాత్మక శక్తిని పెంపొందించును. గౌతమ బుద్ధుని తండ్రి కేవలము సంతోషకరమైన విషయములనుమాత్రమే చూపి లోకధర్మములను మరగుపరచి గౌతమబుద్ధుని పెంచుటచేతనే జ్ఞానము వచ్చిన ఆ బాలుడు లోకమునందలి కష్టములను చూచి తట్టుకొనలేని స్థితి యేర్పడినది. అందుచే నాటికలు సర్వవిషయములు ఆకళింపుచేయునవిగా నుండవలయును. ప్రసిద్ధములగు పురాణగాథలను తెలియపరచుచు ప్రస్తుత సాంఘిక, దేశకాలపరిస్థితులను తెలియపరచుచుండవలెను. దానివలన బాలురు కేవలము ఆలోచనాపరులుగనేకాక దేశభక్తులుగను, శాస్త్రవిషయవేత్తలుగను తయారగుటకు అవకాశము కలదు.

2. ఆకాశవాణి నాటికలు : ఇవి కేవలము శ్రవణయోగ్యములైనవి. పిల్లలు కొందరు ఇందు పాల్గొనుటకుకూడ అవకాశము ఎక్కువగా నుండును. ఇవి కంటితో చూచుటకు సాధ్యముకానివైనను నేటి బాలబాలికలకు వీనిపై ఆసక్తి మిక్కుటముగా కానవచ్చుచున్నది. ఇవి కథాపటుత్వముపైనను, భావనా చమత్కారముపైనను, సంభాషణచాతుర్యముపైనను ఆధారపడియుండును. వినుచున్న బాలురు ఆ నాటికలో లీనమై తామే ఆ పాత్రలుగా భావింతురు. ఇట్లు భావించుట నాటికలో నటించు పాత్రల నటన సామర్థ్యముపై ఆధారపడియుండును. నటించు బాలురలో ఉత్సాహమధికమై, భావనాబలము పెంపొంది ఉచ్చారణ దక్షత ఏర్పడును. ఈ నాటికల వలన నటించువారితోపాటు వినుచున్న పిల్లలకు ఉపయోగ మెక్కువగా నుండును. కొందరు పిల్లలు సహజముగా ప్రతిభాశక్తి తగి

నంత లేకయుండురు. అట్టివారికి పఠనీయము లగు నాటికలవలన ప్రయోజనము తక్కువగా నుండును. అందుచే అట్టివారికి ఈ రేడియో నాటికలు చాల అవసరము. అంధులగు బాలు రకు కూడ ఈ నాటికలవలన ఉపయోగమెక్కువ. పఠనీయ నాటికలనే ఆకాశవాణి నాటికలుగా మార్చుటకు అవకాశము కలదు. ఇవి సాధార ణముగా పదునైదు నిమిషములనుండి ముప్పది నిమిషముల వరకు నుండును. ఆ కాలము లోనే అవసరమగు కథనంతను నడిపి, అనవసర ములగు సంభాషణలు, వ్యర్థమగు కథను వదలి వేయవలయును. కథావస్తువులో పఠనీయను లగు నాటికలకు, వీనికి పెద్ద భేదము కాన రాదు. దానివలెనే ఇచ్చట ఆకార, రూప రేఖాదుల, వస్త్రధారణాదుల అవసరము కాన రాదు.

3. టెలివిజను నాటికలు : రేడియో నాటి కలకంటె పిల్లలకు ఆసక్తిని పెంపొందించునవి, ఆనందమును కలిగించునవి ఈ నాటికలని చెప్పవచ్చును. ఇవి ప్రదర్శనీయ నాటకముల వలె కంటితో చూచుటకు అవకాశముండును. అట్టియెడ ఇందు పాత్రల అర్హతనుబట్టి వస్త్ర ధారణము చాల అవసరము. రాజుపాత్ర ధరించువాడు సామాన్యునివలె కనబడినచో పిల్లలకు అభిరుచి తగ్గిపోవును. వారు ఎన్నడును చూడకపోయినను నాటికయందలి పాత్రలను బట్టి వారిట్లుందురని ఊహించుకొని హృదయ ముపై శాశ్వతముద్రవేసుకొందురు. అట్టివిషయ ములనుండి వారిని మరలించుటకూడ చాల కష్టము. మనము అబద్ధము చెప్పుచున్నామని భావింతురు. అందుచే పాత్రోచిత వేషధార ణము, సంభాషణము చాల ముఖ్యము. అంతియే గాక కంటికి ఇంపగు రంగురంగుల వస్త్ర ములు, అలంకరణము వలన వీరికి ఆనందము మిక్కుటముగా కలుగును. కథ అర్థము చేసు కొనలేనివారు కూడ సినిమాలను చూచుటలో విశేషమిదియే! కాని టెలివిజను నాటికలలో పాల్గొనుటకుకాని వానిని చూచుటకుకాని అంద రకును వీలుపడదు. ధనవంతులకు మాత్రమే ఇది వీలగు విషయము. అందుచే ప్రభుత్వము వారు ప్రభుత్వ సంస్థలలో, పంచాయతీ ఆఫీసు లలో టెలివిజను సెట్లు ఏర్పాటు చేయవలెను.

4. దృశ్య నాటికలు : అన్ని నాటికల కంటె యోగ్యములైనవి రంగస్థలముపై ప్రదర్శించు నాటికలు. ఇందు రంగస్థలము ప్రధానమైనది. పిల్లలందరు తమ కంటితో చూచి ఆనందించుటకు అవకాశము కలదు. పఠించునప్పుడు కొన్ని భావములు కలుగగా అత డెట్లుండునో అన్న భావము కలుగును. వీనిని చూచినచో పిల్లలు తమ కన్నుల ఎదుట నిజముగా ఆ కథ జరుగుచున్నట్లు భావిం తురు. అందుచే వారి హృదయముపై ప్రభా వము మెండుగా పడును. ఇవి టెలివిజను నాటికల కంటె యోగ్యమైనవి. టెలివిజన్ నాటికలు ముందే రికార్డు చేయబడి యుండు టచే జనులందరి యెదుట నిలబడి పిల్లలు ప్రద ర్శించు అవకాశము లేదు. కాని దృశ్యములలో ప్రదర్శించువారు పలువురి యెదుట ప్రదర్శిం చుటచే భయము తగ్గి ధైర్య సాహసములు, సంభాషణ చాతుర్యము పెంపొందించుటకు అవకాశము హెచ్చుగా నుండును.



# బాల సాహిత్యంలో బహుమతి పొందిన గ్రంథాలు

– రెడ్డి రాఘవయ్య

బహుమతుల పేరుతో పెక్కు గ్రంథాలు వెలుగులోకి వచ్చాయి; బాల సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి. బాల సాహిత్యంలో విశిష్ట స్థానాన్ని సంపాదించు కున్నాయి.

సాహిత్యంలో ఉత్తమ గ్రంథా లేవో నిర్ణయించటానికి, ఒక ప్రత్యేక శాఖలో విరివిగా సాహిత్య సృష్టి జరగటానికి బహుమతులు తోడ్పడతాయి.

బాల సాహిత్యంలో గ్రంథాల సంఖ్య చాలా స్వల్పం. మొదట్లో దీనికి ఆదరణగూడా ఉండేది కాదు. తరువాత పోటీలు వచ్చాయి. వీటి ద్వారా నయినా కొన్ని గ్రంథాలు పెరిగాయి.

### తెలుగు భాషా సమితి

మొట్టమొదట బహుమతుల ఆనవాయితీ ప్రారంభించింది తెలుగు భాషా సమితి. ఈ సమితిని ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో 1947 లో స్థాపించారు. ప్రజలకు ఉపయోగమైన వాఙ్మయ సృష్టికి ప్రోద్బలం కలిగించాలని మద్రాసు ప్రభుత్వం గ్రంథ రచన పోటీలు జరుపవలసిందిగా సమితిని ఆదేశించింది.

ఆ సమయంలో అంటే 1948 - 49 లో వివిధ సాహిత్య విజ్ఞాన శాస్త్ర గ్రంథాలతో పాటు, మాగంటి బాపినీడుగారు వ్రాసిన "పిల్లల బొమ్మల భారతా"నికీ, డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు వ్రాసిన 'బాలానందా'నికీ బహుమతు లిచ్చారు. డా॥ గిడుగు వేంకట సీతాపతిగారు 1907 ప్రాంతంలోనే "రైలు బండి, చిలుకమ్మ పెండ్లి" అనే గేయాలు వ్రాశారు. ఇవి బాల బాలికలలు రాగయుక్తంగా పాడుకోవటానికి అనువుగా వున్నాయి. ఈ రెండు గేయాలూ, ఇంకా కొన్ని గేయాలూ, కథలూ కలిపి 'బాలానందం' ప్రచురించారు.

రైలు బండి ప్రయాణాన్ని "రైలు బండి" అనే గేయంలో వర్ణించారు.

"మదిలో పుట్టిన ఊహాలకంటే
మంటలు లేచిన పొగనుడికంటే
వడివడిగా దడదడగా..."

రైలుబండి కదలిపోతున్నదట.....ఇటువంటి ఊహాలు వారి గేయాల్లో చాలా కనిపిస్తాయి.

### ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ బహుమతులు

1953 లో ఆంధ్ర ప్రభుత్వం ఏర్పడింది. ఆ పిదప అది ఆంధ్రప్రదేశ్ గా రూపొందింది. ఈ ప్రభుత్వం కూడా కొన్ని బాల సాహిత్య గ్రంథాలకు బహుమానాలిచ్చింది. వాటిలో

చెప్పుకోదగినవి: శ్రీమతి పి. సీతారాజ్యలక్ష్మి వ్రాసిన "పిల్లల నాటికలు". తెలుగులో పిల్లల కోసం నవలారచన సాగించిన ఆద్యులు శ్రీ చింతా దీక్షితులుగారు. వారి "లీలాసుందరి", "బంగారు పిలక", యస్. యల్. నరసింహా రావుగారి "జంతుపురాణం", డాక్టర్ గుంటు పల్లి రాధాకృష్ణమూర్తిగారి "విజ్ఞానం", వేజెండ్ల సాంబశివరావుగారి "ముద్దుపాటలు". మంచి నవలలు. 'జంతుపురాణం', 'విజ్ఞానం' రెండూ విజ్ఞానశాస్త్ర గ్రంథాలు. మొదటిది పిల్లలకు జంతువులనుగురించీ, రెండోది భౌతికం గా మనకు లభిస్తున్న విద్యుచ్ఛక్తి, టెలిఫోను, రేడియో, సినిమా మొదలైనవాటిని గురించీ వివరిస్తూ, దేవుడున్నాడా? అని ప్రశ్నిస్తూ, ఉన్నాడని రకరకాల మహాత్ముల గురించి చెబుతూ, "ఈ ప్రపంచం అంతా ఒక కుటుంబం. మనమందరం ఒక కుటుంబంలోవాళ్లం. నాన్నా వాళ్ల కాలం అయిపోవచ్చింది...ఇక వచ్చేది మన కాలమే...మన దేశాన్ని ముందుకు నడి పించాలి, పదండి ముందుకు" అంటూ బాల లను ఉద్బోధిస్తుంది.

బాలలు పాడుకోవటానికి అనువైన తువ్వాయి, ముద్దు, ఋతుగానం మొదలైన ముద్దుముద్దు పాటలెన్నో ఉన్నాయి "ముద్దు పాటలు"లో. వీటిలో హాస్యగీతాలూ, విజ్ఞాన వినోదదాయకాలూ, నీతిబోధకాలూ, చాలా ఉన్నాయి.

## దక్షిణ భాషా పుస్తక సంస్థ

దక్షిణ భారత భాషల్లో శాస్త్ర విజ్ఞాన గ్రంథాలూ, బాలసాహిత్య గ్రంథాలూ ప్రోత్సహించి ప్రచురించాలనే ఉద్దేశ్యంతో 1955 లో దక్షిణ భాషా పుస్తకసంస్థ ఏర్ప డింది. ఈ సంస్థ కూడా కొన్ని పుస్తకాల పోటీలు నిర్వహించింది. యస్. యల్. నర



సింహారావు "జంతుదర్శనం", వారణాసి సత్యనారాయణమూర్తి "అల్లరిగోపి అద్భుత యాత్ర", మిరియాల రామకృష్ణ "బాలాభి రామం" (గేయాలు), వెలగా వెంకటప్పయ్య "విజ్ఞానలోకం" అనే బాలల పుస్తకాలు బహు మతు లందుకొన్నాయి.

"అల్లరిగోపి అద్భుతయాత్ర" పిల్లల నవల. అల్లరిగోపి అనే పిల్లవాడు సీతాకోకచిలుక మాహాత్మ్యం వలన చీమంతవాడై పోయి రక రకాల లోకాల్లో యాత్రలు సాగించటం రచ యిత అద్భుతంగా వర్ణించారు. ప్రఖ్యాత చిత్రకారులు బాపు రంగుల బొమ్మలు దీనిలో అక్కడక్కడ ముచ్చటగా ఉన్నాయి.

"విజ్ఞానలోకం" విజ్ఞాన విషయాలను తెలియజేసే కథ, టెలిగ్రాఫ్, టెలివిజన్, గ్రామఫోను, టెలిఫోను, రేడియో, శబ్దం మొదలైనవాటి పుట్టు పూర్వోత్తరాల గురించి కథలాగా పిల్లలకు అర్థమయేటట్లు సులభ శైలిలో చెప్పారు వెలగావారు.

పిల్లలగేయాల పుస్తకం 'బాలాభిరామమ్' చుట్టూ కనిపించే ప్రకృతిలో దృశ్యాలను

అక్షరాల్లో బంధించి, కవితామయంచేసి చదువుకోవటానికీ, పాడుకోవటానికీ అనువుగా మలిచారు రచయిత.

**భారత ప్రభుత్వ బహుమతులు**

బాల సాహిత్యాన్ని విరివిగా ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో భారత ప్రభుత్వం 1953-54 లో బాల సాహిత్య పోటీలు ప్రారంభించింది. ఇప్పుడు పోటీలు "జాతీయ విద్యా పరిశోధన-శిక్షణసంస్థ" ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్నాయి. ఇప్పటివరకూ 20 పోటీల్లో వివిధ తెలుగు పుస్తకాలు బహుమతులు పొందాయి.

> కాకులన్నీ కోయిల లయితే
> జొన్నలన్నీ కన్నియ లయితే
> పూవులన్నీ మా వాసమే
> తావులన్నీ మా కోసమే
> వెన్నెలంతా మా కోసమే
> వన్నెలంతా మా భాసమే.
>
> -వెన్నం

వీటిలో బాలగేయాలూ, కథలూ, గేయకథలూ, విజ్ఞానశాస్త్ర గ్రంథాలూ ఉన్నాయి. బోలెడన్ని విజ్ఞానశాస్త్ర గ్రంథాలు ఈ సంస్థ వల్ల వెలుగులోకి వచ్చాయి.

గేయాల్లో కవిరావు "బొమ్మరిల్లు", చింతా దీక్షితులు "లక్కపిడతలు" మొట్టమొదటి బహుమానా లందుకొన్నాయి. వీటితోపాటు మొట్టమొదటి తెలుగు విజ్ఞాన సర్వస్వ మనదగిన మాగంటి బాపినీడుగారి "తెలుగుతల్లి"కి కూడ బహుమతి లభించింది.

గేయకథలను ఖండగతి, మిశ్రగతి, త్రిస్రగతుల్లో నడుపుతూ మాత్రాచ్ఛందస్సులో "బొమ్మరిల్లు" కట్టారు కవిరావుగారు.

ఆటల్లో లక్కపిడతలు ప్రధాన స్థానాన్ని ఆక్రమించినట్లే పాటల్లో "లక్కపిడతలు" ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తాయి. కష్టమైన శాస్త్రవిషయాలు కూడా అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు దీక్షితులుగారు వర్ణించారు. దీక్షితులుగారు బాలవాఙ్మయబ్రహ్మలు. బాలల మన స్తత్త్వాలను వారెరిగినట్లుగా ఇంకొకరు ఎరుగరంటే అతిశయోక్తి కాదనుకుంటాను.

తరువాత పోటీల్లో "బాలన్నయ్య" న్యాయపతి రాఘవరావుగారి "బడిగంట", బి. వి. నరసింహారావుగారి "పాల బడి పాటలు", మండా సూర్యనారాయణగారి "బాల ప్రపంచం", సత్తిరాజు కృష్ణారావుగారి "పక్షి పాటలు", వక్కలంక లక్ష్మీపతిరావుగారి "స్వతంత్ర భారతి" అనే గేయ సంకలనాలు బహుమానా లందుకున్నాయి.

బాలన్నయ్యగారు రేడియోలో పిల్లలచేత పాడించిన, బాలలో ప్రచురించిన గేయాలను "బడిగంటలు"గా కూర్చారు. దీనిలో చిన్నపిల్లల్ని ఆకట్టుకొనే బుల్లి గేయాలూ, పెద్ద పాటలూ, ముచ్చటైన పదాలతో అల్లారు.

జాతీయభావాన్ని ప్రబోధించేవి ఎన్నో ఆడుకోడానికి, పాడుకోడానికి అనువుగా ఉన్నాయి.

"స్వతంత్ర భారతి"లో ప్రబోధం, నీతి, జాతీయతా మొదలైనవాటిని పిల్లలలో పెంపొందింపజేసే పాటలున్నాయి.

"రంగురంగుల రత్నదీపాలు" లో కూడా బాలాభిరామంలో లాగే ఎన్నో వగిపీలు చెక్కారు రామకృష్ణగారు.

పురాణాల్లోని మంచి కథలను కొన్నిటిని ఉత్పలవారు చక్కని శైలిలో చదివి ఆనందించేందుకు వీలుగా, గేయకథలుగా చెప్పారు.

అవే ఉత్పలమాలలోని గంగావతరణము, క్షీర సాగర మథనము, శమంతకమణి కథలు. "దాస్యవిముక్తి"లో గరుత్మంతుడు అమృతాన్ని తెచ్చి తన తల్లికి నాగులవద్దనున్న దాస్యాన్ని పోగొట్టటం ఇతివృత్తంగా గల కథ. దీనిలో ఆచార్యులవారు గరుత్మంతుడి మాతృభక్తిని, అతడి పట్టుదలనూ చాలా చక్కగా వర్ణించారు

బహుమతులు పొందిన గేయసంపుటిలో "పాలబడి పాటలు"ది ఒక ప్రత్యేకత. ముక్త పదగ్రస్తం మొదలైన అలంకారాలతో నిండుగా ఉన్నాయి గీతాలన్నీ. మచ్చుకి-

గుట్ట పైనా చెట్టు
చెట్టుపై నొక పిట్ట
పిట్ట గూడును కట్ట
కట్టి గ్రుడ్లనుపెట్ట-పిల్లలై ఎగిరెనట...

ఇలా ఎన్నో మాటల చమత్కారాలు నరసింహారావుగారు వాడుతూఎన్నో గేయాలుప్రాశారు.

గేయాలు తరువాత చెప్పుకోవలసినవి విజ్ఞానశాస్త్ర గ్రంథాలు. తెలుగులో శాస్త్ర విజ్ఞానగ్రంథాలు చాల తక్కువ. వాటిలో ప కొద్దో వెలువడినవంటే...అది ఈ పోటీల మాహాత్మ్యం అనే చెప్పకోవాలి!

ముద్రిత విజ్ఞానశాస్త్ర గ్రంథాలకంటె, వ్రాత ప్రతులకే ఎక్కువ బహుమానాలు వచ్చాయి. ఈ పోటీల్లో ఏ. వి. యస్. రామారావు వ్రాసిన చాలా గ్రంథాలు బహుమతులు పొందాయి. అంతరిక్ష విజయం, పరమాణువు కథ, ఆకాశాన్ని చూద్దాం, చంద్రలోకయాత్ర, బాలవిజ్ఞాన కథావళి మొదలైనవి అవి. రామారావుగారి శైలి నవలాశైలి. పాఠకుడికి విసుగుపుట్టకుండా కథ చెపుతున్నట్లు కథనం సాగిస్తారు...మచ్చుకు "అంతరిక్ష విజయం" చూడండి:

"కొన్ని వేల సంవత్సరాల క్రిందటిసంగతి. అప్పుడు మన భూమిమీద ఇంతమంది జనం ఉండేవారు కారు... ఉన్నవాళ్లైనా మనంత తెలివైనవారు కాదు..." అంటూ ఖగోళ విజ్ఞానాన్ని తెలియజేస్తూ ఎన్నో విషయాలు చెప్పారు రచయిత.

యస్.యల్. నరసింహారావుగారి "విజ్ఞాన మందిరం", నటరాజ రామకృష్ణ 'నర్తనకథ' 'నర్తనశాల', 'నర్తనసీమ', విస్సా అప్పారావుగారి 'ఆకాశం', కె. నరసింహాచారిగారి 'బిడ్డల చేతిపనులు', వారణాసి సుబ్రహ్మణ్యం గారి 'ఏనుగు', రెడ్డి రాఘవయ్యగారి 'గాలిలో




ప్రయాణం' కూడా బహుమతు లందుకొన్నాయి.

నృత్య, సంగీత, నర్తనవిద్యల్లో నిష్ణాతులైన నటరాజ రామకృష్ణగారు వాటికి సంబంధించిన విషయాలు బొమ్మలతో సహా వివరిస్తూ "నర్తనసీమ", "నర్తనకథ", "నర్తనశాల" చెప్పారు. నాట్యం నేర్చుకోవాలని కుతూహలమున్న బాలబాలికలకు, వాటిని గూర్చి తెలుసుకోవాలనుకొనే జిజ్ఞాసువులకు ఎన్నో శాస్త్రీయ విషయాలు తెలియజేశారు రచయిత.

గాలిలో ప్రయాణాని కుపయోగించే విమానాలు, గాలిపటలు, హెలికాప్టర్ల కథను

గంగిరెద్దు చూడరా
    ఎంతో బాగుందిరా
గంగడోలు ఊగించే
    డూ డూ బసవన్నరా!
ఇంటింటను చక్కగా
    తన విద్దెను చూపునురా
కాళ్లువంచి బాబులకు
    దండా లందించునురా
దయా ధర్మ భిక్షను గొని
    దీవించి పోవునురా.

-గంగరాజు సుశీలాదేవి

ప్రాచీన కాలంనాటి, ఆయా ప్రయాణసాధనాలతో మొదలుపెట్టి, ఆధునిక కాలంలోని సూపర్‌సోనిక్ విమానాలు, కాంకర్డ్, బోయింగ్ 747 దాకా సచిత్రంగా వివరిస్తుంది గాలిలో ప్రయాణం. ఇది అముద్రితంగానే ఉండిపోయింది.

ఇదేగాకుండా రామారావుగారి చంద్రలోక యాత్ర, ఆకాశాన్ని చూద్దామా? బాలవిజ్ఞాన కథావళి కూడా అముద్రితంగానే ఉన్నాయి.

## భారతప్రభుత్వ విద్యాశాఖ

భారత ప్రభుత్వ విద్యాశాఖ కొత్తగా అక్షరాస్యులయిన వయోజనులకు, అప్పుడే చదువు నేర్చుకొంటున్న బాలబాలికలకు ఉపయోగపడే రచనల వ్రాతప్రతులకు పటా బహుమతు లిస్తున్నది.

ఇప్పటివరకూ ఈ సంస్థ 18 పోటీలు నిర్వహించింది. (గత సంవత్సరం-1976 లో 19వ పోటీ నిర్వహించింది. ఇంకా ఫలితాలురాలేదు). ఈ పోటీల్లో ఎక్కువగా విజ్ఞానశాస్త్ర గ్రంథాలకూ, ప్రజల్లో స్నేహ, సౌహార్దాలు పెంపొందింపజేసే సాంఘిక జీవనానికి సంబంధించిన రచనలకు ప్రాధాన్యమిస్తారు.

యండమూరి సత్యనారాయణ (శ్రీవాత్సవ) గారి "టెలివిజన్ కథ", "రంగురంగుల పూలు", కె. యస్. రెడ్డిగారి "చందమామ", కె. వి. వి. సత్యనారాయణమూర్తిగారి "విజ్ఞాన యాత్ర-కుటీర పరిశ్రమలు", టి. రామచంద్ర రావుగారి "భూదేవి", "చెట్లు-చేమ", కె. యల్. నరసింహారావుగారి "నాన్నకు జాబులు", డా॥ గుంటుపల్లి రాధాకృష్ణమూర్తి గారి "సంఘజీవనం", కొసనం మహేశ్వర రావుగారి "గ్రామరాజ్యం" చెప్పుకోదగినవి.

టెలివిజన్ పుట్టుపూర్వోత్తరాలు, ఉపయోగం, మొదలైన వివరాలు "టెలివిజన్ కథ"లో చెప్పారు. అలాగే మన చుట్టూ ఉన్న రకరకాల పూలు గురించీ, వాటి పెంపకం గురించీ ఎన్నో విషయాలు శ్రీవాత్సవ సులభంగా, సుబోధకంగా తెలియజేశారు "రంగురంగుల పూల"లో.

"చెట్లు-చేమ"లో ప్రాణి బ్రతకటానికి వలసిన రకరకాల వృక్షాలు, వాటిలోని విచిత్రాలు, వాటివల్ల ఉపయోగాలూ వర్ణించారు. భూమిని గురించిన సమగ్ర చరిత్రే "భూదేవి" గ్రంథం.

"సంఘ జీవనం", "గ్రామరాజ్యం", "నాన్నకు జాబులు" లో గ్రామీణ ప్రజల మధ్య సామరస్యాన్ని పెంపొందింపజేసే విషయాలు చాలా ఉన్నాయి.

## ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ కూడా బాలసాహిత్యాన్ని ప్రోత్సహించటానికి పటా బహుమతులిస్తున్నది. అకాడమీ బహుమతుల్లో రెండు ప్రత్యేకత లున్నాయి. అందులో మొదటిది: ఆ పోటీలు రచయిత్రులకు మాత్రమే పరిమితం. పిల్లల పోషణ, పెంపకాల్లో ప్రముఖ స్థానాన్నాక్రమిస్తూ, వారు

భవిష్యత్తులో మంచి పౌరులుగా మసలటానికి స్త్రీలు దోహదం చేస్తారని కాబోలు పోటీ నిర్వాహకులు ఈ నిబంధనను పెట్టారు. ఇక రెండో ప్రత్యేకత: సాహిత్యంలో ప్రక్రియలైన కథానిక, గేయం, గేయకథ, నాటిక, నవల, విజ్ఞానశాస్త్రం, చరిత్ర, జీవితం, దేశయాత్ర, కవుల కథలు మొదలైన విషయాలు వారే ఇచ్చి పుస్తకాలు వ్రాయించటం.

ఆయా శాఖల్లో మంచి గ్రంథాలు రావటానికి ఈపద్ధతి ఉపయోగపడుతుంది. ఈ పోటీలు 1966-67 లో ప్రారంభమైనాయి. ఇప్పటికి ఏడు పోటీలు నిర్వహింపబడ్డాయి.

వీటిల్లో గంగరాజు సుశీలాదేవి ''చిట్టి ముత్యాలు'' (గేయాలు), జి. రాఘవమ్మ 'గేయ కథావళి', కె. రామలక్ష్మి 'యువరాజు', (జానపదనవల), కోడూరి లీలావతి 'ఆశాకిరణం', ఎ. యస్. మణి 'ప్రేమ మంత్రం' (సాంఘిక నవలలు, ఎ.లక్ష్మీరమణ 'మూడు మొగ్గలు' (కథానికలు), సంక్రాంతి పాటి వెంకటరమణ 'నేటి విద్యార్థులు', కోడూరి లీలావతి 'బాలచంద్రిక'' (నాటికలు), కంచి రమాదేవి ''అనంతంలో అంతం'' (వైజ్ఞానిక కాల్పనికనవల), కోడూరి లీలావతి ''కుంకుమరేఖ'' (కస్తూర్బా జీవితం), గిడుగు విశాలాక్షి ''ప్రకృతిలో వింతలు'' (శాస్త్ర విజ్ఞానం), ''రాబిన్‌సన్ క్రూసో (అనువాద నవల), కుమారి కమలవాసిని ''ఆంధ్రదేశ యాత్ర'', యాసం సుశీలాదేవి ''తెలుగు కవుల కథ'', శ్రీమతి సీత ''యాగ్జికం'' అనే గ్రంథాలు బహుమతులు పొందాయి.

**ఇతర బహుమతులు**

పైన వివరించిన బహుమతులే కాకుండా ఆయా సందర్భాల్లో బహుమతులు పొందిన గ్రంథాలు కూడా ఉన్నాయి. వాటిల్లో కోడూరి లీలావతి, శ్రీరామమూర్తి వ్రాసిన "రవి కథ" రవీంద్ర శతజయంతి సందర్భంగా ప్రత్యేక సంఘం ఏర్పరచిన పోటీలో బహుమతి పొందింది.

1975 లో ఆంధ్రజ్యోతి బాలల నవలా పోటీలు నిర్వహించింది. దానిలో పాలంకి వెంకట రామచంద్రమూర్తిగారి "బంగారు తల్లి" నవల బహుమతి పొందింది.

మొదటిది రవీంద్రుని జీవితకథ. రచయితలు కథనంలో ప్రత్యేకతను చూపిస్తూ, రవీంద్రుడి జీవితంలోని ఘట్టాలకు రమ్యమైన శీర్షికలు పెడుతూ గ్రంథాన్ని వ్రాశారు. రవీంద్రుని జీవితాన్ని చక్కగా బాలలకు వివరిస్తుంది గ్రంథం.

అలెగ్జాండరు, పురుషోత్తములనాటి రాజకీయ, సాంఘిక జీవితాన్ని తెలియజేస్తుంది "బంగారు తల్లి". బాలసాహిత్య రచనలో నిష్ణాతులు పాలంకివారు; కథనం చక్కగా నడిపారు. పాఠకుడికెక్కడా విసుగు పుట్టించదు.

ఇవేకాకుండా నా దృష్టి కందుబాటులో లేని గ్రంథాలు చాలా వున్నాయి. బహుమతుల పేరుతో పెక్కు గ్రంథాలు వెలుగు వెలుగులోకి వచ్చాయి; బాలసాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి; బాలసాహిత్యంలో విశిష్ట స్థానాన్ని సంపాదించుకున్నాయి.



# బాలల చలనచిత్రాల ఆవశ్యకత

— మార్పు గోపీనాథ్

బాలల చిత్రాలకు ఎంతో ప్రాముఖ్యం ఉన్నది. పిల్లల మనో వికాసానికి, వారి అభివృద్ధికి దోహదం చేసే ఉత్తమ చిత్రాలు నిర్మాణం కావాలి. మన చిత్ర పరిశ్రమ ఈ అంశాన్ని గమనిస్తుందనే ఆశ నాకున్నది.

— నెహ్రూ

"పుస్తకాలు, పత్రికలు మొదలయినవెన్నో ప్రజల్ని ప్రభావితం చేస్తాయి. అయితే మన దేశంలో చలనచిత్రాలు ప్రజలమీద చూపే ప్రభావం వీటన్నిటికన్నా చాల ఎక్కువని నేను భావిస్తాను."

పై మాటలు ఇరవై రెండేళ్ల క్రితం చాచా నెహ్రూ అన్నవి. మన జనాభాలో హెచ్చు ప్రజలు నిరక్షరాస్యులు. పురాణాలయినా, పుణ్యగాథలయినా మన జనాలకు కళారూపంలోనే బాగా అర్థమవుతాయి. బుడబుక్కల కథలు మొదలుకొని బుర్రకథలవరకు మన దేశంలో ఉన్నన్ని కళావిశేషాలు బహుశః మరే దేశంలోనూ ఉండవనే చెప్పవచ్చును. ఇరవైయవ శతాబ్దం కళారంగంలో సైతం విప్లవాన్ని తెచ్చింది. దాని ఫలితమే చలన చిత్రాలు. కదిలే బొమ్మలు పావలాకే వెండి తెరమీద కమ్మని కథలు చెప్పడం ప్రారంభించాయి.

ఈనాడు ప్రపంచంలో అన్నిటికన్నా ఆధిక్యంలో ఉన్న ప్రచార సాధనం సినిమా. అన్నిటా ప్రథమంగా నిలిచిన వినోదాత్మక కళారూపం సినిమా. అన్ని వ్యాపారాలకన్నా ముమ్మరంగా సాగుతున్న వ్యాపారమూ సినిమా వ్యాపారమే. ఒక్క మాటలో చెప్పాలంటే నేడు మెజారిటీ జనాన్ని పిచ్చెక్కిస్తున్న అంశం సినిమా (అంటే అతిశయోక్తి కాదు).

ఆధునిక సమాజంలో చలనచిత్రాల ఆవశ్యకత ఎంతో ఉన్నది. బాలలు సమాజంలోని వారే. పైగా వారు భావి పౌరులు. ప్రతి సంఘటనా ఆ పసి మనసుల పసిడి భవిష్యత్తుపై ఎంతో కొంత ముద్ర వేస్తూనే ఉంటుంది. మహాత్మా గాంధి జీవితాంతం సత్యసంధుడుగా ఉండడానికి చిన్ననాడు చూసిన 'హరిశ్చంద్ర' నాటకం ప్రేరణ. చిన్నారి శివాజీకి తల్లి జీజీయాబాయి చెప్పిన భారత, రామాయణ వీరగాథలే ఆతర్వాత 'ఛత్రపతి' ధర్మసంరక్షణ దీక్షకు పట్టాభిషేకం చేశాయి.

బాలలపై చలన చిత్రాలు గొప్ప ప్రభావాన్ని చూపుతాయి. ఊపిరి బిగబట్టి కనురెప్ప లయినా కదల్చకుండా ఉత్కంఠతో వారు ప్రతి దృశ్యం చూస్తారు. సినిమాలోని వినోదమయినా, విషాదమయినా వారు పెద్దలకంటె ఎక్కువ అనుభవిస్తారు. దురదృష్టవశాత్తు ఇపుడు మంచిచిత్రాలు తక్కువగా వస్తున్నాయి. విడుద

అవుతున్న చిత్రాలలో ఎక్కువ భాగం అర్థం లేని అశ్లీల దృశ్యాలతోను, హింసాత్మక సంఘటనల తోను నిండి ఉంటున్నాయి. ఇటువంటి చిత్రాలు బాలలకే కాదు; ఎవరికీ ఉపయోగపడనివి. ఫలానా చిత్రంలో మాదిరిగా దొంగతనం చేయబోయి పట్టుబడిన దొంగలవార్తలు, ఫలానా హీరోలా అమ్మాయిలను అల్లరి పట్టించబోయి అల్లరి పాలయిన అబ్బాయిల కథలు మనం తరచు వింటుంటాం. దీనినిబట్టి సినిమాల ప్రభావం సమాజంమీద ఎంత ఉందో మనం ఊహించుకోవచ్చును.

బాలలు చూసే చిత్రాలు వినోదాత్మకంగాను, విజ్ఞాన దాయకంగాను ఉండాలి. వారి 'రేపు'ను సుందరంగా తీర్చి దిద్దేవిగాను. వారి వ్యక్తిత్వాన్ని పెంపొందించేవిగాను ఉండాలి. 1955 లో ఒక చలనచిత్ర గోష్ఠికి ప్రారంభోత్సవం చేస్తూ నెహ్రూ ఇలా అన్నారు : "బాలల చిత్రాలకు ఎంతో ప్రాముఖ్యం ఉన్నది. పిల్లల మనో వికాసానికి, వారి అభివృద్ధికి దోహదం చేసే ఉత్తమ చిత్రాలు నిర్మాణం కావాలి. మన చిత్ర పరిశ్రమ ఈ అంశాన్ని గమనిస్తుందనే ఆశ నాకున్నది."

బాలల చిత్రాల నిర్మాణానికి నెహ్రూజీ గొప్ప ప్రోత్సాహాన్నిచ్చారు. 1955 లో బాలల చలన చిత్ర సంస్థ (చిల్డ్రన్స్ ఫిలిమ్ సొసైటీ) స్థాపనకు ఆయన ఆశీస్సులే కారణం. అంతకు ముందు చలన చిత్ర వ్యవహారాలపై దర్యాప్తుకోసం ఏర్పాటయిన మేధావుల సంఘం ప్రభుత్వమే బాలల చిత్రాలను నిర్మించి ప్రదర్శన ఏర్పాట్లు చూడాలని సూచించింది. నెహ్రూజీ అందుకోసం వేరే ఒక విభాగం ఉండాలని ఆశించారు. ఆ విభాగమే చిల్డ్రన్స్ ఫిలిమ్ సొసైటీ. ఈ సంస్థకు గొప్ప పేరున్నది. మృణాళ్ సేన్, శ్యాం బెనగల్, కె. ఎ. అబ్బాస్, బి. వి. కారంత్, కాంతిషా రాథోడ్ వంటి ప్రముఖుల దర్శకత్వంలో ఈ సంస్థ చిత్రాలు నిర్మించింది. వీటిలో ఎన్నో చిత్రాలు అవార్డులు కూడా గెలుచుకున్నాయి. పంచతంత్రం లోని నీతి కథలు, శివాజి, అక్బర్ వంటి మహాపురుషుల జీవిత గాథలను కూడా ఈ సంస్థ చిత్రాలుగా నిర్మించింది. సుమారు తొంభై చిత్రాలను ఈ సంస్థ స్వయంగా నిర్మించింది. మరి 50 చిత్రాలు ఇతర విధాలుగా సేకరించింది. వీటిలో పెక్కు చిత్రాలు ఇతర భారతీయ భాషలలోకి అనువదించబడ్డాయి. ప్రతి సంవత్సరం చిల్డ్రన్స్ ఫిలిమ్ సొసైటీ బాలల చలన చిత్రోత్సవాలను నిర్వహిస్తుంది. బ్రిటన్‌లో శ్రీమతి మేరీఫీల్డ్ ఆధ్వర్యంలో నిర్వహించబడుతున్న చిల్డ్రన్స్ ఫిలిమ్ ఫౌండేషన్ సంస్థ బాలల చిత్ర నిర్మాణం కోసం ప్రసిద్ధ మయినది. మన సంస్థకూడా కృషితో ఆ స్థాయికి చేరుకోగలమని ఆశిస్తున్నారు.



బాలల చిత్రాల ఆవశ్యకత ఎంతో ఉన్నప్పటికీ భారతీయ భాషలలో నిర్మాతలు వీటిని తక్కువగానే నిర్మిస్తున్నారు. మన తెలుగు పరిశ్రమలో ఇవి మరీ తక్కువనే చెప్పాలి. పిల్లలు తెచ్చిన చల్లని రాజ్యం, బంగారుపాప, ముద్దుబిడ్డ, లేతమనసులు, పాపకోసం, మా నాన్ననిర్దోషి, భలేపాప, పాపం పసివాడు.

చిన్నారిపాపలు, బాలరాజుకథ వంటి చిత్రాలు వచ్చినా వీటిలో సంపూర్ణంగా బాలలచిత్రం అనదగ్గది ఏదీ లేదనే అనాలి. కొన్ని చిత్రాలలో ప్రధాన పాత్రలు బాలలవి. మరికొన్ని చిత్రాలలో బాలలు కథను సుఖాంతం చేస్తారు. మొత్తంమీద వీటిలో సందేశాత్మక చిత్రాలు తక్కువనే ఒప్పుకోవాలి. బాక్సాఫీస్ సెంటిమెంట్లూ, వ్యాపార చిట్కాలు మాత్రం అన్నిట్లో దండిగా ఉన్నాయి.

సురేష్ పతాకంక్రింద శ్రీ డి. రామనాయుడు నిర్మించిన పాపకోసం ఉన్నవాటిల్లో చెప్పుకోదగ్గ చిత్రం. ఒక పసిపాప ముగ్గురు గజదొంగలలో మానవత్వాన్ని నూరిపోసిన కథ ఇది. మూడు మతాలకు చెందిన ఆ బందిపోట్లు ముగ్గురూ ప్రజల్నీ, పోలీసులనూ గడగడ లాడిస్తారు. ఒక దోపిడీలో వారికి ఈ పాప దొరుకుతుంది. అంతకుముందు వారు ముగ్గురు దేవుళ్ళను (రాముడు, రహీం, ఏసు) వేర్వేరుగా కొలిచేవారు. ఆ పాప రాకతో వారికి కొత్త దేవుడూ దొరికినట్టయింది. రాతి దేవుళ్ళకు ఎన్నడు భయపడని ఆ రాతి హృదయాల్లో పసిపాప నవ్వుల వెన్నెలకు పశ్చాత్తాపమనే పువ్వులు వికసించాయి. చివరకు వారు ఆ పాపకోసమే చట్టానికి లొంగిపోతారు.

శ్రీ బాపు తీసిన 'బాలరాజు కథ' సరదాగా సాగిపోయే చిత్రం. తల్లీ తండ్రీ ఎవరో తెలియని బాలరాజు హుషారైన కుర్రాడు. 'మహాబలిపురం...మహాబలిపురం-' అంటూ ఆడుతూ పాడుతూ మహాబలిపురానికి వచ్చే యాత్రికులకు గైడ్‌గా వ్యవహరిస్తుంటాడు. కథలోను, కథనంలోనూ కొత్తదనం చూపగల శ్రీ బాపు సత్తా ఇందులో కనిపిస్తుంది. "అనాథ బాలలయితేనేం, ఆత్మవిశ్వాసంతో నిజాయితీగా జీవించండి" అన్న సందేశం ఇందులో ఉన్నది. ఎ. వి. యం. వారు తీసిన 'లేతమనసులు' కుటుంబగాథా చిత్రమే అయినా చక్కగా వచ్చింది. విడిపోయిన తల్లిదండ్రులను లల్లీ, పప్పీ అనే ఇద్దరు కవల పిల్లలు ఎలా ఒకటి చేసిందీ ఇందులో చిత్రించారు కృష్ణన్ పంజు దర్శకత్వం వహించిన ఈ చిత్రంలో లల్లీ, పప్పీలుగా నాటి బేబీతార పద్మిని ద్విపాత్రాభినయం చేసింది. అలాగే ఒకటిరెండు మంచి చిత్రాలు వచ్చినప్పటికీ బాలల మనసులపై చెరగని ముద్రవేసే సందేశాత్మక చిత్రాలు మనకు తక్కువనే చెప్పాలి.

"చందమామకో చెట్టుంది-దానిక్రింద పేదరాశి పెద్దమ్మ ఉంది" అనే కట్టుకథలకన్నా "చంద్రుడు భూమికిమల్లే ఒక గ్రహం-అక్కడ జీవరాశి మనుగడకు అవసరమయిన ప్రాణవాయువు లేదు" అని చెప్పే విజ్ఞానదాయకమైన చిత్రాలు, సాహిత్యం ఇపుడు ఎంతో అవసరం. చాచా నెహ్రూ మాటలతో ప్రారంభించిన ఈ వ్యాసాన్ని ఆయన మాటలతోనే ముగించడం భావ్యమని అనుకుంటాను. "చలనచిత్రాలద్వారా సత్యాన్ని చాటిచెప్పండి. ఏది ఉత్తమమైనదో, ఏది నిజమయినదో దానిని సినిమాలలో చూపండి. ప్రజలలో బ్రహ్మాండమైన విశ్వాసాన్ని కలిగించడానికి చలనచిత్రాలను సాధనాలుగా వినియోగించండి. అంతేగాని వారికి పిరికితనాన్ని నూరిపోయవద్దు".



# బాలలు: రంగస్థల కళలు

-పాలగుమ్మి విశ్వనాథం

బాలల విషయంలో రంగస్థల కళల పట్ల సవ్యమైన కృషి జరిగితే ఈ బాలలు మేటి పౌరులుగా రూపు దిద్దుకునే అవకాశం ఉంది.

సుమారు నాలుగైదు సంవత్సరాల క్రితం మాట. బాలల దసరా ఉత్సవాలు జరుగుతున్నాయి. రవీంద్రభారతి బాలబాలికలతోటీ, వారి తల్లిదండ్రులతోటీ కలకల్లాడుతోంది. నాలుగురోజులుగా జరుగుతున్న పిల్లల నాటికల పోటీలు అప్పుడే ముగిశాయి ఫలితాలు నిర్ణయించడానికి న్యాయనిర్ణేతలు లోపలికి వెళ్లారు. అప్పటికే రాత్రి పదిగంటలయింది. ఫలితాలు తెలుసుకుని మరీ వెడదామని ప్రేక్షకులు కుతూహలంతో కూర్చున్నారు. కాని ఫలితాలు రావడం ఆలస్యం అవుతోంది. ప్రేక్షకులలో ఓర్పు తగ్గుతోంది. వాళ్ల దృష్టి మళ్లించి కాస్సేపు ఓపిగ్గా కూర్చునేటట్లు చేయాలి. ఖాళీగా ఉన్న వేదికమీదికి ఒకవ్యక్తి వచ్చారు. ఆయన్ని చూసేప్పటికి జనం కాస్త సద్దు మణిగింది. ఆయన ఎవరో కాదు; రేడియో అన్నయ్యగా ప్రసిద్ధికెక్కిన రాఘవరావుగారు. అన్నయ్యగారు ఉన్నారంటే అటూఇటూ పిల్లలు ఉన్నారన్నమాటే. అన్నయ్యగారు ఏమన్నారంటే "నేను కళ్లు మూసుకుంటాను. చేయెత్తి ఎటో అటు వేలు చూపిస్తాను. నా వేలు ఎవరికేసి చూపిస్తుందో ఆ బాలుడుగాని, బాలికగాని ఇక్కడికి వచ్చి ప్రేక్షకులముందు ఒక చిన్న అంశం ప్రదర్శించాలి. రెడీ-వన్-టూ" అంటూ వేలు చూపించారు.

అంతే; ఒకపక్కనుంచి ఓబాలుడు వచ్చాడు. "దుర్యోధన" ఏకపాత్రాభినయం ఓ అయిదు నిమిషాలు చేసి వెళ్లిపోయాడు. ఇంకోపక్కనుంచి ఓ బాలిక వచ్చి ఓ పాట పాడింది. అన్నయ్యగారి వేలు అల్లా చూపిస్తోనే ఉంది. ఓ బాలుడు వచ్చి కాస్సేపు బుర్రకథ చెప్పాడు. మరోప్రక్కనుంచి ఓ బాలిక వచ్చి ఒక నృత్యం చేసింది. మరో బాలుడు వచ్చి చిన్నచిన్న మాజిక్‌లు చేశాడు. ఇంకో బాలుడు రాయబారంలోని పద్యాలు చదివాడు. మరో బాలుడు వచ్చి మిమిక్రీ చేశాడు. ఇల్లా 45 నిమిషాలు ఇట్టే గడిచిపోయాయి. ప్రేక్షకులు అలసట మరిచిపోయి ఆ బాలబాలికలు ప్రదర్శిస్తున్న కార్యక్రమాన్ని ఆనందిస్తూ కూర్చున్నారు (ఇంతలో నాటిక పోటీల ఫలితాలు వచ్చాయి. అది వేరే విషయం).

ఇలా అప్పటికప్పుడు అడిగీ అడగడంతోటే నదురూ బెదురూ లేకుండా రంగస్థలంమీదకి వచ్చి, ప్రేక్షకులని తమ ప్రతిభతో కూర్చోబెట్టగలిగిన శక్తి బాలలలో ఉందన్నమాట. ఆవేళ అంత ప్రతిభతో తమ నైపుణ్యాన్ని ప్రదర్శించిన బాలబాలికలు ఇవేళ ఏంచేస్తున్నారో?

ఆడాలి-ఆడాలి! ఆట లాడాలి!
పాడాలి-పాడాలి! పాట పాడాలి!
బొంగరాల ఆటంటే
బోలెడంత సరదా!
గోళీలు - గోటిబిళ్ళ
గొప్పవైన - ఆటలు ॥ఆడాలి॥
దాగుడుమూతలు - తుమ్మెంట
దానికవే మరి చెప్పదగ్గవి!
చెడుగుడు - చెట్టు కొమ్మమ్మలు
చెప్పలేము - మరి-వాటిమజా ॥ఆడాలి॥
చింతగింజలు - గిరిక
చిన్నాళ్ళాడే ఆట!
ఏ ఆటైనా - ఏ పాటైనా
ఎంతో చక్కగ ఉంటుంది! ॥ఆడాలి॥

-మద్దిపట్ల వెంకట్రావు

"అవన్నీ కట్టిపెట్టి, చదువుమీద దృష్టిపెట్టు. కాంపిటీషన్ ఎల్లా ఉందో చూశావా? ఫస్టు క్లాసైనా వస్తేగాని మన మొహం చూసే వాడుండడు." అని తండ్రి మందలిస్తాడు, మగపిల్లవాళ్ళని అయితే. ఇంక ఆడపిల్లలయితే "చూడమ్మా! అవన్నీ చిన్నప్పుడయితే ముద్దుగా ఉంటాయిగాని, ఇప్పుడు పెళ్లీడు వచ్చిన పిల్లవి" అని అమ్మ మందలిస్తుంది. మొత్తంమీద పరిస్థితి ఇది.

చిన్నప్పుడు రంగస్థలం మీద, కళా నైపుణ్యం వెదజల్లుతూ మెరిసిపోయే ఆ బాల బాలికలలో చాలామంది కొంతకాలం అయ్యే సరికి, దానికి దోహదంలేక, తమ ప్రతిభ లోలోపలనే ఇంకిపోతూ, కళాతృష్ణ మాత్రం వదలక, ఉన్న పరిస్థితులలో రాజీపడలేక, కొంత అశాంతిగా జీవితం గడపటం చూస్తుంటాము.

పిల్లలలో రకరకాలైన ప్రతిభ ఉంటుంది. ప్రత్యేకమైన ఆసక్తులు ఉంటాయి. వీటిని పసిగట్టి, ఎవరు ఎందుకు పనికివస్తారో, ఎందులో ఎవరు రాణిస్తారో తెలుసుకునేందుకు, ఒక నిర్దిష్టమైన విధానం ఉండాలి. ఒకే విధమైన విద్యావిధానం, ఒకే రకమైన శిక్షణ అన్ని అవసరాలను తీర్చదు. ముఖ్యంగా కళారంగం వైపు మొగ్గుచూపించే బాలురకు ప్రత్యేక వసతులు ఉండాలి.

ఇంతవరకూ పిల్లల విషయంలో, వారి ఆసక్తులకు అభిరుచులకు అనుగుణంగా రూపొందించబడిన కార్యక్రమాలు చెప్పుకోదగినంత లేవు. అభివృద్ధి చెందిన దేశాల్లో పిల్లల విషయమై జరిగేకృషి అంతా ఇంతాకాదు. అనేక రంగాల్లో, క్రీడారంగమైనాసరే, కళారంగమైనాసరే- పిల్లలలోని ప్రతిభా పాటవాన్ని అన్వేషించేందుకు, ఆయా రంగాల్లో నిపుణులైన వారు దేశం అంతా పర్యటిస్తారు. ప్రత్యేక ప్రతిభ ఉన్న బాలల్ని ఎన్నుకొన్న తర్వాత, ఆయారంగాల్లో ప్రత్యేకశిక్షణ ఇచ్చే భారం, తర్వాత వాళ్ళకి జీవితంలో సముచితమైన స్థానం, అవకాశాలు ఏర్పరచే బాధ్యత ప్రభుత్వంగాని, కొన్ని సంస్థలుగాని చేపడతాయి. ఈ పద్ధతివల్ల నిగ్గుతేరిన కళాకారులు ఆ దేశ సంస్కృతికి ప్రతీకలుగా కొట్టొచ్చినట్లు కనిపిస్తారు.

రంగస్థల కళలు అనగానే పాట, నృత్యం, నాటకం, ఇప్పుడు ప్రచారంలోకి వచ్చిన బుర్రకథ, ఇంకా మరుగున పడిపోయిన జానపద కళారూపాలు-ఇల్లా ఎన్నో జ్ఞాపకం వస్తాయి. పాట విషయం తీసుకుందాం 'పాట'కి, నిత్య జీవితానికి అవినాభావ సంబంధం ఉంది. ప్రొద్దుట లేచినది మొదలు రాత్రి పడుకునే దాకా మానవ జీవితాన్ని చిత్రించే పాటలు

సంప్రదాయ సాహిత్యంలో ఉన్నాయి. మానవుని కార్యకలాపా లన్నిటికీ 'పాట' తోడుగా, నీడగా నిలిచింది. పాట శక్తిమంతమైనసాధనం. ఈ సాధనాన్ని సరిగ్గా ఉపయోగించుకుంటే కొన్ని ప్రయోజాలు నెరవేరవచ్చు.

నాకు ఎప్పటికీ 'ప్లాటో' అన్న మాటలే జ్ఞాపకం వస్తుంటాయి: **"Let me make the songs of the Nation, I care not who makes its laws"** (ఈ జాతికి కావలసిన పాటలు మాత్రం నన్ను తయారు చెయ్యనివ్వండి. తర్వాత మీ యిష్టంవచ్చిన చట్టాలు మీరు పెట్టుకోండి). ఒక చట్టంవల్ల కంటె, ఒక పాటవల్ల క్రమశిక్షణ అలవాటుపడే అవకాశాలు ఎక్కువ ఉన్నాయి. పాట మానసిక వికాసానికికూడా తోడ్పడుతుంది. ఎక్కడైనా ఒక కమ్మని కంఠం వినిపిస్తే, మన ఆలోచనలు ఒక్కసారి ఆగిపోయి, పాటవేపు మనసు లగ్నం అవుతుంది. కంఠ మాధుర్యాన్నిబట్టీ, కళాకారుడి నైపుణ్యాన్నిబట్టీ, మన ఆలోచనలు స్తంభించిపోయి, ఆ నాద ప్రవాహంతో మన మనస్సు తేలిపోతుంది. నాదానికి అటువంటి శక్తి ఉంది. అటువంటి శక్తిగల నాదంలో, సొగసైన మాటలు పొదిగితే, ఆ మాటలకి ఒక శాశ్వతత్వం వస్తుంది. నాదము అందులో పదము కలియగా రూపుదిద్దుకొన్న శక్తిమంతమైన కళారూపం 'పాట'. ఇంక లేత మనసుల్లో పాట ఇట్టే చొచ్చుకు పోతుంది. అందుచేత పిల్లల పాటల విషయంలో ప్రత్యేకకృషి జరగాలి. ఇంతవరకు వచ్చిన బాలసాహిత్యంలోని గేయాలు అన్నీ ఏరి ప్రత్యేక సంకలనాలు ప్రచురించవచ్చు. దానివల్ల జరిగే ప్రయోజనం కొంతవరకే. ఎందుకంటే, ఏ కథో చదివినట్టు చదువుకుని ఆనందించేది కాదు 'పాట'. పుస్తకాల పుటలమధ్య నిశ్శబ్దంగా




నిద్రపోతున్నది పాటకాదు. అది బాలల కంఠంలో మ్రోగితేనే 'పాట' అవుతుంది.

బాల బాలికల లేత గొంతుల్లో, బొమ్మరాళ్లల్లా అడ్డుపడే మాటలు లేకుండా, ఆ లేత బుర్రలు ఇంకించుకునే భావాలు కలవిగాఉండి, వాళ్లు ఆడుతూనో, చిందులు త్రొక్కుతూనో, గంతులేస్తూనో, పగలబడి నవ్వుతూనో- అన్ని అవస్థలలోనూ పాడుకునేందుకు బాలగేయాల్లో ఊపు ఉల్లాసం ఉండాలి. ముఖ్యంగా అభివృద్ధి

చెందవలసిన ప్రక్రియ ఒకటి ఉంది. అది "బృందగానం". ఇరవై ముప్పైమంది పిల్లలు కలిసి కంఠంఎత్తి పాడడం వింటే అది విచిత్రమైన అనుభవం. పదిమంది గొంతు కలిపితేనే అందులో విశేషం ఉంది. ఇంకో విషయం. బృందగానాల్లో పాల్గొనేందుకు అన్నీ అద్భుతమైన కంఠాలే ఉండనక్కర లేదు. సుమారైన శ్రుతిజ్ఞానం, లయజ్ఞానం ఉంటే చాలు. అన్నిటికంటే ముఖ్యమైనవిషయం పదిమందితో గొంతు కలపడం నేర్చుకుంటే, తర్వాత మనసులు కలుపుకునే అవకాశం ఉంది. బృందగానాలవల్ల ప్రయోజనం అది.

మన జాతి చరిత్ర, సంస్కృతి పరిశీలిస్తే అనేక రంగాల్లో కొన్ని శిఖరాలు కన్పిస్తాయి: ఆ మధ్య అఖాతాలు అలానే ఉన్నాయి. గొప్ప వ్యక్తులు కనిపిస్తారు. గొప్పజాతి కనిపించదు. పెరిగిన జాతికి, చుట్టూవున్న పరిస్థితులకి, కదలడం, మేల్కొనడం, ఏదో చెయ్యడం-ఇల్లాంటి లక్షణాలు ఉంటాయి. నిత్య జీవితంలో నిజాయితీ, జాతి జీవనంలో నైతికస్థాయి కొంత తక్కువగానే ఉన్నాయని చెప్పాలి. ఈ పరిస్థితిని మెరుగు పరచాలంటే, బాలల లేత మనసుల్లో సరియైన భావాలు పడేట్లు చూడాలి. ఈ ప్రయోజనం రంగస్థల కళలవల్ల కొంత నెరవేరుతుంది. ఈ సందర్భంగా పేర్కొనవలసినవి నాటకం-బృందగానం. ఈ రెండూకూడ సమూహానికి సంబంధించినవి. సంగీత విషయంగా గొప్ప గాయకుడు వుండవచ్చు, లేక గొప్ప నర్తకి వుండవచ్చు. వారి వ్యక్తిగత ప్రతిభవల్ల, వారి వ్యక్తిగత సాధనవల్ల వారు పైకివచ్చే అవకాశాలు ఉన్నాయి. కాని నాటకం అల్లాంటిది కాదు. పదిమందితో కలిసిన పని అది. పదిమందితో కలిసి పనిచెయ్యడంలో. మనసుఇచ్చిపుచ్చుకోడాలు ఉంటాయి. వారి అర్హతలనిబట్టి నాటకంలో ఉన్నపాత్రలు ధరించవలసి వస్తుంది. అంతేగాని పాల్గొనే ప్రతివారూ, హీరోవేషానికి ఎగపడ్డం ఉండదు. ఒక క్రమశిక్షణ అలవడుతుంది. ఎవరి ప్రతిభ ఎల్లాంటిదో అంచనా వేసుకోడం అలవాటు అవుతుంది. పక్కనున్నవారి ప్రతిభను గుర్తించడం, దానికి మన్నింపు ఇవ్వడం అలవాటు అవుతుంది. ఈ మనస్తత్వం మనం పెరగనిస్తే పెద్దయ్యాక జీవితంలో దేనికి ఆశించాలో, దేనికి అర్రులు చాచగూడదో, దేనికి అర్హత ఉందో, ఒక అర్హతకోసం ఎంత కృషి చేయాలో- ఇవన్నీ అవగాహనలోకి వస్తాయి.

బాలల విషయంలో రంగస్థల కళలపట్ల సవ్యమైన కృషి జరిగితే, ఈ బాలలు మేటి పౌరులుగా రూపుదిద్దుకునే అవకాశం ఉంది.



# పత్రికలలో బాలల విభాగాలు

— ఎల్లోరా

పెద్ద పత్రికలు సైతం బాలల కోసం ఓ శీర్షిక పెట్టి తీరాలి అనే పరిస్థితి నేడు బలంగా వచ్చింది. ఇది మంచిదే. అయితే బాలలను తీర్చిదిద్దే ధోరణిలో మంచి రచనలు రావాలి.

బాల సాహిత్యం అనగానే మనకు రెండు ప్రశ్నలు ఉదయిస్తాయి : 1. బాలలకోసం బాల భాషలో పెద్దలు రచించేవి. 2. బాలల మనస్తత్వాలను గ్రహించి బాలలకోసమని వారి మనోభావాలను, ఆట పాటలను చిత్రిస్తూ రచించేవి.

సుమారు మూడు దశాబ్దాలుగా బాలల సాహిత్యంతో నాకున్న చిన్న పరిచయాన్ని తీసుకొని ఆలోచించినప్పుడు బాలలకోసం పెద్దలే రాస్తున్న రచనలే ఎక్కువ!

ఇటీవలి కాలంలో బాలల శీర్షిక లేని పెద్దల పత్రికలే లేవని చెప్పవలసి ఉంటుంది. దినపత్రికలు, వారపత్రికలు-ఏది తీసుకున్నా అనేక శీర్షికలతోపాటు బాలలకోసం ప్రత్యేకంగా కొన్ని పేజీలు కేటాయించడం జరుగుతూంది. అంటే పత్రికను తిరగేసే కుటుంబంలో నవల, కథ, మహిళాలోకం, వైద్యం- ఇలా రకరకాల శీర్షికలు ఆయా అభిరుచులు కలిగినవారి కోసం ప్రవేశపెట్టడంతోపాటు, పిల్లలూ ఆ పత్రికలో తమకోసం తమనుగురించిన కథో, గేయమో వెతుక్కొని చదవడం చూస్తున్నాం. ఇది తెలుగు దినపత్రికలలో, తెలుగు సచిత్ర వారపత్రికలలో ఈమధ్య మరీ ఎక్కువగా పరికిస్తున్నాం.

ఇది చాలా మంచి ఫలితాలనే ఇస్తూందని చెప్పవచ్చు. చిన్నతనంనుంచి 'చదవాలి' అనే జిజ్ఞాసను బాలల హృదయాలలో రేకెత్తించడం అటువంటి ఫలితాలలో ఒకటి!

అయితే బాలలు అంటే ఎవరు ? వారికి ఆ వయసులో అర్థం అయ్యే భాష ఏది? అలా వారి మనసులకు అర్థం అయ్యే చిన్నచిన్న మాటలలో రాయడం జరుగుతూందా ? అసలు సాధ్యమా ? ఈ ప్రశ్నలు ఎప్పుడూ ఉన్నవే.

ఎక్కువగా బాలలకోసం రచించిన నవలలు కథలు, గేయాలు యువకులే, పెద్దలే ఎక్కువమంది చదువుతారు. పిల్లలు వాటిని పరిపూర్ణంగా చదివి అర్థంచేసుకుంటారని అనుకోను.

అందుకనే- బాలరచనలు కొని అమ్మో, నాన్నో, అక్కో, అన్నో, బామ్మో చదివి, వాటిని పిల్లలకు ముద్దుముద్దు మాటలతో తిరిగి చెప్పడం జరుగుతూంటుంది.

అది నా అనుభవంలో కూడా జరిగింది. నేను 20 ఏళ్ళక్రితం బాలలకోసం మూడు రకాలుగా మూడు నవలలు రాశాను. చంద్ర

వదన చాకచక్యం, మాయచిలుక, మందారాలు. ఇవి పెద్ద అక్షరాలలో, బొమ్మలలో ఉత్సుకతను రేపే ధోరణిలో రచించినవే. అయితే మా ఇంట మా పిల్లలు ఈ పుస్తకాలు తీసుకని ముద్దుగా వాళ్ల సంచీలలో దాచుకొన్నారు. తరువాత వీలు చిక్కినప్పుడు ఆ పుస్తకాలు తీసి "ఇది ఏమిటి చెప్పు, ఆ బొమ్మ లోని చిలుక ఏమిటి, ఆ గుర్రం ఏమిటి?" అంటూ కథ చెబుతూంటే హాయిగా విన్నారు కాని చదవలేదు.

నేను చెప్పదలచింది ఏమిటీ అంటే పిల్లలు ఓ పట్టాన చదివి అర్థం చేసుకోగల బాల సాహిత్యం ఎక్కువగా వెలువడలేదని; అలాటి ప్రయత్నాలు జరిగినట్లు అనిపించినా పెద్దగా కనిపించ దని.

పిల్లలకోసం అని నడిచే పత్రికలు ఎన్నో ఉన్నాయి. ముద్దుగా ముచ్చటగా రంగు రంగుల బొమ్మల్తో వస్తున్నాయి. వీటిని తమ పిల్లలకోసం కొంటారు. అయితే అవి చదివేది ఎక్కువభాగం యువతీ యువకులు, పెద్దలు, చిన్న పిల్లలు చదవరని కాదు.

పెద్దల పత్రికలలో వస్తున్న బాల సాహిత్యం పెద్దలు రాస్తున్నదే! అవి పెద్దలు చదివే ధోరణిలోనే ఉంటున్నాయి. అనగనగా ఓఊరు, లేదా రాజు అని ప్రారంభించినంత మాత్రాన బాలసాహిత్యం అనుకొంటే ఎలా?

పెద్దపత్రికలు సైతం బాలలకోసం ఓశీర్షిక పెట్టితీరాలి అనే పరిస్థితి నేడు బలంగా వచ్చింది. ఇది మంచిదే. అయితే బాలలను తీర్చిదిద్దే ధోరణిలో మంచి రచనలు రావాలి. జానపద ధోరణిలో కథలు చదవడానికి బాగానే ఉంటాయి. తరువాత వాటి ఫలితాలు ఏమిటి? భావిపౌరులైన బాల బాలికలను ఆలోచింప చేసే రచనలు రావాలి. వాటి ముద్రణ చిత్రాలు వారిని ఆకర్షించేలా ఉండాలి.

చిన్న వయసులో పిల్లల మనసులో ఏ విషయం, ఏ భావం బలంగా నాటుకుంటుందో అదే పెద్ద అయాక వారి భవిష్యజ్జీవితంమీద బల మైన ముద్ర వేస్తుంది. ఆ దృక్పథంతో బాలల రచనలు వారి భావి జీవితనౌకకు చుక్కాని కావాలి.

బాలలకోసం నడుపుతూన్న ఎన్నో పత్రిక లతోపాటు పెద్దల పత్రికలలో బాలల విభాగాలు చాలా ఉన్నాయి. కొన్నికొన్ని పత్రిక లలో బాలలనే దృష్టిలో పెట్టుకొని మంచి మంచి కథలూ గేయాలూ వేయడమే కాదు - విజ్ఞానదాయకమైన ప్రశ్నలు- క్విజ్‌లు ఎన్నో నిర్వహిస్తున్నారు.

నేడు బాలల సాహిత్యం ఒకనాటికంటే చాలా ముమ్మరంగా వెలువడుతూంది. వారికి అని "బాలల అకాడమీ" స్థాపించబడింది. ఇది నిజంగా హర్షించదగిన విషయం!



# బాలలకోసం గేయ కథలు

- ఆలపర్తి వెంకట సుబ్బారావు

లయితో గూడిన గేయానికైనా, గేయ కథకైనా పసిపిల్లలు మురిసిపోతారు.
లయబద్ధమైన గేయ కథ మనసుకు సదా ఆనందదాయి కదా!

గేయ కథల్లోని నీతులు పసిడి హృదయాల్లో చక్కగా హత్తుకుంటాయి. ముందు ముందు వాళ్ల ఉన్నతులు గావడానికి ఉపయోగపడతాయి. అలాంటి తీయని గేయ కథల్ని, వాటి అందించిన రచయితల్ని గూర్చి యిచ్చట ముచ్చటించుకుందాం!

మొట్టమొదట కీర్తిశేషుడు మహాకవి గురజాడవారు వృషభగతి రగడకు దగ్గరగా వుండే 'ముత్యాల సరాలు' అనే సరిక్రొత్త మాత్రా ఛందస్సులో-

"మేలిమి బంగరు మెలతల్లారా!
కలువల కన్నుల కన్నెల్లారా!
తల్లుల గన్న పిల్లల్లారా!
విన్నారమ్మా యీ కథను?"

అంటూ- 'పుత్తడి బొమ్మ పూర్ణమ్మ' కథను వాడుక భాషలో గేయకథగా ఆలపించారు.

పూర్ణమ్మ పాఠక హృదయాకాశంలో పూర్ణిమలా నిలచింది.

కీర్తిశేషులు డాక్టర్ గిడుగు సీతాపతి గారి 'బాలానందం' లో 'ఎలుక-పిల్లి' అనే ఓ వింత గేయకథ వుంది. ఎంతో హాస్యరస భరితంగా వుంటుంది.

చిన్న తరగతుల తెలుగు వాచకాల ద్వారా 'కాకి-పక్కి' లాంటి గేయకథ లనేకం వెలుగులోకి వచ్చాయి. 'చందమామ' పత్రికలో కీర్తిశేషులు ఏటుకూరి వేంకట నరసయ్యగారు వరుసగా ఎన్నో ముచ్చటైన గేయ కథలు అచ్చమైన జాను తెనుగులో వ్రాశారు.

శ్రీ కవిరావుగారు గేయకథ లనేకం వ్రాశారు. వాటిని 'బొమ్మరిల్లు', 'గేయకథలు' అనే రెండు సంపుటాలుగా ప్రచురించారు. 'బొమ్మరిల్లు' అనే గ్రంథానికి కేంద్రప్రభుత్వ బహుమతి లభించింది.

వీరిలాగానే పాత కథావస్తువులకు క్రొత్త భావాల రంగులు వేయడంలో ప్రతిభావంతులు 'బాలబంధు' బి. వి. నరసింహారావుగారు. వీరి 'ఆవూ-హరిశ్చంద్రా' అపూర్వ గేయకథా సంపుటి. సత్య నియతిలో, కరుణామయతలో హరిశ్చంద్రుని కన్న ఆవే మిన్న అన్న నిరూపణే 'ఆవూ-హరిశ్చంద్ర' కథ.

వీరు బాలబంధువు; వీరి మనసు కరుణా సింధువు. అందుచేతనే 'బాలహృదయం' అనే గేయకథలో "పాడుకొంటు ఆడుకొంటు పరవశాన బాలలచట తీరి కెరుగకుండ దినము తీరమంత తిరుగుచుండ్రు...అందరొక్క చేను ప్రేమబంధ మొక్క చేను అచట మనవలెనే

(ఆంధ్రప్రదేశ్ బాలల మహాసభ (1977) లో
ప్రముఖ నటులు
శ్రీ అల్లు రామలింగయ్య పాడినది)

చెప్పినట్టు వింటారా బాలల్లారా!
నా మాట తప్పకుండా పిల్లల్లారా!
చెప్పినట్టు వింటాము టీచరుగారూ!
మాకు గొప్పలేమి చెబుతారు మాష్టరుగారూ
కొట్టకుండ వుంటారా టీచరుగారూ!
మాకు పిట్టకథలు చెప్తారా మాష్టరుగారూ!
కొట్టబోను తిట్టబోను బాలల్లారా
మీరు గట్టిచదువు చదువుతారా పిల్లల్లారా
శ్రద్ధగాను చదివితేను బాలల్లారా
మీరు బుద్ధిమంతు లవుతారు పిల్లల్లారా!
భక్తి శ్రద్ధ లున్నవండి టీచరుగారూ!
మేము చెడ్డపనులు చేయమండి మాష్టరుగారూ!
ముద్దులన్ని వింటారా పిల్లల్లారా
మీ బుద్ధికెంతో మెచ్చేను బాలల్లారా!
-ఎం. వి. ఎస్. బాబురావు

అందరునూ మనవలెనూ అనుకొంటూ..."
తమ భావనా జగతిలో ఓ 'బాలజగతి'ని సృష్టించుకున్నారు. 'ఏకలవ్యుడు', 'జాబాలి బిడ్డ' అను గేయకథలు గూడా నూతన దృక్పథంతో వ్రాసినట్టివే!

కథను అందంగా ఆరంభించి, సున్నిత హాస్యంతో రంగరించి, ఉన్నత శిల్పంతో నడిపించి, కొసమెరుపుతో సొంపుగా ముగింపు చేయగల కవి శ్రీ 'రవి' గారు.

వీరి 'బాలగేయాలు' అనే గ్రంథంలో కొన్ని మంచి గేయకథ లున్నాయి. 'బక్కవాడు-వస్తాడు', 'లేచిపోయినసకిలం', 'ఒట్టు', 'తిక్కలవాడు' కథలలో హాస్యం అందంగా లాస్యం చేసింది.

"కలకల లేనగవు లొలుక
కదలిరండు పిల్లలార!
కైకొను డిది మీకొరకే
కథాగేయ సుధానిధి!"

అంటూ- ఈసప్ కథలను "కథాగేయ సుధానిధి"గా అందించారు-నండూరి రామమోహనరావుగారు. వీరి రచనల్లో అంత్యప్రాసలు అత్యంత మనోహరంగా వుంటాయి. నడకలు రకరకాల మాత్రాఛందస్సులలో నడుస్తాయి. ముఖ్యంగా- 'కప్ప-సింహము' కథ 'పంచచామరవృత్తము' లో పంచకళ్యాణిలా నడుస్తుంది. దాని నడక ఎంత హుందాగా, అందంగా వుందో చూడండి:

"తటాక నిర్మలోదకమ్ము త్రావ,
సింహ మొండు, వే
హుటాహుటిన్ గమించి,
చెర్వు ఒడ్డు చేరి నిల్వగా
తటాన నున్న రంధ్రమందు
దాగియున్న కప్పయున్
చటాలునన్ బెకాబెకంచు
సవ్వడించె నల్లనన్".

'సింహము-నక్క' కథ 'ముత్యాల సరాల'లో వ్రాశారు.

'కపటమిత్రుల పొగడ్తలు-
గడ్డికప్పిన అగడ్తలు'
'రాళ్లు గంపెడున్న నేమి ?-
రత్న మొక్కటైన చాలు'
'అందని పుడు పండు
ద్రాక్షలైనా పుల్లనివే!'

ఈరీతి ప్రతి కథకీ చివర ఓ నీతి చేర్చబడింది.

'అలపర్తి' గేయకథలు 'నెమలి కన్నులు', 'నిమ్మతొనలు' అనే సంపుటాలుగా వెలు

వడ్డాయి. అనుశ్రుతంగా వస్తున్న కథలకు గేయకథారూపమే 'వెమలికన్నులు' సంపుటి.

తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా వుండే కమ్మని గేయకథల సంపుటి 'నిమ్మతొనలు'. ఇందులోని రచనలన్నీ నకిలీగాని కథావస్తువులతో, చికిలీ బెట్టిన భాషతో, బాల మనస్తత్వ చిత్రీకరణలతో చిత్ర విచిత్రంగా వుంటాయి.

'పండు' అనే కథలో పండు పెడతారంటే కొండంత ఆశతో గుడికి పరుగెత్తింది - ఓ అమ్మాయి. అరటిపండేమో నని ఆశపడింది. మామిడిపండేమోనని మనసుపడింది. తీరా-

"చెరచెరా చాచంగ చేతుల్లు రెండు
పెట్టాడు పూజారి వీబూది పండు!"

పాపం! ఇక ఆ అమ్మాయి మనస్సెలావుండు?

చింతా హనుమంతరావుగారి 'బాల గేయాలు' మరో గేయకథల పుస్తకం. అనాదిగా వస్తున్న అనేక కథలను ఇందులో గేయకథలుగా వ్రాశారు. ఇవి హిందీ, ఆంగ్ల భాషలలోనికి అనువదింపబడ్డాయి.

ఐ. నాగమల్లారెడ్డిగారి 'మాతృహృదయం' సంపుటిలో గూడా మంచి మంచి గేయకథలున్నాయి. కె. వి. రమణారెడ్డిగారు ఇతర భాషాకథలు ఆధారంగా 'గజ్జెలు-గంటలు' వీనులవిందుగా వినిపించారు. గేయకథా రచనలో ప్రతిభావంతులైన కె. సభా గారు ఆంధ్రప్రభ వారపత్రికలో అనేక గేయకథలు వ్రాశారు. అందు కొన్ని పుస్తకరూపం దాల్చాయి.

గేయకథలలో కొన్ని పెద్దకథలు (గేయకావ్యాలు) గూడా వున్నాయి. 'చందమామ' పత్రికలో ఉత్పల సత్యనారాయణాచార్య గారి 'గంగావతరణం' తో పెద్ద గేయకథలకు అవతరణోత్సవం జరిగింది. అది అందరి మన్ననలూ అందుకుంది. అది మొదలు వరుసగా 'క్షీరసాగర మథనం', 'శమంతకమణి', 'దాస్య విముక్తి', 'దక్షయజ్ఞము', 'పార్వతీకల్యాణం', 'కుమారసంభవం' అను పెద్ద గేయకథలు 'చందమామ' పత్రికవారే అందించారు. వాటి నన్నిటినీ కలిపి 'ఉత్పలమాల' పేర పుస్తకంగా రూపొందించారు. ఆ తర్వాత 'బొమ్మరిల్లు' పత్రికలో 'ఉత్పల' వారివే 'శ్రీకృష్ణ లీలలు', 'అర్జునుని తీర్థయాత్ర' ఇత్యాది రచనలు వచ్చాయి. వారి కథలన్నీ 'త్రిశ్ర' గతిలో నల్లేరుపై బండిలా సాఫీగా సాగిపోతాయి! అవసరార్థం ఎడ నెడ నడకలు మార్చి వడుపు సాధిస్తారు. మెరుగు చేకూరుస్తారు. వారిభాష కావ్యభాషలా కమనీయంగా వుంటుంది. శ్రీ ఉత్పలవారి రచనల ప్రేరణతో 'అలపర్తి'వి - 'ఏకలవ్యుడు', 'స్నేహధర్మం' అనే పెద్దకథలు వచ్చాయి.

జాతినేత, శాంతిదూత జవహర్‌లాల్ నెహ్రూ జీవితగాథను, రసహృదయులు 'వహ్వారె' యన 'జాతిరత్నం' పేర గేయ



కావ్యం రచించారు డా. సి. నారాయణరెడ్డి గారు.

దక్షతతో మరో 'దక్షయజ్ఞం' చేశారు - కవుల ఆంజనేయశర్మగారు. ఇది చాలాకాలం క్రితం 'బాలమిత్ర' పత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడింది.

'గురుకులం' పత్రికలో బుద్ధభగవానుని గాథను అక్షరబద్ధం చేశారు రెడ్డి రాఘవయ్యగారు.

ఇటీవల వేజండ్ల సాంబశివరావుగారు "ఉడుతా! హుషారా!" అనే ఓ తమాషా గేయకథ అందించారు.

ఇంకా- 'మరో ప్రపంచం' సృష్టించిన మహాకవి శ్రీశ్రీ గారు- కంఠం మూగవోయినా, కలం గళంగా కవనం వినిపించగల దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు - మధుర మధురంగా తాజాకథల నందించే మధురాంతకం రాజారాం గారు- 'పిల్లల్లారా! రారండీ!' అని పిలిచి, కథలు వినిపించగల ఎల్లోరా గారు- నేపథ్యగానమే గాక, బాలలమధ్య నిలచి గేయ కథ లాలపించగల పి. బి. శ్రీనివాస్ గారు- పత్రికల్లో అప్పుడప్పుడు ప్రత్యక్షమయ్యే వజ్రపాణిగారు. శ్రీనివాస కాశ్యపగారు, చావలి రామచంద్రరావుగారు (సమతారావు గారు), అడుసుమల్లి గారు, శ్రీ తాళ్ళపూడి గారు, సోమంచి సూర్యనారాయణశర్మ గారు, భాస్కరం. ప్రభాకరంగార్లు, అందరూ గేయ కథారచనలో చేయి తిరిగిన వారే! పసిపాపల పాలమనసు తెలిగినవారే!!



# బాలల సంక్షేమానికి జాతీయ పథకము

— డా॥ పి. తిరుమలరావు

సంక్షేమ కార్యక్రమాల ద్వారా తగిన వాతావరణం ఏర్పరచడం దేశ ప్రగతికి ప్రణాళికలను తయారుచేసే ప్రతి ప్రభుత్వపు బాధ్యత!

ఏజాతి పురోగమనానికైనా పిల్లల సంక్షేమ కార్యక్రమాలు పునాదిరాళ్లు. పిల్లలు ఆరోగ్యవంతులై, విద్యావంతులై, ఉల్లాసంతో పెరిగితే, వారికి మంచి ఆరోగ్యం గల దేహంలో ఆరోగ్యవంతమైన మేధ వుంటుందని ఆర్యోక్తి వుండనే వుంది. దేశ ప్రజల, భావి తరాల ఆరోగ్యం, మనం కని పెంచే తరాల పిల్లల ఆరోగ్యంమీద ఆధారపడి వుంటుంది. ఇది ముఖ్యంగా, కొత్తగా యీ శతాబ్దంలో స్వాతంత్ర్యం వచ్చి, అభివృద్ధి చెందుతున్న దేశాలు, గమనించవలసిన విషయం. ఈ శ్రద్ధ ప్రథమంగా అయిదు సంవత్సరాల లోపు పిల్లలు మొదలు తరువాత ఆరు మొదలు 16, 18 సంవత్సరాల వయసుగల పిల్లలవరకు కావలసిన సంక్షేమ కార్యక్రమాలద్వారా, తగిన వాతావరణం ఏర్పరచడం, దేశప్రగతికి ప్రణాళికలను తయారుచేసే ప్రతి ప్రభుత్వపు బాధ్యత. అది పురస్కరించుకొని, మనకు స్వాతంత్ర్యము వచ్చిన 27 సంవత్సరాల తరువాతనయినా, ఒక పథకంద్వారా, కార్యక్రమాన్ని రూపొందించడానికి భారత ప్రభుత్వం నిశ్చయించినందుకు భారత బాలలందరూ కృతజ్ఞులు.

## పథకములోని ముఖ్యాంశములు

బాలల జాతీయ పథకంలోని ఉపోద్ఘాతాన్ని, ఆశయాలను మనం గమనిస్తే, మనం స్థాపించుకున్న బాలల అకాడమీ ఆవశ్యకత, ఆ ఆశయములను అమలుపరచుటకు, మన రాష్ట్ర ప్రభుత్వం బాలల అకాడమీద్వారా చేయుచున్న కృషి మనకు అవగాహన కాగలదు.

ఉపోద్ఘాతములో ఈవిధముగా వ్రాయబడినది: దేశములోని బాలలు మనకు అతి ముఖ్యమయిన మూలధనము వంటివారు; ఆస్తివంటివారు. వారి స్వభావమును రూపొందించుట, ఆవశ్యకతలను తీర్చుట, మన ప్రథమ కర్తవ్యము. మన ప్రణాళికలలో పిల్లల సర్వతోముఖాభివృద్ధికి కావలసిన పథకములకు, కార్యక్రమములకు ప్రాధాన్యం వెంటనే యివ్వవలెను. మన సంఘసంక్షేమమునకు, భావి తరమునకు మూలధనమయిన పిల్లల విషయము శ్రద్ధగా చూచినచో వారు ఆరోగ్యవంతులుగాను, మంచి పౌరులుగాను వుందురు. మనము నిర్మించుకొనబోవు సంఘమునకు మానసిక

## బాలలంటే?

బాల లంటే దేవుడనే
భావించుట కద్దు
వారి నెపుడు కోపముతో
ఏడిపించ వద్దు
చూడగానె వా రంటే
చేయు డెపుడు ముద్దు
ఆటలతో పాటలతో
ఆడించుడు ప్రతి పొద్దు!

-రెడ్డి రాఘవయ్య

ముగా చురుకుగాను, నైతిక విలువలుగల ఆలోచనలతోను, కావలసిన శక్తిసామర్థ్యాలు, కౌశలము, లేక నిపుణత కలిగి, మనం కలలు గనే సంఘమును నిర్మించుకొని, నిల బెట్టుకొనవలె ననే ఆసక్తితో కూడిన ఉత్సాహ వంతులుగా వుండెదరు. పిల్లలు త్వరితగతిని పెరుగుచుందురు. వారు పెరుగుతున్న వయస్సులో వారందరికి కావలసిన సదవకాశములు, సమముగా కల్పించుటయే మన ముఖ్యాశయము. అందరిమధ్య వున్న అసమానత్వమును పోగొట్టుటకు, సమదృష్టి గల సాంఘిక న్యాయమును అందరికి సమకూర్చుటకు ఇది చాలా అవసరము!

### ఆశయములు

మన రాజ్యాంగములో, పిల్లల ఆవశ్యకతలను గురించి, మనము వారి ఎడల నిర్వర్తించవలసిన విధులను గురించి, స్పష్టముగా వ్రాయబడివున్నది. దేశీయ విద్యావిధానం గురించి మనం తీసుకున్న తీర్మానములో, ప్రతి రాష్ట్రీయము పిల్లల విద్యావిధానము గురించి, విపులముగా హెచ్చరించి వున్నది. మనము కూడా ఐక్యరాజ్యసమితి వారు పిల్లల హక్కుల గురించి విశదీకరించిన తీర్మానమునకు కట్టుబడి వున్నాము. మనదేశ పరిస్థితులను బట్టి మనకు అందుబాటులో వున్నంత వరకు, ప్రయోజనకరమైన కార్యక్రమముల ద్వారా బాలలకు న్యాయమును చేకూర్చవలెను. ఈ పై దృక్పథముతో మన భారత ప్రభుత్వము ఈ బాలల జాతీయ సంక్షేమ పథకము ద్వారా జాతీయవిధానము అవలంబించు తీర్మానమును ఆమోదించినది.

### విధానములు - పనులు

తల్లి గర్భవతి అయినప్పటినుండి, అంటే శిశువు గర్భములో ప్రవేశించినది మొదలు, శిశువు పుట్టి, పెరిగే వయస్సులో వున్నంత వరకు, వారికి కావలసిన, అన్నిరకములైన, కార్యక్రమములు సమకూర్చవలె ననుట మన జాతీయ విధానము (National Policy). ఈ కార్యక్రమములు చురుకుగా నడిపి, అనతికాలంలోనే, పిల్లలందరికి యీ కార్యక్రమముల వలన కావలసిన ఫలితములు అందించుటయే మన ప్రథమ కర్తవ్యముగా ప్రభుత్వము పని చేయవలసి యున్నది. దేశములో ఉన్న పిల్లలందరికి సర్వతోముఖ వికాసము కలిగించగల మంచి వాతావరణమును కలిగించుటయే ఈ పథకము యొక్క ఆశయము. ఈ లక్ష్యసిద్ధికి యీ క్రింది కార్యక్రమములు ఏర్పాటు చేయడమయిన దని పదిహేను కార్యక్రమముల నుదాహరించిరి. అందులో ముఖ్యమయిన కొద్ది విషయములనే మనము ప్రస్తుతం మన 'బాలల అకాడమీ'కి సంబంధించినంత వరకు గమనిద్దాం.

1. అందరు పిల్లలకు ఆరోగ్య పథకములు అందుబాటులో వుండవలెను.

2. మంచి పుష్టికరమైన ఆహారమును

అంద జేసి, ఏ లోటు లేని ఆహారమును అంద జేయవలెను.

3. గర్భిణీ స్త్రీలకు కావలసిన ఆహారముల సమకూర్చుచు, సామాన్యులగు తల్లి దండ్రులకు మంచి ఆహారముల గురించి విశదీకరించి తగినజ్ఞానబోధ చేయవలెను. దేశంలో అజ్ఞానం వలన కొన్ని మంచి పదార్థములే జబ్బుచేయునను మూఢ నమ్మకము ఉండుటవలన తేలికగా, చవుకగా దొరికినా తినరు. అందుచేత, మన పోషకాహారములను గురించి తల్లిదండ్రులకు, పెద్దలకు బోధించుట అవసరము.

4. పదునాలుగు సంవత్సరముల వయస్సు పిల్లలందరకు ఉన్న సౌకర్యముల పురస్కరించుకొని నిర్బంధ విద్యా విధానమును అమలులో పెట్టవలెను. అంటే మనం 14 సంవత్సరములు నిండువరకు బాలలుగా భావించవలెనన్నమాట!

ఐదు సంవత్సరములలోపు వారికి, అంటే మూడు మొదలు అయిదు సంవత్సరముల లోపువారికి 'బాలవాడీల' (Nursery Schools) ద్వారా క్రమశిక్షణ, మనో వికాసమును కలిగించు కార్యక్రమములు ఆచరణలోకి తీసుకురావలెను.

5. మామూలుగా బడికి పోవుటకు అవకాశము కల్పించవలెను. బడికిపోని పిల్లలకు, వారివారి అవసరములను గమనించి, తగిన విద్యా విధానమును రూపొందించి, వారిని విజ్ఞానవంతుల చేయవలెను.

6. పిల్లల ఆరోగ్యమును పెంపొందించుటకు కావలసిన శరీర వ్యాయామము, ఆటపాటలతో కూడిన వినోద కార్యక్రమములు పరిజ్ఞానము, శాస్త్రజ్ఞానము కలుగజేయు కార్యక్రమములకు కూడ ప్రాముఖ్యం ఇవ్వవలెను.

7. ఈ కార్యక్రమము లన్నీ హరిజన, గిరిజన, వెనుకబడిన వర్గముల వారికి, బీదవారికి, దిక్కులేనివారికి. సాంఘికముగా వెనుకబడిన వారందరికి, ప్రప్రథమముగా అందజేసి వారిని పునరుద్ధరించవలెను.

8-15 ఎనిమిది మొదలు, పదిహేను వరకు వున్న సూత్రములలో ముఖ్యమయినవి మనస్సు సరిలేని పిల్లలు, బుద్ధిమాంద్యముగల పిల్లలు, వికలాంగులు ప్రత్యేక కార్యక్రమముల ద్వారా తరిఫీదు చేయబడుదురు. పిల్లలు బిచ్చమెత్తకూడదు. ప్రస్తుతం ఉన్న చట్టములు పిల్లల సంక్షేమ కార్యక్రమములకు అనుగుణముగా ఉండి వారికి తోడ్పడునట్లు మార్చబడును.



చూడ చూడ నీ రూపము
సుందరమై యొప్పు దేవ!
సొక్కి సొక్కి నీ వలపున
సోలి పరవశత గందును!

వినగ వినగ నీ నామము
వీనుల విందౌను నాథ!
చనగ చనగ నీ జాడల
సౌఖ్యము మునుముందె తోచు!

తలప దలప నీ లీలలు
తనువు పులకరించు స్వామి
వలచి వలచి దేవ నిన్నె
వంతలెల్ల మరచిపోతి!

-బసవరాజు అప్పారావు

మంచి మేధావంతులైన పిల్లలను గుర్తించి వారికి తగిన ప్రత్యేకావకాశములు-అందులో ముఖ్యముగా వెనుకబడిన తరగతులు, పరిస్థితులు గల పిల్లలకు-ఇవ్వబడును.

ఈ పై జాతీయ విధానమును దృష్టిలో నుంచుకొని, మన రాష్ట్రములో పిల్లల సర్వతోముఖాభివృద్ధి కార్యక్రమములను, మనోవికాస కార్యక్రమములను, అమలుపరచుటకే ప్రప్రథమముగా, మన రాష్ట్రప్రభుత్వము "బాలల అకాడమీ" (బాలల విద్వత్ సభ) ఏర్పాటు చేసినది. బాలల సర్వతోముఖాభివృద్ధికి, మనోవికాస కార్యక్రమములకు "బాలల విద్వత్ సభ" ఎంతయు తోడ్పడగలదు.

## మనోవికాస కార్యక్రమముల ఆవశ్యకత

పిల్లల దేహారోగ్యమును కాపాడుటకు, వారి మరణసంఖ్య తగ్గించుటకు తగినచర్యలు తీసుకొనిన తరువాత, పెరుగుచున్న పిల్లల మనస్సు ఆనందముతో ఓలలాడినకాని వారికి తగిన "మానసిక ఆరోగ్యము" ఉండదు. "మానసిక ఆరోగ్యము"ద్వారా వారి మేధ కూడా అభివృద్ధిచెంది, వారికి ఉన్న సహజ ఆసక్తులను వివిధ రంగములలో వికసింపచేయుటకు సహకరించును.

పిల్లలలోని సహజ కళానైపుణ్యమును, రచనా కౌశలమును, సంగీత, నాటక, చిత్రకళాది రంగములలో ప్రవేశమును కల్పించి, వారివారి అభిరుచులను అభివృద్ధిచేయుటయే యీ 'విద్వత్ సభ' ముఖ్యాశయము. దేహారోగ్యము స్థూలముగా ఎంత ముఖ్యమో, మనోవికాస కార్యక్రమములు కూడా వారి ఆనంద జీవితమునకు అంత ముఖ్యము.

ఈ మధ్య కొంతమంది పిల్లలు మన ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీని కలుసుకొని, మీరు "యువజన కాంగ్రెసు"ను ప్రోత్సహించినట్లు "పిల్లల కాంగ్రెసు"ను కూడా ఏర్పాటు చేయవలెనని కోరిరి. దానికి సమాధానముగా ఆవిడ పిల్లలు పెరుగుతున్న వయస్సులో రాజ్యసభలతో సంబంధము లేకుండా విద్య నభ్యసించి, పలువిధములైన కళలద్వారా, మనోవికాస కార్యక్రమములద్వారా, భావి పౌరులుగా, బాధ్యతతో కూడిన ప్రవర్తన గలవారై, తయారుకావలెనని సలహా యిచ్చిరి. తాను చిన్నప్పుడు, దేశము బానిసగా నున్నప్పుడు తయారుచేసిన బాలబాలికల వానరసేనలు యిప్పుడు అవసరములేదని, ఇప్పటి పిల్లలు అదృష్టవంతమయిన, ఈ తరమునకు చెందిన వారగుటచే తమ విద్యారంగములో ఎక్కువ కృషి చేయవలెనని సలహా యిచ్చిరి.

## 1977 పిల్లల సంవత్సరము

1977 వ సంవత్సరము పిల్లల సంవత్సరముగా దేశవ్యాప్తముగా పరిగణింపబడువని,

మన కేంద్ర ఆరోగ్యశాఖామాత్యులు కరణ్ సింగ్‌గారు ప్రకటించారు. అంటే యీ సంవత్సరము మాతా శిశు సంక్షేమ కార్యములమీద ప్రభుత్వము, ప్రజలు దృష్టి కేంద్రీకరించి, తగుచర్యలు తీసుకొందురు. ప్రతి సంవత్సరము ఐక్యరాజ్యసమితివారు ఒక్కొక్క రకమయిన కార్యక్రమములమీద ప్రపంచదృష్టిని కేంద్రీకరించి, మానవాళిని పీడిస్తున్న సమస్యలను ఒక్కొక్కటిని పరిష్కరించుటకు ప్రయత్నిస్తారు. ఈ కార్యక్రమములన్నియు ముఖ్యముగా అభివృద్ధిచెందుతున్న దేశములకు చాలా ముఖ్యమయినవి. ఎందుచేతనంటే, యీ కార్యక్రమముల నిర్వహించుటకు కావలసిన వసరులు మనదేశపు ఆర్థిక పరిస్థితుల మీద మాత్రమే ఆధారపడక, అభివృద్ధిచెందిన యితర దేశస్థులు కూడా విరివిగా సహాయము చేయుదురు. ఐక్యరాజ్యసమితి ప్రపంచప్రజల ఏకత్వమును, ఐకమత్యావశ్యకతను తరిచి తరిచి, జ్ఞాపకము చేయు కార్యక్రమములలో యీ ప్రగతిని కోరే సంవత్సరోత్సవములు చాలా ముఖ్యమయినవి. క్రిందటి సంవత్సరము స్త్రీసంక్షేమ వర్షముగా ప్రారంభించి ఇక వచ్చు పది సంవత్సరములవరకు స్త్రీజనోద్ధరణకు ప్రోత్సాహము యిచ్చు కార్యక్రమములు ప్రపంచమంతటా నడుపుచుండవలెనన్న నిర్ణయము అందరికి తెలిసినదే! అదే విధముగా 1977 వ సంవత్సరము పిల్లల సంవత్సరముగా తగు కార్యక్రమమును రూపొందించుకొనవలెనన్న మన భారత ప్రభుత్వ నిర్ణయము ఎంతయు కొనియాడతగినది.

ఈ పిల్లల సంవత్సరములో మంచి కార్యక్రమముల రూపొందించుకొని, యీ తరము మెరుగుపడుతూ, భావితరపు సౌభాగ్యమునకు పునాదులు వేసే బాధ్యత మన "బాలల విద్వత్ సభ" భుజస్కంధములమీద ఎంతైనా వున్నది.



# సోవియట్ భూమి నెహ్రూ ఎవార్డులు- ఆంధ్రప్రదేశ్ బాలల ప్రతిభ

-బి.ఎ. రెడ్డి

చిత్రకళలో బాలల భావనను అందుకోలేక ఒక్కొక్కప్పుడు పెద్దపెద్ద విమర్శకులు కూడా కలవరపడుతుంటారు.

లలిత కళలలో చిత్రకళకు ఒక విశిష్టమైన స్థానం వుంది. రేఖలలో, రంగులలో సూక్ష్మాతిసూక్ష్మమైన మానవ అనుభూతులు, అనుభవాలు, సంస్కృతి సభ్యతల వైభవాలు, జీవనగతులు, ప్రకృతి రమణీయతలు-ఒకటేమిటి ఎన్నెన్నో ఈ కళలో అందంగా చోటు చేసుకొన్నాయి. చిత్రకళలో బాలల చిత్రకళకు ఒక ప్రత్యేకమైన స్థానం వుంది. వారి సున్నితమైన హృదయాలలో చెలరేగే వేల కోరికలు రంగుల వలలై కల్పనతో రూపం దిద్దుకొంటూ వుంటాయి. బాలకళలు బాలల భావనను అందుకోలేక ఒక్కొక్కప్పుడు పెద్ద పెద్ద విమర్శకులుకూడా కలవరపడుతుంటారు.

గడచిన పన్నెండు సంవత్సరాలనుండి స్వర్గీయ పండిత జవాహర్‌లాల్ నెహ్రూ స్మృతిచిహ్నంగా "సోవియట్ ల్యాండు" పత్రికవారు బాలలకు చిత్రకళా పోటీలు ఏర్పాటు చేస్తున్నారు. భారత, సోవియట్ దేశాల మైత్రీ సంబంధాలను పెంచాలనే వుద్దేశ్యంతోను బాలలలో సర్జనాత్మక కళలపై అభిరుచి పెంచాలనే వుద్దేశ్యంతోను ప్రతియేటా ఈపోటీలను ఏర్పాటుచేస్తూ ఐదుగురు బాలలకు ఈ బహుమతుల నిస్తున్నారు. ఈ బహుమతులు పొందిన బాలబాలికలు వేసవిలో ఒక నెలరోజులు సోవియట్ రష్యాలో, నల్ల సముద్ర తీరంపై ఏర్పాటు చేయబడిన ఆర్తెక్ అంతర్జాతీయ బాలల శిబిరంలో గడుపుతారు. ఈ పోటీలలో 1973 నుంచి ఆంధ్రప్రదేశ్‌కు చెందిన బాలబాలికలు పాల్గొని బహుమతులు గెల్చుకోవడం మన రాష్ట్రంలోని పిల్లలందరకూ గర్వకారణం. ఈ బహుమతులన్నీ గెల్చుకొన్నది మన గోల్కొండ కేంద్రీయ విద్యాలయ విద్యార్థులే. ఇది ఇంకా విశేషం.

కుమారి బి. పద్మారెడ్డి సోవియట్ ల్యాండు నెహ్రూ ఎవార్డు పొందిన మొట్టమొదటి తెలుగు బాలిక. 1973 లో ఈ పాప చిత్రించిన "నేనే మాంత్రికుడనైతే" అనే శీర్షికపై రచించిన చక్కని నీటిరంగుల చిత్రానికి ఈ బహుమతి లభించినది. రంగురంగుల దుస్తులు ధరించిన ఒక మాంత్రికుడు తన మంత్రబలం చేత భారత సోవియట్ బాలలమధ్య ప్రేమ, స్నేహం, వాత్సల్యం, విజ్ఞానం, సంస్కృతు

ులను పెంపొందించాలని ప్రయత్నిస్తుంటాడు. బాలలకు ఈ సందేశాలుగల బెలూన్‌లను పంచిపెడుతుంటాడు. ఈ చిత్రంలో చాలామంది బాలలు భారత సోవియట్ జండాలను ఎగురవేస్తూ మాంత్రికుణ్ణి ఆహ్వానిస్తుంటారు కుమారి పద్మ ఆహ్లాదకరమైన రంగులను వాడుతూ చిరునవ్వులు చిందే బాలల చిత్రాలను ఎక్కువగా వేస్తుంది. ఈ చిరంజీవి గత ఎనిమిది సంవత్సరాలు వరుసగా శంకర్స్ అంతర్జాతీయ బాల చిత్రకళా బహుమతులను గెల్చుకొన్నది. ఈమధ్యే ఫిన్‌లాండులో జరిగిన తృతీయ అంతర్జాతీయ బాలల ప్రదర్శనలో బహుమతి గెల్చుకొన్నది. కామన్‌వెల్తు బాల కళా పోటీలో ఈమెకు యోగ్యతాపత్రం లభించింది. మనదేశంలో జరిగిన అనేక ప్రదర్శనలలో పాల్గొని చక్కని చిత్రాలను ప్రదర్శించింది. హైద్రాబాదు కళాభవన్‌లోను, రష్యాలో ఆర్టెక్ బాలల శిబిరంలోను తన "రామాయణ" చిత్రాలను ప్రదర్శించింది. కేంద్ర ప్రభుత్వంవారు ఈమెకు "టేలంట్ సెర్చ్ స్కాలర్‌షిప్" ఇచ్చి ప్రోత్సహించారు.

తరువాత సంవత్సరం అనగా 1974 లో "సోవియట్ మిత్రులతో నీ సెలవు దినాలు" అనే శీర్షికపై చిత్రించిన చిత్రాలకు మాష్టర్ యమ్. శేషురాం మరియు కుమారి టి. సెల్విలకు ఈ బహుమతులు లభించాయి. మాష్టర్ శేషురాం లోగడ అనేక బాల కళా ప్రదర్శనలలో పాల్గొని బహుమతులు పొందాడు. 1974 లో హైద్రాబాద్‌లో జరిగిన శివ అఖిల భారత అంతః కేంద్రీయ విద్యాలయ చిత్రకళా ప్రదర్శనలో అత్యుత్తమ బహుమతిని ఇ-నో-హికారి (జపాన్) వారి ప్రదర్శనలో కూడా బహుమతిని సంపాదించాడు. చి. శేషురాం అతిప్రకాశవంతమైన రంగులు వాడి తన చిత్రాలను ఎంతో ఆకర్షణీయంగా చిత్రించి మెప్పిస్తాడు. ఈ బాలుడు నవరంగ్ చిత్రకళా నికేతన్ - వెల్లటూరు, రోటరీ క్లబ్ - హైద్రాబాదు, లలితకళా సమితి - సిద్దిపేట మున్నగు సంస్థలు నిర్వహించిన పోటీలలో బహుమతులు పొందాడు. తాను చిత్రించిన 25 చిత్రాల "ప్రహ్లాద చరిత్ర"ను హైద్రాబాదు, ఆర్టెక్ బాలల శిబిరంలోను ప్రదర్శించి భారత సోవియట్ బాలలకు కనువిందు కలిగించాడు.



"నేనే మాంత్రికుడనైతే"
కుమారి బి. పద్మారెడ్డి

అదేవిధంగా కుమారి సెల్వి రంగుల కలయికలో క్రొత్తపోకడలు చూపి తన చిత్రాలను ఆకర్షణీయంగా చేయగల్గిన ప్రతిభావతి అయిన బాలిక. కుమారి సెల్వి కూడ దేశం నలుమూలలా జరిగిన ప్రదర్శనలలో పాల్గొని

పడగ తోకయు నొక్కింత వాయుబలము
నమరినంతన పెనుబాము నైతినంచు
ఇనుని మ్రింగగ నింగిపై కెగసెదౌర!
కాలికూలవె మసియౌచు గాలిపడగ!

గాలియడరిన నెగురుచు గాలిపడగ
డింకి కొట్టుచు వడి బల్లిటీలు వైచి
తోక త్రెంచుక నేలపై దొరలియాడు
గాలిపడగరో! నీకింత కావరంబ!

-నాళము కృష్ణారావు

ప్రతిభ చూపింది. ఈ చిన్నారికూడ తన సంపూర్ణ రామాయణం" చిత్ర చయనికను ఆంధ్రప్రదేశ్‌లోనూ, ఆర్టెక్ బాలల శిబిరంలోనూ ప్రదర్శించి పెక్కుమంది బాలబాలికలను ఉత్తేజపరచినది. కేంద్ర ప్రభుత్వం వారు కుమారి సెల్వికి కూడ "టేలెంట్ సెర్చ్ స్కాలర్‌షిప్" ఇచ్చి ప్రోత్సహిస్తున్నారు.

ఇక 1975 లో మాస్టర్ కె. వి. ప్రసాద్ చిత్రించిన చిత్రానికి సోవియట్ ల్యాండు నెహ్రూ ఎవార్డు లభించింది. ఈ చిత్రానికి శీర్షిక "**May there always be sunshine-May there alwnys be peace-May there always be Mummy-May there always be me.**" తన సోవియట్ యాత్రా సందర్భంలో మాస్టర్ ప్రసాద్ తెలుగు పండుగలకు, భారతీయ సంస్కృతికి సంబంధించిన అనేక చిత్రాలను చిత్రించి హైద్రాబాద్‌లోను, రష్యాలో ఆర్టెక్ బాలల శిబిరంలోను ప్రదర్శించి మన పండుగల విశేషాలను వాటి ప్రాముఖ్యమును వెలుగులోకి తెచ్చాడు. చి. ప్రసాద్ ఆర్టెక్ శిబిరంలో జరిగిన చిత్ర కళా పోటీలలో పాల్గొని ప్రథమ బహుమతి పొందడం ముదావహం. మాస్టర్ ప్రసాద్ నైపుణ్యాన్ని రష్యాలో భారత రాయబారి శ్రీ ఐ. కె. గుజ్రాల్ కూడ ప్రస్తుతించారు.



"సోవియట్ మిత్రులతో నీ సెలవు దినాలు" మాస్టర్ ఎమ్. శేషురాం

ఇదే సంవత్సరం చిరంజీవులు టి. శ్రీనివాస నాయుడు, పి. చంద్రశేఖర్‌లకు నెహ్రూ ఎవార్డు కమిటీవారు యోగ్యతాపత్రాలను బహూకరించారు. ఈ బాలలిద్దరూ కూడ అటు చిత్రకళలోనూ ఇటు చదువులోనూ ప్రతిభావంతులే.

1979 లో జరిగిన పోటీకి శీర్షిక "నా సోవియట్ యాత్ర." ఈ అంశంపై చిత్రించిన నీటిరంగుల చిత్రానికి మాస్టర్ యమ్. రామకృష్ణకు ఈ బహుమతి లభించింది. చి. రామకృష్ణ తాను సోవియట్ రష్యాలో చూడదల్చుకొన్న ముఖ్యమైన ప్రదేశాలను, అచ్చటి బాలలను తన వూహాగానంతో మనోహరంగా చిత్రించాడు. ఇప్పుడు పదవ తరగతి చదువుతున్న మాస్టర్ రామకృష్ణ ఈమధ్య జరిగిన ఐదవ అఖిల భారత అంతః కేంద్రీయ విద్యాలయ బాలల చిత్రకళా ప్రదర్శనలో వుత్తమ పురస్కారాన్ని కూడా పొందాడు. తాను, వచ్చే వేసవిలో రష్యా ప్రయాణానికిగాను తయారౌతున్నాడు. తనతోపాటు "పంచతంత్ర"కు సంబంధించిన గాథలను చక్కగా చిత్రించి తీసుకొనివెళ్లి సోవియట్ బాలలకు చూపుదామని ఆసక్తితో వున్నాడు. ఇదే సంవత్సరం ప్రతిభావంతులైన కుమారి శిఖ, మాస్టర్ లక్ష్మణన్‌లకు యోగ్యతాపత్రాలు లభించాయి.

ఇదీ జరిగిన కథ-జరుగుతున్న కథ. వేలాది మంది బాలబాలికలు పాల్గొనే ఈ అఖిలభారత పోటీలో ఇంతమంది ఆంధ్రప్రదేశ్ విద్యార్థినీ విద్యార్థులకు బహుమతులు దొరకడం చాల ముదావహం. రాబోయే సంవత్సరాలలో గూడ ఇదేవిధంగా తమ కళాప్రతిభతో భారత సోవియట్ మైత్రిని మన బాలలు పెంపొందింపజేస్తారని ఆశిద్దాం.



"సోవియట్ మిత్రులతో నా సెలవు దినాలు" కుమారి టి. సెల్వి

# పిల్లలలో చదివే అలవాట్లు - పెద్దల బాధ్యత

- కె. ఆర్. కె. మోహన్

పిల్లలకు చిన్నతనంలో ఏ విధమైన అలవాట్లు చేస్తే పెద్దతనంలో కూడ అవే ఉండిపోతాయి. అందుకే పుస్తకాలను చదివే అలవాట్లను చేయడంలో పెద్దలు చాలా శ్రద్ధ వహించాలి.

**పి**ల్లలకు తొలి గురువు తల్లి. తర్వాత తండ్రి. ఆపైనే గురువు. అందుకే ఆర్యులు 'మాతృ దేవోభవ, పితృదేవోభవ'; 'ఆచార్య దేవోభవ' అన్న సూక్తులలో తల్లిదండ్రులకు ప్రథమ, ద్వితీయ స్థానాలు ఇచ్చారు. దీనినిబట్టే పిల్లల భావిజీవితంలో తల్లి దండ్రుల పాత్ర ఎంత ముఖ్యమైనదో గ్రహించవచ్చు.

పిల్లలు శైశవావస్థలో నున్నప్పుడు తప్పటడుగులు వేయడం పరిపాటి. అవి మనకి ముద్దుని కల్పిస్తాయి. కాని వారిభావిజీవితంలో తప్పటడుగులు వేయకుండా బలమైన పునాదిని పెద్దలే వేయాలి.

పిల్లల మనస్సు మైనంవంటిది. దానిని మనం ఏవిధంగా మలిస్తే ఆవిధంగానే వారు రూపొందుతారు. అందుకే వారిని క్రమబద్ధమైన, ప్రయోజన పూర్వకమైన జీవితం గడిపేవారుగా చేయవలసిన బాధ్యత పెద్దలదే. పిల్లలు మాటలు నేర్చుకునేటప్పుడు సహజంగా తప్పులు మాట్లాడుతారు. ఎప్పటి కప్పుడు, పెద్దలు వారిని సరిదిద్ది, వారు స్వచ్ఛంగా మాట్లాడేటట్లు చూడాలి. వారికి ఒకసారి ఈవిధంగా అలవాటుచేస్తే వారు యావజ్జీవిత కాలమూ స్వచ్ఛంగా మాట్లాడుతారు. అలాగే పిల్లలు ఎదుగుచున్న కొద్దీ సహవాసదోషంవల్ల అసభ్యకరమైన, అపభ్రంశపు మాటలు నేర్చుకుంటారు. పెద్దలు, వారికి నయాన భయాన అటువంటి మాటలు మాట్లాడకుండా, మృదువుగా, సంస్కారవంతమైన భాషని మాట్లాడేటట్లు అలవాటు చేయాలి.

పురాణాలు, ఇతిహాసాలు మొదలైన మంచి గ్రంథాలలోని కథలు. మనిషి జీవితాన్ని మంచిమార్గంలో మలచడంలో చాలా దోహదం చేస్తాయి. మహాత్మాగాంధీ, నెహ్రూల వంటి మహనీయుల జీవితచరిత్రలు చదివినప్పుడు, వారి చిన్న వయస్సులో వారి తల్లిదండ్రులు వారికి వినిపించిన రామాయణ మహాభారతం వంటి గ్రంథాలలోని కథలు వారిని ఎంతో ప్రభావితం చేసినట్లు మనకు అర్థమవుతుంది. పిల్లలు కథలంటే చెవులు కోసుకుంటారు. వారి ఈ లక్షణాన్ని అవకాశంగా తీసుకుని, వారిని ఉత్సాహపరచి, ప్రాజ్ఞులుగా తయారుచేయగల కథలను వారికి

తల్లిదండ్రులు చెప్తూండడం ఎంతో అవసరం. మన ముందుతరం వరకూ తల్లి దండ్రులూ, అమ్మమ్మలూ, తాతయ్యలూ, పిల్లలకు ఈ విధంగా మంచి కథలు చెప్తూండిన విషయం మన కందరికి తెలిసిందే!

ఇక చదువుల విషయానికి వస్తే, మన ముందుతరం వరకూ పిల్లలచేత 'పెద్దబాలశిక్ష' 'సుమతీ శతకం', 'వేమన శతకం', 'దాశరథీ శతకం' వంటి పుస్తకాలు చదివించేవారు. 'పెద్దబాలశిక్ష' చిన్న పిల్లల పుస్తకమైనా, అందులో పెద్దలకి కూడా పనికివచ్చే విషయాలు ఎన్నెన్నో ఉన్నాయి. దీనిని చదివిన బాలలు ఎంతో ప్రపంచజ్ఞానాన్ని పొందగలిగేవారు. అల్లాగే 'సుమతీ శతకం' వంటి శతకాలు సులభశైలిలో మనస్సుకు హత్తుకునేటట్లు ఉండి, బాలలను మంచిమార్గంలో పెట్టడానికి దోహదపడేవి.

అలాగే 'పంచతంత్రం' ప్రాధాన్యం కూడా. రాజుగారి మందబుద్ధులైన పుత్రులను విష్ణుశర్మ అనే పండితుడు ఈ 'పంచతంత్ర' కథలతో ప్రజ్ఞావంతులను చేయడం ఇందులోని విషయం. 'పంచతంత్రం' నీతికి, ప్రపంచజ్ఞానానికి భాండాగారం వంటిది. అందువల్ల 'పంచతంత్రాన్ని' 'ప్రపంచ తంత్రం' అనడం సబబుగా ఉంటుంది. ఇట్టి విశిష్టమైన 'పంచతంత్రాన్ని' పిల్లలందరూ తప్పనిసరిగా చదివేటట్లు పెద్దలు చూడాలి!

పిల్లలకు మనం చిన్నతనంలో ఏ విధమైన అలవాట్లు చేస్తే పెద్దతనంలో కూడా అవే ఉండిపోతాయి. అందుకే పుస్తకాలను చదివే అలవాట్లను చేయడంలో పెద్దలు చాలా శ్రద్ధ వహించాలి. దురదృష్టవశాత్తు ఈ నాడు వస్తున్న సాహిత్యం చాలా చవుకబారుగా వుండి, పిల్లల్ని తప్పుత్రోవలు పట్టించేటట్లుగా



ఉంటున్నది. అర్థంలేని డిటెక్టివ్ నవలలు, సినిమా పత్రికలు, సెక్సు పుస్తకాలు, పత్రికలు-ఇవే ఈనాటి విద్యార్థులకు ఆదర్శప్రాయంగా ఉంటున్నాయి. వీటిని చదవడం-అందులోని నాయకులను అనుకరించడానికి ప్రయత్నించడం-వీటితో నీతివిలువలు పూర్తిగా దిగజారిపోయాయి. ఈ పరిస్థితిని అరికట్టాలంటే పిల్లలను పసితనంనుంచే మంచి కథలు చెప్పి, మంచి పుస్తకాలను చదివించి సరియైన వద్ధతిలో పెట్టడం ఒక్కటే మార్గం.

అయితే, మంచి పుస్తకాలు మనకు తగినంతగా ఉన్నాయా అంటే, లేవనే చెప్పాలి. తెలుగులో ఇతర సాహిత్యం అభివృద్ధి చెందినంతగా బాల సాహిత్యం అభివృద్ధి చెందలేదు. మంచి పుస్తకాలంటే కేవలం పురాణగాథలు, నీతి పుస్తకాలు మాత్రమే కానక్కరలేదు. వైజ్ఞానిక విషయాలు, మహనీయుల జీవిత-చరిత్రలు - వీటన్నిటినీ కూడా పిల్లలకు అర్థమయ్యే భాషలో, ఆకర్షణీయమైన చిత్రాలతో చిన్నచిన్న పుస్తకాలని ప్రచురించి, పిల్లలచేత చదివిస్తే, వారికి అట్టి పుస్తకాలయెడ అభినివేశం కలిగి, పెద్దవారు అవుతున్నకొద్దీ అటువంటి మంచి పుస్తకాలను చదవడం అలవాటు

చేసుకుంటారు. ఈ రంగంలో ప్రభుత్వం, ప్రచురణకర్తలూ, పత్రికలూ, రచయితలూ ఇతోఒధికంగా బాధ్యతాయుతమైన కృషిని చేయవలసి ఉంది. కాలక్షేపంకోసం డిటెక్టివ్ నవలలనూ, సినిమా పత్రికలనూ చదవడం తప్పుకాదు. కాని కేవలం వాటినే చదవడం పొరపాటు. ప్రధానంగా చదవవలసింది మంచి సాహిత్యం.

బాల సాహిత్యాన్ని పెంపొందించే ఉద్దేశంతో కేంద్ర ప్రభుత్వం విద్యామంత్రిత్వ శాఖ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వంటి సంస్థలు బహుమతులను ప్రకటించడం ద్వారా రచయితలను ప్రోత్సహించి, ఉత్తమసాహిత్య రచనను ప్రోత్సహిస్తున్నాయి. అయితే బహుమతి పొందిన రచయితలు వారి గ్రంథాలను వారే అచ్చువేసుకోవాలన్న నిబంధన ఉన్నందువల్ల, వారు వేసుకొనలేకపోవడం, వేసుకున్నా వాటిని అమ్ముకునే అవకాశం లేక వాటిని మురగపెట్టుకోవడం జరుగుతూంది. ఈ దురదృష్టకరమైన పరిస్థితిని తప్పించి, వారి సంకల్పాన్ని సఫలం చేయాలంటే, ఆయా సంస్థలు బహుమతి పొందిన గ్రంథాలను వారే ముద్రించి వివిధ గ్రంథాలయాలకు అందజేయాలి!

పిల్లలలో ఉత్తమ సాహిత్యాన్ని చదివే అలవాటు పెంపొందించడం ఏ ఒక్కరి బాధ్యతో కాదు. అది అందరి సమష్టి బాధ్యత. విద్యాలయాలలో బోధించే పుస్తకాలలో ఉత్తమమైన, నిర్దుష్టమైన అంశాలను పొందుపరచాలి. ప్రభుత్వం జాగరూకతతో అసభ్య సాహిత్యం ప్రచారంలోకి రాకుండా చూడాలి. ఫిలిం సెన్సార్ వారు అశ్లీలచిత్రాలు రాకుండా జాగ్రత్త వహించాలి. ఉత్తమ సాహిత్యం పెంపొందడానికి ప్రభుత్వమూ, ప్రచురణకర్తలూ, రచయితలూ సుసంఘటితమైన కృషి చేయాలి. ప్రోత్సాహకరమైన బహుమతులను ఇవ్వడం ద్వారా ఉత్తమ సాహిత్య రచనకి దోహదం చేసినట్లే ఉత్తమ సాహిత్య పఠనంలో కూడా పోటీలు పెట్టి, ఆకర్షణీయమైన బహుమతులను ఇవ్వడంద్వారా, మంచి పుస్తకాలను చదవాలనే ఆసక్తిని పెంపొందించవచ్చు. అన్నిటినీ మించి తల్లిదండ్రులు పిల్లలకు మంచి పుస్తకాలు చదివే అలవాటు చేయడం చాలా అవసరం.

ఉత్తమసాహిత్య పఠనాభిలాషను ఒక జాతీయ కార్యక్రమంగా భావించి, అందరూ కూడా సుసంఘటితమైన కృషి చేయడం చాలా అవసరం. అప్పుడే జాతికి మంచి పేరు ప్రతిష్ఠలు తేగలిగిన యువతరాన్ని రూపొందించడం సాధ్యమవుతుంది.



# గేయ నాటికలు

**– న్యాయపతి రాఘవరావు**

**గేయ నాటిక అనేది ప్రత్యేక కళా. ప్రత్యేక ప్రక్రియా. జనరంజకమైన గాథలను నృత్య నాటికలుగా ప్రదర్శించాలి.**

పిల్లలకు నాటకాలు వేయాలన్నా, చూడాలన్నా చాలా సరదా. పిల్లల్లో అభినయం, అనుకరణ ఒక సహజ గుణం.

బాలవాఙ్మయం వెతికిచూస్తే మన రచయితలు బోలెడు గేయకథలను వ్రాసి ప్రచురించారే గాని, నాటకాలూ, గేయనాటికలూ వ్రాయలేదు. కాస్తో కూస్తో ఛందస్సు వచ్చిన కవులు ఒక కథని యతిప్రాసల మధ్య ఇరికించి ఒక గేయకథగా వ్రాస్తున్నారు. ఈ గేయ కథలకు కథావస్తువుకోసం వెతుక్కోనక్కర లేదు. మనకి ఈసబు కథలూ, పంచతంత్ర కథలూ రెడీమేడ్‌గా లభిస్తాయి.

గేయ కథలు వేరు; గేయ నాటికలు వేరు. నాటికలు ప్రదర్శన యోగ్యంగా వుండాలి. వచన నాటికలలో ఆయా పాత్రలు స్వయంగా వారి వారి పాత్రలను ఉచ్చరించి, రంగస్థలముపై అభినయిస్తారు. గేయనాటికలలో పాత్రలు అలాగ ఉచ్చరించ నక్కరలేదు. నేపథ్యంలో గాయనీ గాయకులు ఆ పాత్రలను పాడి పోషిస్తారు. ఈ కోవకు చెందిన నాటిక ఆకాశవాణిలో ప్రసారం చేస్తున్నారు. ఆకాశవాణి ఒక ప్రసార సాధనంగా వచ్చినప్పటినుంచీ మన కవులు అనేక గేయ నాటికలను వ్రాసి ప్రసారం చేశారు; చేస్తున్నారు కూడాను. సర్వశ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి, మల్లవరపు విశ్వేశ్వరరావు, బాలాంత్రపు రజనీకాంతరావు, నారాయణరెడ్డి, దాశరథి, బాపురెడ్డి, ఉషశ్రీ, కొలకలూరి ఇనాక్ మొదలగువారు ఆకాశవాణి ద్వారా ఎన్నో గేయ నాటికలను వినిపించారు.

అయితే ఇందులో ఎవరూ పిల్లలకోరకు ప్రత్యేకంగా గేయ నాటికలు వ్రాసి రేడియో ద్వారా ప్రసారం చేయడం గాని, రంగస్థలంపై దృశ్యరూపంలో చూపడం గాని చేసినట్టు కనపడదు.

తెలంగాణా రచయితల సంఘం ప్రచురించిన 'చిరుగజ్జెలు' అనే పుస్తకంలో డా॥ నారాయణరెడ్డిగారు "సమతా ఫలం" అనే గేయ నాటికనూ, డాక్టరు దాశరథిగారు "వెన్నెల మడుగులు" అనే పిల్లల గేయ నాటికను ప్రచురించారు. కాని వాటిని రంగస్థలంపై ప్రదర్శించినట్లు కానము.

డా॥ నారాయణరెడ్డిగారు 'వెన్నెలవాడ' అనీ, 'గోకుల విహార్' అనీ రెండు గేయ (నృత్య) నాటికలను వ్రాశారు. కాని వాటి శైలి పిల్లల స్థాయిలో లేదని చెప్పాలి.



పిల్లలకొరకు గేయ నాటికలు వ్రాసినా, ప్రసారంచేసినా, ప్రదర్శించినా అందుకు ఆకాశవాణి పిల్లల ప్రోగ్రాంలకు మనం ఋణపడి వుండాలి. అటు మదరాసులోనూ, ఇటు హైదరాబాదులోనూ పిల్లలకొరకు గేయ నాటికలు ప్రసారంచేసిన సంస్థ ఆంధ్ర బాలానంద సంఘం. బెజవాడలో 'బాలభారతి' వారు కూడా కొన్ని గేయ నాటికలను ప్రసారం చేశారు.

మదరాసులో బాలానందం సంఘంవారు గురుజాడవారి "పూర్ణమ్మ కథ"ను సంగీత నాటికగా ప్రసారంచేసి, ఆ తరువాత ఆ గేయ నాటికను పదేపదే రంగస్థలంపై ప్రదర్శించారు. అదే విధంగా "చీకటిలో వెలుగు" అనే గేయ నాటికను అటు ప్రసారంచేసి, ఇటు రంగస్థలంపై ప్రదర్శించారు.

చిన్న పిల్లలకు రక్తి కట్టించిన కొన్ని గేయ కథలను నాటికలుగా రూపొందించి 'అన్నయ్య' బాలానందం వారిచేత రంగస్థలంమీద, చూపించారు. అందులో చెప్పుకోతగ్గవి "కుందేలూ-తాబేలూ", "చిలకమ్మ పెళ్ళి". "ఎలకమ్మ పెళ్ళి", "ఈగా-సాలీడు" నృత్య నాటికలుగా ప్రదర్శించి ఒక కొత్తదనం చూపించారు; విజయవాడలో శ్రీ బాలాంత్రపు రజనీకాంత రావుగారు రచియించి ప్రదర్శించిన "మూల స్తంభాలు" నృత్యనాటిక ఒక నూతన పోకడ.

పిల్లలకొరకు ఒక నృత్యనాటికను, వారి స్థాయిలో ప్రదర్శించాలంటే అందులో దేవతలూ, రాక్షసులూ (దుష్టులూ), జంతువులూ, పక్షులూ వుండాలి. మామూలు కథాగమనం వారికి రక్తికట్టదు. ఇది ఒక ప్రత్యేక కళ; ప్రత్యేక ప్రక్రియ. ఈ నాడు మన కళాకారులుగాని, నృత్యాచార్యులుగాని పాత పురాణ ఇతిహాస గాథలకే ప్రాధాన్యం ఇచ్చి పిల్లలచేత 'మోహినీ భస్మాసుర, శివపార్వతి, భృంగి, గిరిజా కళ్యాణం, గిరికా కళ్యాణం, శకుంతల, ధ్రువ విజయం, గౌతమబుద్ధ' - ఇత్యాది గాథలను నృత్యనాటికలుగా చూపుతున్నారు. ఇవి పిల్లలకొరకు ప్రత్యేకంగా వ్రాసినవి కావు. ఇంతవరకూ తరుచూ పెద్దలకొరకు వ్రాసిన గేయ (నృత్య) నాటికలను పిల్లలచే ప్రదర్శింపజేయుట చూస్తున్నాంగాని, పిల్లలకొరకు ప్రత్యేకంగా వారి స్థాయికి, వారి ఆనందం కోసం వ్రాసిన గేయ నాటికలను బహు తక్కువగా చూస్తున్నాం.

ఉదాహరణకు : ఆంధ్ర బాలానంద సంఘం వారు 'శ్రీరామ జననం' అనే పాతకథనే తీసుకొని అది సంగీత-నృత్య-వచన నాటికగా ప్రదర్శించారు. అందులో జానపద ప్రక్రియ కూడా ప్రవేశపెట్టి ఒక కొత్తదనం తెచ్చారు. చూచుటకు ఎంతో ముచ్చటగా వుంటుంది. "కుందేలూ-తాబేలూ" కథను గేయకథగా వ్రాసి, పిల్లలకు ఆయా జంతువుల వేషాలు వేసి, నేపథ్యగానంలో ఇద్దరు ముగ్గురు పాత్రధారులు గానంచేసి కథాగమనాన్ని సాగిస్తారు. ఈ గేయనాటికను దూరదర్శినివారు కూడా రికార్డు చేసుకున్నారు. హైదరాబాదులోవున్న

జవహర్ బాలభవన్ వారికి ధనం, బలగం వున్నది గమక వారు ప్రత్యేక కృషి చేసి పంచతంత్ర కథలను బాల బాలికలచేత ప్రదర్శింప చేయ వచ్చు.

మన పొరుగు రాష్ట్రాలు - ముఖ్యంగా బెంగాలు రాష్ట్రంలో చిల్డ్రెన్సు లిటిల్ థియేటరువారు పిల్లలకోసం ఎన్నో ప్రయోగాలు చేసి నృత్యనాటికలను ప్రదర్శిస్తున్నారు. కలకత్తాలో "అబన్ మహల్" అనే భవనాన్ని నిర్మించి, అందులో బాలలకు నృత్య నాటికలలో శిక్షణ ఇస్తున్నారు.

నృత్యనాటికలకు నృత్యాచార్యులు వుండాలి. వారికి మనం నూతన పోకడలు చూపాలి. అటు సంప్రదాయ నృత్య తరగతులు (కూచిపూడి, భరతనాట్యం) నడుస్తున్నా, ఇటు జనరంజకమైన గాథలను గేయ నాటికలుగా ప్రదర్శించాలి. ఆంధ్ర బాలానంద సంఘంవారే నూతన సాంఘిక సమస్యను గేయనాటికగా రూపొందించి ప్రదర్శించారు. అది ఒక అంధ బాలిక గాథ.

ముఖ్యంగా మనం గమనించవలసిన దేమిటంటే-

1. మనకు అసలు పిల్లలకొరకు తగినన్ని వచన నాటికలే లేవు!

2. గేయ (నృత్య) నాటికలు ఏవో కొద్ది వున్నా వాటిని ప్రదర్శనయోగ్యంగా చేయుటకు తగిన కళాకారులు కావాలి.

3. గేయనాటికల రచనలో కొత్తదనం చూపాలి.

4. జంతువుల దుస్తులూ, తొడుగులతో నృత్యనాటికల ప్రదర్శనలు మనోరంజకంగా వుంటాయి.

5. బాలల అకాడమీ మనకు వచ్చినది గమక ఒకవంక బాల కళాకారులనూ, ఇంకొక వంక బాల వాఙ్మయ రచయితలనూ ప్రోత్సహించాలి.

6. పిల్లలచేత శృంగార భంగిమలూ, అసభ్య అభినయాలూ నాట్యాచార్యులు చేయించ కూడదు.

7. ఇతర రాష్ట్రాలలోనూ, ఇతర దేశాల లోనూ పిల్లల రంగస్థల ప్రక్రియల తీరు తెన్నులు మనం పరీక్షించి మంచిని గ్రహించి అవలంబించాలి.



# బాలల జానపద గేయాలు

—డా॥ బిరుదురాజు రామరాజు

బాల గేయాలు ప్రధానంగా రెండు తీరులు. పిల్లలకోసం పెద్దలు తర తరాలుగా అందించేవి ఒక తీరువి; తమకు తామై పిల్లలే కూర్చుకొని ఒక తరం నుంచి మరొక తరానికి అందించేవి రెండో తీరువి.

అసలు జానపద గేయములే సహజత్వానికీ, సారళ్యానికీ నిలయాలు. అందులో బాలల గేయాలు ఈ గుణాలతోపాటు సౌకుమార్యానికీ, ముగ్ధమోహన రామణీయకానికీ, స్వచ్ఛందతకూ మారుపేరులు. పసిపిల్లల లేత శరీరాలు మనసులవలెనే వారి పాటలుకూడ మృదువులు, నిర్మలములు. ఈ పాటలలో కొన్ని వారి తరళ నేత్రాలవలె సరళసుందరాలు; కొన్ని వారి బోసినోటి నవ్వులవలె వెన్నెల కుప్పలు; మరి కొన్ని వారి చనుబాల నోటి గమగమలవలె సురభిళాలు; ఇంక కొన్ని వారి ధూళిధూసరాంగములవలె మోటు మాటల ప్రోవులు; మరికొన్ని వారి పెంకె ఏడ్పులవలె, మంకు పట్టుదలలవలె దుర్గ్రాహ్యములు, దుర్భేదాలు.

బాలల గేయాలు ప్రధానంగా రెండు తీరులు. పిల్లలకోసం పెద్దలు కూర్చి తరతరాలుగా అందించేవి ఒకతీరువి. తమకు తామై పిల్లలే కూర్చుకొని ఒక తరంనుండి మరొక తరానికి అందించేవి రెండోతీరువి. పిల్లలకోసం పెద్దలు పాడే పాటల్లో కూడా రెండు రకాలున్నవి. పిల్లలను లాలించటానికి పాడే లాలి పాటలూ, నిద్రపుచ్చటానికి పాడే జోల పాటలూ ఒక రకం; పిల్లలను ఆటలాడించటానికీ, అన్నం తినిపించేటప్పుడో, స్నానం చేయించేటప్పుడో వాళ్లకు ఆనందం కలిగించటానికీ, భక్తి, ప్రేమ మొదలైన విషయాలూ, సద్గుణాలూ నేర్పటానికీ, శారీరక పరిశ్రమకూ, మెదడుకు మేత పెట్టటానికీ పెద్దలు పాడేవి రెండవ రకం.

ఇక పిల్లలు తమకు తామై కల్పించుకొని పాడే పాటలు కూడా రెండు విధాలు. పెద్దవాళ్లు పాడే పాటలను అనుకరిస్తూ "కాళిదాసు కవిత్వం కొంత, తమ పైత్యం కొంత" అనే సామెతవలె పెద్దవాళ్ళ పాటల్లో తమ భాగం కొంత చేర్చి పాడేవి ఒక విధం. కేవలం స్వకపోల కల్పితాలుగా పాడుకొనేవి రెండవ విధం. పెద్దలనుండి సంక్రమించే పాటల్లో బాలలు తమ కవిత్వం కొంత చేర్చి ఒక తరం నుండి మరొక తరానికి అందిస్తుంటారు. ఇవి ఒక పాత ఆచారంవలె రానురాను అర్థవిహీనమై పోతుంటవి. పెద్దల పాటల్లోని ఆద్యంత ప్రాసలూ, యతులూ, యమకాలూ మాత్రం జారిపోకుండా నిలుస్తవి. వాటికి తోడుగా చేరే పిల్లల మాటలు-అర్థం ఉన్నవి కొన్ని, లేనివి కొన్ని చేరి-కాలప్రవాహంలో అన్నీ కలసిపోయి అయోమయం ఐపోతవి. అందుకే వీటిని Nonsense Rhymes అంటారు. పిల్లల కోసం పెద్దలు పాడే పాటలను Nursery

Rhymes అంటారు. అర్థంలేని పాటలు (Nonsense Rhymes) కొద్ది మార్పులతో దేశమంతటా ఒకే తీరుగా ఉంటవి. కాని బాలల స్వకపోల కల్పితాలు మాత్రం మండల మండలానికీ వైవిధ్యం ప్రదర్శిస్తవి. ఈ వైవిధ్యానికి కారణం పెద్దల పాటలవలె పిల్లల పాటలకు సంచారశీలత్వం తక్కువ ఉండటమే. ఈ నాల్గేకాక మరికొన్ని ఉపవిభాగాలున్నవి. అన్ని భాషలలోవలెనే తెలుగులోకూడా బాలల జానపద గేయాలు కొల్లలుగానే ఉన్నవి. కాని విరివిగా సేకరించటంగాని, సేకరించినవాటిని ఎక్కువగా ప్రకటించటంగాని, ప్రకటించిన వాని గూర్చి అధ్యయనమూ, అనుశీలనమూ ఎక్కువగా చేసినట్లుగాని అంతగా కానరాదు.



ఇక తీరుతీరులైన ఈ గేయాల స్వరూప స్వభావాల గూర్చి సంగ్రహంగా మనవి చేస్తాను. శిశువులను నిద్రపుచ్చటానికీ, లాలించటానికీ పెద్దలు పాడేవి జోలపాటలు, లాలిపాటలు. ఈ పాటల్లో ఎక్కువగా పరమాత్ముని లీలావిభూతిని కొనియాడేవి కొన్ని, శిశువు అందచందాలను, గుణాలను, దగ్గరి బంధువులను ప్రస్తావించేవి మరికొన్ని. భగవంతునికి చేసే షోడశోపచారాల్లో నిద్రపుచ్చటం - ఏకాంతసేవ-కూడ ఒకటి. ఆ సందర్భంలో పాడే జోలపాటలే, పిల్లలుకూడ పరమాత్మ స్వరూపులు కనుక, పిల్లలను నిద్రపుచ్చటానికి కూడ పాడుతారు. ఎవరికి ఇష్టమైన దైవం మీద వారు పాడుకొంటారు. పోతన్నగారు శ్రీకృష్ణ పరమాత్మను 'జోజోకమలదళేక్షణ' అనే కందపద్యంతోనే జోకొట్టినారు. ఈనాడు దేశమంతటా బహుళప్రచారం పొందిన "జో అచ్యుతానంద జోజో ముకుందా-రావె పరమానంద రామగోవిందా" అనే పాటతో పదకవితా పితామహులైన తాళ్ళపాక అన్నమాచార్యులవారు వెంకటేశ్వరస్వామిని జోకొట్టినట్లున్నారు. లాలిజోలపాటలు సాధారణంగా శంకరాభరణం, నవరోజు, ఆనందభైరవి, శ్రీరాగాల్లో ఉంటవి. ఈ పాటల చరణాల చివరన ఉండే 'జోజో', 'లాలీ' అనేవాటిని పాడేటప్పుడు జారుగా సాగే స్వరాలకు పిల్లల కనులు పద్మాలవలె మెల్ల మెల్లగా ముకుళించుకుంటవి. వారు నిద్రపోతారు. ఈ స్వరాలు రాగాలే వారిని నిద్రపుచ్చేవి. "శిశుర్వేత్తి పశుర్వేత్తి" అన్నారుకదా పెద్దలు. లాలిపాటలు జోలపాటలు ఏయే దేవీ దేవతల పేర్లతో ఎన్ని ఉన్నవో లెక్కపెట్టలేము. ముక్కోటి దేవతలకూ ఈ పాటలు వర్తిస్తవి. "లాలి లాలీ లాలి లాలమ్మ లాలీ-లాలనుచు పాడరే బాల యేసునకూ" అనే క్రొత్తపాటలు రావటం గమనించదగిన విషయం. "ఏడవకు ఏడవకు వెర్రి అబ్బాయీ-ఏడిస్తే నీకండ్ల నీలాలుకారు".

మేము బాలలం
పూల మాలలం!
మేము బాలలం
పాల హేలలం!
మేము బాలలం
కృష్ణ లీలలం!
మేము బాలలం
మేరు ధీరులం!
మేము బాలలం
సత్య సంధులం!
మేము బాలలం
శాంతి దూతలం!

-మండలి బుద్ధప్రసాద్

అనే పాట, "అమ్మణ్ణి కన్నుల్లు తమ్మి పువ్వుల్లు-తమ్మి పువ్వులలోని కమ్మతేనెల్లు" అనే పాట శిశువుల యెడ మాతృస్త్రీలు ప్రదర్శించే అనురాగాన్ని, పిల్లల రూపగుణాదులను వర్ణించేవి. ఈ పాటల్లో మనోహర భావాలు, లలితపద బంధాలు, సుకుమార శయ్య సహజంగానే ఉంటవి. ఐనా పిల్లలకు ఇందులోని సాహిత్యం, లేదా కవిత్వంతో ఏమీ సంబంధం లేదు. కేవలం రాగం మాత్రం వారనుభవిస్తారు.

శిశువులకు నాలుగైదు మాసాల వయసు వచ్చేటప్పటికి ఉగ్గు పోస్తూ "ఊఁఊఁ ఉంగవ్వ-ఉగ్గూ పాలూ ఇందవ్వా" అనే పాటలు, గోరు ముద్దలు తినిపిస్తూ 'చందమామ రావె-జాబిల్లి రావె' అనే పాటలు పాడుతారు. తిన్నది జీర్ణం కావలెనని 'జీర్ణం జీర్ణం' పాటలు పాడుతారు. ఈ పాటలు కూడ పిల్లల కర్థమయ్యేవి కావు. ఆరుమాసాలు దాటిన తరువాత, శిశువు కూర్చుండ నేర్చినప్పటినుండి 'తారంగం - తారంగం' పాటలు పాడుతారు. శిశువుల అనుకరణ దశ ఇక్కడినుండి ప్రారంభమౌతుంది. 'తారంగం' అనే మాట పునరావృత్త మౌతుంటే, తల్లి చేతులు త్రిప్పుతుంటే, విని చూచే శిశువు తానూ అనుకరిస్తాడు; చేతులు తిప్పుతాడు. ఇంక కొంచెం వయసు వచ్చే టప్పటికి 'తప్పట్లోయ్-తాళాలోయ్' అంటూ తల్లి చేతులు తట్టుతుంటే తానుకూడ చప్పట్లు చరవటం నేర్చుకొంటాడు. ఇప్పటినుండి పాటలు నిచ్చెన మెట్లవలె శిశువుల వయస్సును బట్టి ఎదుగుతుంటవి. 'ఊగు ఊగు గంగెద్దా', 'చల్లాచెయ్యి గొల్లాభామ', 'కొత్తకుండోయి' వంటి పాటలు శిశువులకు దేహపరిశ్రమనూ, నిర్భీకతనూ కలిగించే పాటలు. 'అన్నంబెట్టి-అప్పుబెట్టి' వంటివి చక్కిలిగింతలు కలిగించే పాటలు. పిల్లలకు మాటలు వచ్చే, అర్థం గ్రహించే వయస్సు రాగానే "ఏనుగు ఏనుగు నల్లన", "సంజదీవికి చక్కని జేజే", "మా పాప మామల్లు మత్స్యావతారం" వంటి దైవ భక్తి, ప్రేమ, సద్గుణాలు కలిగించే పాటలు పాడుతారు. పిల్లలు కూడా తల్లిదండ్రులవలన ఈ పాటలు పదేపదే విని తాముకూడా పాడుతారు. పెద్దల పాటలు ఇంతటితో ఆగిపోతవి.

నాలుగైదేండ్ల వయస్సు వచ్చేటప్పటికి పిల్లల సొంతపాటలు ప్రారంభమౌతవి. పిల్లల పాటల్లో మొదటివి అర్థరహితమైన పాటలని మొదట మనవి చేసినాను. ఈ పాటల్లో సగం పెద్దల కూర్పు తక్కిన సగం పిన్నల కూర్పు. ప్రాసలూ, అనుప్రాసలూ, యమకాలూ తాళ లయలకోసం ప్రవేశించి వీటిని కొంతవరకు అర్థరహితం చేస్తవి. ఇటువంటి వానిలో 'అట పాటల' పాలు ఎక్కువ. పిల్లల ఆటలు ఎన్నో తీరులు. వీటిలో చాలావాటికి పాటలుకూడ తోడునీడలు. 'ఉప్పాప్పప్పం' అనే పాటలో

కుందేనగిరి, గుప్పచ్చి, దాగుడుమూతలు, దాటుబిళ్ళ, కన్నెయాట, నెత్తనరాళ్ళు, కత్తిబద్ద, వామనగుంటలు, వానవాన వల్లప్ప, నాల్గు స్తంభాలాట, కాళ్ళగజ్జి, చెమ్మచెక్క, తొడబంతి, దాచుకో మూచుకో, బిత్తి, చిట్టిగోనె, గుడుగుడు గుంచెం మొదలైన ఆటలు పేర్కొనబడ్డవి. వీటికి సంబంధించిన చాలా పాటలు అర్థరహితాలే. ఐతే ఈ పాటలను బాగా పరిశోధిస్తే ఇందులో చాలా అమూల్య విషయాలు, దేవరహస్యాలు, ఆయుర్వేద యోగాలు, ప్రాచీన సాంఘిక విషయాలు, ఆచారాలు బయటపడుతవి. ఈ అర్థరహిత గీతల (Nonsense Rhymes) దశ దాటి ఇంకొక్క మెట్టు పైకి పోతే పిల్లలు సొంతంగా కూర్చుకొనే పాటలు ప్రారంభమౌతవి.

పిల్లల సొంతపాటల్లో మొదటివి తమలో తాము గేలి చేసుకోవటానికీ, వెక్కిరించుకోవటానికి ఉపకరించే వినోదం పాటలు. 'అగ్గిపెట్టె-గుగ్గిపెట్టె', 'ఉసిరికాయ - ఊరబిందె' వంటివి ఇట్టి వినోదాల కుదాహరణలు. పిల్లలు తమబోటివాళ్ళనే కాక తమకంటె పెద్దవాళ్ళను కూడా వెక్కిరిస్తారు. తాతనో, అమ్మమ్మనో, బడిపంతులునో, బావనో, మరదలినో, ఏదో ఒక కులంవారినో, వృత్తివారినో గేలిచేసే పిల్లల పాటలు ప్రతి మండలానికీ వేరువేరుగా లభిస్తవి. ఇందులో కొన్ని అన్ని ప్రాంతాల్లో కూడా ప్రచారం పొందినవి. వినోదం పాటల తరువాత చెప్పుకోదగినవి తమ చుట్టున్న ప్రకృతికి మురిసిపోయి పాడుకొనేవి. పండుగలు, పబ్బాలను పురస్కరించుకొని పాడేవి, దేవతలయెడ భక్తిశ్రద్ధలతో పాడేవి. బుద్ధివికాసం పొందిన తరువాత మెదడుకు పని కల్పించే పొడుపు కథల పాటలు చిట్టచివరివి. వంకలు తీర్చే వయసు రావటంతో బాలల గేయాలు సిగ్గుపడి దాగిపోతవి.



# బాల సాహిత్యంలో వాస్తవికత

— డా॥ అంతటి నరసింహం

కవికి గానీ, రచయితకు గానీ నిర్దుష్టమైన, నిర్దిష్టమైన అభిప్రాయా లుండాలి. అప్పుడే తా నెవరి నుద్దేశించి, ఎందుకు రచన చేస్తున్నాడో అర్థ మవుతుంది.

సాహిత్యంయొక్క ప్రయోజనం అర్థమయి నపుడు మాత్రమే రచయిత చక్కని సాహిత్యాన్ని సృష్టించడానికి ప్రయత్నం చేస్తాడు. అట్లా కానినాడు అది నిరర్థకమే అవుతుంది.

ప్రయోజనం అంటే యేమిటో పూర్వ లాక్షణికులు వివరించారు. అందులో లోక వ్యవహారాన్ని వివరించడం అన్నది ఒకటి. అంటే సమాజంలో యేమి జరుగుతున్నదో, సమాజంపై దాని ప్రభావమేమిటో, దానివల్ల కలిగే మంచిచెడ్డ లేమిటో తెలిసేటట్లు రచించడమన్నమాట. అది చదువరులకు లోక జ్ఞానాన్ని కలిగిస్తుంది. స్వీయానుభవంవల్ల మాత్రమే యే వ్యక్తిగూడా విశేష జ్ఞానాన్ని ఆర్జించలేడు. రచనలద్వారా వివిధ వ్యక్తుల యొక్క అనుభవాలనూ, వివిధ ప్రాంతాల విశేషాలనూ అచిరకాలంలో అధికంగా తెలుసుకోగలడు.

ఆహ్లాదం కోసం గూడా రచనలు సాగించడం మరొక ప్రయోజనం. నిత్యజీవనయాత్రలో మానవులు ఎన్నెన్నో కష్టాలకూ, నష్టాలకూ గురిఅవుతూవుంటారు; శారీరక మానసిక దుఃఖాలతో బాధపడుతూవుంటారు. వారు తమ బాధలను తాత్కాలికంగా అయినాసరే మరచిపోయేటట్లు చేసి ఆహ్లాదాన్ని కలిగించడం రచనలయొక్క ఉద్దేశమయివున్నది.

సమాజానికి ఉపదేశం యివ్వడం గూడా సాహిత్యప్రయోజనమై వున్నది. ఇది సమాజంపై గొప్ప ప్రభావం కలిగివున్నది.

ఆదికాలంనుండీ నేటివరకు గూడా సమాజంపైన రచయితల ప్రభావం అత్యధికం అన్నది సత్యం. నీతులను చెప్పడం కోసంగానీ, వాదాలను నిలబెట్టుకోవడంకోసం గానీ, రచయితల రచనలను ఉదాహరిస్తూవుంటారు. దీన్నిబట్టి రచయితకు సమాజంలో ఎంత ఉన్నతమైన స్థానమున్నదో, సమాజం రచయితల వ్రాతలను ఎంతగా శిరసావహిస్తున్నదో విదితమవుతున్నది.

ఇన్ని విషయాలను దృష్టిలో పెట్టుకొని, ఇన్ని బాధ్యతలను వహించి రచయిత తాను రచనలు చేయవలసివున్నది. కవికి గానీ, రచయితకు గానీ నిర్దిష్టమైన అభిప్రాయాలుండాలి. అపుడే తా నెవరి నుద్దేశించి, యెందుకు రచన చేస్తున్నాడో అర్థమవుతుంది.

బాలసాహిత్యాన్ని సృష్టించే రచయితపై గల బాధ్యత ఇంకా అధికమైనది. పాండిత్యం లేని బాలలు అర్థం చేసుకొనే తీరులో, సాహితీ

ప్రయోజనాలను మనసులో వుంచుకొని రచించడం ఎంతో కష్టంతో కూడుకున్న పని. వాళ్లకు అందుబాటులో వుండే పదజాలాన్ని ప్రయోగిస్తూ సులభగ్రాహ్యంగా వుండే సన్నివేశాలు కల్పిస్తూ, ఔత్సుక్యాన్ని ప్రసాదించే ఘట్టాలను ఎన్నుకొని, వారి భావనాపరిధినీ, భాషాపరిధినీ కొంచెం కొంచెమే విస్తృతం చేసే తీరులో రచించడం అసామాన్యమైన పని.

పై దృష్టి ఈనాటి బాలసాహిత్య ఉత్పత్తిలో కొంత తక్కువగానే కనిపిస్తుంది. అభూత కల్పనలు కల్పించి బాలల్లో ఆశ్చర్యాన్నీ, అద్భుతరసాన్నీ అనుభవింపజేసే రచనలు ఈనాడు విరివిగా చేయబడుతున్నాయి. కాశీ మజిలీ కథలూ, భట్టివిక్రమార్కుల కథలూ, బేతాళ కథలూ, కథాసరిత్సాగర కథలూ మనసులో పెట్టుకొని అసంఖ్యాకమైన రచయితలు అవాస్తవికమైన అద్భుత సాహసగాథా రచనలు చేస్తున్నారు. బాలల్లో ఉత్సాహాన్ని ఇవి రేకెత్తించి చదివించగలవు అన్నది నిజమే. అయితే ప్రయోజనదృష్టితో చూస్తే వాటికి విలువ తక్కువ.

రచనల్లో వాస్తవికత వున్నప్పుడే అవి ప్రయోజనాత్మకమైనవి అని అనిపించుకుంటాయి. ఉన్న విషయాన్ని ఉన్నట్లుగా చెబితే అది చరిత్ర అవుతుంది. దాన్ని కళాత్మకం చేసినపుడే సాహిత్యమవుతుంది. కళాత్మకం చేసేటపుడు అతిశయోక్తులకు చోటివ్వకపోతే వాస్తవిక రచన అనిపించుకుంటుంది.

వస్తుసంబంధం ఎక్కువగా కలది వాస్తవికత. అంటే కేవలం ఊహాలతో కూడుకొన్నది కాదని అర్థం. సహజత్వం ఉట్టిపడే ఘట్టాలను ఎన్నుకొన్నపుడే రచన వాస్తవిక మవుతుంది. అట్టి రచన గూడా ప్రయోజనాత్మకమైనపుడే



ఉత్తమ రచన అనిపించుకొంటుంది.

వాస్తవికత పేరుతో నిరర్థక రచనలు చాలా వస్తున్నాయి. అవి సమాజాన్ని తప్పు దారిలోకి లాగుతున్నాయి. ఒకచోట ఒక దొంగతనం జరిగింది. దాన్ని పురస్కరించుకొని హస్తలాఘవాన్ని వివరిస్తాడు రచయిత. అది చదివిన బాలలు అందరూ గాకపోయినా కొందరయినా అట్లాంటి హస్తలాఘవాన్ని ప్రదర్శించాలనుకోవచ్చు. అది సమాజానికే ముప్పు.

ఇట్లాంటిదే శృంగారరస ప్రదర్శనం. కొన్నికొన్ని అనాగరిక సమాజాల్లోనూ, అతి నాగరకమనుకొనే కొన్ని పాశ్చాత్య సమాజాల్లోనూ పిల్లల్లోనే కొన్ని అసభ్య ప్రవర్తనలున్నట్లు చూచినట్టీ, చదివినట్టీ రచయితలు ఆసక్తిపూర్ణ రచనలు చేస్తున్నామన్న భావనలో రచనలు చేస్తున్నారు. పిల్లలకోసం అట్లాంటి వాస్తవికాలను సృష్టించరాదు.

మరికొంతమంది ఆధునిక రచయితలు లైంగిక శాస్త్రాన్ని కూడా పిల్లలకు బోధించాలని వాదిస్తున్నారు. ఈనాడు పిన్నలూ పెద్దలూ లైంగికమైన తప్పులు చేయడం దాని మంచిచెడ్డలు తెలియకనేనా? తెలుసు. అవి తప్పులని తెలుసు. తెలిసినా తెలియక పోయినా అవి కామావేశంలో చేసే పనులు. వాటి పర్యవసానం తెలిసిగూడా అట్లు చేస్తు

న్నప్పుడు, ఇపుడు ప్రత్యేకంగా లైంగిక శాస్త్రం బోధించవలసిన అవసరం ఏమున్నది? చేయగూడని తప్పులు తాత్కాలిక కామావేశంతో జరుగుతున్నాయిగాని లైంగికశాస్త్ర బోధ లేకపోవడంవల్ల కాదు. లైంగిక సాహిత్యంలో అందెవేసి డాక్టర్ డిగ్రీలు పొందినవాళ్లు అట్లాంటి తప్పులనుండి తప్పుకోలేకపోతున్నారన్న సత్యం తెలిసినవాళ్లు పిల్లల కోసం ఇట్లాంటి సాహిత్యాన్ని సృష్టించరాదు. ఎక్కడయినా నిషిద్ధ బాంధవ్యంలో తప్పులు జరగడంగానీ, వావివరుసలు పాటించకుండా జరగడంగానీ, మరేదయినా అనుచిత కామచర్యలు జరగడంగానీ సంభవించినపుడు యథార్థాన్ని చెబుతున్నాం అనిగానీ, వాస్తవిక రచన చేస్తున్నాం అనిగానీ రచించి ప్రకటించ గూడదు. అటువంటివి అనాలోచిత అక్రమ చేష్టలు తాత్కాలిక కామోద్రేకంవల్ల జరిగేవే. అవి తప్పు అని తెలుసుకోడం కోసం లైంగిక శాస్త్రం అభ్యసించ నవసరంలేదు. అట్లాంటి రచనలు చేయనక్కరలేదు.

సమాజాన్ని నడిపించేది నీతి. అది అన్ని చోట్లా ఒకేరీతిగా వుండకపోవచ్చు. ఒక ప్రాంతంలో అన్ని కాలాలలోనూ ఒకే రీతిలో వుండకపోవచ్చు. అయినా ఎప్పటి కప్పుడు నీతి పూర్ణమైన రచనల ద్వారా సమాజాన్ని జాగృతం చేస్తూవుండాలి. లేకపోతే సమాజ గమనం సాఫీగా సాగదు.

పిల్లలకోసం గొప్పవారి జీవితచరిత్రలు వ్రాయడం చాలా మంచిది. అవి చదివినపుడు పిల్లలు ఆదర్శ భావ ప్రేరితులై అవిధంగా ఆచరించి తాముకూడా గొప్పవారం కావాలనుకుంటారు. ఇట్లాంటి ప్రేరణ సమాజానికి భద్రతను చేకూర్చగలదు. అట్లాంటి రచనలు ఇతోధికంగా సాగాలి.

పిల్లలలో భావనాశక్తినీ, శాస్త్రీయదృష్టినీ, హేతువాద దృష్టినీ, నైతిక దృక్పథాన్నీ, సమాజ సేవాసక్తినీ, ఉన్నతాదర్శ భావావేశాన్నీ, సదాచరణ దక్షతనూ ప్రోత్సహించి ముందు నడిపించే యోగ్యత గలవే ఉత్తమ రచనలూ, వాస్తవిక రచనలూనూ.



# పొడుపు కథలు

- వెలగా వెంకటప్పయ్య

"పొడుపు కథలు ఒక గూఢతను విప్పుతూ, గహనమైన ప్రకృతి రహస్యాలను వెలికి తీస్తూ, కథ చెప్పేవారికీ, విప్పేవారికీ, వినే వారికీ ఆనందదాయకాలు, ఆలోచనాత్మకాలు అవుతాయనడంలో సందేహం లేదు".

సువిశాలమూ, సుందర స్వప్నమూ అయిన తెలుగునాడు జనపదాలకు పుట్టినిల్లు. కను కనే సద్యఃస్ఫూర్తికీ, రసస్ఫూర్తికీ లోటులేని జానపద సాహిత్యం తెలుగుదేశంలో శాఖోప శాఖలుగా విస్తరించింది. ఈ సంపదలో గేయాలు, కథలు, పొడుపుకథలు, సామెతలు, చతురోక్తులు, లోకోక్తులు, జాతీయాలు, పారి భాషికాలు-వందలు, వేలు, లక్షల సంఖ్యలో ఉన్నాయి. వీటిలో సేకరించినవాటికంటే సేకరించవలసినవే చాల కనబడుతున్నాయి. ఈ జీవద్భాషా సముదాయంలో పొడుపు కథ లకు కూడ సముచిత స్థానం కలదనడంలో సందేహం లేదు.

## సాంప్రదాయికంగా పొడుపు కథలు

చిరకాలంగా భారతీయ భాషా సాహిత్యా రంగాలలో పొడుపు కథలు చోటుచేసుకొని ఉన్నాయి. వేదాల్లో కూడ వీటి ప్రసక్తి ఉంది. సంస్కృతంలో వీటిని ప్రహేళికలు అంటారు. అంటే భావాదిగూఢత గలవని అర్థం. దండి, విశ్వనాథుడు, భోజుడు - ఇత్యాది ఆలంకారి కులు ప్రహేళికలను ఉదాహరించారు. భోజుడు చ్యుతాక్షర, దత్తాక్షర, చ్యుతదత్తాక్షర, ముష్టిక, బిందుమతి, అర్థవతి అనే ఆరురకాలను ముచ్చ టించాడు. తెలుగు పొడుపు కథలను విప్పు కథలు లేదా విచిత్ర కథలని గూడ అంటారు. ప్రబంధాలలో, కావ్యాలలో యివి ప్రారంభమై ముఖ్యంగా జనపదాలలో విశేషంగా ప్రచారం లోకి వచ్చాయి. నాగరికత పెరుగుతున్న కొలదీ వీటి సంఖ్య తరుగ నారంభించింది. తేనెసోనల బోలిన తెలుగు నుడికారాల పరిరక్షణకు వీటిని సేకరించి నాలుగు కాలాలపాటు భద్రపరచ వలసి ఉంది.

## పొడుపు కథలంటే?

తెలుగుదేశంలో జీవద్భాషకు జవజీవాలు పోసిన నేదునూరి గంగాధరంగారు "పొడు చుట, విప్పుటలో ఆనందం వెల్లివిరిసేది పొడుపు కథ" అన్నారు. మొత్తంమీద పొడుపు కథలు ఒక గూఢతను విప్పుతూ, గహనమైన ప్రకృతి రహస్యాలను వెలికి తీస్తూ కథ చెప్పేవారికి, విప్పేవారికి, వినేవారికి ఆనందదాయకాలు,

బాలల లోకం మాది
బంగారు లోకం మాది
అందరూ రండి
ఆనందాన్ని పంచుకోండి.
త్వరగా రండి
త్వర త్వరగా రండి.
పెద్దా చిన్నా భేదం లేదు
పిల్లా, పెద్దా అంతా రండి.
మెరిసే చుక్కలు మనవి
ఎగిరే పక్షులు మనవి.
మబ్బులే మిత్రులు మనకు
చందమామయే చుట్టం మనకు.
—మంత్రిప్రగడ శేషాబాయి

ఆలోచనాత్మకాలు అవుతాయనడంలో సందేహం లేదు.

## పొడుపు కథ లెలా వుంటాయి ?

వాస్తవానికి పొడుపు కథలు ఉపమానోపమయ సమ్మేళనాలు. ఇవి అర్థగోపవం ప్రధానంగా, సంకేతం ప్రధానంగా సంక్షిప్తంగా ఉంటాయి. సరళంగా ఉంటాయి. వస్తువు వర్తమాన సమాజానికి సన్నిహితంగా ఉంటుంది. శాస్త్రరీత్యా చెప్పాలంటే వ్యాజోక్తి, వక్రోక్తి, గూఢోక్తి అలంకారాలకు దగ్గరగా ఉంటాయి. ఇవి సమాజంలో, ముఖ్యంగా జనపదాలలో విశేషప్రచారంలో ఉన్న ప్రక్రియ- గేయం, వచనం, పద్యం, ప్రశ్న, సామెత, చాటువు - ఏ తీరులోనైనా ఉంటాయి.

## పొడుపు కథ లెందుకు ?

పొడుపు కథలు కేవలం హాస్యగుళికలు కావు; ఆలోచనా ప్రేరకాలు. జ్ఞాపకశక్తికి దోహదాలు. లోకజ్ఞతకు, బుద్ధికుశలతకు ఆయువుపట్టులు. కేవలం కాలక్షేపం కోసం. వినోదం కోసమే అనుకున్నా, అవి మరొకవైపున ఎదుటివాడి కుతూహలాన్ని ప్రేరేపిస్తాయి. వావి వరసలు పెంచి, సామాజిక స్పృహకు అందరినీ సన్నిహితం చేస్తాయి. వ్యంగ్యాన్ని, వ్యవహార జ్ఞానాన్ని పోషిస్తూ- ఆచారాలు, సంప్రదాయాల్ని పరిరక్షిస్తూ మానసికవికాసానికి, భావసమైక్యానికి తోడ్పడతాయి. ఇవి పిల్లలకేగాదు, పెద్దలకూ, ఎల్లరకూ ఉపాదేయాలు.

## పొడుపు కథల హొయలు

ఒక కవి, ఒక రచయిత, ఒక కాలం, ఒక విషయం, ఒక ప్రాంతం, ఒక ప్రక్రియ, పరిమితి లేనందువలన ఇవి కాలగమనంలో ఎన్నో హొయల, లయలను విచ్చి విప్పారి సుమ సౌరభాలు దశదిశలా వ్యాపింపజేశాయి. ప్రతి ప్రాంతంలో-పదాలలో, పాదాలలో భేదాలు హెచ్చుగా పొడచూపాయి. 'వమిద' విడుపుకు రెండు రూపాలలో పొడుపు కనిపిస్తుంది.

1. అందమైన చెరువులో
   ముద్దు వచ్చే పిట్ట
   మూతికి బంగారం
   తోకతో నీరు తాగును.
2. అద్దంకి చెరువులో
   ముద్దంకి పిట్ట
   ముక్కున బంగారం పెట్టుకొని
   తోకతో నీరు తాగును.

పై రెండు కథలలో మొదటిది కడప జిల్లాలో, రెండవది ప్రకాశం జిల్లాలో ప్రచారంలో ఉండడం విశేషం. ఇలా ఎన్నో ఉన్నాయి. క్లిష్ట అన్వయాలు, కష్టమైన సమస్యలు గల-

పొడుపు కథలు అలా ఉంచి, బాలలు మెచ్చే వాటి విషయంలో కొన్ని వివరాలు తెలుసుకుందాం.

పొడుపు కథలు ఒట్టి పొట్టి మాటలకు పుట్టినిల్లు. పాడుకోడానికి, ఆడుకోడానికి వీలైన అలతి, అలతి పదాలలో రమణీయార్థ ప్రతిపాద్య చమత్కృతి తొంగిచూస్తూ ఉంటుంది.

మారుకత మంకెన్నా
మా మామ కొంకెన్నా
మళ్ళీ వస్తే కుంకన్నా
నీకూ నాకు లంకెన్నా. (గొళ్ళెం)

గోడమీద బొమ్మ
గొలుసుల్ల బొమ్మ
వచ్చీపోయే వారికి
వడ్డించు బొమ్మ. (తేలు)

రాచమందిరం చిన్నదానా
రఘుపతి కోడలా
చేద వెయ్యకుండా
ముంచకుండా
దాహానికి నీళ్లు తేవే. (కొబ్బరికాయ)

రెండు మూడు మాటలలో చక్కని భావాన్ని అందించే పొడుపు కథలు అనేకం ఉన్నాయి.

ఆకు లేని పంట -ఉప్పుపంట
ఇటుకలో గొటికరాయి -గెనుసుగడ్డ
ఈతచెట్టు కిద్దరు బిడ్డలు -కల్లుకుండలు

పల్లెపట్టులలో వంశపారంపర్యంగా వస్తున్న వివిధ వృత్తులను కొన్ని కథలు చెప్పక చెబుతూ ఉంటాయి. పనిచేసే విధానాన్ని వ్యంగ్యంగా వర్ణిస్తూ ఉంటాయి.

చలిలో నిప్పులో కాగేవాడు
తాపంలేక చెరువులో నానేవాడు
బతికుండి గోతిలో కూర్చునేవాడు
ఏవూళ్లో ఒడితే ఆవూళ్లో ఉంటారు.
-కంసాలి, చాకలి, సా

అన్నయ్యగారి బాల-మాసపత్రికలో చిట్టిబా పొట్టిమరదలు శీర్షికలో బావామరదళ్ళ ప సాలు మనందరం ఎరిగున్నవే! అంతకంతే మరింత నాజూకైన ధోరణిలో చాల పొడుప కథలు ప్రచారంలో ఉన్నాయి.

ఉబ్బుఉబ్బున వాన కురిసే
గొయ్యినిండా కుప్పతేవె
కుప్ప కాలి అప్పు తీరె
దీని భావమేమి బావగారూ!
-కుమ్మరి అవ

బావామరదళ్ల సరసాలేగాక పిల్లలు ఒక కొకరు వేసుకొనే ప్రశ్నల రూపంలో గ కథలు మెండుగా ఉన్నాయి.

పిల్లికి ముందు రెండు పిల్లులు
పిల్లికి వెనుక రెండు పిల్లులు
పిల్లికి పిల్లికి మధ్య ఒక పిల్లి
మొత్తం పిల్లులెన్ని? -తొమ్మి

దొంగిలించలేదు
దొంగసొమ్ము తీయలేదు
అబద్ధమాడలేదు
సంకెళ్ల బడ్డ కారణమేమి? -ఎలుక

కథలు పొడవడంలో జానపదులు పెక్కు సొం పులు చూపించారు. కథలో రెండు పాదాలకు



ఒకే విప్పుడు వచ్చే రీతిగా రూపొందినవి-పాదం చివరి పదంలోనే విప్పుడు వచ్చేవి కొన్ని ఉన్నాయి-

పామేల దుముకు -కప్పకై
గుడిసేల కురియు -కప్పకై
బ్రేల తన్ను -చేపకై
కొంగేల పొంచు -చేపకై

వంకర టింకర శొ -శొ
వాడి తమ్ముడు - అ
వల్లని మిల్లా - మి
నా కేమిస్తావు - తే
నాలుగు కాళ్ళు - మే

-శొంఠి, అల్లం, మిరియాలు, తేనె, మేక.

ఇవిగాక మన ప్రకృతిమీద, ఆచార వ్యవహారాల మీద, పురాణాల మీద ఎన్నో కథలున్నాయి. పంచమ వేదమైన భారతంలో యక్ష ప్రశ్నలు, మన జానపద సాహిత్యంలో ప్రసిద్ధ రచనలైన భట్టివిక్రమార్క కథలలో బేతాళుడు వేసే ప్రశ్నలలో, వినోద కథా కల్పవల్లిలో, కొన్ని కాశీమజిలీ కథలలో, చాటువులలో, శతకాలలో వందలాది పొడుపు కథలున్నాయి. వీటి మధుర సౌరభాలను మరొక సారి తెలుసుకుందాం.

ఆంగ్లంలో పొడుపు కథల నిర్మాణంపై విశేష కృషి చేసిన జేమ్స్ బకెల్స్ వీటిని "అస్పష్టంకాని రూపకం లేదా రూపకాల సముదాయం" అన్నారు.

తెలుగు దేశం నలుచెరగులా ముద్రితంగా అముద్రితంగా, మౌఖికంగా కల పొడుపు కథలను సేకరించి అకాడమీ సచిత్రంగా ప్రచురిస్తే అనావృతంగా వున్న యీ శాఖలోని తేనె సోనలు అందరూ చవిచూడడానికి వీలు అవుతుంది.



# బాల కథా వాఙ్మయం

## -రావూరి భరద్వాజ

ప్రపంచంలోని ఏదేశపు బాల సాహిత్యం చూసినా, వీర గాథామయంగానో, లేదా అద్భుత, ఆశ్చర్యకర సన్నివేశాల మయంగానో ఉంటున్నది.

ఇప్పటి సంగతి కాదుగానీ-

రమారమిగా 30, 40 సంవత్సరాల క్రిందటి తెలుగు దేశంలోని అమ్మమ్మలకూ, నాయనమ్మలకూ, తాతమ్మలకూ ఒక అద్భుతమైన కథా కథనశక్తి ఉండేది.

ముని సందెలవేళప్పుడూ, తెరపి వెన్నెల వేళప్పుడూ, మనవ సంతానాన్ని చుట్టూరా కూచోబెట్టుకొని, 'ఊ' కొట్టేవారు అలసి నిద్రపోయిందాకా కథలు చెప్పేవారు.

"అనగా...అనగా......"

అంటూ ప్రారంభమైన ఆ కథ ఎన్ని మెలికలు తిరిగేదో, ఎన్ని మలుపులు తిరిగేదో చెప్పటం ఒకంతట సాధ్యంకాదు. సాధారణంగా, ఒక రాజుగారో, రాణీగారో, రాక్షసుడో, మంత్రాల, మాయల వస్తువులో అందులో ఉండక తప్పదు. ఈ ముడిసరుకుల్ని ఆధారం చేసుకొని, ఆ నాయనమ్మలు, అమ్మమ్మలు, తాతమ్మలు చెప్పేకథలు - పరమాద్భుతంగా, పరమ రమణీయంగా ఉండేవి. అలాంటి వందలాది కథలు విన్న అదృష్టవంతుల్లో నేనూ వొకణ్ణి!

కొన్ని సందర్భాల్లో ఈ కథా కథనం, చాలా పొద్దుపోయిందాకానూ సాగేది. ఎండాకాలం- ఆరుబయట చిరిచాపలు పరుచుకొని, పాలమీగడ వంటి వెన్నెల్లో కూచుని, రాజకుమార్తెను రాక్షసుడు ఎత్తుకుపోతున్న ఘట్టమో; రాజకుమారుడు అడవికి వేటకు వెళ్ళి దాహంవేసి, సెలయేటిలోని పుడిసెడు నీరుతాగి, దుడుంగున చేపలాగ మారిపోయిన ఘట్టమో వింటున్నపుడు; గుండెలు- తక్కున ఆగినట్లనిపించేది.

ఈ చేపపిల్ల ఇక్కడ "నాన్నా-నాన్నా" అని గిలగిల లాడిపోతూ ఉండడం; అక్కడేమో, మహారాజావారూ, రాణీవారూ, కొడుక్కోసం కంటికీ మంటికీ ఒకేధారగా ఏడుస్తూ కూచోవడమూ చెబుతున్నప్పుడు వింటున్నవారి కళ్లుకూడా నీటితోనిండిపోవడం సహజం! అలా నిండకపోతే, ఆమె అమ్మమ్మ కాదు- అది తెలుగు కథా కాదు!

వచ్చిన సంఘటన రాకుండా, వేసినమెలిక వేయకుండా తిరిగినమలుపు తిరగకుండా, రోజులకొద్దీ కథలను చెప్పగల సామర్థ్యం వారికి ఉండేది! ఈ సమర్థత అందరిలోనూ ఉన్నదని కాదుగానీ, ఒక తరానికి చెందిన వారిలోమాత్రం పుష్కలంగా వున్నది.

పోనీ వీరు బాగా చదువుకొన్నవారా ?

> గుల్లమెక్కెదనమ్మ గుల్లమెక్కెదనే
> గుల్లమెక్కి దేశమెల్ల తిరిగెదనే!
> బలికి పోయెదనమ్మ బలికి పోయెదనే
> పుత్తకాలెన్నెన్నొ పత్తుకెల్లెదనే!
>
> —కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు

పండిత వంశంలోనించి వచ్చినవారా?

కారే!

పగలంతా— పొలంలోనో కలుపుతీస్తూనో గడ్డి గోకుతూనో, పిట్టకావలి కాస్తూనో గడిపి, అదరాబాదరా తూగుతూ ఊగుతూ ఇంటి కొచ్చి, పొంతలో నీళ్లు గభాల్న పొలపరించుకొని, అవురావురు మంటూ నాలుగు మెతుకులు ఎంగిలిపడి, కుక్కిమంచంమీద వడ్డివాల్చే అమ్మమ్మకు చదువూరాదు, సంధ్యారాదు. ఆమెకు గుణాఢ్యుని బృహత్కథను గురించి గానీ, పంచతంత్రాన్ని గురించిగానీ తెలీదు. భట్టివిక్రమార్కుని కథలూ, కాశీమజిలీకథలూ తెలీవు. అరేబియన్‌నైట్స్ కథలూ, డెకమరాన్ కథలూ, ఈసప్ కథలూ ఇంకా ఈ జాబితు వాటిపేర్లన్నా ఆమెకు తెలిసివుండవు.

కానీ ఆమెకు ఒక్క సత్యం తెలుసు. పిల్లల కేంకావాలో తెలుసు. ఏం చెబుతే, ఎలా చెబుతే, వాళ్లు అబ్బురంగా కూచుని వింటారో తెలుసు. కథలో నీరసం వచ్చినప్పుడు, ఏం మెలిక వేయాలో, ఏం మలుపు తిప్పాలో కూడా ఆమెకు తెలుసు.

నాగొడవ కూడా సరిగ్గా అదే!

బాలలకోసం రాస్తున్న వారందరికీ మౌలికమైన ఈ మూడు సత్యాలూ తెలిసి ఉండాలి. ఏంచెబుతే ఉత్తరోత్తరా వారికి కాస్తంత ఉపయోగపడుతుందో ముందు రాస్తున్నవారికి తెలియాలి. తరవాత దాన్ని అద్భుతంగా చెప్పాలి. పిల్లల మనసుల్ని వీరాద్భుతరసాలు ఆకర్షించి నట్లుగా మరే రసమూ ఆకర్షించదనుకొంటూ. అంచాతనే కావచ్చు- ప్రపంచంలోని ఏ దేశపు బాలసాహిత్యం చూసినా, వీరగాథా మయంగాను, లేదా అద్భుత, ఆశ్చర్యకర, సన్నివేశాల మయంగాను ఉంటున్నది!

ఈ కల్పనా సాహిత్యం మనకైనా తక్కువేమీ లేదు. అక్షర బద్ధమయింది చాలా తక్కువే కావచ్చు గానీ, ఇంకా గ్రామీణ ప్రాంతాలలోని, జానపదుల పుక్కిట, ఈ కల్పనా కథలు మాగిపోతూనే ఉన్నాయి. వాటిని సేకరించాలి.

విశ్వ విద్యాలయాల ప్రోత్సాహం వలన జానపద వాఙ్మయం గురించి విపులమైన పరిశోధనలు జరిగి, సిద్ధాంత గ్రంథాలు వెలువడినట్లుగానే, గ్రామీణుల గుండెల్లో గువగువలాడుతున్న ఈ ప్రాచీన కథాసంపదను అక్షరబద్ధం చేయాలి. ఈ పని బాలల అకాడమీ చేపట్టవచ్చు. లేదా- అకాడమీ, విశ్వ విద్యాలయమూ సంయుక్తంగానూ ఈ కార్యక్రమాన్ని నిర్వహించవచ్చు!

మనదేశంలోని వివిధ భాషల తాలూకు జానపద గాథలను కూడా సేకరించడం అవసరం! వాటన్నింటినీ తెలుగులో పుస్తక రూపాల్లో ప్రకటించాలి. తెలుగు దేశంలోని పుస్తక ప్రచురణ కర్తలు గతంలో బాలసాహిత్యం పేరున కొన్ని పుస్తకాలు ప్రచురించారు. నిస్సందేహంగా వాటిల్లో కొన్ని మంచివి! కానీ ఎక్కువ భాగం పెద్దలను దృష్టిలో పెట్టుకొని అచ్చువేసినవే!

అనేక విషయాల్లోకి మల్లేనే ఈ విషయంలోనూ, పాశ్చాత్య దేశాలను చూసి మనం నేర్చుకోవలసింది చాలా ఉన్నది. ఆ యా

దేశాల్లో చాలాసంవత్సరాలుగా, బాలలకోసం పుస్తకాల ప్రచురణ కొనసాగుతూ ఉన్నది. వారు అచ్చేసిన పుస్తకాలు చూస్తుంటే, వళ్లు పులిసిపోతాయి. ఎంత అందంగా ఉంటాయవి! సంగ్రహంగా విషయం ఉండడంతోపాటుగా, కంటిని పట్టిఉంచే రంగురంగుల బొమ్మలు కూడా ఉంటాయి. అదిగాక- వారు బాలల్ని రెండు మూడు తరగతులుగా విభజిస్తారు. ఒక్కో గ్రూపువారికి, ఒక్కో రకమైన పుస్తకాలని ప్రచురిస్తారు. ఉదాహరణకు 'ఏనుగు'కు సంబంధించిన ఒక పుస్తకం ఉన్నదనుకొందాం. ఐదు నుండి ఎనిమిది సంవత్సరాల వయస్సు వారికోసం ఒకరకంగానూ, ఎనిమిది నుండి పది సంవత్సరాల వయస్సువారికోసం మరో రకంగానూ, 11 నుండి 12 సంవత్సరాలవారి నిమిత్తం మరో రకంగానూ ఆ పైబడిన వయస్సు వారికోసం ఇంకో మోస్తరుగానూ పుస్తకాలు వేస్తారు. వీటన్నింటిలోనూ రేఖాచిత్రాలూ, ఫొటోలూ, రంగురంగుల్లో ఉంటాయి.

ఐదునుండి ఎనిమిది సంవత్సరాల లోపు వారికోసం ఉద్దేశించిన పుస్తకంలో పుటలు 16కు లోపుగా ఉంటాయి. ఏనుగుకు సంబంధించిన ప్రధానమైన లక్షణాలు చెబుతూ, ఆ లక్షణాలను బొమ్మలద్వారా విడమరిచి మరీ చూపెడతారు. అదే 12 సంవత్సరాలకు పైబడిన వారికోసం ఉద్దేశితమైన పుస్తకం-ఏనుగు తాలూకు పూర్వరూపంనుండీ ప్రారంభమవుతుంది. ఏనుగు శరీర నిర్మాణంలో వచ్చిన క్రమానుగతమైన మార్పులు, వివిధ దేశాలలోని ఏనుగుల ఆకార విశేషాలు, వాటి ఉపయోగాలు, చారిత్రక ప్రాముఖ్యాలు-అన్నీ సంగ్రహంగా చెబుతారు.



అలాంటి పుస్తకాలు తెలుగులో కూడా సమృద్ధిగా రావాలి. అవి చవకగానూ, అందంగానూ ఉండాలి. బాలలు కొనుక్కోవడానికి అందుబాటులో ఉండాలి. అన్నింటికన్నా తక్కువ పుస్తకం ఖరీదు 25 పైసలకు మించకూడదు. కుర్రవాడి జేబులో పావలాకాసుంటే వాడు మిఠాయి కొట్టుకేసి కాకుండా, పుస్తకాల దుకాణంకేసి పరుగెత్తాలి! అలా చేయడం అసాధ్యమేమీ కాదు.

బాలలు కథలు చదివేమాటే నిజం! అందులోనూ, వీరాద్భుత రసాలతో కూడిన కథలంటే, వారు చెవులు కోసుకొంటారు. మాయానగరాలూ, మంత్రదండాలూ, రాక్షసులూ, రాణులూ, రాజకుమారులూ, రాజకుమార్తెలూ, పరకాయ ప్రవేశాలూ, ఉండనీండి! ఇలాంటివాటిని-గ్రామాలవెంట తిరిగి సేకరించవలసిందే! వాటిని, సరళీకరించి, తిరిగి వ్రాసి, తగిన రంగురంగుల బొమ్మలు చేర్చి, అందమైన పుస్తకాలుగా అచ్చువేయవలసిందే! ఈ కల్పనా సాహిత్యంతో పాటుగా, కొన్ని వైజ్ఞానిక విషయాలను కూడా వారికి అందజేయాలి.

ప్రతిరోజూ రబ్బరును వాడుతున్న లక్షలాది బాలబాలికలకు, ఆ రబ్బరుకు వెనుక దాగిఉన్న అసంఖ్యాకమైన అద్భుత గాథలు తెలిసి ఉండవు. అలాగే ప్లాస్టిక్కులు, పెన్నులు, పింగాణీ, సిమెంటు, పెట్రోలు, విద్యుత్తు-ఇంకా మనచుట్టూ ఉన్న శతాకోటి వస్తువుల్ని గురించి వారికి చెప్పాలి. వైజ్ఞానిక విషయాలను బాలలు వినరన్న వాదన వినపడుతున్నదిగానీ-అది నిజం కాదు. ఒక విషయాన్ని వినడానికి ఆసక్తి చూపెట్టే బాలలు, ఏ విషయం వినడానికైనా ఆసక్తి చూపించుతారు. కాకపోతే, ఆ విషయాన్ని ఆసక్తిదాయకంగా చెప్పగల నేర్పు మనకుండాలి. ఆ నేర్పు లేనప్పుడు-వైజ్ఞానిక విషయాలేకాదు; మనం ఏం చెప్పినా పిల్లలు వినరు; వినవలసిన అవసరం కూడా వారికి లేదు.

ఇతర దేశాల్లో ఉన్నట్లుగా, మనదేశంలో, ముఖ్యంగా మన భాషలో; అచ్చంగా పిల్లల కోసమనే రాస్తున్నవారంటూ ఉన్న జాడ కనిపించదు. పిల్లలకోసం రాసినవారున్నారుగానీ, వారు పెద్దలకోసమూ రాస్తున్నవారే! ఆ చేత్తోనే మరో రెండు పొంగరాలు పోసి, ఇటు కేసి వడ్డించడంతప్ప, అదొక ప్రత్యేకమైన దీక్షగా చేపట్టి చేస్తున్నవారు లేరనిపిస్తున్నది! అక్కడక్కడా చెల్లాచెదరుగా, ఒకరూ ఇద్దరూ కనిపించినా, వారి కృషి, రీతికి రంగానికి రాకుండా ఉన్నది. ఈ తికమకలు పోవాలి. కల్పనా సాహిత్యమయినా, వైజ్ఞానిక సాహిత్యమయినా-అది పిల్లలకోసమని తయారుచేస్తున్నది గనక, భాష సరళంగా ఉండాలి. బొమ్మలతో ఆకర్షణీయంగా ఉండాలి. చవగ్గా ఉండాలి బాలలకు అందుబాటులో ఉండాలి!

మనం ఎంతసేపటికీ నగరాలూ, పట్నాలూ, అక్కడి బాలలూ, వారి సమస్యలూ చూస్తున్నామే తప్ప, గ్రామాలకేసి చూడడంలేదు. నూరింట 80 వంతులమంది బాలలు గ్రామాల్లోనే ఉంటున్నారు. వారిలో చాలామందికి చదువుకొనే అవకాశాలే ఉండవు పాపం! ఉన్నవారికైనా పాఠ్యపుస్తకాలు తప్ప, ఇతర పుస్తకాలు లభ్యం కావు. ఇలా లేనివారి సంఖ్యే ఎక్కువ. వీరందరూ, ఇలా ఆధునిక విజ్ఞానానికి దూరంగా ఉండిపోవలసిందేనా! ఆ అజ్ఞాన కూపాలనుండి వెలువడడానికీ, ఆధునిక వైజ్ఞానిక ప్రపంచంతో పరిచయం కలగడానికీ, పుస్తకాలరూపంలో మనమేమీ చేయలేమా? వారి కొనుగోలుశక్తి పరిధిలోనే అందమైన, ఉపయుక్తమైన పుస్తకాలను వారికి లక్షల సంఖ్యలో అందచేయడం-అసాధ్యమేమాత్రం కాదు. అవసరమయితే, ప్రభుత్వం సబ్సిడీ ఇచ్చయినా ఇలాంటి పుస్తకాలను విరివిగా ప్రచురించాలి. ప్రతి పాఠశాలలోనూ వాటిని ఉంచాలి. అక్షరాస్యుడైన ప్రతి బాలుడి చేతిలో, ప్రతి బాలిక చేతిలోనూ ఈ పుస్తకాలుండాలి.

అందుకోసం, నూతనంగా ఏర్పడిన ఈ బాలల అకాడమీ కృషి చేస్తే, దాని ఉనికి సార్థకమవుతుంది. ఆపని జరుగగలదని ఆశిద్దాం!



# తెలుగులో పిల్లల పుస్తకాల పంపిణీ

— ఎమ్.ఎస్.రావు

మన దేశంలో ప్రాంతీయ భాషలలో పిల్లల పుస్తకాలను పంపిణీ చేయడంలో కొన్ని ముఖ్య సమస్యలను ఎదుర్కొంటున్నది. ఒక క్రమమైన పంపిణీ పద్ధతి లేదనడం ఒక సమస్య అయితే, తగు మాత్రపు మంచి పుస్తకాలు (లేకపోవడం) మరొక సమస్య.

"ఒక పుస్తకాన్ని వ్రాయడం చాల సులభం. దానికి కావలసిందల్లా ఒక కాగితం, కలం, సిరా. పుస్తకాన్ని ముద్రించడం కొంచెం కష్టం; మహా రచయితల జిగిబిగి వ్రాత తెలుసుకోలేక-పుస్తకాన్ని చదవడం మరికొంచెం కష్టం-నిద్ర రావడానికి అవకాశం కల్పిస్తుంది కనుక. అన్నిటికంటె కష్టమైన పని దానిని అమ్మబోవడం."

ఈ పై వాక్యాలను "ఫెలిక్స్ డాన్" (Felix Daun) వ్రాసిన జర్మను పద్యమునుండి గ్రహించి, స్టాన్లీ అన్విన్ (Stanley Unwin) వ్రాశాడు. ఏది ఏమైనప్పటికీ, పిల్లల పుస్తకముల విషయంలో మాత్రం ఇది చాలవరకు నిజమని చెప్పొచ్చు.

మన దేశం ప్రాంతీయ భాషలలో పిల్లల పుస్తకాలను పంపిణీ చేయడంలో కొన్ని ముఖ్య సమస్యలను ఎదుర్కొంటున్నది. ఒక క్రమమైన పంపిణీ పద్ధతి లేదనడం ఒక సమస్య అయితే, తగుమాత్రపు మంచి పుస్తకాలు లేకపోవటం మరొక సమస్య. నెవ్రాలా బాల పుస్తకాల ప్రచురణకర్తలైన నేషనల్ బుక్ ట్రస్టు, బాలల పుస్తక సంస్థ వంటి పెద్ద ప్రచురణ సంస్థలు తప్ప తక్కిన ప్రచురణ సంస్థలన్నీ యీ సమస్యలను ఎదుర్కొంటున్నవే!

| సం॥ | ప్రచురించిన పుస్తకముల మొత్తము సంఖ్య | ప్రచురించిన పిల్లల పుస్తకముల మొత్తము సంఖ్య | తెలుగులో ప్రచురించిన పిల్లల పుస్తకములు |
|---|---|---|---|
| 1971-72 | 17,557 | 244 | 8 |
| 1972-73 | 17,020 | 465 | 12 |
| 1973-74 | 17,600 | 260 | 24 |
| 1974-75 | 16,182 | 347 | లభింపలేదు |
| 1975-76 | 22,096 | 455 | లభింపలేదు |

చెయ్యని కుండ
పొయ్యని నీళ్లు
వెయ్యని సున్నం
తియ్యగనుండు
తిన్నవారికే
తెలియును గుట్టు.
(కొబ్బరికాయ)

సేకరణ : గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

ప్రక్కపుటలో ఇచ్చిన పట్టీద్వారా, మన దేశంలో ప్రచురించిన పిల్లల పుస్తకాల సంఖ్య ఎంత తక్కువో తెలుసుకోవచ్చు.

ఈ పై పట్టీని పరిశీలించితే, 74-75 లేదా 75-76 ల మధ్య తెలుగులో ప్రచురించిన పిల్లల పుస్తకాల సంఖ్య 35 లేదా 40 దాటి ఉండదని చెప్పొచ్చు.

మన దేశంలో విద్యావంతులు బహుకొద్ది. ముద్రించే ప్రతుల సంఖ్య అత్యల్పం; ఉత్పత్తి ధర అత్యధికం. అంతేగాదు - పఠనాభ్యాసం బహు తక్కువ మనలో. 1973-74 లో సాలీనా సగటు రాబడి మనిషికి రూ. 850/- కాబట్టి మనిషికి కొనుగోలుశక్తి తక్కువ. పోనీ, ఒక క్రమంలో పుస్తకాల అమ్మకం కాగలదా అంటే అదీ సందేహమే. దీనితో సరిగాదు. ఆ యా ప్రాంతీయ భాషలకు తగినట్లుగా విభజించి, మితంగా ప్రచురించుకోవాలి. కాబట్టి మన దేశంలో పిల్లల పుస్తకాలు ప్రచురించడం ఆర్థికంగా అంత లాభసాటిగాదు. మంచి పిల్లల పుస్తక రచయిత ఉన్నారు; కానీ, వారిని పిల్లల పుస్తక ప్రచురణ ఆర్థిక పరిధి లోనికి సరిగా సమన్వయించి ప్రచురణకర్తలు ఉపయోగించుకోలేక పోతున్నారు. దానికి ముఖ్యకారణం పిల్లల పుస్తక ప్రచురణ చాలా వరకు కుటీర పరిశ్రమలాగ ఉండిపోవడమే. ఇట్లా ఉండడానికి కారణం దేశం విభిన్న భాషలతోకూడి ఉండి, తగుమాత్రపు అక్షరాభ్యాసం లేక పిల్లల పుస్తక ప్రచురణకు ప్రోత్సాహం లభించకపోవడమే. కాని కొంతమంది ప్రచురణకర్తలు బాలుర కోసమని, ప్రశస్తమైన బాల సాహిత్యాన్ని ఎక్కువగా ఇంగ్లీషులోను, అప్పుడప్పుడు యితర ప్రాంతీయ భాషలందును వెలువరిస్తున్నారు. కాని బాలసాహిత్య రచయితలు, చిత్రకారులే కాక, ఏ యితర ప్రచురణ సంస్థలు కూడ, బాలసాహిత్య ప్రచురణ మీద ఆధారపడ లేకపోవటం జరుగుతోంది. మన దేశంలోని పిల్లల పుస్తక ప్రచురణ ఈ దశలో ఉన్నప్పుడు, తెలుగులో బాలసాహిత్య ప్రచురణ ఏదశలో ఉందో ఊహించుకోవచ్చు.

ఆ యా ప్రాంతీయ భాషలకు తగిన సంఖ్యలో పుస్తకాలు లేనిదే, పంపిణీ పద్ధతి కొనసాగించడం హాస్యాస్పదమే అవుతుంది. కాబట్టి, ఇరుప్రక్కల నుండి ఎదుర్కొంటేగాని యీ సమస్యకు సంతృప్తికరమైన పరిష్కారం దొరకదు.

పిల్లల పుస్తకాల ముఖ్యోద్దేశమేమంటే, "చదవడం ఒక సరదా" అని వారికి తెలియజేయడమే. కానీ, ప్రస్తుతమున్న పుస్తకాలు ఇటువంటి అభిప్రాయాన్ని వారిలో కలిగింపలేవు: అత్యాదరణ పొందిన పిల్లల మాసపత్రిక "చందమామ" తప్ప- చందమామ రావడమే తరువాయి. దాని కొరకు పిల్లలు ఎగబడడం, మనం అందరి యిండ్లలోనూ చూస్తున్న విషయమే. ఈ విధమైనటువంటి ఆసక్తి పిల్లలలో కలిగింప వలెనని, ఇతర పత్రికలు గూడ ప్రయత్నించి కొంతవరకు సఫలమైనవని చెప్పవచ్చు.

ఏది ఏమైనప్పటికీ, 1969 లో ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, వారి ఇంటింటా స్వంత గ్రథాలయం ప్రణాళిక చందాదారుల ప్రశ్నావళి సర్వే ద్వారా తెలిసిన విషయం: మంచివి, ప్రశస్తమైనవి అయిన పిల్లల పుస్తకాలకు విలువ ఉన్నదనీ, త్వరలో అమ్ముడు కాగలవనీ.

ప్రశ్నావళిలోని ప్రశ్నల్లో యీ క్రిందివి కొన్ని:

ప్రశ్న 14B : మీ పిల్లల్లో ఎవరికైనా పుస్తకాలు చదివే అలవాటుందా ? (బడి పుస్తకాలు కాదు; ఇతర పుస్తకాలు).

ప్రశ్న 14C : అలవాటుంటే ఎంతమంది అలా చదువుతున్నారు ?

ప్రశ్న 14D : మీ పిల్లలు పుస్తకాలు చదివే అలవాటును పెంపొందించుకోవడం మీ కిష్టమేనా ?

ప్రశ్న 14E : నిర్బంధమేమీ లేకుండా, పిల్లల పుస్తకాల తాలూకు ప్రత్యేక చందా పథకంలో మీ పిల్లలను చేర్పడానికి మీకు ఆక్షేపణ ఏమైనా ఉందా !

ప్రశ్న 14F : ఆక్షేపణ లేకుంటే, నెలసరి ఈ చందా లేమైనా కట్టగలరా?

రూ. 1-50; రూ. 2-50; రూ. 2-00; రూ. 3-00; రూ. 4-00; రూ. 5-00.

(గమనిక : కట్టగలమన్నంతమాత్రాన అటువంటి పథక మేదైనా మీకు చూపినప్పుడు కట్టి తీరవలెనన్న నిర్బంధమేమీ లేదు.)

ఈ ప్రశ్నావళిద్వారా తెలిసిన విషయాలను విశదీకరించి నివేదికగా వ్రాసిన "The Profile of Andhra Book Readers" అనే పుస్తకమును ప్రచురించారు. 14F ప్రశ్నకు 84



శాతము చందాదారులనుండి నిశ్చయమైన ప్రత్యుత్తరాలు రావడమేగాక, పిల్లల పుస్తకాల తాలూకు ప్రత్యేక చందా పథకం ప్రవేశపెట్టితే తమ పిల్లలను చేర్పడానికి సిద్ధముగా మన్నారని తెలిసినది. 1968, 1967 సం॥లందు ఇదేవిధముగా కావించిన ప్రశ్నావళి సర్వే ద్వారా, యీ పై విషయమే స్పష్టమైనది. దీనినిబట్టి, పిల్లల పుస్తకాలకు అత్యావశ్యకత వున్నదని రుజువవుతుంది. పిల్లల పుస్తకాల తాలూకు ప్రత్యేక పథకాన్ని అమలుపరచలేక పోవడానికి కారణం తగుమాత్రం పిల్లల పుస్తకాలు లేకపోవడమే!

పిల్లల పుస్తకాలు వెలువరించడంలో వాటికి అందమైన మెరుగులు, ఆకర్షణీయమైన రంగులతో తీర్చిదిద్ది, మంచి కాగితం ఉపయోగించి, వీలైనంతవరకు తక్కువ ధర కందుబాటులో ఉండేటట్లు చేయాలి కాని ఉత్పత్తి ధర చాల ఎక్కువ అవుతుందన్న కారణంగా, ఇది సాధ్యంగాదు. కాబట్టి పుస్తకంలో గుణలోప

> ఏ కులమని నేను వివర మడిగితే
> ఏమని చెల్పుదు లోకులకూ
> లోకులకూ పలు గాకులకూ
> దుర్మార్గులకూ ఈ దుష్టులకూ
> ఫాలభాగమున పలలు బాడుచు
> భావము గన్నది నా కులము.
>
> -దూదేకుల సిద్దప్ప

మైనా ఉంటుంది-లేదా పుస్తకం ధరనైనా హెచ్చించవలసి ఉంటుంది. పుస్తకంలో గుణలోపం ఉంటే అమ్మడమే కష్టం. దీనికి తోడు ధర హెచ్చిస్తే అమ్మగలగడం కష్టతరం. ప్రకటనలుచేసి ప్రచారము చేయడం ద్వారా పంపిణీ ఖర్చు చాల ఎక్కువవుతుంది. ఫలితమేమంటే - పుస్తకంధర హెచ్చింపవలసివచ్చి, తద్వారా పలువురికి సులభంగా అందుబాటులో ఉండడానికి వీలుకాని పరిస్థితి వస్తుంది. ఇది ఒక పెద్ద సమస్యే. దీనిని విడదీయడం ఎలా అంటే, ఎక్కువ ప్రతులను అమ్మగలగడం, తద్వారా "యూనిట్ కాస్ట్"ను వీలైనంత తగ్గించడం. ఇది సాధ్యమా అంటే వీలైనంత వరకు ప్రతులు అధికసంఖ్యలో అమ్ముడయేట్లు చేస్తే సాధ్యమే కానీ, ఆ విధంగా అమ్ముడయేట్లు చేయడానికయ్యే ఖర్చులుగూడ ఎక్కువే. తెలుగు భాషలోనే గాక, ఇతర భాషలందు గూడ పిల్లల పుస్తక ప్రచురణ అంతగా అభివృద్ధి చెందలేదనటానికి యివే ముఖ్య కారణాలు. ఇదే తెలుగు పిల్లల పుస్తక ప్రచురణలో కూడ ఉన్న క్లిష్ట సమస్య.

ఈమధ్యనే "సంస్కృతి ఇంటర్నేషనల్" వారు బాపు బాలల బొమ్మల రామాయణం తెలుగులో పలు రంగులతో, అత్యాకర్షణతో ప్రచురించి వున్నారు. (బాపూ బాలల బొమ్మల రామాయణం మొదటగా అంతర్జాతీయ స్థాయిలో ఉన్నత ప్రమాణములతో ఇంగ్లీషులో ప్రచురణ అయి అమెరికాలో ప్రచారమయింది. అమెరికా దేశపు పిల్లలు దీనిని కాసెట్టు టేపులోను, ఫిలిం స్ట్రిప్పులోను, తదితర సామానులతోను మల్టీ మీడియా కిట్‌గా వాడుతున్నారు. ఇది ఫ్రెంచి భాషలోను ప్రచురింపబడినది; స్పానిష్ భాషలో తయారవుతున్నది.) దీన్ని ఒక ప్రయోగమనండి - పరీక్ష అనండి లేదా పరిశోధన అనండి-మొత్తానికి ఇది గొప్పగా చెప్పుకోదగ్గ విషయమే. ఈ ప్రయోగపు జయాపజయాల ద్వారా, మంచి పిల్లల పుస్తకముల పంపిణీ అభివృద్ధి చేయడంలో గల చిక్కులు, సమస్యలు, తప్పొప్పులు తెలుసుకోవచ్చు.

పిల్లల పుస్తక ప్రచురణలో గమనింపవలసిన మౌలిక ఆర్థిక మూలబంధం: సాధారణంగా పిల్లల పుస్తకాలు, పిల్లలే కొనడం అరుదు. పెద్దలు చూసి కొనడం అనేది సహజం. సాధారణంగా మన దేశంలో సగటు మనిషి, తన పిల్లలకు పాఠ్యపుస్తకాలు కొనిచ్చి, ఆ పై ఇతర పుస్తకాలు కొనడం అన్నది శక్తికి మించిన పని. పిల్లల పుస్తకాలను ఆకర్షణీయమైన రంగులతో తీర్చిదిద్ది ప్రచురించడం అంటే పెట్టుబడి ఎక్కువ పెట్టుకోవాలన్నమాటే. కానీ తగు మార్కెట్టు, పంపిణీ లేకపోవడం వల్ల ప్రచురణ చేసే ప్రతుల సంఖ్య మాత్రం కొద్దిగానే ఉంటుంది. కాబట్టి పుస్తకం ధర విధిగా కొంచెం హెచ్చులోనే పెట్టవలసి ఉంటుంది. అభివృద్ధి పొందిన దేశాలలోనే, బాలల పుస్తకాలు ఎక్కువశాతం అమ్ముడవడం పాఠశాలల ద్వారానే. పాఠశాలల తర్వాత గ్రంథాలయాలని చెప్పొచ్చు. అన్నిరకాల పుస్తకాలు—

ముఖ్యంగా బాలల పుస్తకాలు ప్రచురింపగలగడానికి ఇవే మొదటి ఆధారం; మౌలిక ఆర్థిక మూలబంధమూను. పిల్లల పుస్తకాల మార్కెటు సరిగా లేనందువల్ల, ప్రచురణ కర్తలకు 3000 కాపీలు సైతం అమ్మగలగడం చాల ప్రయాసకరంగా ఉంటుంది. అందుకే మన దేశంలో పిల్లల పుస్తకాలు ప్రచురించే సంస్థలు చాల తక్కువ. తగుమాత్రపు గ్రంథాలయాలు లేనిదే పిల్లల పుస్తక ప్రచురణ సంస్థలు అభివృద్ధి కాలేవు. కాబట్టి బాలుర కోసరమని తగుమాత్రపు గ్రంథాలయాలు వ్యాపింపచేయాలి. ఈ పుస్తకాలను విద్యా సంస్థలు తప్పనిసరిగా కొనేటట్టు చేయాలి. దానికి ప్రభుత్వపు సహకారం కావాలి.

పిల్లల పుస్తకాలను ఉదాహరణాలతో, రంగురంగుల బొమ్మలతో అలంకరించడం ద్వారా వాటి ఉత్పత్తిధర ఎక్కువవుతుంది. కాబట్టి ఇతర ప్రచురణ సంస్థల సహకారంతో వివిధ ప్రాంతీయ భాషలలో పుస్తకాలు ప్రచురించడంద్వారా ఉత్పత్తిధరను సాధ్యమైనంత తగ్గించుకోవడంవల్ల ఒకవిధంగా సమస్య పరిష్కార మవుతుంది. ఈపద్ధతినే "అమరచిత్ర కథ", "చతురంగకథ" అను వెలువరించిన "ఇండియా బుక్ హౌస్"వారు శ్లాఘనీయులు. తెలుగు ప్రచురణ సంస్థల సహకారములతో కూడ ఈ ప్రయోగం సాగిస్తున్నారు.

తగుమాత్రపు హెచ్చు సంఖ్యలో పుస్తకాలు ప్రచురించాలి. అప్పుడే మంచి పుస్తకాలను సాధ్యమైనంత తక్కువధరకు వెలువరించడానికవకాశముంటుంది; పంపిణీ చేయడానికి అవకాశముంటుంది. కాబట్టి దీనికిగాను భారీ ఎత్తున ప్రభుత్వ సహాయ సహకారాలు అవసరం. బాల పుస్తకాలు వెలువరించేందుకు బాలల ఎకాడమీ ఈ విషయంలో సహకరించగలదని ఆశిస్తాను.



# ఆంగ్లంలో బాలసాహిత్యం

**— బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు**

ఆంగ్ల రచయితలవల్ల తగిన ఉత్తేజం పొంది మన తెలుగు బాల రచయితలు కూడా "బుడుగు, చిచ్చుల పిడుగు" లాంటి నిజమైన బాల సాహిత్య గ్రంథాలను సృష్టించాలి!

ఆంగ్లసాహిత్యంలో ఇప్పుడు బాలసాహిత్యం ఒక ప్రధాన శాఖ. తమ ఇష్టాలను, మంచి చెడ్డలను దృష్టిలో ఉంచుకుని ప్రత్యేకం తమ కోసమే వ్రాసి, అందమైన బొమ్మలతో అలంకరించి ప్రకటించిన వేలాది పుస్తకాల్లో తమకు నచ్చినవాటిని ఆంగ్లబాలురు నేడు ఎంచుకోగలుగుతున్నారు. అయితే ఆంగ్లంలోనూ బాల సాహిత్యం ఇటీవలే అభివృద్ధిపొందింది. 1850కి ముందు మన పెద్దబాలశిక్షలాంటి పాఠ్యగ్రంథాలు కొన్ని తప్ప బాలురను అలరించి చదివించే సాహిత్య గ్రంథాలు ఎక్కువగా వెలువడలేదు. 'బాలుడు ఇలా నడుచుకోవాలి, ఇటువంటి విశ్వాసాలు అలవరచుకోవాలి' - అని చెప్పే ఆ పాఠ్యగ్రంథాలు వాళ్లకు నీరసంగానూ, విసుగుగానూ ఉండేవి. దానితో పెద్దవాళ్లకోసం వ్రాసిన రాబిన్‌సన్ క్రూసో (డేనియల్ డీఫో), గలివర్స్ ట్రావెల్స్ (జొనాతన్ స్విఫ్ట్), రిప్‌వాన్‌వింక్ల్ (వాషింగ్టన్ ఇర్వింగ్) వంటి గ్రంథాలే వాళ్లూ చదువుతూ ఉండేవారు.

బాలురకోసం వ్రాసిన మంచి గ్రంథాలు అనేక జీవితాల అనుభవం వాళ్లకు కలిగిస్తాయి. స్వీడెన్ దేశం మీదుగా బాతు వీపుమీద ఎక్కి ఎగిరిన బాలుని అనుభవం, హంగరీలో పెరుగుతున్న గయ్యాళి పిల్ల అనుభవం, ఎడారిలో ఒంటరిగా చిక్కువడ్డ బాటసారి అనుభవం - ఇలా ఎన్నెన్నో అనుభవాలు పుస్తకాలు చదివి వాళ్లు చవిచూడగలుగుతారు. మంచి బాల సాహిత్యంవల్ల బాలురకు వినోదం, విజ్ఞానం అన్ని దేశాల్లోని, అన్ని కాలాల్లోని ప్రజల స్వభావ స్వరూపాల అవగాహన లభిస్తాయి.

## ప్రాచీన యుగం

క్రీ. శ. 600 ప్రాంతాల్లో కూడా సన్యాసులూ, ఇతర విద్వాంసులూ తమ శిష్యులకు బోధించే నిమిత్తం 'పాఠపుస్తకాలు' తయారు చేసేవారు. కాని అవి చాలా భాగం ల్యాటిన్ భాషలోనూ, ఏ కొన్నో ఇంగ్లీషు బాలురకు ససేమిరా అర్థం కాని ఆంగ్లో-శాక్షన్ భాషలోనూ ఉండేవి. ఆ ప్రాచీన యుగంలోని పాఠ్యగ్రంథాలకు ఒరవడి పెట్టినవాడు ఆల్డ్‌హెల్మ్ (640?-709). అతని 'డ సెప్టెనేరియో' బైబిల్‌లో 7 అంకెను ఏయే అర్థాలలో ఎలా ఉపయోగించారో వివరించే సుదీర్ఘ వ్యాసం. దీనిలో కొన్ని పొడుపు కథలు కూడా చేర్చబడినయి. ఈ గ్రంథం ప్రశ్నోత్తరరూపంలో రచించబడింది. క్రీ. శ. 1500 దాకా పిల్లల కోసం వ్రాయబడిన పాఠపుస్తకాలన్నీ ఇదే ఒరవడిలో ప్రశ్నోత్తరాల రూపంలోనే వెలసి

వయి. ఈ పద్ధతిలో పిల్లల పుస్తకాలు వ్రాసిన వారిలో ఈ క్రిందివారు ప్రధానులు :

వెనరబ్ల్ బీడ్ (673-735) : 52 ఏళ్లు టీచరుగా పనిచేశాడు. ఆల్డ్ హెల్మ్ కంటె ఎక్కువ భావనాశక్తి, సృజనశక్తి కలవాడు. సరళమైన, సుబోధకమైన ల్యాటిన్‌లో వ్రాశాడు. అతని 'డి నేచురా రీరమ్' జంతువులు, మొక్కలు మొదలైన ప్రకృతిలోని అంశాలను శాస్త్రీయంగా వివరించే చక్కని గ్రంథం.

ఎగ్బర్ట్ ఆఫ్ యార్క్ (?-766?) : యార్క్‌లో సుప్రసిద్ధమైన స్కూలు స్థాపించాడు. అంతకు ముందున్న పిల్లల పుస్తకాల వ్రాతప్రతులు సేకరించాడు. విద్యావ్యాప్తికి దోహదం చేశాడు.

ఆల్ క్యూయిన్ (735-804) : యార్క్ స్కూల్లో చదువుకున్నాడు. అనేక పాఠపుస్తకాలు వ్రాశాడు. వ్యాకరణంమీద ఎక్కువగా వ్రాశాడు. జర్మనీలోని షార్ల్‌మన్ చక్రవర్తి అంతఃపురంలో బాలురకూ, బాలికలకూ కలిపి చదువు చెప్పాడు. బహుశః బాలబాలికల సహవిద్యాభ్యాసానికి అదే ఆరంభం!

ఈల్ఫ్రిక్ (955?-1020?) :- విన్‌చెస్టర్ మఠ పాఠశాలలో ఉపాధ్యాయుడు; 'కలోక్వీ' అన్న ఈయన గ్రంథం గురుశిష్యుల మధ్య ప్రశ్నోత్తర రూపంలో సాగింది. వృత్తులను గూర్చి, వ్యాపారాలనుగూర్చి గురువు శిష్యుడికి బోధిస్తాడు. ఆ నాటి సాంఘికాచారాలను ప్రతిబింబించే రచన ఇది. ల్యాటిన్‌లో వ్రాయబడినా పంక్తులమధ్య ఆంగ్లో-శాక్సన్ అనువాదం ఉంది.

ఈ ప్రాచీన యుగంలో వెలువడిన ఉద్గ్రంథం మొట్టమొదటి బాల విజ్ఞానసర్వస్వం. దాని పేరు 'ఎలూసిడేరియమ్'. కాంటర్‌బరీ ఆర్చిబిషప్ ఆన్‌సెల్మ్ (1033-1109) ఆ విజ్ఞాన సర్వస్వం వ్రాశాడు.



జర్మన్ జానపద కథలను సేకరించిన జాకబ్ గ్రిమ్, విలియమ్ గ్రిమ్

## మధ్యయుగ బాల సాహిత్యం

నార్మనులు అధికారంలోకి రావడంతో ఫ్రెంచ్ భాష ప్రాబల్యం వహించింది. 1450 ప్రాంతంలో అచ్చుయంత్రం తయారై పునరుజ్జీవనయుగం ఆరంభం అయ్యేవరకూ సాగిన ఈ మధ్యయుగంలో అత్యుత్తమ గ్రంథం **The Babee's Boke or A lytle Reporte of how Young People should behave.** ఈ కాలంలో వచ్చిన పిల్లల పుస్తకాల్లో పిల్లల సత్ప్రవర్తనతోపాటు అతిథులెలా మెలగాలో, సేవకులు ఎలా నడచుకోవాలో కూడా వివరించబడేది. ఈ కాలంలో అచ్చుయంత్రం కనిపెట్టిన విలియం కాక్స్‌టన్ (1421-1491) కొన్ని పిల్లల పుస్తకాలు వ్రాసి ప్రచురించడమే

ఇవాళలాగే ఎప్పుడు కూడా
ఇనబింబం పయనించు నింగిపై
ఎప్పుడు కూడా ఇవాళలాగే
గాలులు వీచును, పూవులు పూచును
... ... ... ... ...
ప్రమోద వీణలు కమాచి పాడగ
... ... ... ... ...
ఎచ్చు పెచటికో ఎగురుతు పోయే
పిల్లల్లారా! పిట్టల్లారా!
ఇది నా గీతం వింటారా?

-శ్రీ. శ్రీ

కాక, 'ఆర్థర్ రాజు కథలు', 'ఈసప్ కథలు' మొదలైన అనేక నీతిబోధక పుస్తకాలుకూడా ప్రచురించారు.

## పునరుజ్జీవన యుగం

అచ్చుపుస్తకాలు ఆదిలో ఖరీదు ఎక్కువగా ఉండడంతో పిల్లలకోసం 1550 ప్రాంతంలో కొమ్ముపుస్తకం (horn book) తయారైంది. అచ్చుపుట నలుచదరపు బల్లమీద అంటించి దానిమీద కొమ్ము పొర (ప్లాస్టిక్ పొరలాంటిది) అంటించేవారు. చుట్టూ ఇనుప చట్రం బిగించి ఒక హాండిల్ అమర్చి, దానిలో రంధ్రం చేసి త్రాటితో దానిని పిల్లల బెల్టుకి వ్రేలాడదీసే వారు. దీనిలో అక్షరాలూ, చిన్న ప్రార్థనలూ ఉండేవి.

1690 లో అచ్చయిన 'న్యూ ఇంగ్లండ్ ప్రైమర్' లేక 'రాయల్ ప్రైమర్' బహుళ ప్రచారం పొందింది. ఒక నూరేళ్లపాటు అది చిన్నపిల్లలకు పాఠగ్రంథంగా ఉంది; 50 లక్షల ప్రతులు ఖర్చయినయి.

ప్యూరిటన్ యుగంలో, అంటే 17వ శతాబ్దంలో - పిల్లల పుస్తకాలు కూడా విషాదభరితంగా ఉండేవి. వారికి జీవితంమీది ప్రేమకంటె దైవభీతి ఎక్కువ. ఈ ప్యూరిటన్ యుగంలో వచ్చిన ఒక ప్రధాన గ్రంథం జాన్ బన్యన్ వ్రాసిన 'పిల్గ్రిమ్స్ ప్రోగ్రెస్'. దాని వేదాంతార్థం వదలి ఒక సాహస గాథగా పిల్లలు ఇప్పటికీ ఇష్టంగా దాన్ని చదువుతూఉంటారు. ఈ కాలంలో వచ్చిన మరో రెండు గ్రంథాలు అవి పెద్దవాళ్లకోసం వ్రాసినవే అయినా పిల్లలకు పారాయణ గ్రంథాలు అయినయి. అవి:
1. రాబిన్సన్ క్రూసో (డేనియల్ డిఫో).
2. గలివర్స్ ట్రావెల్స్ (జొనాథన్ స్విఫ్ట్).

## 18 వ శతాబ్దం

పిల్లల అవసరాలూ, సరదాలూ వేరే ఉంటాయనీ, వాళ్లకోసం ప్రత్యేకంగా పుస్తకాలు వ్రాయాలనీ మొట్టమొదట గుర్తించినవాడు జాన్ న్యూబరీ (1713-1763). ఈయన వ్రాసిన Little Pretty Pocket Book (1744) విశేష ప్రజాదరణ పొందింది. ఈయన Chap books అనే చౌక పుస్తకాలు ప్రకటించి పేవ్‌మెంట్లమీద అమ్మించేవాడు. వీటిలో వీరగాథలూ, జానపద కథలూ ఉండేవి. ఉన్నవారూ, లేనివారూ కూడా వేలంవెర్రిగా ఈ పుస్తకాలు కొని చదివేవారు. జాన్సనూ, గోల్డ్‌స్మిత్తూ ఈ న్యూబరీకి మిత్రులు. బహుశః వారు కూడా ఈయన ప్రకటించిన చౌకపుస్తకాల్లో కొన్ని వ్రాసి ఉండవచ్చు. ఈ శతాబ్దంలో ఆంగ్ల బాల సాహిత్యపుష్టికి కృషిచేసిన మరి కొందరు ప్రధాన రచయితలు:

1. థామస్ డే - Sanford and Merton (1783).

2. శ్రీమతి అనా లెటీషియా బార్బాల్డ్, డా. ఐకిన్ (బార్బాల్డ్ సోదరుడు)-Evenings at Home.

3. శ్రీమతి సారా కిర్బీ ట్రిమ్మర్-History of the Robins (1786)

### 19 వ శతాబ్దం

ఆంగ్ల బాల సాహిత్యం ఈ శతాబ్ది ఆరంభంలో మరో మలుపు తిరిగింది. నిజమైన సృజనాత్మక రచనలు రావడం మొదలుపెట్టినయి. సిద్ధహస్తులైన సుప్రసిద్ధ రచయితలు బహిరంగంగా పిల్లలకోసం వ్రాయడానికి ముందుకు వచ్చారు. ఈ కాలపు రచయితలలో ప్రధానులు కొందరు :

1. చార్లెస్ ల్యాంబ్, మేరీ ల్యాంబ్ (అన్నా,చెల్లెలు);-1807లో వీరు షేక్స్పియర్ నాటక కథలు పిల్లల కర్థమయేటట్లు వ్రాసి ప్రకటించారు.

2. శ్రీమతి మేరీ మర్తా షెర్వుడ్ (1755-1851)-History of the Fairlychild Faimily (1818).

3. జేన్ టెయిలర్ (1783-1824), అన్ (ఆమె చెల్లెలు) - Little Ann and other Poems (1804).

ఈ పుస్తకానికి కేట్ గ్రీన్వే చక్కని బొమ్మలు వేశారు. ఇప్పటికీ జేన్ టెయిలర్ వ్రాసిన ప్రసిద్ధ పద్యం Twinkle Twinkle, Little Star ప్రతి తరం బాలల నాలుకలమీదా నానుతూనే ఉంది.

గ్రిమ్ సోదరులు బాల సాహిత్యానికి చేసిన సేవ అనల్పమైంది. వారు జర్మనీలో ఊరూరా తిరిగి జానపద కథలు సేకరించారు. వారి Popular Stories 1824 లో ఆంగ్లంలోకి అనువదించబడింది. తరువాత 1846 లో హాన్స్



పిల్లలకు కథలు చదివి చెబుతున్న హాన్స్ క్రిష్టియన్ ఆండర్సన్

క్రిష్టియన్ ఆండర్సన్ వ్రాసిన Modern Fairy Tales ఆంగ్లంలోకి వచ్చింది. గ్రంథకర్త స్వయంగా కల్పించి వ్రాసిన జానపద కథల సంపుటం ఇది. ఈ కాలానికి చెందిన ఇతర ప్రసిద్ధ బాల రచయితలు :

1. Harriet Martineau (1802-1876)-Feats of the Fjord (1841).

2. Thomas Hughes (1822-1896) - Tom Brown's School Days (1857).

3. Washington Irving(1783-1859)-Ripwan Winkle (1819), Legend of Sleepy Hollow (1819).

ఇర్వింగ్ వ్రాసిన ఈ రెండు పుస్తకాలూ ఇప్పటికీ పునర్ముద్రణలు పొందుతూ బహుళ ప్రజాదరణ అందుకుంటూనే ఉన్నాయి.

పెద్దలకోసం పుస్తకాలు వ్రాసే ప్రసిద్ధ రచయిత లనేకులు పిల్లలకోసం కూడా వ్రాయడం సాగించారు. అలాంటివారిలో కొందరు :

1. Sir Walter Scott (1771-1832)- Tales of a Grandfather.

2. W. M. Thackeray (1811-1863)- The Rose and the Ring.

3. Charles Dickens (1812-1870)- Child's History of England.

4. John Ruskin (1819-1900) - King of the Golden River.

5. Lewis Carroll (1832-1898) - Alice's Adventures in Wonderland.

19 వ శతాబ్దం చివరా, 20 వ శతాబ్దం ఆరంభంలోనూ ఆంగ్ల బాలసాహిత్యం పరిపూర్ణ సౌష్ఠవం సంతరించుకుంది. ఈ కాలంలో Mary Mapes Dodge (1831-1905), Howard Pyle (1853-1911), Mark Twain (1835-1910) వంటి మహామహులెందరో బాలల నలరించే ఉద్గ్రంథాలు ఎన్నెన్నో వ్రాశారు. కేవలం ఆంగ్ల బాల సాహిత్యాభివృద్ధిని రేఖా మాత్రంగా పరిచయం చేయడానికి పూను కొన్న ఈ సంగ్రహ సమీక్షలో వారందరి పేర్లూ గాని, వారి రచనల విశిష్టతగాని ప్రస్తావించడం సాధ్యం కాదు.

అయినా - ప్రసిద్ధాంగ్ల బాల రచయితల పేర్లూ, వారి రచనల పేర్లూ తెలుసుకోడం కాదు ముఖ్యం. వాళ్ల రచనలవల్ల తగినంతగా ఉత్తేజం పొంది మన తెలుగు బాల రచయితలు కూడా 'బుడుగు, చిచ్చుల పిడుగు' లాంటి నిజమైన బాల సాహిత్య గ్రంథాలను సృష్టించాలి. అదీ ముఖ్యం !



# జాతీయాభివృద్ధి కృషి: బాలలు

- గోవిందరాజు రామకృష్ణరావు

**జాతీయాభివృద్ధి కృషిలో పిల్లలను తమ భాగస్వాములను చేయడానికి విద్యాలయాలు, తల్లి దండ్రులు, స్వచ్ఛంద సంస్థలు ఇంకా ఎక్కువ అవకాశాలు కల్పించాలి.**

సమాజంలో అంతర్భాగంగా వున్న ప్రతి వర్గం చైతన్యవంతంగా వున్నప్పుడు ఆ సమాజం అంతా సచేతనమై, శీఘ్రగతిని ముందుకు సాగిపోతుంది. కాబట్టి సమాజాన్ని సదా చైతన్య విలసితం చేసే కృషిలో అందరు-అంటే అన్ని వయోవర్గాల వారు భాగస్వాములు కావాలి. బాలలు, యువకులు, మధ్యవయస్కులు, వృద్ధులు అందరు జాతి పురోగమనానికి తోడ్పడాలి.

మన దేశంలో జాతీయాభివృద్ధి కృషిని క్రమబద్ధం చేసేందుకు స్వరాజ్యం సిద్ధించిన అనతికాలంలోనే ప్రభుత్వం ప్రణాళికారచనకు, వాటి అమలుకు పూనుకొన్నది. సాంఘిక సేవలో బాలబాలికలకు, ముఖ్యంగా విద్యార్థులకు సముచిత పాత్ర ఇవ్వాలని మొదటి పంచ వర్ష ప్రణాళిక స్పష్టంగా నిర్దేశించింది. దానిలో ప్రణాళికాకర్తలు "ఈ కార్యక్రమంవల్ల చేకూరే ప్రతిఫలాన్ని కేవలం ఆర్థికపరంగానే పరిగణించకూడదు. అయితే పనిలో సామర్థ్యాన్ని ఇనుమడింపజేయడానికి తగిన ప్రయత్నం చేస్తూనే వుండాలి. విద్యార్థులు నిర్వహించే ఈ కార్యక్రమం వారికి నిజమైన సంతృప్తినికలిగిస్తుంది. సాధించిన ఫలితాలు వారికి గర్వకారణమవుతాయి" అని పేర్కొన్నారు. ప్రణాళికలో తలపెట్టిన సాంఘిక సేవాకార్యక్రమం విద్యార్థులను ఉత్తమపౌరులుగా, బాధ్యతాయుతమైన వ్యక్తులుగా తీర్చిదిద్దేందుకు దోహదంచేస్తుంది. వారు చేసే కాయకష్టం మానసికంగా వారికి ఎంతో ఆనందాన్ని చేకూరుస్తుంది. జాతిసేవలో తాము పాలుపంచుకుంటున్నామనే భావం వారిలో దేశభక్తిని ప్రవర్ధమానం చేస్తుంది.

ప్రముఖ గాంధేయవాది డాక్టర్ జె. సి. కుమరప్ప ఈ విషయంలో ప్రత్యేక కృషి చేశారు. పిల్లలు తగిన పథకాన్ని ఏర్పరచుకొని నిర్వహించే సామూహిక కేంద్రాలు ఏర్పరచాలని, సమాజంలో వివిధమైన సాంఘిక సేవా కార్యక్రమాలకు అవకాశం కల్పించాలని చెప్పారు. ప్రధాని పండిట్ జవహర్ లాల్ నెహ్రూ ఈ విషయం ప్రస్తావిస్తూ విద్యార్థులు వివిధ బృందాల క్రింద ఏర్పడి ప్రతి బృందం గ్రామాలను, పరిసర గ్రామాలను లేదా పట్టణాల్లో ఆయా వీధులను పరిశుభ్రంగా వుంచే బాధ్యత వహించాలని పెక్కుసార్లు ఉద్బోధించారు. గాంధీజీ గ్రామనిర్మాణ కార్యక్రమాలలోను, సర్వోదయ కార్యక్రమాలలోను బాలబాలికలువహించేపాత్రగురించి విపులీకరించారు.

ఈ తరం బాలబాలికలు పుడుతూనే స్వేచ్ఛా వాయువులు పీల్చుకోగలుగుతున్నారు. వెనుకటి తరం పరిస్థితి వారు జన్మించినప్పటికి దేశం పర పాలనలో వున్నది. వారి తరంలో చిన్నప్పటి నుంచి వారి మనస్సులలో అనుక్షణం మెదిలే కోరిక స్వరాజ్యకాంక్ష. దేశానికి ఏ విధంగా దాస్యవిముక్తి చేయాలన్నదే ప్రతి భారతీయుని ధ్యేయం. అనుక్షణం దేశభక్తి వారిని ముందుకు నడిపించేది. త్యాగం, దేశభక్తి, సామాజిక సేవ మొదలైన ఆదర్శాలు ప్రతి భారతీయునికి ఉగ్గుపాలతో వచ్చాయి. మన దేశంలో ఏ మహా నాయకుని జీవితచరిత్ర చూసినా చిన్నతనం లోనే ఏవిధంగా దేశమాతను శృంఖలాముక్తం చేయగలనా అని పరితపిస్తూ సమస్తం త్యజించి స్వరాజ్య ఉద్యమంలో పాల్గొన్న ఉదంతం స్పష్టమవుతుంది. అది ఆ నాటి స్వరాజ్య దీక్ష. ఆ మహనీయుల త్యాగఫలంగా దేశం స్వరాజ్యం సముపార్జించుకుంది. ఈ నాటి బాలబాలికలకు కనిపించే వాతావరణం వేరు. ఆనాడు స్వరాజ్య కాంక్ష మాదిరి ఈ నాడు జాతీయాభివృద్ధి కని పిస్తుంది.

శతాబ్దాలుగా విదేశీపాలనలో ఉండడంచేత భారతదేశం అనేక రంగాల్లో ఇతరదేశాలకంటే వెనుకబడి ఉండవలసివచ్చింది. స్వరాజ్యానంత రం మనం ప్రణాళికాబద్ధంగా జాతీయాభివృద్ధి కృషి ప్రారంభించాం. ఈ కృషిలో వయో భేదం లేకుండా అందరు పాల్గొనడం అత్యం తావశ్యకం. పిల్లలు కేవలం తమ శ్రద్ధాసక్తు లను, సమయాన్ని గ్రంథపఠనకే ఉపయోగిం చాలనుకోవడం సరికాదు. దేశాభివృద్ధి కృషిలో వారు చిన్నతనంనుంచి భాగస్వాములు కావాలి. ఒకవైపున ఉత్తమ విద్య సముపార్జించుకుం టూనే, లేదా తమ పనులు చేసుకుంటూనే మరొకవైపున బాలబాలికలు జాతీయాభివృద్ధి కృషిలో పాల్గొనాలి. అందుకు తగ్గ అవకా శాలు, ప్రోత్సాహం వారికి కలుగజేయాలి. దేశం మొత్తంమీద అక్షరాస్యత శాతం ఈనాడు 34.45 వున్నది. 6-11 సంవత్సరాల వయస్సు గల పిల్లలలో 1975 నాటికి 1-5 తరగతులలో చదివేవారి శాతం 82.7. అదేవిధంగా 11-14 సంవత్సరాల వయస్సుగల 7-8 తరగతులలో చదివే పిల్లల శాతం 36. 14-17 సంవత్సరాల వయస్సుగల సెకండరీ తరగతులలోని పిల్లల శాతం 27.5. 14 సంవత్సరాల వయస్సువరకు బాలబాలికలందరికీ నిర్బంధ ప్రాతిపదికపై ఉచితంగా విద్య గరపాలని రాజ్యాంగం నిబం ధిస్తున్నది. అయినప్పటికీ అనేకమైన సాంఘిక, ఆర్థిక పరిస్థితులవల్ల చాలామంది పిల్లలు పాఠ శాలలకు వెళ్లడంలేదు. మన దేశంలో 12 సంవ త్సరాల లోపు పిల్లలు 110 లక్షలమంది పైగా జీవనంకోసం పనిచేస్తున్నారు. వీరు ఇండ్లలోను, హోటళ్లలోను, చిన్నచిన్న కార్ఖానాలలోను వున్నారు.

జాతీయాభివృద్ధి కృషిలో విద్యార్థులను, విద్యార్థులు కాని పిల్లలను కూడా భాగస్వాము లను చేసేందుకు మరింత అధిక ప్రయత్నం జరపవలసివున్నది. విద్యార్థులలో క్రమశిక్షణను పెంపొందించి వారిని ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దేందుకు ఉపాధ్యాయ వర్గమే కాకుండా ఇతర సంస్థలు కూడా పనిచేస్తున్నాయి. మన దేశంలో స్కౌట్ ఉద్యమం 1909 లోనే ప్రారంభమయింది. బెంగుళూరు, కిర్కి, జబల్ పూర్, సిమ్లా పట్టణాల్లో నాలుగు తొలి స్కౌటు దళాలు ఏర్పాటు కావడంతో నూతన అధ్యా యం ప్రారంభమయింది. స్వాతంత్ర్యం వచ్చాక ఈ ఉద్యమం మరింత బలపడింది. పిల్లలలో క్రమ శిక్షణను పెంపొందించే సంకల్పంతో 1954 జులైలో జాతీయ క్రమశిక్షణ పథకం ప్రారంభ

మయింది. ఎన్. సి. సి. కార్యక్రమాలు ఈ ఉద్యమానికి చేయూత నిచ్చాయి. విద్యార్థులుకాని బాలబాలికలలో ఇట్టి ఉత్తమ లక్షణాలు పెంపొందించేందుకు బాల సంఘాలు గణనీయమైన కృషి చేస్తున్నాయి. నెహ్రూ యువక కేంద్రాలు కూడా గ్రామీణ ప్రాంతాల్లోను గణనీయమైన కృషి చేస్తున్నాయి. ఇతర స్వచ్ఛంద సంస్థలు కూడా ఈ విషయమై శ్రద్ధాసక్తులు చూపుతున్నాయి.

పిల్లలు పెద్దవారైన తరువాత ఈ సంగతులు తామే తెలుసుకొంటారనే అభిప్రాయం సరియైనది కాదు. దేశంలో వస్తున్న మార్పులను వారికి చిన్నతనంలోనే తెలియజేయాలి. వారు కూడా తమ బుద్ధికుశలతకు, తమ వయస్సుకు తగిన రీతిగా ఈ మార్పులకు అనుస్పందిస్తారనే సత్యాన్ని మనం విస్మరించకూడదు. అంతే కాకుండా జాతీయ స్రవంతిలో దేశంలోని ప్రతి వ్యక్తి ఒక అంతర్భాగమైన బిందువే. ఈ దృష్టితో పరిశీలించినప్పుడు జాతీయాభివృద్ధి కృషిలో పిల్లలను తగు భాగస్వాములను చేయడానికి విద్యాలయాలు, తల్లిదండ్రులు, స్వచ్ఛంద సంస్థలు ఇంకా ఎక్కువ అవకాశాలు కల్పించాలి. ముఖ్యంగా విద్యాసంస్థల పాత్ర దీనిలో ఎక్కువగా వున్నది. పాఠ్యాంశాలలో వచ్చిన మార్పులను ఎప్పటికప్పుడు విద్యార్థులకు తెలియజేయాలి. చదువుతోపాటు సంఘసేవకు, జాతీయాభివృద్ధి కార్యక్రమాల్లో ప్రత్యక్షంగాను, పరోక్షంగాను పాల్గొనేందుకు ప్రతి విద్యాసంస్థ తగు కార్యక్రమాలు రూపొందించి అమలుజరపాలి. జాతీయసేవ అనేది పిల్లల జీవితంలో ఒక భాగం కావాలి. దైనిక కార్యక్రమంలో ఒక అంశం కావాలి. సెలవలలో పిల్లలు మరికొన్ని ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించవచ్చును. బాల సంఘాలు ఇతర స్వచ్ఛంద సంస్థలు కూడా తగు కార్యక్రమాలను ఏర్పరచుకొని అమలుజరపాలి. కేవలం వినోదపరమైన కార్యక్రమాలకు పరిమితం చేసుకోవడంవల్ల పిల్లలలో కావలసిన జాతీయ స్ఫూర్తి పెంపొందదు. తల్లిదండ్రులు కూడా పిల్లలలో ఇట్టి అభిరుచిని వర్ధిల్లచేయాలి. అప్పుడు జాతీయాభివృద్ధి కృషిలో బాలబాలికలు తగు పాత్ర వహిస్తారు. తద్వారా భావిజీవితంలో వారు దేశాభ్యుదయానికి అన్నివిధాలా తోడ్పడే పౌరులుగా రూపొందుతారు.



# బాలల ఆరోగ్యానికి యోగాసనాలు

— యశవంత సిన్హా

*ఇప్పుడు శాసనాధికారం మన చేతులలో ఉన్నందున మన సంస్కృతికి అనుగుణంగా ఉన్న ఆసనములను, సూర్య నమస్కారములను పాఠశాలలో పిల్లలకు ప్రవేశపెట్టుట కనీస ధర్మము.*

ఏ కళనైననూ సాధించవలెనంటే వయసుకు తగిన ఆరోగ్యమూ బలమూ అత్యవసరములు. అందుకుగాను యోగాసనములు, సూర్య నమస్కారములు బాలలకు అకాడమీలో నేర్పించుట భావ్యము.

ఒలింపిక్ క్రీడలలో భారతీయులకు ఇంత వరకు గణనీయమైన స్థానము లేకుండుట శోచనీయము. రెండవ ప్రపంచ యుద్ధము తరువాత ఏర్పడిన జర్మన్ డెమోక్రటిక్ రిపబ్లిక్ వాసులు పెక్కు క్రీడలలో చాంపియన్ షిప్ పొందగలిగారు. ఖండ ఖండాంతరములలో ఏడవ సంవత్సరము రాగానే పిల్లలకు ప్రత్యేక శారీరక శిక్షణ ఇవ్వడంచేత వారు ఒలెంపిక్ ఆటల పోటీలలో విజేత లవుతున్నారు. మనం కూడా మన పిల్లలకు తగు శిక్షణ ఏడవ సంవత్సరము నుండియే ప్రారంభిస్తే వారు కూడా ఆటలలో ప్రవీణులగుటకు అవకాశం వున్నది. బ్రిటిష్‌వారు మనలను పాలించిన రోజులలో క్షత్రియులను, సిక్కులను, పంజాబీలు మొదలగువారిని సైన్యములో చేర్చుకొనెడివారు; పక్షపాతము చూపేవారు. స్వాతంత్ర్యము వచ్చిన వెనుక జాతి మత భేదములు లేకుండా యోగ్యులైన వారందరిని సైన్యములో చేర్చుకొన వలయునని తీర్మా నింపబడినది. కానీ రిక్రూట్ మెంటు సమయములో నూటికి 10 మంది మాత్రమే ఆ ప్రమాణాలను అందుకొన గలుగుతున్నారు. మిగిలిన వారు అనారోగ్యవంతులు గాను, అశక్తులుగాను నిర్ణయింప బడుతున్నారు. ఈ పరిస్థితి చాలా విషాదకరము. పాఠశాలలలోను, కళాశాలలలోను ఇచ్చు వ్యాయామ శిక్షణలో లోటుపాట్లుండుట అందరికీ విదితమే. ఇంగ్లీషు వారు తమ పద్ధతులను, ఆట పాటలను ప్రవేశ పెట్టినారు. మన పద్ధతులను నిరసించినారు. ఇది మన సంస్కృతికీ, శీతోష్ణస్థితికీ వ్యతిరేకముగా వున్నందున మంచి ఫలితములను ఇవ్వలేక పోయినది.

ఇప్పుడు శాసనాధికారము మన చేతులలో వున్నందున మన సంస్కృతికి అనుగుణంగా వున్న ఆసనములను, సూర్యనమస్కారములను పాఠశాలలలో పిల్లలకు ప్రవేశపెట్టుట కనీస ధర్మము. మన ఎకాడమీలో చిన్నపిల్లలను చేరదీసి వారికి వినోదము కూర్చుటకు వున్న ఏర్పాట్లలో యోగాసనములు, సూర్యనమస్కారములు కూడ ప్రవేశపెట్టుట సముచితము.

ఈ వ్యాయామ తరగతులలో 7 నుండి 15 సంవత్సరముల లోపు పిల్లలు చేరవచ్చును. 15 సంవత్సరములు నిండిన తరువాత వారు

ఇచ్చటనుండి వెడలిపోవునపుడు తమ వయసుకు తగిన ఆరోగ్యము, బలము కలిగియుండుటకు దోహదము చేయుట అకాడమీవారి ప్రథమ కర్తవ్యము. ఇక్కడ ఒక విషయం నొక్కి చెప్పాలి. మనదేశంలో ఉద్భవించిన యోగ సద్విద్య ఖండ ఖండాంతరములలో వ్యాప్తిచెంది వృద్ధి గాంచుచున్నది. ఇది చాలా కాలంవరకు మనదేశంలో సవతితల్లి ప్రేమకు గురియగుట దేశ దౌర్భాగ్యము. ఈ మధ్యనే కేంద్ర విద్యాశాఖామాత్యులు గౌరవనీయులు నూరుల్‌హాసన్ యోగసద్విద్యను ప్రైమరీ క్లాసునుండి ఎం. ఏ. వరకు నేర్పించుట అత్యావపరమని వక్కాణించినారు. మన ఆంధ్ర ప్రదేశ్‌లో విద్యాశాఖను నిర్వహిస్తున్న శ్రీ మండలి వెంకటకృష్ణారావుగారు యోగవిద్య యందు సుముఖులై వుండుట సంతోషించదగిన విషయము. కనుక బాలల అకాడమీ ఇటువంటి ఉపయోగకరమైన పద్ధతులలో యోగవిద్యను ప్రవేశపెట్టి దేశ భావిపౌరులను తీర్చిదిద్దుట కనీసపు ధర్మము.

ఆసన విద్యలో బునాదిగా ఉన్న (1) పశ్చిమోత్తానాసనము (2) ధనురాసనము (3) పవన ముక్తాసనము (4) వజ్రాసనము (5) సర్వాంగాసనము (6) హలాసనము (7) అర్ధ మత్స్యాసనము (8) పద్మాసనము (9) అర్ధమత్స్యేంద్రాసనము (10) భుజంగాసనము (11) శలభాసనము (12) కుక్కుటాసనములను అభ్యసిస్తే కాళ్ళకు చేతులకు చక్కని వ్యాయామం కలిగి వాటిని బలిష్ఠము చేయును. పొట్టలోని పేగులు శాస్త్రసమ్మతముగా స్పందించును. కాలేయము చైతన్యవంతం అగును. కరకర ఆకలి అగును. భుజించిన పదార్థము చక్కగా అరిగి ఒంటపట్టును. మూత్ర పురీషములు సకాలమునకు బహిర్గతమగును. రక్తము నాడులలో ధారాళముగ ప్రవహించును. కంటినిండ కమ్మగా నిద్రపట్టును. ధైర్యము, సాహసము, ఆత్మవిశ్వాసము, ఉత్సాహము కలిగి జీవితము గడపుటకు దోహదకారి అగును. ఆసనములు సూర్యోదయమునకు పూర్వము చేయుట శ్రేయోదాయకము. పుస్తకములు చదివి చేయుట హానికరము. సద్గురుని ద్వారా నేర్చుకొని అభ్యసించుట మేలు.

ఈ ఆసనములను బాలబాలికలు అభ్యసించి వర్ధిల్లుదురు గాక!



# బాలసాహిత్యంపై పాశ్చాత్య ప్రభావం

**— గాలి ప్రభావతి**

ఈ నాడు వట వృక్షంవలె విస్తరిల్లుతున్న బాల సాహిత్య వృక్షానికి అలనాడు బీజం నాటడానికి కారకులైనవారూ, మొలకెత్తిన తరువాత నీరు పోసి పెంచి పెద్ద చేయడానికి యథాశక్తి సహకరించినవారూ పాశ్చాత్యులే అంటే అతిశయోక్తి అనకూడదు; ఆంధ్ర మహా రచయితలు ఆగ్రహించగూడదు.

ఇతర సాహిత్యశాఖలవలెనే 'బాల సాహిత్యం' అనే ఒక ప్రత్యేక సాహిత్యశాఖ ఏర్పడటానికి కూడా కారణం పాశ్చాత్య (సాహిత్య) ప్రభావమే అని చెప్పవచ్చు. తెలుగు భాషలో నేడు శాఖోపశాఖలుగా విస్తరిల్లుతున్న బాల సాహిత్య వృక్షం 19వ శతాబ్దపు చరమదశలో అంకురించింది.

పూర్వం తెలుగు సాహిత్యంలో ఉన్న పాటలు పిల్లలను ఆడించడానికో, లాలించి నిద్ర పుచ్చడానికో ఉద్దేశించినవే కాని, పిల్లలు అభ్యసించడానికి ప్రత్యేకంగా వ్రాసినవు కావు. కథలు, నాటికలు బాలలకోసం విడిగా లేవు. 1897 లో విక్టోరియా మహారాణి పాలన వజ్రోత్సవం జరిగినప్పుడు తర్డ్ ఫారం చదువుతున్న గిడుగు సీతాపతిగారు విక్టోరియారాణిని గురించి పద్యాలు వ్రాసి తరగతిలో చదివినందుకు బహుమతి పొందినట్లు, "Boys own Annual" అనే పుస్తక ప్రభావంతో తాను 1909 లో చిలుకమ్మ పెండ్లి, రైలుబండి మొదలైన గేయాలు రచించినట్లు బాల సాహితీమాల పరిచయంలో వ్రాశారు.

అప్పుడే క్రిస్టియన్ లిటరేచర్ సొసైటీ వారు 'పక్షులు', 'మృగములు', 'నానాదేశ బాలబాలికలు', 'చెట్లు', 'పువ్వులు', 'పండ్లు' మొదలైన శీర్షికలతో చిన్న చిన్న పుస్తకాలు పిల్లలకోసం ప్రచురించేవారు. 1909 లోనే గుంటూరులో ఒక క్రైస్తవ సంఘంవారు నడుపుతున్న 'వివేకవతి' అనే తెలుగు పత్రికలో సీతాపతిగారు వ్రాసిన బాలగేయాలు ప్రతినెలా వరుసగా ప్రచురింపబడి కొంతవరకు ప్రచారంలోకి వచ్చినాయి.

'గిడుగు' నుండి 'బుడుగు' వరకు- ఆ మధ్యకాలంలో బాలలకోసం, తెలుగు సాహితీ క్షేత్రంలో ఎన్ని ఎక్స్‌పెర్‌మెంట్లు! ఎన్ని పెప్పర్‌మెంట్లు! ఎన్ని సర్టిఫికెట్లు! ఎన్ని చాక్‌లెట్లు! ఇక అనువాదాలను గురించి చెప్పనక్కరలేదు.

రెండు దశాబ్దాలక్రితం!- ఆంధ్ర వారపత్రికలో ధారావాహికంగా వెలువడిన 'రాజూ-పేద' (మార్క్ ట్వెయిన్ నవల 'ప్రిన్స్ అండ్ పాపర్'), 'హకల్ బెరిఫిన్', (మార్క్ ట్వెయిన్- 'ఎడ్వంచర్స్ ఆఫ్ హకల్ బెరిఫిన్'), 'కాంచన ద్వీపం' (రాబర్ట్ లూయీ స్టీవెన్సన్ నవల 'ట్రెజర్ ఐలండ్'),

'డాన్ క్విక్ సెట్' (స్పానిష్ రచయిత సెరి వాన్‌టెజ్ నవల)- ఈ నవలలన్నీ పిల్లలను ఎంతగానో ఆకర్షించి ఉత్తేజ పరిచినాయి. అద్భుత సాహస సన్నివేశాలతో కూడిన ఈ నవలల ప్రభావం బాలబాలికల మనస్సులపైన తరవాత వచ్చిన బాలసాహిత్య ప్రక్రియలపైన చెరగని ముద్రవేసింది.

18 వ శతాబ్దికి చెందిన జోనథన్ స్విఫ్ట్ ఆంగ్లరచన 'గలివర్స్ ట్రావెల్స్'ను, 'గలివర్ నౌకాయాత్రలు' అనే పేరుతో శ్రీ కాళ్ళకూరి హనుమంతరరావు,- 'అంగుష్ఠమాత్రుల చిత్రద్వీపం', 'తాళప్రమాణుల లంకారాజ్యం' అనే శీర్షికలతో శ్రీ కమలాకర వెంకట్రావు తెలుగులోకి అనువదించి ప్రచురించారు. ఇవి విచిత్రమైన కాల్పనిక గాథలు. 'గలివర్' అనే కాల్పనిక వ్యక్తి సముద్ర ప్రయాణం చేస్తూండగా తుపాను తాకిడికి నౌక భగ్నమైంది. గలివర్ సాహసంతో సముద్రంలో ఈది ఒడ్డుకు చేరి ఒకసారి 'అంగుష్ఠమాత్రుల ద్వీపం', తిరిగి ఓడలో ప్రయాణం సాగించి రెండవసారి 'తాళప్రమాణుల ద్వీపం' చేరుకున్నప్పటి చిత్రమైన అనుభవాలు ఈ కాల్పనిక కథలలో వర్ణితమైనాయి ఈ కథలు బాలబాలికలలో ధైర్య సాహసాలను పురికొల్పుతాయి.

పిల్లల మనస్సులను ఆకట్టుకునే అద్భుత సన్నివేశాలతో కూడిన నవల ప్రసిద్ధ రచయిత జాక్ లండన్ వ్రాసిన 'ది కాల్ అఫ్ ది వైల్డ్'. ఈ నవలను శ్రీ కొడవగంటి కుటుంబరావు 'ప్రకృతి పిలుపు' అనే పేరుతో తెలుగులోకి అనువదించారు. కెనడా ఉత్తరభాగాన గల అలాస్కా సమీపంలో కాన్‌డైర్ జిల్లాలోని నదీతీరాలలో బంగారం ఉన్నదని తెలిసి, 1896 లో బంగారం అన్వేషణకై పర్యటించిన



జాక్ లండన్ స్వానుభవాలను ఆధారం చేసుకొని ఈ నవల వ్రాశాడు.

చింతా దీక్షితులుగారి 'లీలాసుందరికథ'కు లూయీ కెరేల్ వ్రాసిన 'యాలిస్ ఇన్ వండర్ ల్యాండ్' ఆధారం.

హేరియట్ ఎలిజబెత్ బీజర్ స్టోవ్ రచన 'అంకుల్ టామ్స్ కేబిన్'కు శ్రీ నాయని సుబ్బారావు, శ్రీ చెరుకుపల్లి సీతారామమూర్తి గార్ల తెలుగు అనువాదాలు 'బానిస బ్రతుకు(లు)' అనే శీర్షికలతో వెలువడినాయి. నాయని సుబ్బారావుగారు స్టీవెన్సన్ నవల 'ట్రెజర్ ఐలండ్' ను కూడా 'నిధి ద్వీపము' అని తెలుగులోకి అనువదించారు. 'బానిస బ్రతుకులు' మచిలీపట్టణంలో త్రివేణి పబ్లిషర్స్ వారు, 'నిధిద్వీపము' గుంటూరులో ప్రభూ అండ్ కో వారు ప్రచురించారు.

'వీరనారి' అనే శీర్షికన వెలువడిన 'జోన్ ఆఫ్ ఆర్క్' వీరగాథ పిల్లలకోసం 'లతానాథ్' వ్రాశారు. ఇది బాల బాలికలను ఉత్తేజపరిచే ఫ్రాన్స్‌దేశపు చారిత్రకగాథ. 'దైవవాణి' ప్రేరణతో ఆంగ్లేయుల బారినుండి ఫ్రెంచి సింహాసనాన్ని రక్షించటానికి పురుషవేషం ధరించి, యుద్ధంలో ఫ్రెంచి సైన్యానికి నాయకత్వం వహించి, పట్టుదలతో పోరాడి

విజయం సాధించి, చివరకు ఆంగ్లేయుల వంచనకు, క్రౌర్యానికి అన్యాయంగా బలి అయిపోయిన పదహారేళ్ళ జోన్ కన్య జీవితగాథ.

చార్లెస్ డికెన్స్ 'గ్రేట్ ఎక్స్‌పెక్టేషన్స్'కు శ్రీ కమలాకర వెంకట్రావు తెలుగు అనువాదం 'పుట్టెడాశలు'. థామస్ వ్రాసిన 'టామ్‌బ్రౌన్స్ స్కూల్ డేస్'ను వెంకట్రావు గారే 'టామ్‌బ్రౌన్ బడి అనుభవాలు' అని తెలుగులోకి అనువదించారు.

శ్రీ ప్రయాగ నరసింహశాస్త్రి 'ఇటలీ కథల' కు మూలం, మాక్సిం గోర్కీ వ్రాసిన 'టేల్స్ అఫ్ ఇటలీ'.

జర్మన్ సాహిత్యం నుండి కూడా పిల్లల కథలు, నవలలు కొన్ని తెలుగులోకి అనువదింపబడినాయి: జర్మన్ రచయితలు హాన్స్ కరోసా, ఎరిక్ కేస్ట్నర్, తియోడోర్ స్టోరం వ్రాసిన నవలలను 'ఇంద్రజాలం' 'బాల డిటెక్టివ్' 'తండ్రీ కొడుకూ' అనే పేర డాక్టర్ వి. ఎన్. శర్మ తెలుగులోకి అనువదించారు.

గ్రీకు సాహిత్యానికి చెందిన 'ఈసప్స్ ఫేబుల్స్'ను వీరేశలింగంపంతులుగారే కాక, నండూరి రామమోహనరావు, శ్రీ రెంటాల గోపాలకృష్ణ, శ్రీ మరుపూరు కోదండరామ రెడ్డి 'ఈసపు నీతికథలు'గా అనువాదాలు చేసి పుస్తకరూపంలో ప్రచురించారు; రెంటాల గోపాలకృష్ణ అనువాదం మొదటి భాగం 1956 లోను, రెండవ భాగం 1960 లోను వెలువడినాయి. కోదండరామరెడ్డి అనువాదం ఒకే సంపుటంగా వెలువడింది. ఇందులో మొత్తం 216 కథలున్నాయి.

ఈసపు కథలు ప్రపంచ ప్రఖ్యాతి పొందిన నీతి కథలు.

రష్యన్ రచయితలు టాల్‌స్టాయ్, పుష్కిన్ మొదలయిన వారు వ్రాసిన పిల్లల నవలలకు, కథలకు కూడా తెలుగు అనువాదాలు వెలువడినాయి. టాల్‌స్టాయ్ బాలల కథలో చాలా వరకు రెంటాల గోపాలకృష్ణ, తమిడిపాటి కామేశ్వరరావు, మహీధర జగన్మోహనరావు, గద్దె లింగయ్య అనువాదాలు చేసి ప్రచురించారు

పుష్కిన్ రచన 'ది టేల్స్ అఫ్ ఐవాన్ బెల్కిన్' కు శ్రీ బి. రామచంద్రరావు తెలుగు అనువాదం 'బెల్కిన్ కథలు' 1959 లో పుస్తకరూపంలో వెలువడింది.

ఈనాడు వటవృక్షంవలె విస్తరిల్లుతున్న బాలసాహిత్య వృక్షానికి అలనాడు బీజం నాటటానికి కారకులైనవారూ, మొలకెత్తిన తరువాత నీరుపోసి పెంచి పెద్దచేయటానికి యథాశక్తి సహకరించినవారూ పాశ్చాత్యులే అంటే అతిశయోక్తి అనగూడదు; ఆంధ్ర మహారచయితలు ఆగ్రహించ కూడదు.



# బాల సంఘాలు

— మండలి బుద్ధప్రసాద్

బాల సంఘాలు, విద్యా సంస్థలు చెట్టా పట్టాలు వేసుకుని మనుగడ సాగించిన నాడు మనం ఆశించే సుందర సుమధుర సాంఘిక వ్యవస్థ ఏర్పడుతుంది.

నేటి బాలలే రేపటి పౌరులు. ఈ నాటి బాలలు తమ వ్యక్తిత్వాన్ని ఇతోధికంగా వికసింప చేసుకొనేటట్లు వారిని తీర్చి దిద్దగలిగినప్పుడే భారతదేశం సముజ్జ్వలంగా ప్రకాశింప గలుగుతుంది; ఉజ్జ్వల భవిష్యత్తుతో విరాజిల్లుతుంది. అందుకే దేశంలోని బాల లందరినీ తీర్చిదిద్దే క్రమశిక్షణతో నడిపించవలసిన బాధ్యత ఎంతైనా మనపై ఉంది. మన దేశంలో బాలల విషయమై జరుగుతున్న కృషి కేవలం విద్యాపరమైనదిగా వుంటూ వచ్చిందేకాని బాలలలోని సర్జనాత్మక శక్తులను వెలికి తీసుకువచ్చేదిగా లేదని చెప్పవచ్చును. ఈ విషయాన్ని గ్రహించిన పెద్దలు బాలానంద సంఘాలు స్థాపించారు. విజ్ఞానం, వినోదం, వికాసం తమ ధ్యేయాలుగా పెట్టుకొని నేటి బాలానంద సంఘాలు పనిచేస్తున్నాయి.

బాల సంఘాలెందుకు ? అని దేశంలో కొందరి దృష్టిలో ఒక అపోహ ఉంది. విద్యాలయాలకు, విద్యావిధానాలకు బాలసంఘాల కార్యక్రమాలు విద్యావిఘాతంగా ఉన్నాయని కొందరు భావిస్తూ వుంటారు. ఇది సమంజసమైన భావన కాదు. విద్యాలయాలను కళాలయాలుగాను, కళాశాలలుగాను భావించుటలోనే యిట్టి పొరపాటు అభిప్రాయం ప్రారంభమైనది. విద్యాలయాల్లో చెప్పే విద్యలు కళలు గావు.

మానవుడు కేవలం విద్యలతోనే బ్రతకలేడు. మనిషికి ఆకలితోపాటు కళాతృష్ణకూడా నైజగుణం. మనకు కనిపించని మనస్సు ఈ తృష్ణకు కేంద్రం. దానిని తృప్తిపరచనియెడల మానవ జీవితం అసంతృప్తితోనే అంతమవుతుంది. కనుక కళలతో కూడా మనిషిని తృప్తి పరచవలసిన అవసరం ఉంది. అలాగని ప్రతివాడూ కళాకారుడు కాలేడు. కళలవలన కలిగే ఆనందాన్ని అనుభవించి సంతృప్తిపడే ప్రజలు అనేకమంది. అంటే ఈ రెండువర్గాల వారికి కూడా కళయొక్క అవసరం ఉంది. కనుక కళలతో ప్రతివారికి అవసరం ఉండాలి. సిద్ధాంతపరమైన యీ సత్యం ఇప్పుడు కాలానుగుణమైన కొన్ని మార్పులు పొందింది. విద్యలతో పాటు కళలు కూడ జీవనోపాధికి ఉపకరణాలుగా పరిణమించిన సాంఘిక స్థితి యేర్పడింది. కనుక ప్రతివారు కళలను విధిగా నేర్చుకోవలసిన అవసరం ఎంతైనా వుంది. జన్మదత్తమైన కళాభిజ్ఞత ఉన్నవాడు కళాకారుడుగా రాణిస్తాడు. అలా కానివాడు కళాను భూతిని పొంది కళోపాసకుడవుతాడు; కళాపోషకుడవుతాడు. విద్యాలయాల్లో లేనటువంటి

యీ లోటును పూరించే పనిని బాలసంఘాలు చేస్తున్నాయి. విద్యాలయాల్లో ఒకవేళ కళలను బోధిస్తున్నప్పటికీ కూడా అది నామ మాత్రంగానే ఉంది. కనుక కళలను శాస్త్ర బద్ధంగా నేర్పవలసిన బాధ్యత బాలసంఘాలు నిర్వర్తిస్తున్నాయి. బాలసంఘాలు విద్యాల యాలకు పోటీసంస్థలు కావు. ఇవి రెండూ చెట్టాపట్టాలువేసికొని మనుగడ సాగించిననాడే మనం ఆశించే సుందర సుమధురమైన సాంఘిక వ్యవస్థ యేర్పడుతుంది. కాబట్టి బాలసంఘాల అవసరం యీనాడు యెంతైనా వుంది.

> నవ్వవే నువు పాప! నవ్వవే నువ్వు !!
> నవ్వుకన్నా సుఖము లోకాన లేదు !
> చూడు ఈ లోకాన ఎందరో మనుషులు
> మనసుతీరా అసలు నవ్వనే లేరు
> ఉన్నది చాలునని ఊరుకో లేరు
> లేనిదాని కొరకు ఆరాట పడతారు
> నవ్వకుండా తుదకు నిద్ర పోతారు
> నిద్రలో ఎన్నెన్నో కలలు కంటారు.
> నేలమీద నడచు మనుషులే వారు
> చూపు మాత్రం నింగిపైన నిలిపేరు
> నీలాగ ఒకనాడు బాలలే వారు
> నేడు నవ్వును మరచి బ్రతుకుతున్నారు.
>
> -పి. శ్రీనివాసశాస్త్రి

తెలుగుదేశంలో తొలి రిజిష్టర్డు బాలసంఘం "ఆంధ్ర బాలానంద సంఘం". దీనిని బాల లోకంలో అన్నయ్య. అక్కయ్యలుగ ప్రసిద్ధి కెక్కిన శ్రీ న్యాయపతి రాఘవరావు, శ్రీమతి కామేశ్వరమ్మగార్లు 1947 లో మద్రాసులో స్థాపించారు. 1945 లో స్థాపించబడిన తొలి తెలుగు పిల్లల పత్రిక "బాల" ద్వారాను, ఆలిండియా రేడియోవారు ప్రసారం చేస్తున్న పిల్లల కార్యక్రమాలద్వారాను ఆంధ్రప్రదేశ్ బాలల ఉద్యమానికి ఎనలేని ప్రచారం చేకూ రింది. తత్ఫలితంగా ఊరూరా బాలసంఘాలు ఏర్పడినాయి. ఉత్సాహవంతులైన పెద్దలు, పిన్నలు కలసి తమ శక్తికొలది సేవాపరాయ ణతతో బాలసంఘాలు స్థాపించారు. వాటిలో కొన్నిటిని ఇక్కడ ఉదాహరించడము అప్రస్తు తం కాదనుకుంటాను.

ఆంధ్ర బాలానంద సంఘం, హైదరాబాద్, మద్రాస్.

గౌతమీ బాలవిహార్, నాగార్జునసాగర్.

బాలానంద కేంద్రం, గుంటూరు.

బాలభారతి, విజయవాడ.

రామా బాలానంద సంఘం, అనకాపల్లి.

నేతాజీ బాలానంద సంఘం, పోడూరు.

దివిసీమ బాలానంద సంఘం, అవనిగడ్డ.

రాయలసీమ బాలానంద సంఘం, గుంతకల్.

శ్రీకాళహస్తితాలూకా బాలానందసంఘం.

నవరంగ్ చిత్రకళా నికేతన్, వెల్లటూరు.

రాజేంద్ర బాలానందం, పాలమూరు.

విశ్వశాంతి బాలానంద సంఘం, తాడికొండ.

కాకతీయ బాలానంద సంఘం, వరంగల్.

జాంబాగ్ బాలానంద సంఘం, హైదరాబాద్.

నవీన్ బాలానంద సంఘం, చిక్కడపల్లి.

**బాలసంఘాల ఆశయాలేమిటి?**

బాలసంఘాల ఆశయాలుగ ఈక్రిందివాటిని పేర్కొనవచ్చును.

1. సాంస్కృతిక, వినోద, విజ్ఞాన రంగాలలో పిల్లలకు అభిరుచి కలిగించడం, పాల్గొనే. ట్లు చేయడం.

2. నాట్య, నాటక, సంగీతాది రంగస్థల కళ లందు, చిత్రలేఖనం, ఫొటోగ్రఫీ వంటి దృశ్యకళలందు వ్యాసరచన, గేయరచన, వక్తృత్వం వంటి సాహితీ ప్రక్రియలందు పిల్లలకు అభిరుచి కలిగించి పాల్గొనేటట్లు చేసి ప్రతిభా పాటవ పోటీలు నిర్వహించి ప్రోత్సహించడం.

3. బాలలకు విజ్ఞాన, వినోద యాత్రలను నిర్వ హించడం.

4. బాల గ్రంథాలయాలను ఏర్పరచి, విజ్ఞాన సముపార్జనకు దోహదపడడం.

5. వస్తుప్రదర్శనలు, పుస్తక ప్రదర్శనలు ఏర్పరచి అభిరుచి కలిగించడం.

6. బాల సాహిత్య ప్రచురణ గావించి, పంపిణీ చేయడం.

7. ఆటల పోటీలు నిర్వహించి బాలలను పాల్గొనేటట్లు చేయడం.

ఈ ఆశయాలతో నేటి బాలసంఘాలు పని చేస్తున్నవని చెప్పవచ్చును. ఈ ఆశయాలను అక్షరాల అమలు చేయగలిగితే బాలసంఘం విజయవంతమైనట్లే!

## బాలసంఘాల నిర్వహణ

ఏ సంఘమైనా విజయవంతం కావాలంటే, అది సక్రమ నిర్వహణపైన ఆధారపడి ఉంటుంది. కార్యకర్తలు నిస్స్వార్థపరులైతే వారు స్థాపించిన సంఘం విజయవంత మవుతుంది. బాలసంఘాలు నడిపేవారు ముఖ్యంగా ఈ క్రింది అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి.

అ. బాలసంఘాలు నడిపే వ్యక్తి బాలల మన స్తత్వాన్ని ఎరిగినవాడై ఉండాలి. సుతి మెత్తని ఆ పసిహృదయాలను చూర గొననివాడు బాలసంఘాలు నడపలేడు.

ఆ. బాలసంఘాలు భవిష్యత్తులో పనికొచ్చే విధంగా కార్యకర్తలు తయారుచేయాలి.

ఇ. ముఖ్యంగా బాలసంఘాల నిర్వహణకు నిర్వహణ దక్షతతోపాటు ఆర్థికసహాయం కావాలి. ఉదారులైన పెద్దలు, ప్రభు త్వము సహాయపడాలి. చిత్తశుద్ధిగల కార్యకర్తలు వుండి ధనాన్ని సక్రమ మార్గాన ఖర్చుపెట్టగలిగిననాడే ఏ సంఘ మైనా రాణించగలుగుతుంది.

## బాలల ఉద్యమ పునరుజ్జీవనం

ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం బాలల సంక్షేమ పథకాలపట్ల చూపుతున్న ఆసక్తి



ప్రార్థన జరుపుతున్న దివిసీమ బాలానంద సంఘం సభ్యులు

కారణాన బాలల ఉద్యమం పునరుజ్జీవనం పొందుతుందని చెప్పవచ్చును. 1974 లో హైదరాబాద్ నగరాన జరిగిన అఖిలభారత తెలుగు బాలల మహోత్సవాలు ఈ పునరు జ్జీవన కార్యక్రమానికి నాందీవాక్యం పలికి నాయి. ఆ సమావేశాలలో "బాలల అకాడమీ" ని స్థాపించవలెనని ప్రభుత్వాన్ని కోరడము, తత్ఫలితంగా 1976 మార్చిలో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ఆవిర్భవించడము జరిగింది. 1976 సెప్టెంబరు 14 న భారత రాష్ట్రపతి

శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమద్ బాలల అకాడమీకి ప్రారంభోత్సవం చేశారు. భారతదేశంలో పిల్లలకోసం ప్రత్యేకంగా ఏర్పడిన తొలి అకాడమీ ఇదే కావడము మనకు గర్వించదగిన విషయం.

### బాలల అకాడమీ చేపట్టవలసిన కార్యక్రమాలు

బాలల అకాడమీ రాష్ట్రమంతటా వున్న బాలసంఘాల కార్యక్రమాలను పెంపొందించి క్రమబద్ధం చేసేందుకు కృషిచేయాలి. అల్లే బాలసంఘాలకు ప్రత్యేక నియమావళిని తయారుచేయాలి. బాలసంఘాల కార్యకర్తలకు శిక్షణ గరిపే ఏర్పాట్లు గావించాలి. హైదరాబాద్‌లోని 'జవాహర్ బాలభవన్' నమూనాలో 'మినీ బాలభవన్' లను రాష్ట్రంలో పలుప్రాంతాలలో నిర్మించాలి. బాలల వినోదార్థమై చలనచిత్రాలను బాలసంఘాలకు సరఫరాచేసే నిమిత్తము ఒక "ఫిలిం బ్యాంక్" ఏర్పాటు చేయాలి. బాలల అకాడమీ స్వయంగా పిల్లలకు విజ్ఞాన, వినోద సమ్మిళితమైన చలన చిత్రాలు తీయాలి. సంవత్సరానికొకమారు రాష్ట్రస్థాయిలో బాలమహాసభలు ఏర్పాటు గావించి, బాలసంఘాల కార్యకర్తలను ఒకే వేదికపై కలుసుకునేటట్లు చేయాలి. బాలల ఉద్యమానికి దోహదపడే విధంగా ఒక పిల్లల పత్రికను నడపాలి. దీనిలో పెద్దల రచనలే కాకుండా, పిల్లల రచనలు కూడా చోటు చేసుకోవాలి. దానిలో బాలసంఘాల వార్తలను ప్రచురించి ప్రోత్సహించాలి. ఈ కార్యక్రమాలలో బాలల అకాడమీకి బాలసంఘాలు తగు చేయూతనివ్వాలి!



నాటకం ప్రదర్శిస్తున్న దివిసీమ బాలానంద సంఘం సభ్యులు

# బాలలకోసం పద్యకావ్యాలు

- ఉత్పల సత్యనారాయణాచార్య

భాషను బోధించడానికి మహా కావ్యాన్ని వినియోగించడం క్షౌరానికి ఖడ్గం ఉపయోగించడం వంటిదని రవీంద్రు డన్నాడు. మహా కావ్యాన్ని వ్యాకరణంగా, నిఘంటువుగా దుర్వినియోగం చేయడం సరస్వతీ దేవికి తీరని అపచారం చేయడమే అవుతుంది.

బాలలకు కావ్యాలు అవసరమా? అవసర మను కొంటే అవి ఎలా ఉండాలి? అన్న విషయా లనుగురించి చర్చిద్దాం.

కావ్యాలు ప్రతిభావంతులచేతనే రచింపబడ తాయి. బాలలను ప్రతిభావంతుల్ని కూడా చేయవలసి ఉన్నది కనుక వారు కావ్యాలను చదవడం అవసరమే. ప్రగతిశీలమైనది కదా ప్రతిభ-అది అపూర్వ వస్తునిర్మాణానికి దారి తీస్తుందని వేరే చెప్పనక్కరలేదు. ఇంకొక విషయ మేమంటే పెద్దలమాదిరిగానే పిల్లలు కూడా వారి స్థాయిలో రసానందం పొంద గలుగుతారు. పెద్దలకంటె పిల్లలే ఊహాజగ త్తులో స్వేచ్ఛగా విహరించగలుగుతారు.

అయితే మన ప్రాచీన సాహిత్యంలో బాల లకు ఉపయోగించే కావ్యా లున్నాయా? అలాంటివి ఉన్నాయని చెప్పలేము కాని, కృష్ణ శతకం, వేమన శతకం, సుమతి శతకం, కుమారీ శతకం మొదలైనవి పిల్లలు పఠించ దగిన శతకాలు ఎన్నో ఉన్నాయి. శతకాలు వేరు, కావ్యాలు వేరు. పిల్లలచేత పద్య మయము, లేదా గేయమయము అయిన కావ్యం చదివించడం అవసరం. అలాంటి కావ్యాలు ప్రాచీన సాహిత్యంలో మనకు దొరకవు. భోజరాజీయము, కేయూరబాహు చరిత్ర మొదలైన కథా కావ్యాలలో ఇతి వృత్తం పిల్లలకు సంబంధించిందేకాని, పిల్లలు చదువుకొనడానికి ఉద్దేశించి రచించినవిగా అవి కనిపించడం లేదు. నిజానికి మనుచరిత్రలోని ఇతివృత్తం సిద్ధరసమైన అద్భుతరసంతో కూడు కొన్నది. అయినా దాన్ని పెద్దన్నగారు శృంగారరసంతోనో, శాంతరసంతోనో నింపి వేయడం జరిగింది. పిల్లలకు మాత్రం అది పనికిరాని దయింది.

మనుచరిత్ర మొదలైన కావ్యాలలోని ప్రసాదగుణాన్నిబట్టి వాటిని పిల్లలచేత చది వించడం భాషావిషయికంగా ముఖ్యం గదా!- అన్నది మరొక ప్రశ్న. మనుచరిత్రలో అంద రినీ ఆకర్షిస్తున్నది ఆ ప్రసాదగుణమే! అది కూడా పెద్దల స్థాయిలో ఉన్నది కానీ పిల్లల స్థాయిలో లేదు అది పిల్లల కథే అయినా పెద్దన్నగారి చేతిలో పడి అది అన్నివిధాలా మహా కావ్యమయింది. మహా కావ్యంలోని



పద్యాలు బలవంతంగా పిల్లలచేత చదివించడం తప్పని నా అభిప్రాయం. ఎంత రుచికరమైన పదార్థాన్ని అయినా బలవంతాన నోట్లో క్రుక్కితే రుచిగా ఉండదు. భాషను బోధించడానికి మహాకావ్యాన్ని వినియోగించడం క్షౌరానికి ఖడ్గం ఉపయోగించడం వంటిదని రవీంద్రుడన్నాడు. మహాకావ్యాన్ని వ్యాకరణంగా, నిఘంటువుగా దుర్వినియోగం చేయడం సరస్వతీదేవికి తీరని అపచారం చేయడమే అవుతుంది.

అయితే పిల్లల కావ్యాలు ఎలా ఉండాలన్నది మరొక ప్రశ్న. పిల్లలకు కావ్యాలు రచించే కవి శబ్దశక్తి గ్రహించినవాడై ఉండాలి. కవి ప్రతిభావంతుడే కాబట్టి అతని శబ్దశక్తినిగురించి ప్రశ్నించే హక్కు మనకుండదు. అతడు కావ్యంలో ఉపయోగించే అన్ని శబ్దాలు, అన్ని భావాలు పూర్తిగా పిల్లలకు తెలియవలసిన అవసరం ఎంతమాత్రం లేదు. కావ్యం అంత తేలికగా ఉంటే అది పేలవమైన రచన అవుతుంది. పిల్లలకు తెలిసిన ఇంకా తెలుసుకోదగిన విధంగా ఆ కావ్యం ఉండాలి. అది భావంలోను, వ్యంగ్యంలోను, నిర్మాణ చాతురిలోను కనబరచాలి. కొన్ని కొన్ని శబ్దాలలోనూ వెల్లడించాలి. ఆ కావ్యం ప్రాచీన కావ్య సౌధానికి సోపానంగా ఉపకరించాలి. కాలెత్తి పైమెట్టుకు ఎక్కేటప్పుడు ఉత్సాహము, శ్రమ ఈ రెండూ తప్పనిసరిగా ఉంటాయి. బాలల కావ్యంలో కూడా ఈ పద్ధతి ఉండటం అత్యావసరం.

బాలకావ్యాలు పద్యమయంగా ఉండాలా? గేయమయంగా ఉండాలా అన్నది వేరొక ప్రశ్న. ఉత్పలమాలాది వృత్తాలలో కంటె, ఆటవెలది మొదలైన జాతులలో కంటె గేయంలో సౌలభ్యం అధికంగా ఉంది. కవి గేయం వ్రాయడం ఎంత సులభమో పాఠకుడు దాన్ని చదవడం కూడా అంతే సులభంగా, క్షుణ్ణమయిన విధంగా ఈనాడు గేయం తన రూపు దిద్దుకొన్నది. నిజానికి పద్యానికి, గేయానికి అట్టే భేదంలేదు. గేయాన్ని కూడా కొందరు పద్యమో అన్నట్లుగా వ్రాస్తారు- చదువుతారు కూడా. కాని, గేయానికి సహజంగా ఉన్న విరుపులు, లయ ఈనాడు బాగా ప్రస్ఫుటమయినందువల్లనే చాలామందికి గేయ రచన సులభోపాయ మయింది.

ప్రాచీన కావ్యాలు సులభతరం చేసి పిల్లల చేత చదివించడం మంచిదా? మన ప్రాచీన కావ్యాలను మనమందరం కూర్చొని సులభతరం చేయలేము. అలా చేయడం తప్పుకూడా. అది సాహిత్యామృతం. అందులో నీళ్లు పోసి పిల్లలచేత త్రాగించడంవల్ల లాభం ఉండదు. అలా చేస్తే ఆ అమృతం కూడా పాడవుతుంది. పిల్లలకు ప్రయోజనం లేకుండా పోతుంది. కాబట్టి పిల్లల్ని, దేశకాల పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకొని పిల్లలకోసం కావ్యాలు వ్రాయాలి.

అలాంటి కావ్యాలను చదివించి పిల్లల్ని ప్రతిభావంతుల్ని చేయాలి.

బాల సాహిత్యంలో పద్యకృతులు వెలయిం చిన ఆధునికులు చాలామంది ఉన్నారు. వారిలో నాళం కృష్ణారావుగారు ప్రముఖులు. వారి మార్గాన్నే అనుసరించి కవిరావుగారు ముద్దుపాప, గుజ్జనగూళ్లు, చిరుమువ్వలు అనే పద్యఖండికలు వ్రాశారు. కరుణశ్రీగారి తెలుగు బాల, అలపర్తి వెంకట సుబ్బారావుగారి బంగారుపాప హృద్యమైన పద్యకృతులే! వార్ల చిరంజీవిగారి తెలుగుబాల, కవివర్మగారి వశోపదేశం, నీలా జంగయ్యగారి బాల గీతాంజలి మొదలైనవి చక్కని పద్యరచనలు. వేజండ్ల సాంబశివరావు, రంగ కృష్ణమా చార్యులు, కుమారి డి. తారాబాయి, పైడి పాటి సుబ్బరామకవి, చెన్నప్ప ప్రభృతులు చక్కని పద్యకథా రచనలు చేశారు. బాల సాహిత్యంవైపు బుద్ధి మళ్లించి చక్కని పద్య రచనలు చేసినవారెందరో ఉన్నారు. వారంద రికీ వందనాలు చెప్పుకొంటున్నాను.



# స్వాతంత్ర్యానంతర బాలసాహిత్యం

— డా. ముకురాల రామారెడ్డి

మన బాల సాహిత్య పంథాలో ఇప్పటికి వచ్చిన వాటిలో కొన్ని గేయ రచనలు మాత్రమే బాగున్నవి. కథలూ, నవలలూ, నాటకాలూ, వైజ్ఞానిక రచనలూ కొన్ని వచ్చినవి కానీ అవి అంతంత మాత్రంగానే ఉన్నవి.

ఈ ముప్పై ఏండ్ల స్వతంత్ర శకంలో తెలుగు బాలలను మురిపించే రచనలు గూడా ఎన్నో వచ్చినవి. వీలైనంతవరకు ఆ యా రచయితల ప్రయత్నాలను ప్రశంసిస్తూ కొన్ని కుడి ఎడమలను గూడా గ్రహించడం ప్రస్తుత విధి.

1952 నాటికే మన రచయితలు బాల సాహిత్యం సుసంపన్నం చేయాలనే దీక్షతో కలాలు పట్టారు. శ్రీ చేకుమళ్ల కామేశ్వర రావు రచించిన 'తాతలనాటి కథలు' అడ్డ సైజులో ఉన్న చిన్న పుస్తకమే అయినా దీన్ని పెద్దచ్చులో వేశారు. పిల్లలకు వినోదం, అద్భుతం, ఆశ్చర్యం కలిగించే కథలు (కుక్కమూతివాళ్లు వగైరా) ఇందులో ఉన్నవి. 'పిల్లలే నయం' అనే పుస్తకం రాసిన శ్రీ మానేపల్లి తాతాచార్య పిల్లల మనస్సును ఆకర్షించే కథలు (కోడిగుడ్డంత గోధుమగింజ, వగైరా) రాశారు. వివిధదేశాల జానపద కథలను కూర్చి శ్రీమతి అబ్బూరి ఛాయాదేవి 'అనగా అనగా' అనే పుస్తకం వేశారు. ఆ కథలు వినేకోసం పిల్లలను ఆహ్వానిస్తూ మొదటి పుటలో ముత్యాలసరం బాణీలో రాసినగేయం ఆప్యాయమైన శైలిలో ఉంది. శ్రీ బాపు చిత్రాలను సంతరించుకొని అందంగా అచ్చయిన బాలానంద ప్రచురణలు 'పేదరు పాపాయి' వగైరా బాలలకు ఉలుకూ, ఉత్సాహమూ కలిగించేవి. 64 పుటల్లో 14 కథలు శ్రీ రెంటాల రచించినవి- 'టాల్‌స్టాయి పిల్లల కథలు' చిటికలో ముగించి గుటకలు వేయించేవి. బాలబంధు ప్రచురణల్లో వివిధ భాగాల కింద: వీర నారీమణులు, వీర బాలలు, వీర బాలురు, భక్త రమణీమణులు సంపుటిగా వచ్చినవి. 'బాల కాశీమజిలీ కథలు' గూడా వచ్చినవి. వీటి రచనాశైలి ఇంకా సరళంగా ఉంటే బాగుండేది. శ్రీ బి. రామరాజు రచించిన 'వీరగాథలు' బాలలకు పౌరుష పాఠాలు నేర్పించే పుస్తకం. దీనిలోని సదాశివరెడ్డి కథ చరిత్ర కెక్కవలసింది. శ్రీ సామవేదం జానకిరామశర్మ మాటలతోపాటు పాటలు గూడా కలిపి 'పాపాయి కథలు' రచించారు. పిల్లల కోసమని శ్రీ దాశరథి, నారాయణరెడ్డి రచించిన 'రామాయణ, భారతాలు' కమ్మని శైలిలో ఉన్నవి. 'పిల్లలున్న ఇల్లు మల్లెపూల జల్లు' అనే పుస్తకంతో శ్రీ మహూనా అరు వ్యాసాలు రాశారు. బాల సాహిత్యం ఎట్లా రచించాలో తెలుసుకో దలచిన వారికి ఇందులో కొన్ని సూచన లున్నవి. చిత్రకారులైన శ్రీ బుజ్జాయి రచించింది

'పిల్లలు పువ్వులు' పిల్లలకోసం రాసే వచన రచనకు మంచి ఉదాహరణ. శ్రీ కె. సభా రచించింది 'పిల్లల రాజ్యం'. కథా కథన పద్ధతిని బట్టి ఇది పెద్ద బాలలకు బాగా పనికి వస్తుంది.

1958 నాటికి ఆదర్శ గ్రంథ మండలి, విజయవాడ వారు ఉత్తమ బాల సాహిత్యం పేరుతో 44 పుస్తకాలు వేశారు. డా॥ వి. ఎన్. శర్మ రచించిన 'పిల్లల లోకం' జర్మను కథకు అనుసరణ అయినా, దీని దేశీసరళి రచన ఆకర్ష వంతంగా ఉంది. శ్రీ అనిపెద్ది 'పిల్లల సామెత కథలు' రచించారు. బాలలూ! అమ్మాయిలూ! అబ్బాయిలూ!, తమ్ముళ్లూ, చెల్లెళ్లూ! అని సంబోధిస్తూ 'కుక్క కాటుకు చెప్పు దెబ్బ' వంటి సామెతలు అర్థ మయ్యేటట్లు రచించిన వీరి కథలు పిన్న మనస్కులను బాగా ఆక ర్షించినవి.

శ్రీయుతులు చింతా దీక్షితులు, బి. వి. నరసింహారావు ప్రభృతులు కొందరు తమ కలం పరిశ్రమ బాల సాహిత్యం కోసమే అని రుజువు చేశారు. వీరి ప్రత్యేక కృషికి బాల సాహిత్య చరిత్రలో ప్రముఖస్థానం లభిస్తుంది.

'రేడియో అన్నయ్య' న్యా. రాఘవ రావు రచించిన "అంతా ఒక్కటే!" అనే గేయంలో జాతీయ సమైక్య భావన పిల్లల మనస్సుకు హత్తుకొనేటంత చిక్కగా ఉంది. శ్రీ అలసత్తి వారి కథాత్మక గేయాలు చెప్ప దగ్గవి. స్నేహ ధర్మమనే నీతిని పిల్లలకు చెప్ప డానికి వీరు కృష్ణ - కుచేల కథను లలితమైన గేయంలో రచించారు. శ్రీ ఉత్పల వారి 'ఉత్పల మాల', 'కుమార సంభవం' వంటి రచనల్లో గేయ రూప మెత్తిన పౌరాణిక కథలు బాలలు ఆనందించే శైలిలో అమరినవి. శ్రీ చల్లా రాధాకృష్ణ శర్మ రచించిన 'బెక



బెక', 'అనగా-అనగా' వంటి రచనలు మెచ్చ దగ్గవి. శ్రీ మిరియాల రచించిన 'బాలాభి రామం, రంగు రంగుల దీపాలు' కవిత్వపు గుబాళింపుతో తయారైన అతి రసాల వంటివి. బాలల్లో స్వదేశీ భావన, తల్లి దండ్రులపై భక్తి మొలకెత్తే రచనలు చేసిన శ్రీ లక్ష్మీపతి

రావు కలం ప్రశస్తమైంది. బాలలకు ఆధునిక గేయాలు నేర్పుదామనే పట్టుదలతో రచించిన కవిరావు ప్రయత్నం ఉచితమైంది. శ్రీ డి. ఎల్. ఆనందరావు రచించిన 'పిల్లల ఆటలు' చూడదగ్గవి. ఇంకా 'రేడియో అక్కయ్య'

> వీథులలో సందె వేళ
> వినోదాల కేరింతల
> తేలియాడు బాలలూ!
> తెలియండీ వింతలు!
> సూర్యుడు మీ కెరికే మరి
> చుక్కలు చంద్రుడు మీ సరి
> తోడుగ ఆ నభోవీథి
> ఆడే రంతట నిశీథి
>
> ఎంద్రకాయ, సింహము సం
> ద్రెండు బొమ్మలూ విధి
> తారలతో ఏర్పడి సం
> తాల వెలుగు చోద్యమ్మది.
>
> సూర్యునివలె నెంతో స్థిర
> మందరముగ ప్రభవించును
> అర్ధరాత్రి తలలపైన
> అగుపడి మన నలరించును.
>
> ఉత్తర ధ్రువ మన్నమాట
> పొత్తములో చదువనేల
> ముత్తెములా కనుల ఎదుట
> చిత్తగించు ధ్రువుని మ్రోల!
>
> —సన్నిధానం లక్ష్మీనారాయణమూర్తి

(న్యా. కామేశ్వరి), వీడిద కామేశ్వరరావు, వాల్లపూడి వెంకట రమణ, ఎం. ప్రభాకర రెడ్డి, వాడి వెంకట కృష్ణారావు, వింజమూరి లక్ష్మి మొ॥ వారు చేసిన కృషివల్ల మన బాల సాహిత్యం పెరుగుతూ వచ్చింది.

బాల సాహిత్యాన్ని ప్రోత్సహించే ఉద్దేశంతో ప్రభుత్వం గూడా ప్రణాళిక వేసింది. నెహ్రూ బాల పుస్తకాలయం సిరీస్ ('ఒక నాటకం వేద్దాము' వంటి) పుస్తకా లెన్నో సరసమైన ధరలకు అందివవి. మాస్కో ప్రచురణలు గూడా బాగా ప్రచారాని కెక్కినవి.

చందమామ, బాలమిత్ర, బొమ్మరిల్లు వంటి పత్రికల ద్వారా, అమర చిత్ర కథల వంటి ప్రచురణల ద్వారా ఈ తరం బాలలు తమ పఠనా శక్తిని బాగా పెంచుకొన్నారు.

**కుడి ఎడమలు**

మన బాల గ్రంథాలయ విభాగాలు ఇంకా సువ్యవస్థితం కావలసిన అవసర ముంది. అంతే బాలలకు ఉపయోగించని పుస్తకా లెన్నో ఈ విభాగాల్లో చేరినవి. సాధారణంగా పుస్తకం చిన్న సైజులో ఉన్నా, పెద్దచ్చులో ఉన్నా, వెల తక్కువదైనా, అక్కడక్కడ బొమ్మ లున్నదైనా, చిన్న వాక్యాలు గల వచనంలో ఉన్నదైనా చూసి దాన్ని బాల విభాగంలో పడవేసిన ఉదాహరణలున్నవి. ఈపద్ధతి వెంటనే మార్చదగింది.

ఇప్పటి బాల సాహిత్య రచయితలు స్థూలముగా గ్రహించదగిన అంశాలు కొన్ని :

(i) బాలల కోసమని ఇంత మంది ఇన్ని రచనలు చేసినా ఆధునిక బాలలకు బాగా జ్ఞాపక మున్నవి పురాతన గేయాలే. ఆధునిక గేయాలు బాలలకు పట్టుపడడం లేదు. పురాతన గేయాలూ, వేమన పద్యాలూ, పైగా సినిమా పాటలు కూడా ఇష్టమైన బాలలకు ఆధునిక గేయాలు జ్ఞాపకం లేకపోవడానికి కారణా లేమిటో రచయితలు గ్రహించవలసిన మొదటి అంశం.

(ii) బాలల కోసం ఎంపిక చేసుకోవలసిన భాష, దానితో పొదగవలసిన భావాలు, వీటి

కోసం ప్రత్యేక కృషి చేయవలసిందే.

(iii) చిన్న తనంలోనే అలవడ చేయవలసిన సుగుణాలు - స్నేహం, సమైక్య భావం, పట్టుదల, చదువులపై శ్రద్ధ మొ॥ - పోత్సాహక ప్రాతిపదికతో రచిస్తేనే బాగు. వీటిని గేయ కథల్లో రాయవచ్చు.

(iv) సరళమైన భాషలో గేయం ఎట్లా రాసినా బాలలు చదువుతా రనుకోవడం పొరపాటు. గాన గుణంలేని గణాలు, పెటుకైన అక్షరాలు ఇప్పటి బాల గేయాల్లో దొర్లుతున్నవి. ఇది గమనించ వలసింది.

(v) అంత్య ప్రాస కోసమని 'త్రుంచు', 'కాంచు' వంటి పాత పలుకుబడి వచ్చి పడుతున్నది. ఇవి పిల్లలకు పట్టుబడే మాటలు కావు. "ము" ప్రత్యయం ఇప్పటి వ్యవహారంలో లేనే లేదు. పెద్దల రాతల్లోనే లేని ఇట్లాంటి ప్రత్యయాలు కొన్ని బాల సాహిత్యంలో ఉండడం పూర్తిగా అనవసరం.

(vi) మన బాల సాహిత్య పరిధిలో ఇప్పటికి వచ్చిన వాటిలో కొన్ని గేయ రచనలు మాత్రమే బాగున్నవి. కథలూ, నవలలూ, నాటికలూ, వైజ్ఞానిక రచనలూ కొన్ని వచ్చినవి. కాని అవి అంతంత మాత్రంగానే ఉన్నవి. అనువాదాలూ, అనుకరణలూ తెలుగు వాతావరణానికి భిన్నంగా ఉన్నవి.

బాలల అకాడమీ ఏర్పడ్డది కాబట్టి ఈ రంగంలోని రచయితలు ప్రత్యేకంగా కృషి చేసి మన బాలలను ఇంకా బాగా దిద్ది తీర్చే సాహిత్యాన్ని సృష్టిస్తారని ఆశించవచ్చు.



# పిట్టకథలు-కట్టుకథలు

– డా॥ నాయని కృష్ణకుమారి

పిట్ట కథల్లో ప్రముఖంగా మనకు కనిపించే అంశం జంతువులకు మానవ స్వభావాన్ని ఆపాదించడం. అంటే ఆ యా కథల్లో ఉండేవి కేవలం జంతువుల ఆకార విశేషాదికాలు గల మానవులు మాత్రమే.

కథా ప్రక్రియ చాలా ప్రాచీనమైనది. లోతుగా ఆలోచిస్తే, ఏ భాష అయినా ఇంకా సాహిత్యంగా మారని అనాగరక దశలోనే ఏర్పడిన ప్రక్రియగా దీన్ని భావించవచ్చు. ఏదైనా ఒక విషయం ఉన్నది ఉన్నట్లుగా చెప్తే అది కథ కాదు. మనుష్యుని ఆలోచనా శక్తి వలన కల్పనలతో అది సంఘటితమైతేనే కథగా మారుతుంది. అనగా ఒక సత్య విషయంలో, కొంత కల్పన జతపడినప్పుడే అది కథ అనిపించు కుంటుంది. కథకు అందుకనే ప్రాణం వంటిది కల్పనాశక్తి.

మనుష్యునకు లభించిన తొలికథ సృష్టిలో ఉండే సహజ సత్యాలను ఆశ్రయించుకునే పుట్టింది.

1. ప్రకృతి శక్తులు: మనుష్యుని వశంలో లేకుండా విజృంభించే నీరు, నిప్పు, గాలి, వాన వంటి సహజ శక్తుల ప్రకోపాన్ని మనుష్యుడు ఆశ్చర్య దృష్టితో తిలకించాడు. కారణాన్ని తనకు తోచిన రీతిలో నిర్ణయించగా అవే కథలుగా మారడం సంభవించింది.

2. జనన మరణాలు : సృష్టిలోని జీవజగత్తు మరణానికీ, జననానికీ లోనవుతున్నది. పుట్టుకను గురించీ, చావును గురించీ, వాటిని నియమించే పద్ధతిని గురించీ విజ్ఞాన ప్రదమైన అవగాహన లేని మనుష్యుడు ఆ రెండు సంఘటనల చుట్టూ తన కల్పనను జోడించి కథలల్లుకన్నాడు.

3. పుట్టు పూర్వోత్తరాలు తెలియని చరాచర వస్తువులు : ఎత్తైన కొండలు, పారే నదులు, భీకర మృగాలు, భూమి, ఆకాశం, చెట్లు, పశువులు, పాములు - ఇటువంటి వస్తువులను గూర్చిన విచికిత్స ఎన్నో కథలు జనించడానికి వీలు కలిగించింది.

4. అధి మానవ భావన : వేళ తప్పని సూర్య చంద్రోదయాస్తమయాలూ, పగలూ, రాత్రీ, కాల భేదాలూ, రోగాలూ, రొప్పులూ, అతివృష్టి, అనావృష్టి, కలలూ మొదలైన వన్నీ తొలి మనిషిలో అతీతశక్తిని గూర్చిన ఆలోచనల్ని రేకెత్తించి కథలుగా మార్చడం సంభవించింది.

ఇదంతా కథ పుట్టడానికి తొలి రంగం. ఈ రంగంలో పుట్టిన కథల్ని మనం పురాణ గాథలుగా పేర్కొనవచ్చు. ఈ కథల్లో సృష్టి మర్మాలు, అతీతశక్తులు, చరాచర ప్రపంచ

నిర్మాణ పద్ధతి - సృష్టితో మనుష్యుడి కుండే సంబంధం - ఈ అంశాలు మాత్రమే వెల్లడి కాగలవు.

ఇక మలి రంగం- మనుష్యుడు ఆదిమ దశ నుండి ఎదిగి, సంస్కృతికి శిశువై, నాగరికుడై క్రమ పరిణతిని పొందుతున్న రోజులలో ఏర్పడ్డది. ఈ రంగంలోనే రాజకీయ, సాంఘిక మత విషయికమైన జీవనం ప్రముఖాంశంగా నిలిచింది. ఆ జీవన చిత్రణాన్ని స్పష్టంగా, స్ఫూర్తిమంతంగా చేయడానికి మనుష్యుడు నిత్య వ్యవహారంలో ఉపయోగించే భాష కల్పనా రమ్యమై సాహిత్యంగా మారింది. ఆ సాహిత్యంలో కథా ప్రక్రియ అతి కీలక స్థానాన్ని వహించ గలిగింది.

మనుష్యుడు సంఘజీవనంలో ప్రముఖ స్థానాన్ని పొంది, ఉజ్జ్వల పాత్రను వహించినప్పుడు అతని చుట్టూ ఎన్నో కల్పనలు భాసించి కథలుగా రూపు చెందినవి. అక్కడ అతడు సామన్య మానవుడో, రాజవంశానికి చెందినవాడో కావచ్చు. ఈ కథలన్నీ వీర గాథలు, అద్భుత గాథలు; ఇవి ప్రపంచ సాహిత్యంలో కొల్లలుగా దొరుకుతాయి. ఇక భగవంతుడే మనుష్యుడుగా పుట్టి మానవాతీత శక్తుల్ని ప్రదర్శిస్తూ మానవకోటిని రక్షించడానికి పుట్టినట్లుగా భావించే కథలు కూడా క్రమంగా ఏ సాహిత్యంలోనైనా రూపు చెందడం సంభవించింది. ఇవన్నీ పురాకల్పిత గాథలు.

మనుష్యుని నైతిక ప్రవర్తనను చక్కదిద్దే ప్రయత్నంలో సందేశాలు కథా రూపంలో వెలువడ నారంభించాయి. అవన్నీ నీతికథలు, పేదరాసి పెద్దమ్మ కథలు.

మనుష్యుని ఆలోచన కల్పనను జోడించుకుని కథగా మారిన క్రమ పరిణామాన్ని ఈ క్రింది విధంగా పట్టికలో బిగించవచ్చును.



> పాపల అందం విరిసింది
> పాపల చందం మెరిసింది
> నాట్యం చేసే పాపల గజ్జెల
> లాస్యం దిక్కుల తూగింది.
> పాటలు పాడే పాపల గొంతులో
> కోకిల కుహూ కుహూ లాడింది
> కుంచెలు పట్టిన పాపల చేతిలో
> రంగులు తొణికిస లాడినవి.
>
> **-వై. వి. విజయశ్రీ**

ఇందులో నీతి కథలను, పేదరాసి పెద్దమ్మ కథలను పిట్టకథలనే విభాగం కిందికి చేర్చడానికి వీలుంది. లోకంలో పిట్టకథ అన్న పదానికి రెండురకాల అర్థాలు వాడుకలో ఉన్నాయి. (1) చిన్న కథ, లేదా ప్రాసంగిక కథ. (2) జంతువులూ, పశులూ పాత్రలుగా మారి మానవకోటికి సందేశాన్ని అందించే నీతి కథ. ఈ రెంటిలో మొదటి అర్థమే ఎక్కువ వాడుకలో ఉన్నట్లు కనిపిస్తుంది.

కాని ఈ వ్యాసంలో ప్రసక్తమయ్యే పిట్ట కథలు జంతుప్రాధాన్యం కలిగి, సందేశాన్నో, నీతినో అందించే కథలు మాత్రమే.

అటువంటి కథలు ప్రపంచమంతటా ఏ సాహిత్యంలో చూచినా కొల్లలుగా కనిపిస్తాయి. ఈ కథల్లో ప్రముఖంగా మనకు కనిపించే అంశం జంతువులకు మానవస్వభావాన్ని ఆపాదించడం. అంటే ఆ యా కథల్లో ఉండేవి కేవలం జంతువుల ఆకార విశేషాదికాలు గల మానవులు మాత్రమే. జంతువులకూ మనుష్యులకూ మధ్య సంబంధాన్ని స్పష్టం చెయ్యడంలో ప్రాచీనమైన మత విధానం దాగి ఉన్నది. ఆదిమ మానవ సంఘాల మతపద్ధతిని పరిశీలిస్తే అక్కడ జంతుప్రాధాన్యం ఎక్కువగా కనిపిస్తుంది (1) జంతువులు మనుష్యుని ఆత్మ వాహికలైన రూపవిశేషాలు (2) మనుష్యుల చేత పూజలు అందుకునే దైవాలు (3) తమను పూజించే మనుష్యుల వంశాలకు కర్తలు. (4) తమ వంశానికి చెందిన వీరులకు ఉపకార ప్రదాలు (5) తమ వంశపు వాసుల కందరికీ రక్షక దేవతలు. జంతువులకూ, మనుష్యులకూ మధ్య భగవంతుడికీ, భక్తుడికీ మధ్య ఉండే సంబంధం ఇప్పటికీ ఉంది. నాగదేవత, ఆంజనేయులు, గరుడాళ్వారు, వినాయకుడు - ఈ దేవతారూపాలన్నీ ఇంచుమించు అటువంటి మత విధానంలోనుండి రూపుచెందినవే!

అంతేకాక, మనుష్యుడు తాను పుట్టవలసిన అనేక జన్మల్లో జంతుజన్మలు కూడా ఉన్నట్లు భావించడం జరిగింది. బుద్ధ జాతక కథల్లోని కథలన్నీ అటువంటివే. ఈకథలవల్ల, మామూలు నీతికథలకు మతప్రాధాన్యం కూడా అపాదింపబడ్డది. ఈ కథలలోని అంతరార్థం మాత్రం మానవకోటికి, సాంఘిక, మత విషయాలలో సమగ్రమైన అవగాహనను కలిగించి సందేశాన్ని అందివ్వడమే.

క్రీ. శ. రెండవశతాబ్దంలో జనించిన పంచతంత్ర కథల్లో మతప్రాధాన్యం వెనుకబట్టి, అవి కేవలం సందేశాత్మకాలుగా మాత్రమే మిగిలిపోయాయి ఈ కథల్ని ఎవరో ఒకరు వ్రాశారనడంకంటే, జనజీవితంలో మౌఖిక ప్రచారంలో బతికే వీటిని గుదిగూర్చి, సుస్వరూపాన్ని చ్చారనడం సబబు. పండితులచే ఆదరింపబడి, సుసంస్కృతమైన భాషలో ఇవి రచింపబడినా, జనజీవితంలో మౌఖికంగా ప్రచారాన్ని పొంది, పాతుకుపోయిన జానపద గాథలే ఈ కథ లని మనం గుర్తించవచ్చును.

ఇక ఈ కథల్లోని జంతుప్రాధాన్యాన్ని పరిశీలించవలసి ఉంటుంది. ఈ రెండు విభాగాల

లో నేకాక, సాంప్రదాయిక, జానపద సాహిత్యం మొత్తంమీద, కథల్లో జంతు ప్రసక్తి చెదురుమదురుగా కనపడుతూనే ఉంటుంది. రామాయణంలో వానర ప్రసక్తి, మాయలేడి వృత్తాంతం, భారతంలో దేవశుని సరమ కథ, గజకచ్ఛప వృత్తాంతం, గరుత్మంతుని కథ, భాగవతంలో గజేంద్రమోక్షం, శిబి దాతృత్వ పరీక్ష వంటి కథలన్నీ జంతుప్రాముఖ్యాన్ని సూచించేవే. కాని అక్కడ జంతుప్రసక్తి కేవలం ప్రాసంగికమైనది. జంతువులే ప్రధాన పాత్రలై తమ తమ చర్యలద్వారా నీతిబోధ చేసే పద్ధతి అక్కడ లేదు.

అందువల్ల నీతికథలు, పేదరాసి పెద్దమ్మ కథలు అనే రెండు విభాగాలు మాత్రమే పిట్ట కథలుగా పేర్కొనబడవచ్చును.

ఈ కథల్ని నిశితంగా పరిశీలిస్తే ఇవి కొన్ని నిశ్చిత మార్గాలలో నడుస్తూ నిశ్చితమైన ధ్యేయాలను సాధించడానికి పుట్టిన కథలుగా కనిపిస్తాయి. ఆ ధ్యేయాలను ఈ క్రిందివిధంగా అమర్చవచ్చు.

1. నైతిక ప్రవర్తనను నియమించడం: కొన్ని సూక్తుల్నీ, జీవన సత్యాలనూ తెలియ జేయడమే ఈ కథల ధ్యేయం. ఉదాహరణకు (i) అబద్ధమాడరాదు అనే సూక్తిని తెలియ జేయడానికి ఏర్పడ్డ కథ, పశువులు కాచే బాలుడు-పెద్దపులి కథ. తన తండ్రితో ఆట కాయితనంగా 'నాన్నా పులి' అని పదేపదే అబద్ధాలాడిన దోషానికి ఆ పిల్లవాడు నిజం గానే పులికి తన ప్రాణాల్ని పరిహారంగా చెల్లించవలసి వచ్చింది. ఇక్కడ విషాదాత్మక మైన ముగింపు చెప్పవలసిన విషయానికి బలా న్నిచ్చేదిగా ఉంది.

(ii) సత్యవాక్పాలనను బోధించే కథ: గోవు-పులి కథ. తనను మింగడానికి వచ్చిన



పులిని వేడుకుని, తన బిడ్డకు చన్నిచ్చి బుద్ధులు చెప్పి తిరిగి పులివాత పడడానికి నిబ్బరంగా వెళ్ళిపోయిన ఆవు ఈ కథలో ప్రధాన పాత్ర ధారిణి. ప్రాణాలకు ముప్పు వచ్చినా సరే, సత్యం తప్పరాదనే ఆదర్శాన్ని బోధించే కథ ఇది. ఈ విధంగా అహింస పరమ ధర్మమనీ, పరుల సొమ్ము నంటరాదనీ, పెద్దల ఎడ వినయమూ, పిన్నల యెడ వాత్సల్యమూ చూపవలెననీ, ఆపదలో ఉన్నవారిని ఆదుకోవాలనీ, ఎన్నో పిట్టకథలు ప్రపంచ పరివ్యాప్తంగా కనిపిస్తాయి. గ్రంథ విస్తర భీతిచే ఇక్కడ ఉదాహరణా లను ఇవ్వడం మానుకుంటున్నాను.

2. ఉపాయంవల్ల అపాయాలను తప్పించు కోవడం: దీనికో చక్కని ఉదాహరణ. అందరూ ఎరిగిన సింహం-కుందేలు కథ. ఆహారంగా బయలుదేరిన కుందేలు దారిలో పాత బడ్డ బావిలో ప్రతిబింబాన్ని చూచుకొని, ఉపాయాన్ని ఆలోచించి, తన శత్రువును నాశనం చేస్తుంది. ప్రాణాపాయకర పరి స్థితి కాకపోయినా, చికాకు కలిగించే సంఘట

> పరుగులు తొక్కే సెలయేరా !
> నురుగులు కక్కే సెలయేరా !
> నాకై నిమిషము ఆగవా ?
> మాటలు రానీ మూగవా ?
> కొండలు దాటీ కోనలు దూకి
> బండరాళ్లపై పాకి పాకి
> పోయెద వెటకు ! చెపుమా కిటుకు !
>
> —కొరిడె శాంద

నలు ఎదురైనప్పుడు కూడా బుద్ధిబలంవల్ల వాటిని సర్దుకుపోయే కథల్ని ఈ విభాగం క్రిందనే చెప్పవచ్చు. అందుకు ఉదాహరణ టోపీల వర్తకుడు-కోతులు కథ. చెట్టుక్రింద నిద్రపోయే టోపీల వర్తకుడి సంచిలోనుండి టోపీలు నెత్తిన పెట్టుకుని చెట్టుమీద కొలువు దీరాయి కోతులు. నిద్రలేచిన వర్తకుడు విషయం గ్రహించి బెంబేలు పడక, తన తలమీది టోపీని నేలమీద కొట్టగా అవీ అదేవని చేయడం జరిగింది. వర్తకుడికి పోయిన టోపీలు తిరిగి లభించాయి. ఈ విభాగంకింద ఎన్నో కథ లున్నాయి. 'కాకి-నీటికుండ-గులకరాళ్లు', 'పాము-రత్నహారం కథ' మొదలైనవి ఎన్నో ఉదాహరణయోగ్యాలు.

3. మూర్ఖత్వాన్ని హేళనచేసి హెచ్చరించడం : కొన్ని కొన్ని గొప్ప గుణాలను ఒప్పరికించడంవల్ల, తెలివిలేనితనంవల్ల కలిగే నష్టాలను చాటిచెప్పే కథ లివి. ఉదాహరణకు రెండు పిల్లులు-కోతి-రొట్టెముక్క కథ. పిల్లుల మధ్య పొత్తు లేనందువల్ల అవి సంపాదించుకున్న రొట్టెముక్క జిత్తులమారి కోతి నోట్లో పడిపోయింది. ఇటువంటివే కాకి-మాంసం ముక్క కథ, తాబేలు-నక్క కథ.

4. పొరపాట్లు చేసి విషమ ఫలితాల వలన పశ్చాత్తాప పడడం: ముందుచూపు లేని మనుష్యుల బలహీనతనూ, దానివల్ల కలిగే దుష్ఫలితాలనూ ఎత్తిచూపే కథ లివి. ఇందుకు చక్కని ఉదాహరణ, "ముంగిస-ఉయ్యాలలో పిల్లవాడు"- కథ. ఒక ముంగిసను ఇంటి జంతువుగా పెంచుకుంటున్న యజమాని బిడ్డ బాధ్యత దానికి ఒప్పజెప్పి బయటికి వెళ్ళిపోతాడు. ఈలోగా ఒక పాము ఉయ్యాల సమీపాన తిరుగులాడడం చూచి ముంగిస దాన్ని చంపుతుంది. తన ఘనకార్యాన్ని యజమానికి నివేదించడానికి రక్తసిక్తమైన నోటితో వాకిట్లో యజమాని రాకను నిరీక్షిస్తుంటుంది. యజమాని దాన్ని చూచి అది బిడ్డ నేదో చేసిందన్న తొందరపాటుతో, దాన్ని బడితతో మోది చంపుతాడు. చివరకు విషయం తెలుసుకుని కన్నబిడ్డలా పెంచిన ముంగిసని చంపుకున్నందుకు కుమిలిపోతాడు.

5. గర్వభంగం చేసే కథలు : తమను గూర్చి తాము వేసుకునే అతిశయమైన అంచనాలవలన అహంకారంతో చరించే పాత్రల గర్వాన్ని ఉపాయబలంచేత అణగద్రొక్కడం ఈ కథలలో ముఖ్యాంశం. దీనికి "కుందేలు-తాబేలు" కథను ఉదాహరణగా చెప్పవచ్చును. పరుగులో తన్నెవ్వరు ఓడించ లేరన్న కుందేలును, ఉపాయంతో మంద గమనం గల తాబేలు ఓడించడం ఈ కథలో కనిపిస్తుంది. అటువంటిదే "నక్క-కొంగ విందు"; గరుత్మంతుడు-పిచ్చుక పరుగుపందెం మొదలైన కథలు.

6. ప్రతికక్షిపైన పగ దీర్చుకోవడం : ఒకరు మరొకరికి అపాయం చేయగా, రెండవవారు ఉపాయాలు వెదికి శత్రువుమీద పగ దీర్చుకోవడం ఇందులో ముఖ్యాంశం. దీనికి "దర్జీ-ఏనుగు" కథ మంచి ఉదాహరణ. ఒక

దర్జీ తన దుకాణం ముందునుంచి పోయే ఏనుగుకు రోజూ ఒక అరటిపండు నిచ్చేవాడు ఆ అలవాటును బట్టి రోజూ ఏనుగు అతని అంగడి దగ్గర ఆగి తొండం చాచి అరటిపండు కోసం కొంతసేపు వేచి ఉండేది. ఒకనాడు పని ఒత్తిడివల్ల దర్జీ అరటి పండివ్వకపోగా, తన యెదుట తొండం చాచి నిలుచున్న ఏనుగుమీద విసుక్కొని సూదితో దాన్ని పొడిచి బాధిస్తాడు. అందువల్ల కోపం తెచ్చుకున్న ఏనుగు మర్నాడు మురికి నీళ్ళను తొండాన నింపుకుని, వాడు కుట్టుకునే కొత్త బట్టల్ని పాడుచేసి పగ తీర్చుకుంటుంది.

మనకు తెలుగు భాషలో లభ్యమయ్యే పిట్ట కథలన్నీ పైన చెప్పిన ఆరు స్థూల విభాగాల క్రిందికి సర్దుబాటు కాగలవు. ఇంకా సూక్ష్మ దృష్టితో పరిశీలిస్తే ఇందులో ఉప విభాగాలు కొన్ని చెయ్యడానికి వీలు కలుగుతుంది.

ఒక్క తెలుగుకే కాదు, ప్రపంచ పరివ్యాప్తంగా, ఉన్న పిట్టకథ లన్నిటికీ ఈ విభజన వర్తిస్తుంది. ప్రపంచం మొత్తంమీద వ్యాపించిన పిట్టకథలు ఇతివృత్తంలో చాలా వరకు పోలికలు గలిగినవిగా కనిపిస్తాయి. అందుకు రెండు కారణాలు చెప్పుకోవచ్చును. (1) పూర్తిగా నాగరకత పెరగని దశలో మనుష్యుని మెదడు పనిచేసే పద్ధతి ప్రపంచ పరివ్యాప్తంగా ఒకే విధంగా ఉండడం ఒక కారణం. అందువల్ల అప్పటి కథలన్నీ నమూనా కథలుగా రూపొందే అవకాశం లభించింది. (2 ఒక దేశానికి, మరొక దేశానికీ మధ్య సాంస్కృతిక కారణాల వలన రాక పోకల సంబంధా లేర్పడవచ్చు. అప్పుడు, వ్యాపారస్థులు, మత ప్రచారకులు, రాజకీయ వేత్తలు, యుద్ధభటులు మొదలైనవారు ఇతర దేశాలకు తాము విన్న కథలతో పాటు ప్రయాణించడం జరుగుతుంది. పాశ్చాత్య పండితుల అంచనా ప్రకారం పంచతంత్ర కథలు, పాశ్చాత్య దేశాలకు భారతదేశంనుండి ఆ రకంగా వ్యాపించినవే!

ఈ పిట్టకథల్లో మనం గమనించవలసిన మరొక లక్షణం ఉంది. మన సాహిత్యం, సర్వే సర్వత్రా మంగళాది, మంగళమధ్యం, మంగళాంతం కావలసి ఉండగా, వీటిల్లో విషాదాంత లక్షణం కొన్నిచోట్ల కుదురుకొని ఉండడం కనిపిస్తుంది. ఇది సర్వజనులూ ఆమోదించిన లక్షణం.

ఈ రకంగా, ఇక్కడ వివరించిన వన్నీ పిట్ట కథలకు గల స్థూల లక్షణాలు. వీటిని సూక్ష్మంగా పరిశీలించి, ఎన్నో కథలను సేకరించి, అధ్యయనం చేయడంద్వారా, వీటి చారిత్రక గతిని, వర్ణనాత్మక స్థితిని నిర్ణయించడానికి వీలు కలుగుతుంది. స్థలాభావంవలన అంతటి విపుల చర్చకు ఈ వ్యాసంలో వీలు కలుగదు.



# అనువాదం : ఏది? ఎలాగ?

**—వాకాటి పాండురంగరావ్**

అనువాద మయినా, మూల రచన అయినా భాష ఎలా ఉండాలి? లేగ దూడలా ఎగరాలి. అమ్మమ్మలా కథలు చెప్పాలి. అమ్మలా దగ్గరకు తీసుకోవాలి. ఆడంబరాలు, వాగాడంబరాలు అస లుండరాదు.

మా చిన్నమ్మాయి కరుణకు అప్పుడు రెండేళ్ళుంటాయి. రోజూ రాత్రి నిద్ర పోయేముందు దేవుడిని ప్రార్థించి పడుకోవా అని వాళ్ళమ్మ నేర్పిస్తుండేది.

ఒకసారి దానికి జ్వరం వస్తే, డాక్టరు చెప్పినట్టు గోధుమ పొట్టును కాస్త వెచ్చగా వేయించి రొమ్ముమీద కాపడం పెట్టాము. కఫం తాలూకు భారం, ఆ తర్వాత జ్వరం తగ్గాయి.

ఆ మరుసటివారం ఒకరాత్రి పడుకున్న చిరంజీవి కరుణ నిద్రపోయేముందు దేవుడికి తన మామూలు ప్రార్థన చెప్పిందిలాగ :

"దేవుడా ! నీకు దండం పెడుతున్నాను. నన్ను, మా అక్కయ్యలను, మా అమ్మను, నాన్నను కాపాడు తండ్రీ!"-అని, "మమ్మల్నందరిని కాపాడితే నీకు కాపడం పెడతాను దేవుడా!" అని మరొక చిన్నవాక్యం చేర్చింది.

అది విని అందరం నవ్వుకున్నాం...కొబ్బరి కాయలు, చక్కెరపొంగలి, పండ్లు, పాలు, పానకం, జుత్తు ఇస్తామంటారు కాని ఈ విధంగా పాపం ఆ దేవుడి కింత జాలితో 'కాపడం' పెడతా మన్న వారెవరయినా వున్నారా-అనిపించింది.



తనకు ఉపశమనం కల్పించి, హాయి అనిపించింది గనుక ఆ దేముడికీ బాగుండి తీరాలి అన్న సాపత్యాన్ని నిర్మించుకోగల దైవత్వం ఆ బాలలకే చెల్లుతుంది.

శైశవంలోని ఆ దైవత్వం క్రమంగా మానవత్వంలోకి జారి, వాళ్ళు పెరిగాక రాక్షసత్వంలోకి దిగజారుతుంది. ఎంచేత?

అంటే - 'ఉడు ముండదె నూరేండ్లును' అన్నట్లు కేవలం వయస్సురీత్యా మాత్రమే పెద్దలమై, లేచిందగ్గరనుండి పడుకున్నదాక మనం జీవిస్తున్న కృత్రిమ జీవితాలు, ఆడుతున్న అబద్ధాలు, వేస్తున్న నాటకాలు ఈ విపత్తు విత్తనాలు మన పిల్లల మనసు లనే నేలలో నాటి మొక్కలై మానులై మహారణ్యా లవుతున్నాయి. ఆ కీకారణ్యం చూసినప్పుడు మాత్రం- "అయ్యో! ఏమయిపోతూందండీ సంఘం! మా చిన్నప్పుడు ఏవో ఒకటో రెండో అబద్ధాలాడేవాళ్ళం. తప్పులు చేసేవాళ్ళం. కాని ఇంతలా విచ్చలవిడిగా లేమండీ!" అని అంగలారుస్తుంటాం. ఎంత అబద్ధం!

చిన్నపిల్లలలోని నైర్మల్యాన్ని, సౌభ్రాతృత్వాన్ని అలాగే వుంచి పెంచి పెద్దచేస్తే ఇక అణ్వస్త్రాలు ఎందుకు? ఐక్యరాజ్యసమితులు-

ఎందుకు? కులమత వ్యవస్థలెందుకు? రాజకీయమైన, భౌగోళికమైన సరిహద్దు లెందుకు ?

చిన్నారుల మనసులోని సొగసులను దండగా కూర్చి మానవ జీవితమే ఒక శత సహస్రదళ పారిజాతంగా చేయడానికి సాహిత్యం ఒక ముఖ్యమైన సాధనం. కాని దానితో బాటు పెద్దలమైన మన మాటలు, చేతలు, బళ్ళో చదువు, సంఘంలో విలువలు - ఇవన్నీ కూడా సహకరించాలి.

## అందరం మనమే

రష్యాలో కించిట్కా అయినా, అమెరికాలో జూడా పవెల్ అయినా, పాకిస్తాన్‌లో మునావర్ సుల్తానా అయినా-ఆకలేస్తే అమ్మ దగ్గరకే పరుగెడుతుందనీ, పండగొస్తే కొత్త బట్టలు వేసుకుని మిఠాయి తింటుందనీ, క్రింద పడ్డప్పుడు నొప్పి వేస్తే ఏడుస్తుందనీ-మన పిల్లలకు తెలిసినప్పుడు సరిహద్దులు చెరిగిపోవూ? మానవజాతి అంతా ఒకటి కాదూ? - ఆ పనిని చిన్నప్పుడే చేయకుండా, పెరిగి, పెద్దలయి, మతం పేరిట, దేశం పేరిట కొట్టుకుచస్తుంటే మారణహోమాల కని, రాజీల మంత్రాల కని కోట్లాది ధనం వెచ్చించేకన్న, చిన్నతనపు దైవత్వాన్ని పెంచడం గొప్ప పెట్టుబడికదూ? మరి మన ప్రణాళికలు ఆ 'బడి'లో చదవ్వు, ఎంచేత ?

పుస్తకాలకు మనం ఇవ్వవలసినంత ప్రాధాన్యం ఇవ్వడంలేదు గనుక! తిండి, నగలు, బట్టలు, సినిమాలు, వాటి తర్వాత పుస్తకాలు వస్తాయి గనుక!

ఒక మనిషి జీవితం వున్నట్లు ఇంకొకరిది వుండదు. ఒక దేశంలో జీవనం ఇతర దేశాల వారికి కొత్తగా వుంటుంది. అందుకనే అందరి జీవితానుభవాలు వడపోసిన పుస్తకాలను



మించినవి మరేమీ లేవి. అన్ని దేశాల సాహిత్యమూ చదవడంకన్న మానవజాతి మధ్య గోడలు బద్దలు గొట్టగల వేరే బుల్‌డోజర్లు లేవు.

ఏ దేశమయినా మనుషుల కోర్కెలు, బాధలు ఒకటే ననీ, ఏ భాషయినా 'లెస్స'గానే వుంటుందనీ, ఏ మతమయినా సరే 'నిజం' వేసుకున్న మరొక వేషం మాత్రమే ననీ తెలియాలంటే ఆ యా భాషలు తెలిపే ఆ పుస్తకాలు చదవాలి; లేదా అనువాదాలు చదవాలి- వేరే దారిలేదు మరి!

## ఎలాంటివి ?

కాకమ్మ కథల నుండి 'వైకింగ్' కుజ యాత్రలదాక పిల్లల చదువుకు కాదేదీ అనర్హం.

మాట్లాడే చేప చిన్నవాడి మనసులో రేకెత్తించిన ఊహాలే ఇంకో ఇరవై ఏళ్లకు

మానవజాతికి ఒక మహత్తర వరం కావచ్చు- ఎవ రెరుగుదురు ?

అంచేత అన్నిరకాల పుస్తకాలనూ అన్ని భాషలనుండీ ఎన్నుకోవాలి; సజావుగా అనువదించాలి. చక్కగా ముద్రించాలి; చవకగా అమ్మాలి.

తలి దండ్రులందరూ కనీసం నెలకి రెండు కొత్త పుస్తకాలయినా కొని పిల్లలచేత చదివించాలి.

**మరి**

ఇహ అనువాదమయినా, మూలరచనయినా భాష ఎలా వుండాలి ?

లేగ దూడలా ఎగరాలి.

అమ్మమ్మలా కథలు చెప్పాలి.

అమ్మలా దగ్గరకు తీసుకోవాలి.

ఆడంబరాలు, వాగాడంబరాలు అసలుండరాదు.

నీతులు, సూక్తులు సున్నితంగా వుండాలి.

శైలి సూటిగా వుండాలి; పిల్లల మనసులతో బాటు గెంతగలంత తేలికగా వుండాలి; వారి మనసులలో నాటుకుని నిలువగలంత బరువుగానూ వుండాలి.

అందువలన పిల్లలకోసం రాయడం అంటే అంత తేలికగా తీసుకోకూడదుస్మండీ!

మీరో-

ఉదయించే సూర్యుడిలో ఎన్ని అందాలున్నాయో మళ్ళీ మళ్ళీ చూస్తుంటారా ? ప్రతి పున్నమినాడూ తూరుపు ఆకాశంమీద దొర్లుకుంటూ పైకివచ్చే ఆ చందమామకు మీ మనసులో అద్దంపట్టడం వచ్చా! మొక్క చివరి పువ్వు గాలి లయకు 'తిలాన' ఆడడం తిలకించారా సార్ ? రావియాకు కొసనుండి వాన చినుకు జారడంలో మీకు అల్ప్సకొండల మీద స్కేటింగ్ చేసేవారి నైపుణ్యం కన్పించిందా చెప్పండి ? కుక్కతోక వంకరలో విశ్వాసానికీ మీటరుంది, సంతోషాని కొక స్టాండర్డ్ వుంది, గుర్తించారాండీ ?

అన్నట్లు మరిచాను. పిల్లలంటే మీకు నిజంగానే ఇష్టం కదూ? అయితే ఇహనేం-పిల్లలకు కావలసిన భాష మీకు సునాయాసంగా వస్తుంది. ఎటొచ్చీ అవతలి భాషను కూడా మీరు తెలుగంత బాగా తెలుసుకొని వుండాలి.

ఉంటే ఇహ ఆలస్యం ఎందుకు? మీరూ, మీరూ, మీరూ-మనమందరమూ కలిసి, బాలల అకాడమీని మరొక నూట పదిహేడవ సంస్థగా కాక-నిజంగా పిల్లలకోసం ఎన్నో నిజమైన మంచి పనులు చేయొచ్చుకదా !

రండిక ! ఆలస్యం దేనికి ?





# స్వాతంత్ర్యానంతరం విస్తరించిన మలయాళ బాల సాహిత్యం

- జొన్నలగడ్డ వేంకటేశ్వరశాస్త్రి

**ఇతర సాహిత్య ప్రక్రియలన్నీ మలయాళంలో అనేక ఇతర భారతీయ భాషల కన్నా ముందుగానే అభివృద్ధి చెంది ఇతర భాషలకు మార్గదర్శకంగా నిలిచినా, బాల సాహిత్యం అంతగా అభివృద్ధి చెందకపోవడానికి ముఖ్య కారణం ఏమిటి ?**

ఇతర సాహిత్య ప్రక్రియలతో పోల్చిచూస్తే మలయాళంలో బాలసాహిత్యం అభివృద్ధి అంత ప్రోత్సాహకరంగా లేదనే చెప్పాల్సి వస్తుంది. 1947-48 వరకూ పిల్లలకోసం ప్రత్యేకంగా రాసిన రచయితలు వేళ్ళమీద లెక్కపెట్టదగినంత మంది మాత్రమే! బాల కథాసాహిత్యంపై అభిమానమున్న రచయితలు కరువైన కాలమది.

1948 లో మాథ్యూ కుళివేళి మొట్టమొదటిసారిగా బాలలకోసం ఒక పత్రికను నెలకొల్పడానికి కృషిచేశారు. 'బాలన్' అనే పేరుతో ఒక వారపత్రికను ప్రారంభించారు. లండన్ నుంచి ఆర్థూర్ మే సంపాదకత్వంలో వెలువడిన 'చిల్డ్రన్స్ న్యూస్ పేపర్'ను ఆదర్శంగా ఉంచుకొని కుళివేళి 'బాలన్' పత్రికను నడపసాగారు. బాలన్ పత్రికకు ఆరునెలల్లోనే బాలారిష్టం వచ్చినా ఆ పత్రికా సంపాదకత్వం తన కిచ్చిన ప్రోత్సాహంతో కుళివేళి పిల్లల కోసం 30 పుస్తకాలను నాలుగు గ్రేడ్ లుగా విభజించి ప్రచురించడానికి ఒక పథకం తయారు చేశారు. 'బాలన్ ప్రచురణసంస్థ' అనే పేరుగల సంస్థను స్థాపించి తాను ప్రచురించదలచిన 30 పుస్తకాలలో 20 పుస్తకాలను స్వయంగా రచించి మలయాళ బాలలకు అందించిన కుళివేళి కృషిని మలయాళ బాలలు మరిచిపోరు. గత రెండు దశాబ్దాలలో బాలన్ ప్రచురణసంస్థ దాదాపు 325 పుస్తకాలను పిల్లలకోసం ప్రత్యేకంగా రాయించి ప్రచురించింది. కుళివేళి ఇందులో 58 పుస్తకాలను రచించారు. పాలా నారాయణన్ నాయర్, కె. సి. చాకో, నిలాంపెరూర్ రామకృష్ణన్ నాయర్, ఎం. ఎన్. ఎం. నాయర్ యీ సాహితీ యజ్ఞంలో అన్నివిధాలా సాయపడిన వారు.

కొట్టాయం కేంద్రంగా ఏర్పడిన నేషనల్ బుక్ స్టాల్ (సాహితీ ప్రవర్తక కోపరేటివ్ సొసైటీ) వారు పిల్లల పుస్తకాలను ప్రచురించదలచి ఎన్నో పథకాలను రూపొందించారు. బహుమతులు ఏర్పరచి, రచయితలలో ఉత్సాహాన్ని రేకెత్తించి, ఈ సంస్థ చాలా పుస్తకాలను వ్రాయించి ప్రచురించగలిగింది. మద్రాస్ లోని దక్షిణభారత భాషా సంస్థ, ఢిల్లీలోని బాలల బుక్ ట్రస్ట్ కూడా గణనీయమైన సేవ చేశాయి. ప్రఖ్యాత కార్టూన్ చిత్ర

కారుడు శంకర్ సంపాదకత్వంలో వెలువడిన ఈ పుస్తకాలు ఎంతో ప్రయోజనకరములైన విషయాలను ఆసక్తి కలిగించి, చదివించేలా రూపొందించబడ్డాయి. భాష, భావప్రకటన, విషయవిమర్శ, అందమైన చిత్రాలు-వీటన్నిటిలో ఈ ప్రచురణలు తక్కిన భాషలలోని పిల్లల పుస్తకాలతో పోటీపడగలవు.

టి. వి. జాన్, ఉమయనల్లూర్ బాలకృష్ణ పిళ్లై, సి. ఎ. కిట్టుణ్ణి, కరూర్ నీలకంఠం పిళ్లై, డి. బి. కురూవ్, ఓ. ఎన్. వి. కురూప్ ప్రస్తుతము బాల సాహిత్యంలో కృషి చేస్తున్న రచయితలు.

ఎన్నో వారపత్రికలు, పక్షపత్రికలు, ప్రత్యేకంగా బాలలకోసం కొన్ని పేజీలను కేటాయించి అందులో బాలలకోసం రాయించిన రచనలను ప్రచురిస్తుంటాయి. అంతేగాక బాలలు రాసేవాటిని కూడా ప్రచురించి ప్రోత్సహిస్తూ ఉంటాయి. మాతృభూమి, మలయాళ మనోరమ, జనయుగం అందులో చాలా ముఖ్యమైనవి.

ఇతర సాహిత్య ప్రక్రియలన్నీ మలయాళంలో అనేక ఇతర భారతీయ భాషలకన్నా ముందుగానే అభివృద్ధిచెంది ఇతర భాషలకు మార్గదర్శకంగా నిలిచినా, 'బాల సాహిత్యం' అంతగా అభివృద్ధి చెందకపోవడానికి ముఖ్య కారణం ఏమిటి ? నాదృష్టికి తోచినంతవరకూ ఒకటే! రాజకీయ ఆదర్శాలు, కవిత్వపు కొత్త పోకడలు రచయితలను ఆకర్షించినంతగా 'బాల సాహిత్యం' ఆకర్షించలేకపోయింది. పత్రికలు, ప్రజలు కోరిన 'రాజకీయాలు' మొరటుతేలగా, సున్నితంగా మనసుకు హత్తుకుపోయేలా చెప్పగలిగినవారు తక్కువయ్యారు.

ఏదేమైనా ఇప్పుడు అక్కడి రచయితలు కళ్లు తెరచి వాస్తవాన్ని చూడగలుగుతున్నారు. బాలసాహిత్యం అభివృద్ధి చెందుతున్నది.



# బాల గేయ సాహిత్యం

- ఎం. కె. దేవకి

పిల్లల కోసం పెద్దలు పాడే పాటల్లో లాలి పాటలూ, జోల పాటలూ ముఖ్యమైనవి. అవి మాటలు రాని, నడవలేని వయస్సులోని పిల్లల కోసం పాడేవారు.

తెలుగులో 19 వ శతాబ్ది చివరివరకు ప్రత్యేకంగా పిల్లలకు గ్రంథస్థ సాహిత్యమంటూ ఉన్నట్లు కన్పించదు. కాని అనుశ్రుతంగా వస్తున్న లాలిపాటలు, జోలపాటలు, వినోదం కోసం వేసే చిక్కుప్రశ్నలు, పొడుపుకథలు, పిట్టకథలు, నీతికథలు మొదలైనవి ప్రాచీన కాలంలో చెలామణి అయిన బాలసాహిత్యం. బాలల గేయసాహిత్యాన్ని మాత్రం రెండు రకాలుగా విభజించవచ్చు. అవి :

(1) ప్రాచీన కాలంనుండి అనుశ్రుతంగా వస్తున్న బాలల గేయాలు.

(2) ఆధునిక కవులు వ్రాస్తున్న గేయాలు.

ప్రాచీన బాలగేయాలు కేవలం పాటల రూపంలో కొన్ని, ఆటలకు సంబంధించిన పాటల రూపంలో కొన్ని కన్పిస్తాయి. అవి రెండు రకాలు.

(1) బాలలకోసం పెద్దలు పాడే పాటలు.

(2) బాలలే స్వయంగా పాడుకొనే పాటలు.

పిల్లలకోసం పెద్దలు పాడే పాటల్లో లాలి పాటలు, జోలపాటలు ముఖ్యమైనవి. అవి మాటలురాని, నడవలేని వయస్సులోని పిల్లల కోసం పాడేవారు. ఆ పాటల్లోని సంగీతం మాత్రం వాళ్లని నిద్రపుచ్చడానికో ఏడుపు మాన్పడానికో ఉపయోగపడ్తుంది.

"నిద్రపో నిద్రపో నీలవమందా
బలభద్రు తమ్ముడా! హరి! నిద్రపోరా?"

అని రాముడు, కృష్ణుడు మొదలైన దేవతల అంశాలుగ తన కొడుకుని భావించి ఒక తల్లి మురిసిపోతుంది.

'అదిగో బూచివాడు
మన అటకమీదున్నాడు
ఏడిస్తే వాడు నిన్ను
ఎత్తుకుపోతాడు...' అని
'బూచివాడా! రార బుట్టల్లుకోనీ
బుట్టలో నాయనను పట్టుకొనిపోరా!' అని

భయపెడుతూ బూచివాణ్ణి పిలుస్తుంది. ఎంత ఊరడించినా చివరకు భయపెట్టినా ఏడుపు మానని పిల్లవాణ్ణి చూస్తే తల్లికి దుఃఖం ముంచుకొస్తుంది. కొడుకుపైనున్న ప్రేమ కొద్దీ

'ఏడవకు ఏడవకు వెర్రి అబ్బాయి
ఏడిస్తె నీకళ్ల నీలాలు గారు
నీలాలు గారితే నే చూడలేను
పాలైన గారవే బంగారుకండ్ల'

అంటూ కలువరేకులవంటి అబ్బాయి కన్నుల్లో కారే కన్నీటిని చూడలేనంటుంది తల్లి.

తానో - 'లామఁలు'
తండ్రి పే రెవరయా ?
'దాచాత మాలాలు'
'ఔలే ! నా పేరు ?' అన
'అమ్మగాలు' అనగ, ఓలిన్ దల్లి
'కౌసల్య తండ్రి !' నాగా
అనబోయి, రాక, కనులన్ నీర్వెట్ట
'కౌసల్యనౌ కానే కానులె !
అమ్మనే !' అని ప్రభున్
కౌసల్య ముద్దాడెడిన్!

-విశ్వనాథ సత్యనారాయణ

పిల్లలకు ఉగ్గు పోస్తూ వారి దృష్టిని తమ వైపు మరల్చుకోవడానికి కాబోలు-

'ఊ ఊ ఉంగన్న
ఉగ్గుపాలు ఇందన్న
గుండెడు ఉగ్గు కమ్మన్న
ఉమ్మక కక్కక మింగన్న'

అని పాడుతారు.

"గుమ్మాడమ్మా గుమ్మాడి..."
"తారంగం తారంగం
తాండవకృష్ణా తారంగం..."
"తప్పట్లోయ్ తాళాలోయ్..."

మొదలైన పాటలు పాడ్తూ పిల్లలకు శరీర వ్యాయామాన్ని కల్గచేస్తారు. ఈ పాటల్లో యతులు నాదానుగుణంగా, ప్రాసలు లయానుగుణంగా ఇమిడి ఉండడంవల్ల మాట్లాడనేర్చిన పిల్లలకు తొందరగా పట్టుబడతాయి.

ప్రాచీన బాల గేయాలలోని రెండవ ప్రధానశాఖ బాలలే స్వయంగా పాడుకోడానికి వున్న పాటలు. అనుకరణశక్తివల్ల పిల్లలు కూడా స్వయంగా కొన్ని పాటలల్లి పాడుకోగలరు. ఈ శాఖలో ఆటలకు సంబంధించిన పాటలే ఎక్కువగా కన్పిస్తాయి. వినోదం కోసం ఇతరుల్ని గేలిచేస్తూ పాడే పాటలు కూడా ఉన్నాయి. పిల్లల ఆటల్లోని హావభావాది చేష్టల కనుగుణంగా ఆ ఆటపాటల్లోని తాళలయలు ఇమిడి ఉండడం గమనించదగ్గ విషయం. బిత్తి, దాగుడుమూతలు, గచ్చకాయలాట, చెమ్మచెక్క, దొంతి, గుడుగుడుగుంచం, పెళ్ళిఆట, ఒత్తొత్తి-వారొత్తి, చిక్కుచిక్కుపుల్ల, త్రొక్కుడుబిళ్ల మొదలైన ఆటలు-వాటి పాటలు బాలికలకు సంబంధించినవి. గోడీబిళ్ళ, చెడుగుడు మొదలైన ఆటలు బాలు రాడుకుంటారు. బాలబాలిక లిరువురు పరస్పరం కలిసి ఆడుకొనే ఆటలు కూడా ఉన్నాయి. 'కాళ్లాగజ్జి' అలాంటి ఆటే!

బుద్ధిప్రధానాలైన పొడుపు కథలెన్నో ప్రాచీన కాలంనుండి ప్రచారంలో ఉన్నాయి.

ఉదా :

'గోడమీదబొమ్మ గొలుసులబొమ్మ
వచ్చే పొయ్యేవారికి వడ్డించు బొమ్మ'

-తేలు.

పిల్లలకోసం రచనలు చేసిన ఆధునికుల్లో వీరేశలింగం పంతులుగారే ప్రథములనవచ్చు. వారు రచించినవి బాలల కథలు, పద్యాలు. కాని బాలగేయాలను తెలుగులో ప్రథమంగా రచించినవారు గురజాడ అప్పారావు. వారు చక్కని వ్యావహారిక భాషలో పిల్లలకోసం అనేక పాటలు, గేయాలు వ్రాశారు.

వారి తర్వాత బాలగేయాల రచన చేసిన వారు గిడుగు సీతాపతిగారు. బాలసాహిత్యోద్ధరణకు మూలపురుషులు కూడా వీరే.

తర్వాత చెప్పుకోదగ్గవారు చింతా దీక్షితులుగారు. పిల్లలు చదివే వాచకాల భాష వేరు, వారు మాట్లాడే భాష వేరు అన్న సత్యాన్ని గుర్తించి పిల్లల భాషలో రసవంతమైన గేయాలెన్నో వీరు వ్రాసినారు.

చింతా దీక్షితులుగారు వ్రాసిన 'లక్కపిడతలు' అన్న గేయసంపుటి బాలల గేయసాహిత్యంలో ఒక మణిపూసవంటిది.

చింతా దీక్షితులు తర్వాత ఎందరో రచయితలు, కవులు బాలగేయాలు వ్రాసినారు. వెంకట పార్వతీశ కవులు రెండవతరగతినుండి ఐదవ తరగతివరకు చదువుకొనే పిల్లలకు పాఠ్యగ్రంథాలుగా "బాల గీతావళి"ని ప్రకటించినారు. నాళం కృష్ణారావుగారి "మధుర కవితలు" పిల్లలకు బోధించడానికి అనువైన రచనలు. నార్ల చిరంజీవిగారు పిల్లలకు సుష్ఠుగా సాహిత్యాన్ని అందించినారు. వారు 'ఆటపాటలు', 'కొత్తపాటలు', 'జాబిల్లిపాటలు' మొదలైన గేయాలే గాక పిల్లలకు నీతిని బోధిస్తూ 'తెలుగుపూలు' అన్న శతకాన్ని కూడా రచించినారు. తెలుగు బాల సాహిత్యరంగంలో తమ జీవితాలను పిల్లలకోసం అంకితం చేసి రేడియో అన్నయ్య, అక్కయ్యలుగా ఆంధ్రదేశంలో ఆబాలగోపాలానికి పరిచితులైనవారు న్యాయపతి దంపతులు. వీరిద్దరూ పిల్లల మనస్తత్వాన్ని చక్కగా తెలుసుకొని వారితో గడుపుతూ వారి కెలాంటి రచనలు అవసరమో గ్రహించి వారికోసం చక్కని రచనలెన్నో చేసినారు.

వీరేగాక కోట సోదర కవులు, సామవేదం జానకిరామశర్మ, మధురాంతకం రాజారాం, ఎల్లోరా, కలువకొలను సదానంద, లవణం, ఇల్లిందల సరస్వతీదేవి, జి. ప్రభావతి, వల్లభనేని కాశీవిశ్వనాథం, బి. యన్. శాస్త్రి, మొదలైన రచయిత లెందరో బాలగేయాలు వ్రాసినారు.



# తమిళంలో బాలసాహిత్యం

— డా॥ చల్లా రాధాకృష్ణశర్మ

బాల బాలికలలో కనుక ఇతర భాషలను గురించీ, ఇతర ప్రాంతములను గురించీ సదవగాహన ఏర్పడినట్లయితే, జాతీయ సమైక్య భావం వారిలో చిన్న వయస్సులోనే ఏర్పడుతుంది. అది వారి జీవిత సౌఖ్యానికే కాక దేశ శ్రేయస్సుకి దారి తీస్తుంది.

తమిళంలో బాలసాహిత్యం బాగా అభివృద్ధి చెందినట్లు స్థూలదృష్టికి కూడా తెలియ వస్తుంది. వికృతి తమిళ సంవత్సరాదని, అనగా 1950 ఏప్రిలు 13 న మదరాసులో వెలుగులోకి వచ్చిన కుళన్దై ఎళుత్తాళర్ సంగం (బాలల రచయితల సంఘం) గత సంవత్సరం రజతోత్సవం జరుపుకుంది. ఆ నాడు కేవలం పదిహేడుగురు సభ్యులతో స్థాపించబడిన యీ సంఘం నేడు శాఖోపశాఖలతో విలసిల్లే వట వృక్షంలా వుంది. ఈ సంఘ సభ్యులు ఒక్క భారతదేశంలోనే కాక, శ్రీలంక, మలేషియా, మొదలైన కొన్ని విదేశాలల్లోకూడా ఉన్నారు. బాలసాహిత్య నిర్మాతలను యథోచితరీతిని గౌరవించడం, బాలసాహిత్యం గురించి పరిశోధనలు జరిపించడం, బాలసాహిత్య మహాసభలు నిర్వహించడం మొదలైనవి ఈ సంఘ వివిధ కార్యకలాపాలలో కొన్ని. బాలసాహిత్య రచయితలు ఎవరెవరు?- అనే పుస్తకం కూడా ప్రకటించింది యీ సంఘం. బాలవాఙ్మయ వికాసమునకు ఎంతగానో కృషి చేస్తున్న ప్రసిద్ధ కవి శ్రీ అళ. వళ్లియప్ప ఈ సంఘమును స్థాపించారు.

తమిళ బాల వాఙ్మయ చరిత్రలో ఇటీవలే మరొక మైలురాయి వెలిసింది. సుప్రసిద్ధ కవులైన శ్రీ మ. ప. పెరియసామి తూరన్ సంపాదకత్వాన పది సంపుటాలలో బాల విజ్ఞాన సర్వస్వం వెలుగులోనికి వచ్చింది. ఈ సంపుటాలలో మామూలువే కాక రంగు రంగుల చిత్రాలు కూడా చోటు చేసుకోవడం ఒక విశేషం. బాల సాహిత్య చరిత్రను సవివరంగా తెలియజేస్తూ 'పూవణ్ణన్' (శ్రీ వి. డి. గోపాలకృష్ణన్) ఒక మంచి రచన చేశారు. ఇవన్నీ చూసినప్పుడు బాల వాఙ్మయానికి ఇంకా ఉజ్జ్వలమైన భవిష్యత్తు కలదని స్పష్టమవుతుంది.

కడమ భారతీయ భాషలలో వలె తమిళంలోనూ పిల్లల పాటలూ, పొడుపు కథలూ, పిల్లల్ని ఉద్దేశించి చెప్పబడే కథలూ చాలా ఉన్నవి.

'కాకీ!  
కాకీ!  
కళ్ళకి కాటుక తీసుకు రావే!  
పిచుకా!  
పిచుకా!

జడలోకి
పువ్వులు తీసుకు రావే!
కొంగా!
కొంగా!
పాపకు
పాలూ తీసుకు రావే!'

వంటి పాటలు ఎన్నో నేటికీ వాడుకలో ఉన్నవి. పై పాటలో ఉదాహృతమైన వన్నీ పిల్లలకు పరిచితమైనవే. అంతేకాదు; నల్లని కాటుక అనకుండా, నల్లని రంగు కల కాకి అని పేర్కొని ఆ భావం పరోక్షంగా వ్యక్తం చేయబడింది. పిచ్చుక మహా ఓపిగ్గా ఎక్కడెక్కడో తిరిగి రకరకాల వస్తువులు సమకూర్చుకుంటుంది తన గూటికోసం. అటువంటి పిచ్చుకయేమో రకరకాలపూలు తీసుకురావాలట! తెల్లని కొంగ యేమో, యిక, నల్లని పాలు ఎలా తీసుకువస్తుంది? ఇదీ యీ చిన్న పాటలోని విశేషం.

తమిళంలో బాలసాహిత్య మన్నప్పుడు తమిళ నవయుగ ప్రవక్త సుబ్రహ్మణ్యభారతి పేరు స్ఫురణకు రాకతప్పదు. కవిత, వ్యాసం మొదలైన యితర ప్రక్రియలతోపాటు పిల్లల సాహిత్యమునూ ఆ మహాకవి ఆదరించాడు. ఆదరించడమే కాక నాలుగు కాలాలపాటు నిలిచే మంచి రచనలూ చేశాడు. పిల్లలకోసం ఆయన వ్రాసినవాటిలో 'పాప్పా పాట్టు' చాలా ప్రసిద్ధమయింది. అందులోని కొన్ని పంక్తులు పరికించండి :

'బండిని లాగే మంచి గుర్రాన్నీ
చేను చక్కగ దున్నే ఎద్దునీ
ముద్దు చేసిన వద్దకు వచ్చే మేకనీ
ప్రేమగ చూడవలెను పాపా!
వేదము వెలసిన దేశ మిది
మేటి వీరులు పుట్టిన దేశ మిది



అఖండ హిందూస్థాన మిది
దైవ మనుచు పూజింపుము పాపా!
జాతులు లేవే పాపా-కులమున
హెచ్చుతగ్గులు ఎంచుట పాపము
నీతి న్యాయము, విద్యాబుద్ధులు
కలవారే జాత్యధికులు."

భారతి అనుయాయులలో ముఖ్యుడూ, కవిమణిగా ప్రథితయశస్కుడూ అయిన దేశిక వినాయకం పిళ్లై కూడా పిల్లలకోసం చక్కనీ చిక్కనీ పాటలు ఎన్నో వెలయించారు. ఆవుని గురించి ఆయన వ్రాసిన పాట చాలా ప్రసిద్ధికెక్కింది. సారళ్యం ఆయన కవితకు పెట్టని భూషణం. 'ఆవు' పాటలోంచి కొన్ని పాదాలు :

ఎట్టి ఎట్టని దాన
ఎవరివే నీవు ?
ఎరుగవా నన్ను నీ
వెరుగవా నన్ను ?
అందాల బాలను
మందారమును నేను.

-లక్ష్మీరమణ

'తియ్యని పాలూ యిచ్చేవు-పొలానికి
మంచి ఎరువూ యిచ్చేవు
బండిని లాగే ఎద్దుని-చక్కగ
పెంచీ పెద్ద చేసేవు
తల్లిలేని పసిపాపలకు-నీవు
తల్లి వయ్యేవు
జబ్బుతో బాధపడేవారికి-నీవు
మందు వయ్యేవు.'

ప్రాచీనులలో కా. నమశ్శివాయ ముదలి యారు, మణి తిరునావుక్కరసు ముదలి యారు, మయిలై శివముత్తు ప్రభృతులు పిల్లల పాటలు చాలా వ్రాశారు. ఇవన్నీ తమిళ వాచకాలలో కనిపిస్తూ వుంటాయి కూడా.

ఆధునికులలో చాలామంది పిల్లలకోసం పాటలు వ్రాసేవారున్నారు. పెరియసామి తూరన్, తణిగై ఉలగనాదన్, ఆర్. అయ్యా స్వామి, అళ. వళ్లియప్ప, తిరుచ్చి భరతన్, తంబి శ్రీనివాసన్, నాగముత్తయ్య మొదలైన వారు కవితా సంపుటులు వెలువరించారు. పిల్లల కవిగా సుప్రసిద్ధుడైన శ్రీ వళ్లియప్ప వెలయించిన కవితా సంపుటాలలో 'మలరుం ఉళ్లం' ముఖ్యంగా పేర్కొనదగింది. ఆయన వ్రాసిన 'నా దైవం' లోంచి కొన్ని పాదాలు:

'అమ్మా అమ్మా! నువు వచ్చేవు
ప్రేమతో నాకు ముద్దిచ్చేవు
అమ్మా! నిను చూచుట తరువాయి
నా యేడుపు పొయ్యేను
అందా లొలికే చంద్రుణ్ణి
ఆకాశంలో చూపుతు
పాలూ పళ్లూ పెట్టేవు
పాటలు కథలూ చెప్పేవు
నీలా నను పెంచేవారు
లోకంలో లే రెవరు
నన్ను పెంచే మా అమ్మా
నీవె నా దైవ మమ్మా !'

కవితవలె కమ్మని కథలూ పిల్లలకోసం ఎన్నో వెలువడినవి. తి. జ. ర. (తి. జ. రంగ నాధన్), యన్. నటేశన్ (రాజీ, వైత్తణ్ణా (వైద్యనాథన్), ఆర్వి (ఆర్. వెంకటరామన్), కె. జయలక్ష్మి, కామాక్షి శ్రీనివాసన్ ప్రభృతులు కథలెన్నో రచించారు. పిల్లలకి కథలు కమ్మగా చెప్పడం తి. జ. ర. కి వెన్నతో పెట్టిన విద్య. ఈ సందర్భంలో రాజాజీని గురించి చెప్పక తప్పదు. ఆయన ప్రసిద్ధ కథ కుడు. ఏ విషయమునైనా సరే కథగా, మన స్సుని హత్తుకునేటట్లుగా చెప్పడ మనే కళ రాజాజీకి అబ్బినట్లుగా మరొకరికి అబ్బలేదు అనడం సాహసంకాదు. ఆయన కల్పనా కథల సంపుటి 'కర్పనైక్కాడు' రాజాజీ కట్టు కథలు అనే పేరుతో తెలుగులో వెలువడింది. అనువాదకులు శ్రీ తిరుమల వెంకట రంగా చార్యులు. పిల్లలకోసం కొన్ని నవలలు కూడా వెలువడకపోలేదు. వాటిలో వళ్లియప్ప వెల యించిన 'మణిక్కుమణి' అన్నది పేర్కొన దగినది. ఇది "చిట్టికి చిరుగంట" అనే పేరుతో తెలుగు చేయబడింది.

విజ్ఞానశాస్త్ర సంబంధము అయిన రచనలు కూడా ఎన్నో వెలువడడం హర్షించదగిన విష యం. ఈ రంగంలో కృషి చేస్తున్న వారిలో

ముఖ్యులు శ్రీయుతులు పి. యస్. అప్పుస్వామి, ఎం. యల్. శబరిరాజన్ ప్రభృతులు. 'పేనా' అనే లేఖినీ నామంతో శ్రీ అప్పుస్వామి కొన్ని గేయకథలు కూడా వ్రాశారు. విజ్ఞాన శాస్త్ర విషయాలను గురించి వ్యాసాలూ, పాటలూ ఆయన చాలా వ్రాశారు. జీర్ణకోశం గురించి చక్కని పుస్తకం (మన్తిర విద్దై) వ్రాశారు శ్రీ శబరిరాజన్. నాటినుంచీ నేటిదాకా వెలుగులోకి వచ్చిన రకరకాల గడియారములను గురించి శ్రీ కల్వి గోపాలకృష్ణన్ అనే ప్రసిద్ధ రచయిత 'మణి ఎన్న' అనే పుస్తకం వ్రాశారు. ఈ పుస్తకం గడియారం ఆకృతిలోనే అచ్చు కావడం ఒక విశేషం. ఇది పిల్లలకు ఎంతో ఆసక్తిదాయకంగా ఉంటుందని వేరే చెప్పనవసరం లేదు.

పిల్లల్ని ఉద్దేశించి జీవితచరిత్రలు ఎన్నో తమిళంలో వెలువడినవి. ప్రసిద్ధ విద్యావేత్త అయిన శ్రీ నె. తు. సుందరవడివేలు ప్రపంచ ప్రసిద్ధికెక్కిన ప్రముఖుల జీవిత విశేషాలను చక్కని కథలుగా సంతరించారు. శ్రీ కల్వి గోపాలకృష్ణన్ గాంధీజీ కథను పరమాద్భుతంగా చిత్రించారు. తమ 'వళి కాట్టియ ఉత్తమర్ గాంది యడిగళ్' అనే పుస్తకంలో విశ్వకవి రవీంద్రనాథ ఠాకూరు జీవిత చరిత్రను శ్రీమతి తిలకవతి మనోహరంగా అభివర్ణించారు. "పెద్దలు పిన్నలుగా ఉండే రోజుల్లో" అనే శీర్షికతో శ్రీ వళ్లియప్ప కొందరు ప్రముఖులను గురించి ఆసక్తి గొలిపే కొన్ని సంఘటనలు తెలియజేశారు.

ఈ సందర్భంలో శ్రీ యం. వి. వెంకట్రామ్ అనే రచయిత చేసిన కృషిని ప్రస్తావించాలి. గాంధీజీ, బాలగంగాధర తిలక్, గోఖలే, వీర సావర్కర్, రామలింగస్వామి, శివాజీ మొదలైన ప్రముఖుల్ని గురించి 'నాట్టుక్కు ఉళైత్త నల్లవర్' (దేశంకోసం శ్రమించిన మహనీయులు) అనే శీర్షిక కింద సుమారు 50 పుస్తకాలు వ్రాశారు. ఇవన్నీ సచిత్రకంగా, ఒకే సైజులో ముద్రితము లయినవి. అలాగే, తి. సు. కలియపెరుమాళ్ అనే మరొక రచయిత 'అటివియల్ అటిజర్' అనే శీర్షిక కింద సుమారు 20 పుస్తకాలు ప్రకటించారు. విజ్ఞాన శాస్త్రవేత్తల జీవిత విశేషాలు ఈ శీర్షిక కింద వెలువడిన పుస్తకాలలోని ప్రధాన విషయం.



శ్రీయుతులు నాగముత్తయ్య వ్రాసిన కుళన్దై క్కవితైగళ్ (పిల్లల కవితలు), రా. అయ్యాస్వామి సంకలించిన కుళన్దైగళుక్కు నాడోడిప్పాడల్‌గళ్ (పిల్లల జానపద గీతాలు), తంబి శ్రీనివాసన్ వ్రాసిన 'పుత్తకం తయార్' (పుస్తకం తయారయింది), త. నా. సేనాపతి అనువదించిన బొమ్మై త్తిరుడన్ (బొమ్మ

(దొంగ-రవీంద్రుని కథలు) మొదలైన పుస్తకాలు కూడా సంభావించదగినవి. రా. అయ్యాస్వామి పిల్లల్ని ఉద్దేశించి మనోహరమైన శైలిలో రామకథను రచించారు. ఇలా వివిధ ప్రక్రియలలోనూ ఎన్నెన్నో చక్కని రచనలు వెలువడినవి.

తమిళ బాలసాహిత్యాభివృద్ధికి రచయితలూ, పత్రికలే కాక పళనియప్పా బ్రదర్స్, పారినిలైయం, క్రైస్తవ సాహిత్య సంఘం (సి. యల్. యస్.), కలై మగళ్ కార్యాలయం, శైవసిద్ధాంత పుస్తక ప్రకాశక సంఘం మొదలైన ప్రసిద్ధ గ్రంథ ప్రకాశకులు కూడా గణనీయమైన కృషి కావిస్తున్నారు,

ఈ సందర్భంలో మదరాసులోని దక్షిణ భాషా పుస్తకసంస్థవారు తమిళ బాలవాఙ్మయ వికాసమునకు చేస్తున్న కృషిని అభినందించడం సముచితం. మంచి పుస్తకాలు ప్రకటించడమే కాక, పిల్లల పుస్తకాల పోటీలు కూడా నిర్వహిస్తున్నారు. పోటీలలో నెగ్గిన పుస్తకాలను ఇతర దక్షిణాది భాషలలోకి అనువదింపజేస్తున్నారు. తమిళంనుంచి తెలుగులోకి వచ్చిన కొన్ని పిల్లల పుస్తకాలు ఉదాహరించడం అప్రస్తుతం కాదనుకుంటాను.

అబ్దుల్ ఖాదర్ (వళరుం చుడర్) ఆకాశదీపం; అను : మధురాంతకం రాజారాం, నవల.

కల్వి గోపాలకృష్ణన్ (కనవు ఉలగిల్ కుళందైగళ్) స్వప్నలోకంలో పిల్లలు; అను : సభాపతి, నవల.

పరక్కుం పాప్పా (పేపరు పాపాయి;) అను : టి. వి. రంగాచార్యులు, నవల.

వళి కాట్టియ ఉత్తమర్ (దారి చూపిన ఉత్తముడు గాంధీ;) అను : చల్లా రాధాకృష్ణ శర్మ, జీవిత చరిత్ర.

(మణి యెన్న) టైమెంతయింది?; అను : చల్లా రాధాకృష్ణ శర్మ. విజ్ఞానం.

రాజాగోపాలాచారి, సి. (కర్పనైక్కాదు) రాజాజీ కట్టుకథలు; అను : టి. వి. రంగాచార్యులు.

వళ్లియప్ప, అళ. (మణిక్కూ మణి) చిట్టికి చిరుగంట; అను : చల్లా రాధాకృష్ణశర్మ, నవల.

(మిరుగంగళుడన్ మూన్డు మణి) మృగాలతో మూడు గంటలు; అను : మధురాంతకం రాజారాం, విజ్ఞానం.

శబరి రాజన్, యం. యల్. (మన్తిర విద్దై) కడుపులో గారడీ; అను : చల్లా రాధాకృష్ణశర్మ, విజ్ఞానం.

కథల పుస్తకాలు, పిల్లలకోసం ఉద్దేశించబడిన జానపద గేయాలు, తమిళ మహాపురుషుల జీవితచరిత్రలు మొదలైనవి తెలుగులోకి ఇంకా ఎక్కువగా వెలువడవలసిన అవసరం ఉన్నది. బాలబాలికలలో కనుక ఇతర భాషలను గురించీ, ఇతర ప్రాంతములను గురించీ సదవగాహన ఏర్పడినట్లయితే, జాతీయసమైక్యభావం వారిలో చిన్నవయస్సులోనే ఏర్పడుతుంది. అది వారి జీవిత సౌభాగ్యానికే కాక దేశశ్రేయస్సుకి దారి తీస్తుంది.



# బాలసాహిత్యానికి జీవితం అంకితంచేసిన ఉరుదూ మహాకవులు

— డా॥ జీనత్ సాజిదా

పిల్లలమీద సహజమైన స్నేహ వాత్సల్యాలు ఉబికి వచ్చేవారే బాల సాహిత్యాన్ని సృష్టించగలరు. వారి రచనలే అజరామరములై నిలుచును.

పాఠ్యప్రణాళికకన్న భిన్నమైన బాల సాహిత్యము ఉండాలనే భావము ఆధునిక యుగములోనే ఏర్పడింది. ప్రాచ్య సాహిత్య, విద్యా సంప్రదాయాలలో విద్యావిధానము లోనే బాలుర మనోవృత్తి కనుగుణమైన రీతిలో పాఠ్యప్రణాళికను తయారుచేసేవారు. ఈ విధానములో పిల్లల కిష్టమైన కథలద్వారా, వారి చుట్టూ ఉన్న పశుపక్ష్యాదులను, చెట్లను, చేమలను, ప్రకృతిని, వారి జీవన సమస్యలనూ వారికి పరిచయము చేసి, ఆ కథ వెనువెంటనే నీతిబోధకమైన ఒక వాక్యాన్ని చేర్చి, వారి మనఃఫలకముమీద చెరగని ముద్రను వేసేవారు. భాషదృష్ట్యా కూడా ఈ సాహిత్యము నిర్దుష్టమై, అనుప్రాసయుక్తములైన కవితలతో చిన్నపిల్లలకు సులభంగా నోటబట్టుటకు దోహదము చేసేది. పచ్చి మట్టి ఫలకము వలె ఉన్న వారి మనస్సులో ఎన్ని మణులనైనా పొదుగ వచ్చును. క్రమక్రమముగా పువ్వు వలె వారి చైతన్యము వికసించేకొలది తాము నేర్చుకొనిన పంక్తుల అంతరార్థాన్ని వారు గ్రహించేవారు.

మన ప్రాచీన గ్రంథము లన్నియునూ ఉత్తమ కళాకారులు రచించిన అనుప్రాసతో కూడిన ఛందోరీతినే నడచుటవలన ఎంతటి బృహద్గ్రంథములైననూ బాలకులు కంఠస్థము చేయగలిగేవారు. మౌఖిక విద్యా సంప్రదాయ మిందుకు దోహదమైనది. ఇట్టి గ్రంథ పరంపరలో ఉరుదూ సాహిత్యాధ్యయనమునకు మూలబంధాలవంటి పర్షియను గ్రంథాలు ముఖ్యమైనవి. అవి - రిసాలె సుబియాన్ (పెద్ద బాలశిక్ష), ఖాలికే బారీ (పార్సీ, తుర్కీ, అరబ్బీ, హిందీ భాషల కోశము, రచయిత అమీర్ ఖుస్రూ), కరీమా (నీతిబోధక గ్రంథము), మాముకిమా (భగవద్భక్తిపూర్ణమైన మధుర కవిత్వము), గులిస్తాన్, బూస్తాన్‌లు.

గులిస్తాన్, బూస్తాన్ గ్రంథములను రచించిన "సాదీ" కవి విశ్వవిఖ్యాతుడు. పర్షియాలోని "షిరాజ్" ఈతని జన్మభూమి. పదుసార్లు దేశ విదేశములను పర్యటించి సంపాదించిన లోకజ్ఞానముతో ఇతడు పలికిన ప్రతి పలుకు స్వాతివాన బిందువు ముత్యముగా మారినట్లయ్యెను. నీతివాక్యములలో "సాదీ" వచనముల కీడైనవి లేవు. కటువైన మాటలనితడు చెప్పినా, వినడానికి తీయగనే ఉండును. ఇతడు భారతదేశమును గూడా సందర్శించెనని అందురు. మన దేశానికి ప్రథమ రాష్ట్రపతి

శ్రీ రాజేంద్రప్రసాదు తాను ఉరుదూభాషను, లిపిని "సాదీ" వచనాలతోనే దిద్దబెట్టుకొంటి నని తన ఆత్మకథలో చెప్పెను. ఇతని కవిత మచ్చుకు-

"బర్గే దరఖ్తానే సబ్జ్‌దర్ నజరే
హోషియార్
హార్ వరఖే దఫ్తరేస్త్ మారే ఫతె
కర్దిగార్"

"పచ్చని చెట్లు ఈశ్వరజ్ఞాన భాండాగారములు. ఒక్కొక్క ఆకు ఆ జ్ఞాన పుస్తకములోని ఒక్కొక్క పుట"-జ్ఞాని ఇట్లు తలంచుచున్నాడు.

ఈతని వచనాలు హృద్యములు, అనవద్యములు. ఇతని దార్శనిక దృష్టిని ప్రతిబింబించును. అం దొకటి రెండు మచ్చుకు-



అమీర్ ఖుస్రూ

"కలవాడు ఆకలిగా ఉన్నప్పుడు
తింటాడు
లేనివా డన్నము దొరికినప్పుడు తింటాడు"

"ప్రపంచము ఒక గుమ్మటము (గుంబద్) వంటిది. మంచిని పలికితే మంచి, చెడును పలికితే చెడు ప్రతిధ్వనిస్తుంది".

ఉరుదూ సాహిత్య వికాసము పర్షియను సంప్రదాయముల ననుసరించే జరిగింది. ఉరుదూ భాషాభ్యాసం గూడా పై పర్షియను గ్రంథాలతోనే ఆరంభ మయ్యేది.

"సాదీ" సమకాలికుడైన "అమీర్ ఖుస్రూ" క్రీ. శ. 14 వ శతాబ్దములో భారతదేశమునందు జన్మించిన సుప్రసిద్ధ కవి, దార్శనికుడు, వాగ్గేయకారుడు, సితార్ వాద్య స్రష్ట. ఇతడు ఉర్దూ, హిందీ సాహిత్యములకు రెండింటికినీ మూలపురుషుడే! పర్షియను సాహిత్యమునం దితడు ధ్రువతారగా వెలుగును. ఇతని కవితలు, దోహాలు, ప్రహేళికలు, ఇంకా అన్‌మిళియా, కహ్‌ముకర్నియా, దో సుఖ్‌నే వంటి శబ్దచిత్రాలు సుప్రసిద్ధములు. ఖాలికే బారీ కోశకర్త ఈయన. పిల్లలకోసము ఈతని ప్రహేళికలు మచ్చుకు-

"అందర్ చిల్‌మన్ బాహార్ చిల్‌మన్
బీచ్ కలేజా ధడ్‌కే
అమీర్ ఖుస్రూ యూ కహే
కే దోదో అంగుల్ సర్‌కే".

లోపల తెర, బయట తెర, మధ్య హృదయము స్పందించును. అమీర్ ఖుస్రూ ఇలా అంటున్నాడు: రెండు రెండు అంగుళాలిది కదలును. అది ఏమిటి? (జవాబు-గడియారము).

"సారీ రాత్ మొహే సంగ్ జాగా
భోర్ భయీ తబ్ బిఛుడన్ లాగా
ఉస్ కే జాతే ఫాటత్ హియయా
క్యా సఖి సాజన్, నా సఖి దియా"

రాత్రంతా నాతో మేల్కొని, తెల్లారగనే వదలివేయగా, నా హృదయము పగిలిపోయినది. ఓ సఖి ఎవరది, నీ ప్రియుడా? కాదుకాదు దీపము.

హికాయతే షీరీ (మధుర గాథలు, చక్కెర పలుకులు): సంస్కృత, పర్షియన్, అరబ్బీ భాషలలోని కథలను ఉరుదూలోని కనువదించి స్వతంత్ర రచన ప్రతిపత్తిని కల్పించుకొనిన దీ కథానికా సంగ్రహము యూసఫ్ కథలు కూడా ఇందు నిక్షిప్తములు. అందొక కోడి పుంజు కథలో తవుడు గెలికితే ఆ కోడిపుంజుకొక రత్నము దొరుకుతుంది. అప్పుడా పుంజు 'నా కెందుకీ రత్నము ఒక గోధుమ గింజైనా దొరికితే కడుపు నిండేది' అని అనుకుంటుంది. ఇచ్చట కవి సూక్తిని చూడండి.

"ఖదరె జోహర్ షాహదానత్ యా బదానత్ జౌహరీ" (రత్నపు విలువ కట్టేవాడు రాజు, లేక రత్నాల వర్తకుడు; ఇరువురు మాత్రమే).

పంచతంత్ర కథలు జగత్ప్రసిద్ధములు. ఇందలి కథలు, పాత్రలు వాస్తవికములు కాకపోయినను, సంఘటనలు మానవ జీవనానికి సన్నిహితములై మనోరంజకముగానూ, విజ్ఞానదాయకముగానూ ఉండును. వీని అరబ్బీ అనువాదము "కలీలా దమ్నా" నుండి పర్షియన్‌లోనికి "అన్వారె సొహేలీ" (శుక్రకిరణములు) అను పేరిట అనువదించబడెను. జ్ఞానానికి ప్రతీక అయిన శుభగ్రహము శుక్రగ్రహము. ఇది మంచిని ప్రకాశింపజేసి, చెడును నశింపజేస్తుంది. అందుచే ఈ పేరు ఆ కథల పుస్తకానికి అన్వర్థమై ఉన్నది.



నజీర్ అక్బరాబాదీ

ఇట్టి సంప్రదాయము లుండగా పాశ్చాత్య సంప్రదాయములు వెల్లువ వలె మన దేశముపై పడి పాత విద్యావిధానానికి విచ్ఛిత్తి ఏర్పడినట్లయ్యెను. ఈ సమయములో కొత్త పాతలను సమముగా జీర్ణించుకొని బాలలోకానికి వరప్రసాదమువలె నజీర్ అహ్మద్ అను మేధావి పుట్టెను. ఈతడు తన కూతురికి, కొడుకుకు నాలుగు నాలుగు పేజీలు పాఠ్యవిషయములను వ్రాసియిచ్చి వారిచే చదివించేవాడు. కూతురు కట్లు వ్రాసిచ్చిన కాపీకి "మిరాతుల్ ఉరూస్" (దుల్హాన్‌కీ అయినా-వధూదర్పణము) అని పేరు పెట్టి, ఆడపడుచుగా, కోడలుగా స్త్రీ నిర్వర్తించవలసిన విధుల నందు తెలిపెను. కొడుకు కాపీ పేరు "చంద్‌పంద్". ఇందు జీవన సమస్యలను పురుషు డెదుర్కొనుట కుపయోగించు విషయములను తెలిపెను. యాదృచ్ఛికముగా స్కూళ్ల ఇన్‌స్పెక్టరు కండ్లబడ్డ ఈ



గ్రంథములు ఉరుదూ బాలలోకముకొఱకై ప్రకాశింపబడి, నజీర్ అహ్మాదు లోని రచనా శక్తికి గుర్తింపు కలిగించెను. క్రమముగా నితడు తన పిల్లలు ఎదుగుకొలది వారికి అనువైన పుస్తకాలు రచించెను. ఈ గ్రంథముల నుండియే క్రమముగా ఉరుదూ నవలా వికాసము జరిగెను. గొప్ప వక్త, విద్యాంసుడు, నవలా రచయిత ఈ నజీర్ అహ్మాదు.

క్రీ. శ. 1739 లో ఆగ్రాలో జన్మించి, శ్మశానములో విడిచిపెట్టబడ్డ బిడ్డ నజీర్ అక్బరాబాదీ కవి. ఇతడు చుట్టుపట్ల ఉన్న ప్రతి ఇంటనూ ఒక్కొక్కరోజు ఉండి ఆ యింటి వాతావరణానికి, భావకు అనువైన కవితలను రచించెను. కుల మతాలకు, కలిమి లేములకు అతీతమైన ఈతనివంటివారిని "ఖలందర్" (అవధూత) అందురు. ఇతడు కనుచూపుమేరలో తాజ్‌మహాలు కనిపించునంతమేర స్థలములోనే తిరుగుచూ తన జీవితాన్ని వెళ్లబుచ్చెనట. పిల్లలకోసము హిందూ, ముస్లిముల సంప్రదాయములు, ఉత్సవములపై ఇతడు రచించిన కవితలు అమరములు. వేపచెట్టు నీడలో మీర్జా గాలీబుకు దేశికవిత్వము బోధించిన మహామహుడీతడు. ఈతని కవిత లాబాల గోపాలానికి సుపరిచితము. వానిలో కొన్ని పేర్లు ఇచ్చట పొందుపరచబడినవి :

హోలీ, బల్‌దేవ్‌కీ మేలా, తిల్‌కే లడ్డూ, కన్‌కవ్వా ఔర్ పతంగ్, (చిన్న పతంగి, పెద్ద పతంగి), అష్‌దహే కా బచ్చా (కొండ చిలువ పిల్ల), రీచ్‌కా బచ్చా (ఎలుగుబంటి పిల్ల), గిల్హేరీకా బచ్చా (ఉడుత), బుల్‌బుల్‌కీ లడాయీ, కవ్వా ఔర్ హిరణ్ (కాకి, జింక), హంస్‌నామా.

ఇందు "రీచ్‌కా బచ్చా" కవిత ప్రతి ఉరుదూ బాలునికి ఇంచుమించు కంఠస్థము. ఎలుగుబంటి వీథిలో ఆడే లయను అనుసరించే కవిత గతి కూడా ఉండును.

"కల్ రాహ్ మేఁ జాతే జో మిఁలా
రీఛ్ కా బచ్చా
లే ఆయే వహీఁ హమ్‌భీ ఉఠా
రీఛ్ కా బచ్చా
సౌ నేమతేఁ ఖాఖాకే పలా రీఛ్ కా బచ్చా
జిస్ వక్త్ బడా రీఛ్ హువా రీఛ్ కా బచ్చా
జబ్ హమ్ భీ చలే సాథ్ చలా రీఛ్ కా బచ్చా
థా హాథ్ మే ఇక్ అపనే రచామన్ కా
జో సోంట్
లోహేక్ కడీ జిస్ పే ఖడక్ లేథీ సరాహి
కంధేపే పడా ఝోలనా ఔర్
హాథ్ మేఁ ప్యాలా
బాజార్ మేఁ లే ఆయే ఁఖానే కీ తమాశా
ఆగేతో హమ్ ఔర్ పీఛే వో థా
రీఛ్ కా బచ్చా
కహతాథా కోఈ హమ్‌సే మియాఁ
ఆవో కలందర్
అబ్ క్యా హువా అగలే జో తుమ్హారే థే
వో లుకదర్
హమ్ ఇన్‌సే యే కహతే థే యే
పేశాహై కలందర్
హాఁ ఛోడ్ దియా బాబా ఉన్హేఁ
జంగల్ కా అందర్
జిస్ దిన్‌సే ఖుదానే యే దియా
రీఛ్ కా బచ్చా.

(నిన్న దారిన వెళుతూంటే
దొరికింది ఓ ఎలుగుపిల్ల
మేము దానిని వెంట తెచ్చాము
మోసుకొని ఎలుగుపిల్ల
పెరిగి పెద్దదయింది, ఎలుగు
బంటయింది ఎలుగుపిల్ల
మేము బయలుదేరితే మావెంట
నడిచింది ఎలుగుపిల్ల

... ...

ఒకరన్నారు నాతో రావయ్యా
మియా అవధూతా
మునుపు నీవారు వుండేవారే
ఇపు డేమయ్యారు తాతా!
వారితో నేనన్నాను : ఇది
లోకవృత్తి నాయనా!
వదిలేశాను అడవిలో వారిని
అందరినీ నాయనా!
ఏ దినమయితే ఖుదా నాకు
ఇచ్చాడో ఈ ఎలుగుపిల్ల.)

"హాంస్‌నామా" సర్వోత్తమము. ఇచ్చట హాంస ఆత్మకు ప్రతీకము. ఈశ్వరజ్ఞాన స్థాన మందు తొలి సోపాన మని ఈ కవితను గురించి భావింతురు. ఇతడు "కలియుగ" పదము నిట్లు చమత్కరించెను.

"కల్ జుగ్ నహీ, కర్ జుగ్ హై ఏ
క్యా ఖూబ్ సౌదా నగ్ద్ హై
ఇస్ హాత్ దే ఉస్ హాత్ లే"

ఇది కలియుగముకాదు; "కర్"(చేయుము అని కర్మయోగాన్ని ఉపదేశించు)యుగ మిది. ఎంత మంచి సరుకు ? ఏమి రొక్కం ? ఈ చేత్తో ఇమ్ము, ఆ చేత్తో తీసుకొమ్ము.



డాక్టర్ మొహమ్మద్ ఎక్బాల్

"ఆబే హయాత్" అను ఉరుదూ సాహిత్య చరిత్రను రచించిన మహమ్మదు హుస్సేను ఆజాద్‌కు "సాహెబె ఆబే హయాత్" అనే బిరుద మున్నది. ఈతడు చిన్నపిల్లలకొరకై రచించిన అయిదు వాచకములు నూరేండ్లపైచిలుకు కాలము ఉరుదూ బాలలోకానికి అసదృశమైన సేవ చేసెను. ఇతడు పెరుగుతున్న బాలకునికి మనోవికాస మగుకొలది అతనికి క్రమక్రమముగా తెలియజేయవలసిన విషయముల నిందు జతపరచెను. రచయిత ఇల్లు, కుటుంబము, ఆహారము, పాఠశాల, గ్రామ జీవనము, వివిధ వృత్తులు, భౌగోళిక జ్ఞానమును గురించిన పాఠముల నిందు వ్రాసి, వాని తరువాత కబీర్, నానక్ వంటి మహాత్ముల చరిత్రలతో పరిచయము చేసెను. చుట్టూ ఉన్న ప్రకృతిలోని దరిందే, చరిందే, పరిందేలను (పశుపక్ష్యాదులను, చెట్లను) పరిచయము చేయుచు చుట్టూ ఉన్న "ప్రకృతి జ్ఞానభాండాగార"మనే సాదీ వచనాన్ని చెప్పకచెప్పును. ఈ పాఠములలో, సైన్సు పాఠాలను

మనిషి మనిషికీ దేవుడు
మన సిచ్చాడు !
మనుషులుగా బ్రతకం డని
మమ తిచ్చాడు !
మమతలు పండించుకొన్న
మనసు కోవెల !
మంచితనం చంపుకొన్న
మనసు పెను శిల !
మనసులోన దేవుడున్న
మాట మఱువకు !
మంచి మనిషి దేవు డన్న
మాట మఱువకు !
పువ్వు వంటి మనసుతో
నవ్వుకో హాయిగా !
వలపు చిలికి పది మందిని
పలుకరించు తీయగా !

-వక్కలంక లక్ష్మీపతిరావు

ఙితపరచి, నగర జీవనాన్ని వర్ణిస్తే ఇప్పటికినీ ఇవి పఠనయోగ్యములే!

హాలీ : ప్రఖ్యాత కవి హాలీ కూడా బాల సాహిత్యానికి కొంత సేవ చేసెను. ఈయన ఉపదేశాన్ని చూడండి:

"జహాఁ ఆరామ్ హోతా హై
మీఠీ జబాన్ సే
నహీఁ లగ్ తీ కుఛ్ ఉస్ మేఁ కీమత్ జ్యాదా"

(తియ్యని మాటలతోనే ఇతరుల హృదయానికి ఆశ్వాసమును కలిగించవచ్చును. దానికి ఖర్చు అయ్యేదేముంది?)

ఇస్మాయిల్ మేరఠీ :-భారత దేశములో బ్రిటిషువారి నెదిరించు సాంఘిక చైతన్యము ఏర్పడినప్పటి కాలములో "మహమ్మద్ హుస్సేన్ అజాద్" భావుకత్వమును, రసదృష్టిని కలిగించుచు రచించిన వాచకముల స్థానములో వాస్తవిక దృక్పథాన్ని ఏర్పరచు వాచకములను ఇస్మాయిల్ మేరఠీ రచించెను. బాల సాహిత్యానికే తన జీవితమును అంకితము చేసిన ఇతనిని "బచ్చోంకా ఇస్మాయిల్" అని అందురు. ఈతని వాచకములు అడవిలో అగ్నివలె వ్యాపించి పాత వాచకాలను మరపింపజేసెను. ఈతని వాచకాల ద్వారా బాలకుని దృష్టి జాతీయ పరిధినుండి అంతర్జాతీయ జీవనము వైపు మళ్లను. సహజ సుందరమైన ఈతని శైలికి ఒక ఉదాహరణము :

"ఆబె రవాకె అందర్ మఛిలీ బనాఈ తూనే
మఛిలీకో తైర్ నేకో ఆబె రవా బనాయా"

(ఓభగవంతుడా! నీటి ప్రవాహము నలంకరించుటకు చేపపిల్లను సృష్టించితివి. చేపపిల్ల ఈదుటకు ప్రవాహాన్ని సృష్టించితివి.)

ఇస్మాయిల్ బాలసాహిత్యములో తొక్కిన కొత్తపుంతలవలన కొత్తకొత్త కార్యరంగములేర్పడి, పత్రికారచన ప్రారంభమైన ఈ కాలములో బాలులకు పత్రికలు ప్రత్యేకముగా వెలువడెను. ఆరంభదశలో వెలువడిన కొన్ని మంచి పత్రికలుగూడా ధనాభావముచే మూతపడగా, పెద్దపెద్ద సంస్థలు నడిపించు బాలుల పత్రికలు సుప్రసిద్ధములై నిలిచెను. అందు కొన్ని :

ఫూల్ :-లాహోర్ నుండి "ముమ్తాజ్ లీ" అనునత డీ పత్రికను వెలువరించెను. బహుజనాదరాన్ని పొందిన ఈ పత్రికను చదివి రచయితలుగా మారిన బాలకు లెందరో ఉన్నారు. ఆకర్షణీయముగా అచ్చయి వచ్చే ఈ పత్రికలో స్వతంత్ర రచనలు, పాత కథల సంగ్రహాలు,

పాశ్చాత్య సాహిత్యములోని కథల ఉరుదూ అనుసరణలు ప్రకాశింపబడేవి.

“అతాలీఖ్” (శిశు సంరక్షకుడు, అనుగామి) :-ఇది ఔరంగాబాదునుండి వెలువడి దాదాపు ఏబది సంవత్సరాలపాటు పాత నిజాము రాష్ట్రములోని బాలరచయితలను ప్రోత్సాహపరచిన ఉత్తమ బాలపత్రిక. ఈ పత్రిక “పుట్టుకతో ఎవరూ రచయితలు కారు. వారికి తగిన తరిఫీదు నిచ్చి, వారిలో అణగి ఉన్న శక్తిని ప్రజ్వలింపజేయాలి” అనే నమ్మకముమీద బాలకులచేత తిరిగి వారి రచనలను దిద్దించి అచ్చువేసేది. దీనికి రావలసినంత ఖ్యాతి రాలేదు.

గుంచ :-బిజ్‌నోర్ నుండి ఒక మౌల్వీల సంస్థ కాంగ్రెసు వాదాన్ని బలపరుస్తూ రాజకీయ చైతన్యాన్ని కలుగజేయు “మదీనా” అను దినపత్రికను వెలువరించి దాని కనుబంధంగా “గుంచ” అనే పత్రికను పిల్లలకై వెలువరించింది.

ఇరువదవ శతాబ్ది ఆరంభములో జన్మించిన మహాకవి, దార్శనికుడు మొహమ్మదు ఎక్బాల్. ఇతడు ప్రారంభదశలో బాలసాహిత్యమును రచించెను ఇతడు పిల్లలకై రచించిన కవితలపై జర్మను, ఇంగ్లీషు సాహిత్యముల ప్రభావము కొంతవరకు గలదు. “సారే జహాఁసే అచ్ఛా హిందూస్తాఁ హమారా”, మేరా వతన్ వహీహై” వంటి ప్రసిద్ధ దేశభక్తి గీతాల కర్త యితడే. ఈతని చిన్న రచనలు కొన్ని : మాఁకా ఖాబ్ (తల్లి కల), ఏక్ మక్‌డా ఔర్ మక్షి (సాలెపురుగు, ఈగ), ఏక్ పహాడ్ ఔర్ గిల్హారీ (పర్వతము, ఉడుత , ఏక్ గాయ్ ఔర్ బక్రి (ఆవు, మేక), పరిందేకీ ఫర్యాద్ (పంజరములో పక్షి ఫిర్యాదు). “పరిందేకీ ఫర్యాద్” చదివినవారెవరూ పంజరాలలో పక్షులను పెంచలేరు.



డాక్టర్ జాకీర్ హుస్సేన్

ఖిలోనా :-ఢిల్లీనుండి “షమా” అనే సంస్థ వెలువరించే ఈ పత్రికను ఇంటింటా ఇప్పుడు చదువుతారు.

ఆధునిక దృష్ట్యా “జామె మిలియా” నుండి వెలువడు “పయామె తాలీమ్” (విద్యా సందేశము) అను పత్రిక శాస్త్రీయ విజ్ఞానానికి దేశభక్తిభావాలను జోడించునది. ఇది ఏ పాశ్చాత్య పత్రికతోనైనా పోటీ పడగలదు. ఈ సంస్థకు తన జీవితాన్నంకితముచేసిన జాకిర్ హుస్సేను భారత రాష్ట్రపతిగా జీవితమును విరమించినవాడు. ఇతడు తొమ్మిదవ ఏట అకాల మృత్యువు వాతబడ్డ “రుకైయా రెహానా” అను తన ముద్దుల కూతురు పేరట ఆమెకు తాను చెప్పిన తీరులో ఎన్నో కథలు ప్రచురించెను. తనపేరట “అబ్బూఖాఁకీ బక్రీ ఔర్ దూస్‌రీ కహానియా” అనే గ్రంథాన్ని ప్రచురించెను. దేశభక్తి, దైవభక్తి, మానవభక్తిని ప్రచారము చేయు ఈ కథలు మానవ జీవనము

తోని మంచికి అద్దము పట్టి, ఖంగ్యాంతరమున పెద్దలకు గూడా నీతిని బోధించును. ఈ కథలు నిర్మలమైన సరోవరమువలె చల్లని జీవదానము చేయునవి.

ప్రఖ్యాత విమర్శకుడు, రచయిత "రషీద్ అహ్మద్ సిద్దిఖీ", "షేక్ నియాజీ" అను పేరట పెరుగుతూ ఉన్న తన కుమారునితో తన కేర్పడిన సంబంధమును యథాతథముగా వర్ణించుచు గ్రంథము నొకదానిని వ్రాసెను. "పితృపుత్రసంబంధము"ను చిత్రించు ఇట్టి గ్రంథము సాటిలేనిది.

నేటికినీ బాలసాహిత్యమునకు సేవచేయు వారిలో "జామె మిలియా"లో పనిచేసిన షఫి యుద్దీన్ నయ్యరు, అథర్ పర్వేజ్, సాలెహా ఆబిద్ హుస్సేన్, అజ్మర్ అఫ్సర్ ప్రముఖులు. హైదరాబాదులో మహబూబియా పాఠశాలలో టీచరుగా ఉన్న లతీఫున్నిసా బేగము శిశు గీతాలను రచించెను. నేను (డా. జీనత్ సాజిదా) "హుకుంరాన్ ఖవాతీన్" (భారత దేశమును ఏలిన స్త్రీలు), నామ్వర్ ఖవాతీన్ (పేరెన్నిక గన్న స్త్రీలు) అను రెండు గ్రంథములను బాలులకై రచించినాను.

ఉత్తమ రచయితలు అధికసంఖ్యలో బాల సాహిత్యమును సృష్టించుటకు ముందుకు వస్తే అమర సాహిత్యము సృష్టించబడును. బాలకులు తమ మనోవికాసానికై ఉత్తమ రచయితలు ముందుకు రావలెనని మనఃపూర్తిగా ఆశించ వచ్చును. పిల్లలమీద సహజమైన స్నేహావాత్స ల్యాలు ఉబికివచ్చేవారే బాల సాహిత్యాన్ని సృష్టించగలరు. వారి రచనలే అజరామరములై నిలుచును.



ఖలందర్ పాఠాలు.



# తెలుగులో పిల్లల కార్టూన్లు - బొమ్మల కథలు

## భావరాజు వెంకట సత్యమూర్తి

బొమ్మల కథలు, కార్టూన్ల వల్ల చాలా ప్రయోజనాలున్నాయి. కార్టూను చిత్రాలు, సినిమాలు పిల్లల్ని ఉల్లాస పరుస్తూనే కళాత్మకంగా వాళ్ళకి నీతిని బోధిస్తాయి.

మనిషికి జీవితంలో తిండి, బట్ట, నిద్ర ఎంత అవసరమో మానసోల్లాసం కూడా అంతే అవసరం. నిండుగా హుషారుగా నవ్వుకో గలిగిన మనిషి జీవితంలో పెద్ద పెద్ద కష్టాల్ని తేలిగ్గా నెట్టేస్తుంటాడు. మనసుకి ఆనందం కల్గించటానికి ఎన్నిరకాల పద్ధతులున్నాయి ? అతి తక్కువ వ్యవధిలో ఫక్కుమని నవ్వించ గల సాధనం మంచి కార్టూనే అంటే అతిశ యోక్తి కాదేమో!

కార్టూననే సరికి ఏదో బొమ్మ గీసి దాని మీద జోక్ రాయటం కాదు. బొమ్మని చూడగానే నవ్వురావాలి. అందులో అలాంటి భావం వుండాలి. ఏదో జోక్ గురించి కార్టూన్ వేసినట్టు వుండకూడదు. అయితే కార్టూన్ ముఖ్యోద్దేశం కేవలం హాస్యమనే అనుకో నక్కరలేదు. సమాజంలో రోజురోజు మనం ఎదుర్కొనే సమస్యలు సందేశాత్మ కంగా వ్యంగ్యరూపంలో చెప్పొచ్చు. సాధార ణంగా ఓ మాగజైన్ తీసుకోగానే ముందుగా కార్టూన్లు ఈ చివరినుంచి ఆ చివరివరకు చూసేస్తాం. ఈ అలవాటు చిన్నవారినుండి పెద్దాళ్ళదాకా ఒక్కలాగానే వుంటుంది. మా అబ్బాయి పత్రిక రాగానే "నాన్నారూ! రామూ-శామూ చెప్పరా?" అంటూ పరు గెత్తుకొస్తాడు. నేను ఎంత హడావిడిలో వున్నా అది ఆపి, వాడికి ఆ వారం రామూ శ్యామూ ఏం చేశారో చెప్పేదాకా వదలడు. మూడేళ్ల బాబిగాడి దగ్గరనుంచి వలభై ఏళ్ళ భాస్కరరావుగారి దాకా ఈ ఉత్సుకత ఒక లాగానే ఉంటుంది. మన ఇళ్లల్లో మనం చూస్తూంటాం - వారపత్రిక రాగానే నేను ముందంటే నేను ముందంటూ కొట్లాటలు. చివరికి "నేను ఒక్కసారి బొమ్మలు చూసి ఇచ్చేస్తా!" అని రాజీకొచ్చి ఓ సారి ఆత్రుతగా బొమ్మలు, కార్టూన్లు చూసి రెండో వాళ్ల కిచ్చేస్తుంటారు. ఇన్‌స్టెంట్ కాఫీలా ఎక్కువ శ్రమ పడకుండా ఓ కథ చదివిన హాయి, ఓ వ్యాసం చదివిన ఆనందం ఒక కార్టూను

శాంతి కాంతి దశ దిశల
చల్లె మా నెహ్రూజీ
ఇలానే స్వర్గము చేరెడి
కలలు కనె చాచాజీ.

పాపలన్న పూవులన్న
పరవశ మొందే తపస్వి
ప్రజలన్నా దేశమన్న
ప్రాణమిడే యశస్వి.

-జె. బాపురెడ్డి

చూడగానే లభిస్తుంది. వాటిని చదవటానికి పట్టే టైములో సహస్రాంశం వెచ్చిస్తే చాలు, ఓవ్యక్తి గంటలకొలదీ వువన్యాసంలో చెప్పింది. ఓ రచయిత పేజీలకొద్దీ ఓ నవల్లో రాసింది ఓ కార్టూన్లో మనసుకి హత్తుకొనేలా చెప్పే యొచ్చు!

పిల్లల కార్టూన్ల గురించి చెప్పాలంటే శ్రీ న్యాయపతి రాఘవరావు గారిని, వారి అద్భుత సృష్టి "బాల" పత్రికను ముందుపేర్కొనాలి. ఎందరో ఈ నాటి ప్రముఖ చిత్రకారులు బాల లోనే అఆరాఖ్యానం (సారీ 'రేఖాఖ్యానం' అనాలి కాబోలు) చేసి తరువాత తరువాత పెద్ద వారైనవారే!

శ్రీ బాపు, శ్రీ బుజ్జాయి, ఇంకా ఎందరో ప్రముఖ చిత్రకారులను ఆంధ్ర దేశానికి అందిచ్చిన ఘనత "బాల" పత్రికకు ఉన్నది. ఈనాడు "బాల" పత్రిక లేకపోవటం నిజంగా తెలుగు బాలల దురదృష్టం.

ఎవరికైనా చిన్న వయసులోనే లలితకళల్లో అభిలాష కల్గుతుంటుంది. వాటికి ఆ వయస్సు లోనే సరైన ప్రోత్సాహం లభిస్తే రాణింపున కొచ్చి మంచి కళాకారునిగా తయారవటానికి వీలవుతుంది. ప్రారంభంలోనే మంచిబొమ్మలు ఎవ్వరూ వెయ్యలేరు. బొమ్మలు బాగుంటేగాని పత్రికలు ప్రచురించవు. కేవలం ప్రోత్సాహం గురించి తమ పత్రిక సర్క్యులేషన్ పాడుచేసుకుందుకు నేటి పత్రికలు ముందుకు రావు. దాంతో చిత్రకారుడిగా అవ్వాలనే కోరిక పిండెలోనే రాలిపోతుంది. "బాల" పత్రికలాంటి పత్రిక మనకి చాలా అవసరం. ప్రతీ పత్రికవారు క్రొత్త క్రొత్త బాల కళాకారుల గురించి ప్రత్యేకశ్రద్ధ వహించి మంచి ప్రోత్సాహం ఇవ్వాలి. అలాంటప్పుడే తెలుగు దేశంలో ఇంకెందరో బాపూలు తయారవుతారు.

పిల్లల కార్టూన్లు అనేసరికి మనకి కళ్ళ ముందు "వరేయ్ నా పేరు రాయపోతే, నెత్తిమీద హైవేటుచెప్పేస్తా జాటర్ డమాల్" అంటూ బాపుగారి బుడుగు, అంతకంటె కోపంగా బుజ్జాయిగారి డుంబు కనిపిస్తారు. ఆ రోజుల్లో బుడుగు ప్రచురించేటప్పుడు పిల్లలకంటె పెద్దలే ఆత్రుతగా పత్రికగురించి ఎదురు చూసేవారు. అఫ్ కోర్సు అలా చూడాలనే గోపాలం, రాధ ప్రేమ ఘట్టాలు, బాబాయి, రెండుజెళ్ల సీత లవ్ సీన్లు చూపించారు బాపుగారు. ఆ రోజుల్లో బుడుగుగాడి, సారీ, బుడుగుగారి చేష్టలు అన్ని తెలుగు కుటుంబాల్లో సరదాగా చెప్పుకునేవారు. ఈ నాటికీ బుడుగు భాష నిత్యనూతనంగా తెలుగు వారి హృదయాల్లో, జ్ఞాపకాల్లో నిలిచిపోయింది. నిజంగా నామాట మీరు కొంచెం కూడ నమ్మకపోతే మా పక్కింటి లావుపాటి పిన్నిగారి మొగుడుగార్ని గాని బుడుగుగారి సీ గానపెసూనాంబని గాని అడగండి!

ప్రస్తుతం మనం చూస్తున్న పత్రికల్లో పిల్లలనుగురించి ప్రత్యేకంగా ఏవీ కార్టూన్లు రావటంలేదు. ప్రముఖ కార్టూనిస్టులు కూడా

ఈ విషయంలో ఎక్కువ శ్రద్ధ చూపటంలేదు. మిగతా భాషల్ని, ముఖ్యంగా ఇంగ్లీషు పత్రికల్ని చూస్తూంటే తెలుగులో పిల్లల కార్టూన్‌లకు అతి తక్కువ ప్రాముఖ్యం ఇవ్వబడుతోందని అనిపిస్తుంది. ప్రతి పత్రికలో బాల సాహిత్యానికి కేటాయించిన పేజీల్లో కార్టూన్లు, బొమ్మల కథలు ఎక్కువ చోటుచేసుకోవాలి. చిత్రకారులు, పత్రికలు ఈ విషయం గురించి ఇంకా ఎక్కువ శ్రద్ధ తీసుకోవాలి.

ఆంధ్రదేశంలో కార్టూనిస్టులందరూ మొదటిసారిగా ఓ వేదికమీద గత సంవత్సరం జనవరిలో కలుసుకున్నారు. ఇన్నేళ్లుగా ఇలాంటి నూతన ప్రయత్నం జరుగలేదు. ఇకముందు జరుగబోయే సమావేశాల్లో పిల్లల కార్టూన్ల గురించి కూడా చర్చించి పథకాలు తయారు చేసుకోవలసిన అవసరం ఎంతైనా వుంది.

బొమ్మల కథలు, కార్టూన్లవల్ల చాలా ప్రయోజనాలున్నాయి. కార్టూన్ చిత్రాలు, సినిమాలు పిల్లల్ని వుల్లాసపరుస్తూనే కళాత్మకంగా వాళ్ళకి నీతిని బోధిస్తాయి. అవి వాళ్ళ మనసుల్లో చెరగని ముద్ర వేసుకుంటాయి. అందుకే పాశ్చాత్య దేశాల్లో కార్టూన్ చిత్రాలలో కథలు చూపిస్తున్నారు. కీ. శే. వాల్ట్ డిస్నీ ఈ ప్రక్రియలో చాలా చిత్రాలు నిర్మించారు. కేవలం నీతిబోధనకే కాదు, విద్యాబోధనకికూడా కార్టూన్ చిత్రకళని ఉపయోగిస్తున్నారు. కెనడాలో ఒక ఫిల్మ్ డైరక్టరు నార్మన్ మెక్లారెన్ గణితాన్ని బోధించడానికి కార్టూన్ సినిమాలు తయారుచేశాడట. వాటితోటి చమత్కారంగా ఎక్కాలను, క్షేత్రగణితాన్ని బోధించారు. పోలెండ్‌లో ఒక నిర్మాత పిటోల్ట్ గీల్స్ జీవ పరిణామక్రమాన్ని వివరించే ఫిల్మ్ తీశారట. ఇదేవిధంగా భూగోళ శాస్త్రాన్ని, భాషా బోధనాన్ని కార్టూన్లలో



బోధించు చున్నట్లు తెలుస్తుంది. సినిమాలలో క్రొత్త పోకడలను, తనదైన ఒక పద్ధతిని శ్రీ బాపు గారు ప్రవేశపెట్టారు. ఆయన ఏపని చేపట్టినా "బాపురే" అనిపించే ప్రత్యేకముద్ర కనిపిస్తుంది. ఆయన సృష్టించిన కార్టూన్‌లు, చిత్రాలు, కలకాలం మరచి పోలేని విగా వుంటాయి. అందుకే శ్రీ ఆరుద్ర గారు-

"కొంటె బొమ్మల బాపు
కొన్ని తరముల సేపు
గుండె నూయల నూపు
ఓ కూనలమ్మా-" అన్నారు.

తెలుగు సినిమాల్లో పిల్లల గురించి పూర్తి కార్టూన్ చిత్రాలు ఇంతవరకు రాలేదు. ఈ లోటును శ్రీ బాపుగారే తీర్చాలి!

ఓ కథను గాని, ఓ వ్యక్తిని గురించిగాని చదివిందానికంటె, ఓ బొమ్మలకథ చదివితే మనసుకి పూర్తిగా హత్తుకుంటుంది. ముఖ్యంగా పిల్లలకి ఆసక్తి కలగచేయటానికి, సులభంగా అర్థం అయ్యేలా చెయ్యటానికి బొమ్మల కథలు మంచి ప్రయోజనాలు సాధించాయి. పదిహేనేళ్ల క్రితం ఎలిమెంటరీ స్కూల్ విద్యార్థుల పాఠ్య గ్రంథాల్ని నేటి పుస్తకాలతో పోల్చిచూస్తే, బొమ్మల ద్వారా పాఠాలు

బోధించటానికి విద్యావేత్తలు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్న సంగతి విదితం అవుతుంది.

తెలుగులో పిల్లల బొమ్మలకథలు చాలానే వచ్చాయి. శ్రీ విశ్వాత్మల నరసింహమూర్తి గారి మిత్రలాభం, మిత్రభేదం, శ్రీ బాపు గారి రాజు-రైతు, సుహేళీ, బంగారం-సింగారం, బుజ్జాయిగారి బొమ్మల కథలు, కొండపల్లివారి పిల్లల బొమ్మల భాగవతం, భారతం, రామాయణం. ఈమధ్య వస్తూన్న ఇండియా బుక్ హౌస్ వారి అమర్ చిత్ర కథలూ, ఇలా మంచి మంచి బొమ్మలకథలు చాలా వచ్చాయి.

ఇప్పటివరకూ తెలుగులో ప్రచురించిన బొమ్మల కథలు పరిశీలిస్తే వాటిల్లో చాలా మటుకు జానపదాలు, పురాణాల కథలే ఎక్కువ. మారుతున్న కాలాన్నిబట్టి, నేటి బాలల అవసరాల్ని దృష్టిలో పెట్టుకుని బొమ్మల కథలు రావాలి. మిగతా భాషలతో పోల్చిచూస్తే మనం ఇంకా వెనుకబడివున్నా మనిపిస్తుంది. ఈ పరిస్థితి మెరుగుపరచటానికి ప్రచురణ కర్తలు, పత్రికలు, చిత్రకారులు నడుంకట్టి ముందుకు రావాలి. నేటి బాలలే రేపటి పౌరులు. వీరిని బాధ్యత నెరిగిన మంచి యువకుల్లా తీర్చిదిద్దగల సాధనాల్లో ప్రముఖ స్థానం ఆక్రమించే బొమ్మలకథలు, కార్టూన్ లకు ఇంకా ఎక్కువ ఆదరణ, ప్రోత్సాహం లభించగలవని ఆశిద్దాం!



# కన్నడ బాలసాహిత్య మూల పురుషులు, ప్రవర్తకులు

## — ఎం.ఎస్. మహాంతయ్య

ఇంత వరకు కన్నడంలో వచ్చిన బాల సాహిత్యము చెప్పుకోనడానికి గర్వ కారణ మైనను ప్రభుత్వము, ప్రజలు, పరిషత్తులు పిల్లల కొరకై ఇంకను ఎక్కువ శ్రద్ధ తీసుకోవలసి వుంది.

అన్ని ఆధునిక సాహిత్యాలలో వలె కన్నడ మున కూడ బాలసాహిత్యం ఇటీవల విక సించినదే. ఈ బాల సాహిత్యానికి పునాదులు వేసినవారు శ్రీయుతులు చ. వాసుదేవయ్య, శ్రీనివాసరావు, ఎస్. జి. నరసింహాచార్య, ఎం. ఎస్. పుట్టన్న, శాంతకవి, వేంకట రంగో కట్టి, డెప్యూటి చెన్నబసప్ప మొదలగువారు. ఇతఃపూర్వము ఈ సాహిత్యము లేదని కాదు; కాని అది బాలలకొరకై ప్రత్యేకముగా సృష్టింపబడలేదు.

వెనుకటికి బాలసాహిత్య మంటే పెద్దలు చెప్పవలె, పిల్లలు వినవలె అనే కాలమది. కాని రాను రాను పిల్లలు తమంతట తామే చదివి అర్థము చేసుకొనువిధముగా కన్నడమున 'మక్కళ సాహిత్య' (బాలల సాహిత్యము) రూపొందింది. ముద్రణ సౌకర్యము హెచ్చి నందున కర్నాటకమున అన్ని ప్రాంతాలలోను పిల్లలకొరకై పాఠ్యగ్రంథములు వెలసినవి. అందులో నవి సచిత్రముగా ముద్రితమై చిన్నారి చిరుతల లేతమనస్సుల నాకట్టుకొన గలిగినవి. అవి సుబోధకములై సులభగ్రాహ్య ములై యుండినవి.

చ. వాసుదేవయ్యగారు పిల్లలకై రచించిన 'ఒందనెయ బాలబోధె' (మొదటి బాలబోధ) లో పిల్లి, తాను పులిజాతికి చెందిన దనుటను తలచి గర్విస్తుందని ఇలా వ్రాస్తారు :

ఎలె బెక్కె రూపి నిందలె
హులి జాతిగె సేర్దెనెందు గర్విసబేడా
బలుమెయు నిన్నల్లిహుదే
ఇలిగళ హిడివుదరొళాయ్తు నిన్నయ
శౌర్యం.

(ఓ పిల్లీ! రూపముతోనే పులిజాతికి చేరితి నని గర్వించకు. నీలో పరాక్రమమున్నదా? ఎలుకలను పట్టుటయందే నీ శౌర్యము కన పడును.) ఇలాంటివే చిన్నచిన్న విషయాలను గూర్చి రచించిన పద్యము లెన్నో కలవు.

మరికొన్ని రచనలలో మాధుర్యము, లలిత పదముల సోయగము, అర్థగాంభీర్యమున్నను, వానిని రచించిన కవుల విషయము తెలియ రాకున్నది. 'గోవినహాడు' (గోవు పాట) నెవరు రచించిరోకాని, అది పిల్లలను, పెద్దలను చాల ఆకర్షించినది. ఇది సరళమైన పద్యముల రచింపబడిన చిన్ని పుస్తకము.

అంబా యన్నది తువ్వాయి
అమ్మను జేరెను తువ్వాయి
పాలను త్రావెను తువ్వాయి
పరుగులు దీసెను తువ్వాయి
పొంగుచు లేచెను తువ్వాయి
చెంగున దూకెను తువ్వాయి
వంపులు తిరిగెను తువ్వాయి.
తువ్వాయే మా కానందం
తూరుపు రేఖలు అనందం!

-వేజెండ్ల సాంబశివరావు

మేతకై వెళ్ళిన పుణ్యాకోటి అను అవును పులి యొకటి అడ్డగిస్తుంది. పుణ్యాకోటి దూడను అడిగి వస్తానని బాసచేసి పులి అనుమతితో తన దూడవద్ద కేతెంచి పాలిస్తుంది. దూడ తల్లిని పోవద్దంటే, తల్లియైన పుణ్యాకోటి 'అడిన మాటను తప్పజాలను' అని చెప్పుతూ-

సత్యవే నమ్మ తాయి తందె
సత్యవే నమ్మ సర్వ బళగవు
సత్యవాక్యకె తప్పినడెదరె
మెచ్చనా జగదీశను.

(సత్యమే మన తల్లి, తండ్రి, బంధుజనంబులు. సత్యవాక్యము మీరి నడచిన ఆ జగదీశ్వరుడు కూడ మెచ్చుకోలేడు.) అని తనబిడ్డకు బోధించి పులిచెంతకు వెళ్ళిపోతుంది. అచట పులి పుణ్యాకోటి రాకను చూచి, దాని సత్యసంధతకు మెచ్చుకొని, తానే చనిపోతుంది. త్రిమూర్తులు పుణ్యాకోటిని, పులిని దీవిస్తారు. శివుడు పులితోలును ధరిస్తాడు. మోక్షమును ప్రసాదిస్తాడు.

**Catch them yonng** అను మనస్తత్త్వము ననుసరించి, నీతి, ధర్మము, సత్యము, అహింస మున్నగువాటిని బోధించుచు పిల్లలను మంచి నాగరకులనుగా మలచు ఉద్దేశముతో నిటువంటి కృతులెన్నో కన్నడమున రచింపబడినవి. ఈ రచించినవారిలో జ్ఞాతులతోపాటు, అజ్ఞాత కవులుకూడ వున్నారు పై నిరూపింపబడిన గోవుపాటను రచించిన కవి అజ్ఞాతుడే! పిల్లల మనస్తత్త్వముననుసరించి వారిలో ధైర్యసాహసములను ప్రేరేపించుటకై దేశ విదేశాలలోని వీరుల-అందునా బాలవీరుల-కథలను, కవితలను, నాటికలను అనేకులు రచించినారు. వారిలో పంజె మంగేశరావు, ఎం ఎన్. కామత్, హొయ్సళ, అశ్వత్థనారాయణ, డి. కె. భారద్వాజ్, దేవుడు నరసింహశాస్త్రి, కోట శివరామ కారంతు, జి. పి. రాజరత్నం, కువెంపు, ఆర్. నరసింహాచార్, ఎన్. కస్తూరి, పద్మా నాడిగ్ మొదలగువారిని పేర్కొనవచ్చును.

పంజె మంగేశరావుగారి 'నాగరహావె హావొళు హూవె' అను పద్యము చాల మనోహరమైనది. 'ఇలిగళ తక్కధై', 'గుడుగుడు గుమ్మటదేవరు' మొదలైన కథలను పిల్లల కొరకే రచించిరి. మంగళూరులో 'బాల సాహిత్య మండల' అను సంస్థను స్థాపించి, పిల్లల సాహిత్యసృష్టికి దోహదమొనర్చిరి. పంజె వారి వలె కామతుగారు గూడ పిల్లలకొరకై పద్యములు, కథలు రచించినను, వారి నాటకములే ఎక్కువ బాలాదరణ నొందినవి. వారి నాటకములు రంగప్రయోగమున పర్యవసానమొందెనేకాని, పుస్తకరూపము దాల్చలేదు. హొయ్సళగారి రచనలు కూడ చాల ముద్దయినవి. పిల్లలకు ముద్దుముద్దుగా కథలు, పద్యములు చెప్పుటలో హొయ్సళగారిది అందె వేసిన చేయి; వారు 'మగువిన కూగు' వంటి పద్యములే కాక, 'హూవిన హాసిగె', 'పరీక్ష'

'పోరి', 'పుట్టరసు' మొదలగు కథలను, 'వాతాపి', 'కళ్ళ-సుళ్ళ-మళ్ళ' మొదలగు నాటకాలను రచించినారు.

హొయ్సళ గారి రచనాకాలమందే అశ్వత్థ నారాయణ అనువారు పిల్లలకొరకై 'మక్కళ పుస్తక' అను సచిత్ర మాసపత్రికను ప్రకటింప దొడగిరి. ఇది కన్నడ బాల సాహిత్యమున గొప్పగా పేర్కొనదగిన మార్పు అనియే చెప్పవలెను. ఈ 'మక్కళ పుస్తక'మునకు భారద్వాజ, దేవుడు గారలు సంపాదకులై పిల్లలకు అతి రంజకములైన కథలను, కవితలను సంగ్రహించి ప్రకటించి, బాలసాహిత్యాభివృద్ధికి దోహదమొనర్చిరి. పిల్లల పత్రికలు తరువాత విరివిగా వెలసినవి. 'నమ్మ పుస్తక', 'కనక', 'చందమామ', 'బాలమిత్ర' మొదలగునవి పిల్లలకొరకై ప్రచురితమైన పత్రికలు. వీనిలో చందమామ, బాలమిత్రలు వచ్చినప్పటినుండియు పిల్లలలో స్వయముగా చదువు అభిరుచి పెరిగినది. వానియందలి సరసమైన కథలు, కథల కనుగుణమైన రంగురంగుల చిత్రములు, ముద్దులు మూటగట్టు ముఖపత్రము-పిల్లలనేకాక, పెద్దలనుకూడగొప్పగా ఆకర్షించుచు నేటికిని మన్నన లందుకుంటున్నవి.

ఇప్పుడిప్పుడే పిల్లలకొరకై వారపత్రికలలో కూడ ప్రత్యేక పుటలు కేటాయింపబడుతున్నవి. అందు ప్రచురింపబడు 'బాల విహార' పిల్లల అభిరుచికి తగినవిధంగా రచింపబడిన కథ, కవితలతో వెలుగొందుతూ వుంటుంది.

ఇవికాక పిల్లలకొరకే రచించిన ఉద్గ్రంథములున్నవి. శివరామ కారంతుగారు 'బాల ప్రపంచ' అను ఉద్గ్రంథమును మూడు సంపుటాలలో సుమారు మూడు దశాబ్దముల క్రితమే రచించి ప్రసిద్ధి గాంచినారు. వారి ఈ కృతులు



సచిత్రములు. ఇదొక విజ్ఞాన కోశము. ఇందలి విషయములు పిల్లలకు సులభగ్రాహ్యములు. కారంతుగారు తరువాత ప్రకటించిన 'విజ్ఞాన ప్రపంచ' నాలుగు సంపుటములు కూడ పిల్లలకు - ఇవి పెద్దలకొరకే రచింపబడినను - ఉపయుక్తములని చెప్పక తప్పదు. శివరామ కారంతుగారు పిల్లలకొరకు 'ధంధంధోలు' మొదలైన శిశుగీతములను, 'గజరాజ' మొదలగు కథలను కూడ రచించినారు. వారు తమ స్వస్థానమగు పుత్తూరులో స్థాపించిన 'మక్కళ కూటము' (బాల సమూహము) అను స్మరించదగును. వారు పిల్లలలో పిల్లలై వారికై నాటకాలను రచించి ఏటేటా జరిగే మక్కళకూటలో ఆడించిరి. పిల్లలలో సాహిత్యాభిరుచిని రేకెత్తింపజేసిరి. తరువాత వారు పిల్లలకొరకై 'విచిత్ర ఖగోళ', 'నమ్మ భూఖండగళు' అను చిరుపొత్తముల ప్రకటించిరి. వారు పిల్లల

సం క్రాంతి కో
నాటకం వేస్తాం.
ఏమేమిటి వేషాలు!
గంగెద్దు దాసుడూ
సాతాని జియ్యరూ
వీరంతా వేషాలే!
ఇంతేనా?
గొబ్బి తట్టే
చెల్లెమ్మలూ
చద్దిపెట్టే
అక్కయ్యలూ
అందరూ వేషాలే!
ఇదే నాటకం
సంక్రాంతి నాటకం!

-పాతూరి శ్రీరామశాస్త్రి

కొరకు రచించిన 'నాగరికతియ హాస్తిలిల్లి' అను గ్రంథమును మైసూరు విశ్వవిద్యాలయము ప్రకటించినది. ఇప్పుడిప్పుడు ప్రభుత్వ సహాయ సహకారములతో పిల్లలకొరకు ప్రత్యేకముగా 'జ్ఞాన గంగోత్రి' అను ఏడు సంపుటముల విశ్వకోశము వెలువడినది. ఇంకను ఇతర గ్రంథములు వెలువడుచున్నవి.

కారంతుగారి తరువాత శిశుసాహిత్య రచనలో పేర్కొనదగినవారిలో జి.పి. రాజరత్నం, కువెంపు గారలు ముఖ్యులు. జి పి. రాజరత్నం గారు పిల్లలకొరకై తుత్తూరి, కడలెపురి, చుటక, గులగంజి, కెనెహాలు, కల్లుసక్కరె, కోళికళ్ళ, మెరివణిగె, తారె, రసకవళ మొదలగువానిని రచించి నాలుగు దశాబ్దములు గడచియుండవచ్చును. ఐనను పిల్లలకు అవి నేటికిని ప్రియమైనవి. మచ్చుకు వారి 'చుటక' పుస్తక మందలి 'నాయమరి' కవితను చూడవచ్చును. చిన్న పాప కుక్కపిల్లను 'తిండి కావాలా? ఎందుకు? ఏం జేస్తావు?' అని ప్రశ్నిస్తే, తాను "తిండి తిని, సత్త్వశాలినై ఇంటిని కాపాడుతాను, దొంగ వస్తే 'భౌ' మంటాను" అని కుక్కపిల్ల బదులు చెప్పుతుంది.

నాయమరి! నాయమరి!
తిండి బేకె?
తిండి బేకు! తీర్థ బేకు!
ఎల్ల బేకు!
నాయిమరి! నినగె తిండి
ఏకె బేకు?
తిందు గట్టియాగి మనెయ
కాయ బేకు!
నాయిమరి! కళ్ళ బంద
రేను మాడువె?
లొళ్! లొళ్! భౌ! ఎండు
కూగి యాడువె!
జాణమరి! తాళు! హోగి
తిండి తరువెను
తా! నిన్న మనెయ నాను
కాయు తిరువెను.

ఇదే విధంగా కువెంపుగారు కూడ పిల్లలకొరకై కొన్ని చిరుపొత్తములను రచించి, ప్రకటించినారు. కువెంపు కర్నాటకమున నేడు గొప్ప కవి; వారి 'శ్రీరామాయణ దర్శనం' గ్రంథరాజమునకు జ్ఞానపీఠ ప్రశస్తి లభించినది. అట్టి వారు కూడ పిల్లలను మరువలేదు. వారు రచించిన బాలసాహిత్యములో పేర్కొనదగినవి "నన్నగోపాల, నన్నమనె, మరి విజ్ఞాని, మోదణ్ణన తమ్మ, మేఘపుర మొదలగునవి. స్వాతంత్ర్య సమరకాలమందు పెద్దలు భారత

మాత దాస్యశృంఖలాలను త్రెంచుటకు యత్నించుచుండ, కవి పిన్నలను కూడ దేశ సేవకై కంకణబద్ధులు కండి అని ఉద్బోధించు కవితను రచించారు. వారు రచించిన 'ఏళిరై బాలరే' (లేవండి బాలులారా) అను కవితలో ఈ భావము వీరోచితంగా నిరూపితమైనది.

ఏళిరై ! బాలరే ! దేశసేవెగై యువ !
కేళిరై ! కేళిరై ! తాయ గోళ రోదన !
పరకీయర పదతళదొళు
హోరళాడుత అళుతిరువళు !
కండు నీవు సహిపరే ?
గండుగలిగ కల్లవే !

వీరేకాక ఇంకను ఇతరులు బాల సాహిత్యాభివృద్ధికి ఎంతగానో శ్రమిస్తున్నారు. మైసూరువైపు కల్యాణమ్మగారు 'మక్కళ కూట' నొకదానిని స్థాపించిరి. వాని శాఖలు అనేకచోట్ల కలవు. బెంగళూరు శాఖ బాలల సంఘము (మక్కళకూట) "నమ్మ బావుట" అను మాసపత్రికను ప్రకటిస్తున్నది.

పుస్తక రచన ఒక ఎత్తు, ప్రకటన మరొక ఎత్తు. సాధారణంగా పిల్లల పుస్తకాలను ప్రకటించుటకు ప్రకాశకులు జంకుచుండురు. ఐనా కొందరు ప్రకాశకులు ధైర్యంగా ముందుకు వచ్చి పిల్లలకొరకు రచితమైన చిరుహొత్తము లను ప్రకటించియున్నారు. అందు పేర్కొనదగినవారు - సత్యశోధన ప్రకటన మందిర- బెంగళూరు, దక్షిణభాషా పుస్తకసంస్థ, సత్యాశ్రయ ప్రకాశన మందిర-హైదరాబాదు, బాల సాహిత్యమండల - మంగళూరు, శిశుసాహిత్య సంఘ - మైసూరు, ధారవాడులోని రామాశ్రయ పుస్తకాలయ, సమాజ పుస్తకాలయ, ఐ. బి. హెచ్. పబ్లిషింగ్ కంపని-బొంబాయి, కర్నాటక సహకారీ ప్రకాశన మందిర - ధారవాడ; రాష్ట్రోత్థాన సాహిత్య ప్రకాశన-బెంగళూరు మొదలగువారిని పేర్కొనవచ్చును. రాష్ట్రోత్థానవారు పిల్లలకొరకై 'భారత-భారతి' పుస్తక సంపద అను పేర అనేక చిరుహొత్తములను పిల్లలకై అందమైన ముద్రణతో రంగురంగుల బొమ్మలతో ప్రకటించియున్నారు. ఇప్పటికిని ప్రకటిస్తున్నారు.

ఇంతవరకు కన్నడంలో వచ్చిన బాలసాహిత్యము చెప్పుకొనడానికి గర్వకారణమైనను, ప్రభుత్వము, ప్రజలు, పరిషత్తులు పిల్లలకొరకై ఇంకను ఎక్కువ శ్రద్ధ తీసుకొనవలసివుంది. భారతీయ, విదేశీయ భాషలలోని బాలల సాహిత్యము సాధ్యమైనంతగా కన్నడమున వెలసిన అది కన్నడ భాషకు, సాహిత్యమునకు వన్నె తేగలదనుటలో సందియము లేదనిపించును.



# పాల పాటలు

**-కవిరావు**

ఈ ప్రపంచంలోకి వచ్చిన బిడ్డలో తన ప్రతిబింబాన్ని దర్శించుకునే తల్లి హృదయం ప్రేమకు ప్రతీక. ఆ ప్రేమ చిందిన మధుర క్షీరాలే పాల పాటలు. అవే బాల గేయాలు.

అప్పుడే కన్నులు తెరచిన పసికందుకు తొలుత కనిపించేది అమ్మ ముఖం, ఆమె స్పర్శ. ఆ తర్వాత ఆమె కంఠధ్వని. అంతట ఈ ప్రకృతిని చూడ నారంభించి అవ్యక్తమైన చిద్విలాసంలో మునకలాడుతుంది. రోజుకు రోజు పాపాయిలో వచ్చే క్రమానుగతమైన ఈ మార్పులను మన సంస్కృతి స్రవంతిలో మిళితం చేయటానికి మనం చేసే ప్రయత్నాలకు పాలగేయాలు మధురమైన ఆలంబనాలు. పాప పలుకులకు పాలపలుకులు ప్రదీపనం ఇస్తాయి. ఆ పలుకులకు అర్థం పర్థం వుండక పోయినా, అవ్యక్తానందం అందులో తొణికిస లాడుతూ వుంటుంది. అపారమైన ఆ ఆనందం పొందే సొంపు సోయగాలను అభివ్యక్తం చేసే పాలపాటల్ని గురించి చెప్పకోవటంకూడా పాపల్ని యెత్తుకొని ముద్దాడుతున్నట్లే ఉంటుంది. అందుకే-

'ఆడంగ ముద్దు, పాడంగ ముద్దు
నట్టింట పాపాయి, నడయాడ ముద్దు"

అన్నారు. అనటమేకాదు :

"అమ్మనన్న ముద్దును యేమన్నారూ?
అచ్చనావుల పాలన్నారు
అప్పుడె కాచిన నెయ్యన్నారు
దోరగ వేగిన గారన్నారు".

పాలగేయాల్లో ఉండేవి రెండే రెండు ప్రధానమైన పాత్రలు. అవి తల్లీ, బిడ్డ. తల్లి యొక్క హృదయానురాగం ప్రతి అణువున ఈ పాల గేయాల్లో ప్రతిధ్వనిస్తూ వుంటుంది. తన రక్తమాంసాలను పంచుకొని తన మధుర దుగ్ధాన్ని చేదుకొని తన కలలకు రూపంగా ఈ ప్రపంచంలోకి వచ్చిన బిడ్డలో తన ప్రతిబింబాన్ని దర్శించుకొనే తల్లి హృదయం ప్రేమకు ప్రతీక. ఆ ప్రేమ చిందిన మధుర క్షీరాలే పాలపాటలు; అవే బాలగేయాలు. చిట్టిచిట్టి గేయాలు పాడుతూ బిడ్డను మురిపించాలనే ఆమె ప్రయత్నం భాషకు, భావానికి అతీతంగా నాట్యం చేస్తుంది. చూడండి-

"ఊఁ! ఊఁ! ఉంగన్న
ఉగ్గూ పాలూ ఇందన్న
ఊక ఊక! ఉద్ధరణి
గంటెడు ఉగ్గు కమ్మన్న..."

ఈ గేయంలో భాషాలేదు భావంలేదు. కాని ఈ రెంటిని మించిన తల్లి హృదయ దర్పణం ప్రతిఫలిస్తుంది. బిడ్డను ఆడించే ఆనందంలో ఆ

తల్లి తనకు తెలిసిన దంతా తన బిడ్డకు కూడా తెలియాలని తనకు తెలియకుండానే అవ్యక్త ప్రయత్నం చేస్తుంది. విసవిస చేతులు ఊపలేని బిడ్డను చూచి చేతులు ఊప మంటుంది. చూడండి-

"చెయి వూచమ్మా చెయి వూచు
సంతకు పోదాం చెయి వూచు
శనగలు తెస్తాం చెయి వూచు
చల్లగ తిందాం చెయి వూచు"

అని గులాబి మొగ్గలవంటి చేతుల్ని తట్టుతుంది. తన బిడ్డకు కించిత్తు ఆపద వాటిల్లినా ఆ మాతృ హృదయం సహించలేదు. అందుకే ఏ ఆపద రాకుండా తన బిడ్డని కాపాడుమని కోటి దేవుళ్లకు మ్రొక్కుతుంది.

"హాయీ! ఓయీ! ఆపదలు గాయీ
చిన్నవాళ్లనుగాయి శ్రీరంగశాయీ!"

అని ప్రార్థిస్తుంది.

ఇలాగా ఉదయం నిద్రలేచింది మొదలు తిరిగి రాత్రి తన ఒడిలో నిద్రపోయేవరకు క్షణ క్షణం బిడ్డకు తాను చేసే సపర్యలలో యేదో పాట పాడుతూ ఆ బిడ్డతో మాటలాడుతూనే వుంటుంది.

తలగడిగి నీరు పోస్తూ
"ఆయోసి పాయోసి, వేడినీళ్లు
వెచ్చగ పోసి
చల్లని నీళ్లు మెల్లగ పోసి, అమ్మకడుపు
చల్లగ
అత్తకడుపు చల్లగ తలకడుగు తలకడుగు
తాండవకృష్ణ!"

అలా ఆవిరి వచ్చే నీళ్లు పోసి సొమ్మసిల్లిన బిడ్డను ఊయల్లో వేసి,

"ఉయ్యాలోయ్, దంబాలోయ్
ఊగూగు బిడ్డా ఉయ్యాలోయ్"



అని ఉయ్యాల ఊపుతుంది. బిడ్డ పడుకోకపోతే ఒక జోలపాట పాడుతుంది.

నిద్రలేచిన పాపకు కలిపి పాటతోనే పాలు త్రాగిస్తుంది. "గోరు ముద్దలు గోలుసుల ముద్దలు" అందిస్తుంది. అయితే ఆటలు మరిగి అన్నం తిననప్పుడు ఆటలతోటే అన్నం పెడుతుంది. ఆటల్లో అందివచ్చే మామయ్య చందమామయ్యేగా!

"చందమామ రావె జాబిల్లి రావె
కొండెక్కి రావె కోటివేలు తేవె
పరుగు పరుగున రావె పాలు వెన్న తేవె
పసిడిగిన్నెలో పాలు పోసుకొని
అట్టట్టా వచ్చి అబ్బాయికియ్యవే!"

తల్లి ప్రేమలో పెరిగి తనంత తాను నడిచి ఆటలాడుకొనే బిడ్డకు వ్యక్తిత్వం తనంత తానే రూపొందుతుంది. అప్పుడు తానే ఒక కవి అవుతాడు, ఒక గాయకుడవుతాడు, ఒక చిత్రకారుడవుతాడు. వచ్చీరాని మాటలతో తనకు తానే పాటలు కడతాడు. ఆ మాటలకు తానే సరిగమలు తెలియని సంగీతపు బాణీలు కట్టుకొని పాడతాడు. బొగ్గు కనపడితే గోడల నిండా బొమ్మలు గీస్తాడు. ఆ చిన్నారి లేత హృదయంలో తొణికిసలాడే పాటలు చూడండి:

తెలుగు దేశపు
తెలుగు పిల్లలు
తెలుగు వెలుగు లండి
తెలుగు బాలురు
తెలుగు బాలికలు
తెలుగు సొమ్ములండి
తెలుగు తోటలు
తెలుగు బాటలు
తిరుగుచు గనరండి
తెలుగు సీమల
ఆట పాటలు
తెలియగ వివరండి.

-"బాలన్నయ్య"

"ఉడతాఉడతా ఊత్, ఎక్కడకెళ్లావూత్"
"నూకలుపెడతా, మేకలు కాస్తావ్?
పెద్దపులొస్తే జడవవు కా?"
"విద్దెం విద్దెం వీసెడు నెయ్యి,
విద్దెము చేస్తే గిద్దెడు నెయ్యి"
"ఊగూ ఊగూ బసవన్న!
ఉలవలు తినరా బసవన్న"
"తాతా పీతా ముంజకాయ మూత"

ఇలా ఎన్నో పాటలు. ఇక ఆటలాడుకొనే యీడు వచ్చిన పిల్లలు పదిమంది చేరితే వాళ్లతో పాటు ఆడుకొనే పాటలు కోకొల్లలు. ఆట వస్తువులకు కూడా వాళ్లకు కొదవలేదు. చీపురు పుల్లా, చిత్తుకాగితం, వీథిలో దొరికే దుమ్మూ ధూళీ కూడా వాళ్ల ఊహాల్లో ఆటవస్తువులుగా అమరిపోతాయి. వాటితో వారు మరో ప్రపంచాన్ని సృష్టించుకొని మహదానందాన్ని అనుభవిస్తారు. దోసెడు దుమ్ముపోసి అందులో చీపురుపుల్ల దూర్చి రెండుచేతులతో కప్పి "దూదూ పుల్లా దురాయి పుల్లా" అని పాడుతూ ఎదుటివానిని ఆ పుల్ల ఎక్కడుందో కనుక్కోమంటారు. అలాగే "తొక్కుతొక్కుబిళ్ల తొక్కొంగ బిళ్ల" మొదలైన ఆటలకు సంబంధించిన పాటలు ఎన్నో వున్నాయి. అలాగే పండగలకు సంబంధించిన పాటలు కూడా. పండగల ఆనందాన్ని పెద్దవాళ్లు దైవపరంగా భావిస్తే పిన్నవాళ్లు వేడుకలుగా ఆనందిస్తారు.

"దిబ్బూదిబ్బూ దీపావళి,
మళ్లీ వచ్చే నాగుల చవితి"
"అట్లతద్దోయ్, ఆరట్లోయ్,
ముద్దపప్పోయ్ మూడట్లోయ్"

అలాగే గొబ్బి పాటలు, దసరా పాటలు యెన్నో ఉన్నాయి.

పిల్లలకు వేళాకోళమన్నా, వెక్కిరింత అన్నా భలే సరదా. చుట్టపక్కాలమధ్య, హితులు స్నేహితులమధ్య, అక్కచెల్లెండ్ర మధ్య, అనురాగాన్ని, ఆప్యాయతను అన్యాపదేశంగా పెంపొందిస్తూ సున్నితమైన వేళాకోళమును, ధ్వనిప్రధానమైన వెక్కిరింతలు దోబూచులాడే పాటలు ఎంతో ముచ్చట గూర్చుతాయి.

"బావా బావా! పన్నీరు,
బావను పట్టుక తన్నేరు"
"వదెనా వదెనా, వల్లంకి పిట్టా!"

మొదలైనవి.

బాలసాహిత్యంలో ముఖ్యమైన యీ పాలసాహిత్యం రెండు ప్రయోజనాలని సాధించాలని, కేవలం వినోదమే కాక విజ్ఞానలేశం కూడా దానిలో ఉండాలని మనపూర్వులు భావించారు. ఒక పాట చూడండి-

"ఎండలు కాసే దెందుకురా
మబ్బులు పట్టేటందుకురా

మబ్బులు పట్టేదెందుకురా
వానలు కురిసేటందుకురా"



ఇలా దీన్ని పిల్లల సాహిత్యంగానే గాక తల్లుల సాహిత్యంగాకూడా తీర్చిదిద్దారు. ఆ దిద్దటంలో గృహవైద్యం చిట్కాల రూపంలో చక్కగా కుదురుకొంది. ఇటు వైద్యమే గాక మన సంస్కృతికి మూలకందాలైన భారత రామాయణాది మహాగాథలను, కథనే గాకుండా ఆ కథలోని సందేశాన్ని కూడా చిన్నిచిన్ని పాటలలో యిమిడ్చి పిల్లలకోస మని తల్లుల కందించారు. ఉదాహరణకు ఒక్కపాట-

"జగతిపై రామయ్య జన్మించినాడు
సత్యమును లోకాన స్థాపించినాడు
తల్లిదండ్రులమాట చెల్లించినాడు
ఇల్లాలితోపాటు హింసపడ్డాడు
అయోధ్యరామయ్య అన్నయ్య మాకు
వాలుగన్నుల సీత వదినెమ్మ మాకు"

ఇలాగా అనుశ్రుతమైన బాలసాహిత్య సంపద గృహారామంలో గూడు కట్టుకొని, నాయనమ్మల పుక్కిళ్లలోనుంచి ఆ తరంనుండి ఆ తరానికి, ఆ తరంనుండి మరో తరానికి ఉరకలు వేస్తూ, బాగా మాగిన ఊరగాయ పచ్చళ్లవలే ఎప్పటికప్పుడు చవులూరిస్తూ చిరంజీవిగా ఉంది. దీనికి పుస్తకాలు లేవు. అనంత కాలవాహినియే దీనికి చెరగని పుస్తకం. సంప్రదాయమే దీనికి తరగని కళ. మాతృహృదయమే దీని జీవకళిక. నాయనమ్మలే దీనికి సజీవ భాండారాలు. అవిచ్ఛిన్నమైన భారతీయ సాంసారిక జీవన రంగమే దీనికి పాలధార. వేదాలు శ్రుతములు. పాలగేయాలూ అంతే!

సంప్రదాయం మన జీవగఱ్ఱ. అందుకు అనుగుణమైన సాహిత్యమూ అంతే. మనకు మన సంస్కృతికి దర్పణం పట్టే సాహితీ స్రవంతి మనందర్ని సాకుతూనే ఉంది. అట్టి స్రవంతిలో పుట్టి పెరిగిన ఆధునిక బాల గేయకారులు కూడా చిన్నారి లోకాన్ని చివురింపజేస్తున్నారు. ఆధునికులలో కొందరు రాసిన బాలగేయాల్ని తడిమిచూచినట్లయితే, తేనెల్ని చిల్కరించే కమ్మని గేయసాహిత్యం దొరుకుతుంది. తగినంత ప్రచారం ఉంటే వీటి భావం కూడా బాలలపై విశేషంగా ఉండవచ్చు. పూర్వసాహిత్యపు విలువలకు యేమాత్రం తీసిపోనివి వీటిలోనూ ఉన్నవి. వీరేశలింగం మొదలు యిప్పటివరకు ఎందరో ఆధునిక బాలసాహిత్యకారులు కలం పట్టి చిన్నారి లోకానికి చిరుమల్లెల్ని కురిపిస్తున్నారు. ఈనాడు బాలవాఙ్మయం బహుముఖంగా విస్తరిస్తున్నా, నర్సరీ గీతాలు రాసినవారు బహు కొద్దిమంది మాత్రమే ఉన్నారు. ఇలాంటి వారిలో చింతా దీక్షితులుగారే మొదటివారన వచ్చును. పెద్దవారికి రచనలు చేసే మహామహులెందరో, మధ్యమధ్య కొన్ని నర్సరీపాటల్ని కూడా రాసి బాలలోకాన్ని అలరించారు. అట్టివారిలో వెంకట పార్వతీశ్వర కవులను మొట్టమొదటగా పేర్కొనవచ్చును. ఇట్టివారు యింకా ఎందరోఉన్నా వారివందరినీ యిక్కడ పేర్కొనలేము. అత్యాధునికుల్లో శ్రీయుతులు

న్యాయపతి రాఘవరావు, ఏడిద కామేశ్వర రావు, మిరియాల రామకృష్ణ, కె. సభా, బి. వి. నరసింహారావు, వేజండ్ల సాంబ శివరావు, అలపర్తి వెంకట సుబ్బారావు, బాలాంత్రపు రజనీకాంతరావు, రెడ్డి రాఘవయ్య, శ్రీమతి జి. ప్రభావతి, మొదలైనవారు మంచిమంచి నర్సరీ పాటల్ని రాసి బాల లోకాన్ని అలరిస్తున్నారు. వీరందరికి బాలలతో ప్రత్యక్ష సంబంధం ఉండటంచేత శిశు హృదయాలను ఇట్టే ఆకట్టుకొనే నర్సరీ పాటల్ని రాశారు. కుమారి దేవకి లాంటి వారు యీ సాహిత్యాన్ని పరిశోధించి పరిశోధక వ్యాసాలు రాస్తూ ఈ సాహిత్యానికి విశ్వవిద్యాలయ స్థాయి కల్పిస్తున్నారు. వీరందరు ధన్యులు. నే వ్రాసిన ఒక నర్సరీ గీతంతో యీ వ్యాసాన్ని ముగిస్తున్నాను :

"తువ్వాయి మెడలోన-మువ్వలున్నాయి
మువ్వల్ల కడుపులో-రువ్వలున్నాయి;
రువ్వల్లు కదిలితే, మువ్వల్లు పాడు
మువ్వల్లు పాడితే, తువ్వాయి ఆడు!"



# బౌద్ధ, జైన యుగాలలో బాలల శిక్షణా పద్ధతులు

— కొరిడె కమలా రఘుపతిరావు

సోదాహరణ లిపిని, చిత్ర లిపిని ఇప్పుడు బోధన పద్ధతిలో ప్రవేశపెట్టిన అ - అమ్మ, ఆ - ఆవు అని నేర్పే తీరుకూ ప్రాచీన సంప్రదాయమే ప్రాతిపదిక.

"జం జం ఆలిహాఇ మణో
ఆసావట్టీహి హి అల ఫలఅమ్మి,
తంతం బాలోవ్వ విహీ
ణిహులం హాసిఊణ పమ్మునఇ."

గా. స. 7-56.

"హృదయమనే పలకమీద ఆశావర్తికతో (రంగు బలపముతో) మనస్సు ఏదేదో వ్రాస్తూ పోతుంది. ఆ వ్రాతను చిన్నిపిల్లవాడు ముసి ముసి నవ్వులతో ఏమాత్రము సందేహించక తుడిచిపెట్టినట్లు విధి తుడిచివేస్తాడు. మనో లిపికి బ్రహ్మలిపికి అక్కడనే భేదము. 'గాథా సప్తశతి' అనే ముక్తక గ్రంథములోని ఈ ప్రాకృతగాథ, చిన్నపిల్లల విద్యాభ్యాసము-వారి చేతిలోని పలకా, బలపము, వారి ప్రవృత్తి, ఆటపాటలను, చిలిపి చేష్టలను, బల పపుపిండి వారి చేతులకు, ముఖానికి పూసు కున్న చిత్రాన్ని మన కన్నుల ఎదుట నిలుపు తుంది. ప్రాచీన కాలములోని బోధనపద్ధతిని తెలిపే ఘట్టాలను దిఙ్మాత్రముగా బౌద్ధ సాహి త్యమునుండి చూపించడానికే నా యీ ప్రయత్నము.

లలితవిస్తరము :- క్రీ. పూ. ఒకటవ శతాబ్దానికి చెందిన ఈ బౌద్ధ సంస్కృత గ్రంథము మహాయాన బౌద్ధ సంప్రదాయములో రచితమైన గౌతమబుద్ధుని జీవితచరిత్ర. ఒక విలక్షణమైన శైలి ఈ గ్రంథానికున్నది. లలితముగా, చదువరులకు సులభగ్రాహ్యముగా ఉండడం వలన దీనికి లలితవిస్తరమనే పేరు వచ్చి ఉంటుంది. ఈ గ్రంథములో "లిపి శాలా సందర్శన పరివర్తం" అనే అధ్యాయములో బోధిసత్త్వుడు విద్యాభ్యాసము చేయడానికి "లిపి శాల"కు (లిపులు నేర్పే శాలకు) బయలుదేరి పోతాడు. ఇతనిని మంగళవాద్యములతో పది వేలమంది బాలులు వెంటరాగా, పదివేల రథములలో ఖాదనీయ, భోజనీయ, స్వాదనీయ సామగ్రిని (భోజనాన్ని, పిల్లల కిష్టమైన చిఱు తిండిని), హిరణ్య సువర్ణములను వెంటయిచ్చి పంపిరట. మహావైభవముతో ఆ పిల్లల గుంపు సాగి లిపిశాలను చేరుకున్నది. విశ్వామిత్రుడను గురువు వారందరికి విద్యారంభము చేయబూనగా, బోధిసత్త్వుడు ఉరగసారచందన మయమైన (చందనపు చెక్కతో చేసిన) పల

> నేడే బాలల దినం
> నెహ్రూ పుట్టిన దినం
> భావి పౌరులంతు నెహ్రూ కిష్టం
> ఆయన పేరును నిలుపుట మన అభీష్టం!
> -గోవిందరాజు రాజ్యలక్ష్మి

కను చేతికి తీసుకొని దివ్యమైన, రత్నఖచితమైన బంగారపు ముక్కాలి పీటమీద కూర్చున్న ఆచార్యు నుద్దేశించి "ఆచార్యా, బ్రాహ్మి, ఖరోష్ఠి, పుష్కరసారీ మున్నగు అరువదినాలుగు లిపులలో నా కే లిపిని మీరు నేర్పెదరు?" అని ప్రశ్నించెను బోధిసత్త్వుడు చెప్పిన అరువది నాల్గు లిపుల పేర్లు విని గురువు ఆశ్చర్యపడి తనను మించిన శిష్యునికి తానేమి నేర్పగలనని విచారించి, అయినను వృత్తిధర్మానుసారము అబాలకులకు మాతృకలను(వర్ణమాలను)నేర్పించడం ప్రారంభించెనట. దాదులు, పరిచారికలు ఆ లిపిశాలలో ఒకవైపు ఒదిగి ఉండగా ఆచార్యుడు బోధిసత్త్వునికి పాఠము ప్రారంభించెనట. "యదా అకారం పరకీర్తయంతి స్మ అనిత్యః సంస్కార శబ్దో నిశ్చరతి స్మ, ఇకారే ఇంద్రియ వైకల్యశబ్దః, ఈకారే ఈతి బహులం జగదితి". (అ-అనిత్యము లీ ప్రపంచములోని సంస్కారములు. ఆ-ఆత్మ పరరహితము-ఇతరుల కొరకే మనిషి. ఇ-ఇంద్రియములు చెప్పినట్లు వినవు. ఈ-ఈతిబాధలు ప్రపంచములో ఎక్కువ).

ఈ విధముగా మొదలుపెట్టి 'అ' నుండి 'క్ష' వరకు ఉన్న అక్షరాలద్వారా (సంస్కృత వర్ణమాలలో "క్ష" లేదు. దీనిని సంయుక్తాక్షరముగానే గ్రహించిరి.) బౌద్ధ ధర్మోపదేశ వాక్యములను ఈగ్రంథము నిక్షేపము చేసినది. శంకర భగవత్పాదులు కూడా ఇట్లే "సాంబ సదాశివ శంభోశంకర శరణం మే తవ చరణయుగం" అనే మకుటముతో సువర్ణమాలా స్తవాన్ని అకారాది అక్షరములతో ఆరంభము చేసి "శాదిర్న హి ప్రయోగః తదంతమిహా మంగళం సదాఽస్తు విభో" శకారముతో ఏపదము మొదలుకాదు. తదంతమైన 'మంగళ' శబ్దముతో ఈ రచనను ముగిస్తున్నాను. మంగళమగు గాక) అని ముగించిరి. సోదాహరణ లిపిని, చిత్రలిపిని ఇప్పుడు బోధన పద్ధతిలో ప్రవేశ పెట్టిన అ-అమ్మ, ఆ-ఆవు అని నేర్పే తీరుకు ప్రాచీన సంప్రదాయమే ప్రాతిపదిక. మన దేశములో మొట్టమొదటి లిఖిత ప్రతులు, శాసనాలు, బౌద్ధధర్మానికి సంబంధించినవే యని ప్రఖ్యాత విమర్శకురాలు "రైస్ డేవిడ్స్" అభిప్రాయపడుతున్నారు.

జాతక కథలలో కూడా పాఠశాలా ప్రసంగములు ఉన్నవి. ఒక శ్రేష్ఠి తన కుమారుని బడికి పంపుతూ వెంట ఒక బానిసను కూడా తోడు పంపగా, యజమాని కుమారుని పలకను పట్టుకొనిపోయిన ఆ బానిస ఉపాధ్యాయుడు చెప్పే పాఠాన్ని వినివిని చదువరి అవుతాడు. యజమాని బానిస బుద్ధిబలానికి మెచ్చి వాడికి బానిసత్వంనుండి విముక్తిని ప్రసాదిస్తాడు.

క్రీస్తుపూర్వం 450 వ సంవత్సరం నాటి "సుత్తంత" మనే గ్రంథములో బుద్ధుని పదమూడు ధర్మోపన్యాసములు సంభాషణాత్మకములుగా గ్రంథస్థము చేయబడ్డవి. అందులో "అక్షరిక" అనే ఒక పిల్లల ఆట ప్రశంస ఉన్నది. ఇందులో గాలిలో వ్రేళ్లతో వ్రాసిన అక్షరాలను గుర్తించడము, తోటి క్రీడార్థి వీపుపై వ్రాసిన అక్షరాన్ని గుర్తించడము ఆటగా వర్ణించబడినది. "వినయ పిటకము" లో బౌద్ధ శ్రామికలకు లౌకికములైన ఇతరకళలు నిషేధించబడ్డా "లేఖనకళ"

మాత్రము ఉపాదేయమే అని చెప్పబడినది. లేఖకవృత్తి కూడ తదితరములైన వృత్తు లన్నింటికంటె సులభము, సౌఖ్యము అయిన దనీ, అందుచేత బాలకుని లేఖకునిగా తీర్చితే, అతడు మునుముందు సుఖపడుసని చెప్పి, లేఖకునికి వేళ్లు నొప్పిపుట్టుట మాత్రము తప్ప దనీ ఇచ్చటనే చెప్పబడినది.

జీవకుని కథ :- బౌద్ధ సాహిత్యములో జీవకుడనే వైద్యునికథ సుప్రసిద్ధమైనది. తక్షశిలా విశ్వవిద్యాలయములో వైద్య విద్యాభ్యాసమును ముగించి సమావర్తన సమయము కొరకై నిరీక్షించి ఉన్న ఈ జీవకుడనే విద్యార్థిని గురువు పిలిచి చుట్టుపట్ల ఉండే చిట్టడివిలో ఔషధానికై ఉపయోగించని మూలిక ఏదైనా ఉంటే వెదికి తెమ్మని ఆదేశిస్తాడు. అడవి అంతా తిరిగి ప్రతి మూలికనూ పరీక్షించి, నిరుపయోగమైన దానిని కానక విసిగి వేసారి జీవకుడు తిరిగిరాగా "నాయనా, నీ విద్యాభ్యాసము ముగిసింది. నీవు సమర్థుడవు. నేను పెట్టిన పరీక్షలో నెగ్గితివి" అని అభినందించి ఇంటికి పంపివేస్తాడు గురువు. ఆనాటి పరీక్షాపద్ధతి ప్రకారము విద్యార్థి ఎంత తెలుసును అన్న మీమాంసకన్న, ఏది తెలియదు అన్న విషయాన్ని గురువులు పట్టి చూచేవారని ఈ కథ చెబుతున్నది.

క్రీస్తుపూర్వము ఎనిమిదవ శతాబ్దిలో పాణిని మహర్షి రచించిన "అష్టాధ్యాయి" అనే సంస్కృత వ్యాకరణ గ్రంథములోనే "లిపి" శబ్దము కనిపిస్తుంది. వ్రాత పద్ధతులు మన దేశములో చాలా పాతకాలములోనే ఉండి ఉన్నప్పటికినీ, వేదమునకు స్వరము ప్రాణము గనుక గురువులు శిష్యులచేత పాఠాన్ని వల్లె వేయించే పద్ధతే సాగి, నోటిమాట కున్నంత ప్రాధాన్యము లిపికి లేకపోయినది.



బౌద్ధ జైన ధర్మాలలో గూడా ఈ మౌఖిక పరంపర ప్రవర్తించినది. బౌద్ధ జైనాలు రెండూ స్త్రీ విద్యాభ్యాసానికి ఎక్కువ ప్రాధాన్య మిచ్చి నట్లు ఆయా ధర్మముల వికాసము చూసినవారికి తెలుస్తూనే ఉన్నది. ముఖ్యముగా జైనమత పరంపరలో ఉద్దండులైన స్త్రీలెందరో మనకు కనిపిస్తారు. "స్త్రీణాంతు తద్భవే మోక్షః" (స్త్రీలకు అదే జన్మలో ముక్తి) అనే జైన ధర్మమే దీనికి కారణము. ఆహార, అభయ, భైషజ్య, శాస్త్రదానము లనే చతుర్విధ దానములు (తిండి, విద్యా వైద్య సౌకర్యాలు, రక్షణ కల్పించడం, చదువు చెప్పడం, జైన సంప్రదాయములో ముఖ్యములై అందు శాస్త్రదానానికి ఉండే ప్రాధాన్యాన్ని తెలియ

చేస్తున్నవి. జైనమత వ్యాప్తికొరకు ఉన్నత వంశాల స్త్రీలు, సామాన్య స్త్రీలు చేసిన సేవ అపారము.

తెలుగు కన్నడ దేశములలో "శ్రీ ఓం నమః శివాయ; సిద్ధం నమః" అని అక్షరాభ్యాసము చేస్తారు. ఓ నా మా లు నేర్చుకోవడం అంటే ఇదే. సిద్ధం నమః (సిద్ధునకు నమస్కారము) అనే సూక్తి జైనబోధన పద్ధతినుండే వచ్చినదని పలువురి విశ్వాసము. కాని ప్రసిద్ధ పరిశోధకులు శ్రీ చిమకుర్తి శేషగిరిరావుగారు ఈ సిద్ధం నమః అనేది కూడా శైవ సిద్ధుల ప్రశంసయేననీ జైనులు, శైవులు బద్ధ శత్రువులు గనుక శైవులు జైనుల నుండి ఈ సంప్రదాయం గ్రహించే ప్రసక్తి లేదని అభిప్రాయ పడుతున్నారు.

అక్షరారంభములో "చిరడి" అని వ్రాసేవారని గాథా సప్తశతి వల్ల తెలుస్తున్నది. (గా. స. 2.91) ఈ పదానికి "సిద్ధిరస్తు" అని వ్యాఖ్య, ఈ "చిరడి" అనే పదము క్రీ. శ. ఒకటవ శతాబ్దిలో తెలుగు దేశములో, మధ్య దేశములో పిల్లవాడు నేర్చుకున్న తొలి అక్షరము. దీని పరిపూర్ణ స్వరూపమేదో తెలియదు. ఇప్పటి బాలలు గొప్ప గ్రంథాలు చదివి, మేధావులై, చిరడి మున్నగు శబ్దాల యథార్థ తత్త్వాన్ని అన్వేషింతురు గాక!



# బాల సంఘాల సమస్యలు

– ఎం. భిక్షపతి

బాలల సంక్షేమం కోసం అందరం కలిసి కట్టుగా కృషి సల్పి, బాల సంఘాలకు సంపూర్ణ సహకారం అందించినపుడే అవి నిజమైన సేవను చేయగలుగుతాయి.

పసిపాపల మానసికాభివృద్ధికి, వారిలో నిద్రాణమై ఉన్న వివిధ అభిరుచులను, కళలను వెలుగులోకి తీసుకురావడానికి, వారిలో చక్కటి క్రమశిక్షణను పెంపుచేయడానికి బాలల సర్వతోముఖాభివృద్ధికి కృషిచేసే సంస్థయే "బాలానందము". బాలలకు ఆనందముతోపాటు విజ్ఞానం - వినోదం - మనోవికాసం కల్గించడమే బాలానంద సంఘముల ముఖ్యమైన ఆశయము.

బాలానంద సంఘము ఏర్పడే ముందు ఉత్సాహవంతులగు కార్యకర్తలు తమ వీధిలోని లేక తమకు దగ్గరి ప్రాంతాలలో నివసించే చిన్న పిల్లలందరిని పోగుచేసి వారికి ప్రతి రోజు సాయంత్రం వేళనో లేక ప్రతి ఆదివారం రోజుననో ఏవో ఆటలు-పాటలు-నేర్పుతూ లేని ఆదివారాలలో పగలు రేడియోలో వచ్చే పిల్లల కార్యక్రమాలు వారికి వినిపింపజేస్తూ, ఆ పిల్లల సంఘానికి ఒక బాలానంద సంఘం అని పేరు పెట్టుకొని కార్యకర్తలే దానికి కార్యదర్శిగానో లేక ఆర్గనైజర్‌గానో వుంటూ, తమకు తీరుబడి కలిగినప్పుడల్లా పిల్లలకు ఏదో కొంత ఆనందాన్ని కల్గించుతూ వుంటారు. క్రమంగా కొన్ని పోటీలలో పాల్గొనవలసిన సందర్భం ఏర్పడ్డప్పుడు సంఘాన్ని రిజిస్ట్రేషన్ చేయించవలసిన అవసరం ఏర్పడుతుంది. ఆ కార్యకర్త ఆ వీధిలోని లేక ఆ వూరిలోని పిల్లల తలిదండ్రులను కలిసి ఆ విషయాన్నంతా విశదీకరిస్తాడు.

సంఘం నడపాలంటే ఆర్థికమైన బలం కావాలి. ఆర్థికంగా బలం చేకూరాలంటే పిల్లలనుండి చందా వసూలు చేయాలి; లేదా పెద్దలు చందాలు యిచ్చి ఆదుకోవాలి. ఆర్థికమైన యిబ్బందులవల్లనే నేడు ఎన్నో బాల సంఘాలు అభివృద్ధిలోనికి రాకుండా, ఏ కార్యక్రమాల్లోను పాల్గొనలేకుండా పోతున్నాయని చెప్పడంలో అసత్యం ఎంతమాత్రము లేదు.

బాలానంద సంఘానికి పిల్లలు వస్తూవుంటారు. వాండ్లకు కార్యకర్తలు తమ పరిధిలో వున్నంతవరకు గేయాలు, కథలు, పాటలు, చెబుతారు, ఆటలు ఆడించగలుగుతారు. కొన్ని నాటికలు పిల్లలచేత వేయించగలుగుతారు.

కార్యకర్తలు ఎన్ని యిబ్బందులు ఎదుర్కొంటున్నా పిల్లలచేత సాంస్కృతిక కార్యక్రమాలు ఏర్పాటు చేయించి వారిలో వున్న కళాభిరుచిని పదిమందికి చూపాలనుకుంటారు. ఈ కార్యక్రమాలు ఏర్పాటు చేయడానికి విశాలమైన స్థలమో, భవనమో లేదా ఆడిటోరియమో కావాలి. అన్నిచోట్ల ఈ సౌకర్యాలు లభించవు. హైద్రాబాదువంటి నగరాలలో

జవాహర్ బాలభవన్‌లోని ఇందిరా ప్రియదర్శిని ఆడిటోరియం, రవీంద్ర భారతి, ఆంధ్ర బాలానందం హాలు మొదలైన ఎన్నో ఆడిటోరియంలలో సౌకర్యాలు వున్నాయి కాబట్టి అక్కడి కార్యకర్తలు కార్యక్రమాలు ఏర్పాటు చేసుకోవాలంటే సులువయిన విషయమే! కాని గ్రామాల్లో, తాలూకాల్లో జిల్లాలో మాట ఏమిటి? ఆడిటోరియములు ఒకవేళ ఏప్రాంతంలోనైనా వున్నప్పటికి వాటి అద్దెలు ఎక్కువ. కనుక పిల్లల సాంస్కృతిక ప్రదర్శనలకు తగు రంగస్థలాలను సమకూర్చడం అవసరం.

మరొక సమస్య: పిల్లలకు శారీరక, మానసిక అభివృద్ధితోపాటు లోకజ్ఞానం కూడా ముఖ్యం. పాఠశాలలో వారు చదివే చదువు కంటే ఎక్కువ విజ్ఞానాన్ని అందించే పిల్లల పుస్తకాలు ప్రతి బాలానంద సంఘంలో వుండడం ఎంతో అవసరం. నేడు బాలసాహిత్యంలో రచనలు చేసే కవులు ఆంధ్రదేశంలో లేరనికాదు. వున్నారు. కాని వారికి ఎదురయ్యేది డబ్బు సమస్య! తాము వ్రాసిన రచనలు ముద్రించాలంటే సాధ్యమయ్యే విషయం కాదు.

బాలలకు చక్కటి పుస్తకాలు అన్ని బాల సంఘాలలో లేని కారణంగా పిల్లలు మంచి పుస్తకాలను చదివి వారి విజ్ఞానాన్ని అభివృద్ధి చేసుకొనలేక పోతున్నారు. అందుచేత పిల్లలకు మంచి పుస్తకాలున్న గ్రంథాలయాలు లేకపోవడము కూడ బాలసంఘాల నిర్వహణలో ఎదురయ్యే ముఖ్యమైన సమస్యలో ఒకటి కనుక పిల్లలకోసం చక్కటి గ్రంథాల ప్రచురణ ఎక్కువగా జరగాలి.

మరొక సమస్య ఏమిటంటే పిల్లలకు సినిమా ప్రదర్శనలు ఏర్పాటు చేయడం. హైద్రాబాదు, సికింద్రాబాదు లాంటి జంట నగరాలలో ఫిలిమ్స్ డివిజన్ వారు, దౌత్య కార్యాలయాల వారు, ఇతరులు చక్కటి కార్టూను చిత్రాలు, ఇతర చిత్రాల ప్రదర్శనలు పిల్లలకు ఏర్పాటు చేయగలుగుతూ వున్నారు. మరి జిల్లాల్లో, తాలూకాలలో, గ్రామాలలో వున్న బాలల సంగతి ఏమిటి? వారికి ఎవరు చూపించాలి? పిల్లల సినిమాలు అనేది పెద్దసమస్య! అందుచేతనే వారికి పిల్లల సినిమాలు ఎలా ఉంటాయో, కార్టూను సినిమాలంటే ఎమిటో తెలియదు. అందువల్లనే వాండ్లు అందుబాటులో వున్న నేటి సినిమాలు చూడటంవల్ల ఆ సినిమాల ప్రభావము వారిపైనపడి ఎన్నో విధాల చెడిపోతున్నారు. అసలు పిల్లలు పది విషయాలు విన్నదానికంటే ఒక సంఘటనను ప్రత్యక్షంగా చూసినపుడు దానిని ఎప్పుడూ జ్ఞాపకం పెట్టుకొంటారు. పిల్లలు చక్కటి విజ్ఞానాత్మకమైన బాలల చిత్రాలు చూడడం సంభవించినట్లయితే ఆ చిత్రాలలోని మంచిని గ్రహించితే వారి ప్రవర్తనలో కొంత మార్పు కలుగుతుంది. కాని ప్రభుత్వం "పిల్లల చిత్రాలు తియ్యండి! వాటికి చక్కటి బహుమతులు యిస్తాం! నిర్మించడానికి తగిన ఆర్థిక సహకారం అందించుతాం" అని చెబుతున్నా ఎవరూ ముందుకు రారు. పిల్లలపై సినిమాల ప్రభావం చాలా చురుకుగా పనిచేసి వారి నిత్య జీవితంలో నడవడిక, మాటతీరు, గౌరవము, మర్యాద, పద్ధతులు, మంచి చెడు అనేక విషయాలు తెలుసుకోవడానికి దోహదం చేస్తాయి. ఈ అంశాలన్నింటిని చిత్రరూపంలో నిర్మించి చక్కటి ప్రయోజనాత్మక చిత్రాలు నిర్మించినట్లయితే మరికి పేటల్లో, మారుమూల గ్రామాల్లో సభ్యత అంటే ఏమిటో, శుభ్రత అంటే

ఏమిటో తెలియక అల్లరి చిల్లరిగా తిరిగే పిల్లలలో సహితం మార్పు తప్పకుండా వచ్చి తీరుతుంది. మంచి అంటే ఏమిటో, చెడు అంటే ఏమిటోకూడా వారు తెలుసుకొంటారు.

బాలసంఘాలు ఎదుర్కొంటున్న తీవ్రమైన సమస్యలన్నింటికి మొన్నటివరకు పరిష్కార మార్గము అనేది అగమ్యగోచరంగానే వుండేది. కాని బాలల భావిజీవితాలను సుగమం చేయడానికి, వారి భవిష్యత్తుకు చక్కటి బాటలు వేయడానికి, వారిని బాధ్యతగల పౌరులుగా రూపొందించడానికి ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ అవతరించింది. ఇప్పటివరకు బాల సంఘాలు స్థాపించుకొని వాటి నిర్వహణలో ఎన్నో సమస్యలను ఎదుర్కొంటున్న బాల సంఘాల కార్యకర్తలకు చక్కని మార్గాన్ని చూపడం, వారికి అన్నివిధాల ప్రోత్సాహం, సహకారం అందించవలసిన బాధ్యత నేడు అకాడమీపైన వున్నది.

**కొన్ని సూచనలు :**

నా ఉద్దేశ్యం ప్రకారము బాలసంఘాల నిర్వహణ సుగమం కావాలంటే ముఖ్యంగా బాలల అకాడమీలో ఆంధ్రప్రదేశ్‌లోని ప్రతి జిల్లానుండి ఒక బాలసంఘం ప్రతినిధిని సభ్యుడుగా చేర్చుకోవాలి. ఆ ప్రతినిధి ఆ జిల్లాలోని ప్రతి బ్లాకులోను, ప్రతి గ్రామంలోను బాలల కార్యకలాపాలకు సంబంధించిన వ్యవహారాలు చూడడానికి, జిల్లాలో ఎదురయ్యే సమస్యలు నివేదించడానికి వీలు కలుగుతుంది. జిల్లాలోని ప్రతి తాలూకానుండి ప్రతి చిన్న గ్రామంలోని పిల్లలందరకు సమానమైన న్యాయం చేకూరుతుంది.

ప్రతి జిల్లా ముఖ్యకేంద్రంలో "బాలల భవన్" ఒకటి ఏర్పాటు చేయాలి. అందులో బాలలకు కావలసిన అన్ని హంగులు అకాడమీ సమకూర్చి వుంచాలి. ఆ సంస్థనుండి స్థానిక బాలసంఘాలు, జిల్లాలోని బాలసంఘాలు అవసరమగు వస్తువులు తీసుకొని తిరిగి అప్పగించుతూవుంటాయి. అందులో చక్కని గ్రంథాలయం, సినిమా ప్రదర్శనకు కావలసిన హంగులు అన్నీ వుండాలి.

అకాడమీ వారు ప్రతి బాలసంఘానికి గ్రాంటు రూపంలో ఆర్థిక సహకారం అందించుతూ ఆ సంఘాల అభివృద్ధికి సహకరించాలి. బాలల ప్రతిభను యినుమడింపజేయడానికి సభలు, సమావేశాలు, ప్రదర్శనలు, విజ్ఞాన యాత్రలు మొదలైనవి ఏర్పాటుచేసి వారిలో ఉత్సాహాన్ని కలుగజేస్తూ వుండాలి. బాలల చిత్రాలు నిర్మించడానికి ముందుకు వచ్చేవారికి ప్రభుత్వం, అకాడమీవారు సహకరించాలి.

ఏ అవకాశాలు లేక తమ అభిరుచి కలలు కాగా నిరాశతో, నిస్పృహతో చెడుమార్గాన్ని అవలంబించి తెగిపోయిన గాలిపటంలాగా తిరిగే ఎందరో పిల్లలు మనకు ప్రతిరోజు కనిపించుతూ వుంటారు. మన సంస్కరణ వారి వద్దనుండి ప్రారంభం కావాలి. వారిలో మార్పును తీసుకురావడానికి ప్రతి పౌరుడు ముందుకు వచ్చి వారి సంక్షేమంకోసం - వారిలో నిద్రాణమై ఉన్న అభిరుచుల్ని మెరుగు పెట్టడానికి కంకణం కట్టుకోవాలి.



# పిల్లల పెంపకం

— ప్రవిగడ్డ విజయలక్ష్మి

పిల్లలకు చిన్నతనంలో మొలకెత్తే ఆశలకు, ఆశయాలకు అనుగుణంగా వారి జీవిత మార్గాలను పరిశీలిస్తే వారు తప్పక వృద్ధిలోకి వస్తారు.

మానవుని జీవితంలో సున్నితమైన కాలం బాల్యం. తెలిసీ తెలియని దశ బాల్యం. చీకూ చింతా లేని జీవితం అంటే బాల్యమే. అమాయకతకు, మంచితనానికి ఆటపట్టు బాల్యం. అందుకే పిల్లలు పరబ్రహ్మ స్వరూపులు.

పిల్లలు అనగానే సాధారణంగా పెద్దలందరిలోను ప్రేమ, వాత్సల్యం, కరుణ, సంతోషం కలుగుతాయి.

తల్లిచాటు బిడ్డలుగా పెరిగే వయసులోనే లోకం పోకడలన్నీ జాగ్రత్తగా పరిశీలిస్తూ తమకు నచ్చిన అంశాలను అనుకరిస్తూ, నచ్చని వాటిని వదిలివేస్తూ, తెలివితేటల్ని పెంచుకుంటూ వస్తారు పిల్లలు. ఈవయసులో వాళ్ళకు ఒకవిధంగా రక్షణ ఉంటుంది. వాళ్ళు చేసే అల్లరి పనులను కప్పిపెట్టడానికి తల్లి కవచంలా ఉంటుంది. ప్రాణాన్ని పణంగా పెట్టయినా బిడ్డను సర్వవిధాలా రక్షించుకోవడానికి తల్లి ప్రయత్నిస్తుంది గనకే ఎవరికీ లొంగని పిల్లలైనాసరే తల్లిదగ్గర లొంగిపోతారు. ఆ అవినాభావసంబంధం తల్లీ పిల్లల మధ్య ఉంది.

బాల్యంలో ముఖ్యంగా అవసరమైనవి మూడు : అన్నం, చదువు, ఆటలు. అన్నం పెట్టేది అమ్మ. అన్నం పెట్టడంలో అమ్మది అందెవేసిన చేయి. "భోజ్యేషు మాతా" అని భోజనం పెట్టే విషయంలో తల్లిలా ప్రవర్తించాలని చెప్పారు పెద్దలు.

శివుడట తల్లిలేనివాడట. అవును కదా! మన ముఖ్యదేవతలు స్వయంభువులు. అంటే వారంతట వారు పుట్టినవాళ్లు. అటువంటప్పుడు శివుడికి మరి తల్లెక్కడుంది ? లేదు. ఈ విషయాన్ని ఒక మహాభక్తురాలు గమనించింది. ఆవిడ పేరు బెజ్జమహాదేవి. ఆవిడ శివుని దీనావస్థ చూసి జాలిపడిపోయి "అయ్యో, నీకు తల్లే ఉంటే నిన్నిగతికి రానిచ్చేదా?" అని వాపోతుంది.

"తల్లిగల్గిన నేల తపసి గానిచ్చుఁ
దల్లిగల్గిన నేల తల జడల్గట్టుఁ
దల్లియున్న విషంబుఁ ద్రావనేలిచ్చుఁ
దల్లి పాముల నేల ధరియింప నిచ్చుఁ
దల్లి బూడిదయేల తాఁ బూయనిచ్చుఁ
దల్లి పుచ్చునె సుతు వల్లకాటికిని." (బసవ)

పిల్లలకు తల్లి తండ్రియై, గురువై, నేస్తమై, చుట్టమై, దైవమై, సర్వే సర్వత్రా అన్నీ తనే అయి-బిడ్డను పొదివి పెంచుకునే ప్రేమమూర్తి ఆమె.



తల్లి గుణవతి, విద్యావతి అయితే సంతానం కూడా అట్లాగే తయారవుతుందని, తల్లి అసూయాపరురాలు, గుణహీన అయితే పిల్లలు కూడా అట్లాగే తయారవుతారని సాధారణంగా నమ్ముతారు. ఈ విషయాన్నే "కూతురు చెడుగైన మాత తప్పు, తనయుడు చెడుగైన తండ్రి తప్పు" అని చెప్పాడు నరసింహ శతక కర్త. గుణగణాలనేవి మొదటిదశలో తల్లిదండ్రులదగ్గరనుంచి సంక్రమిస్తాయి. తర్వాత పరిసరాలనుంచి వచ్చి చేర్తాయి.

ఏ విషయం నేర్చుకోవాలన్నా పిల్లలకు ఉండవలసింది విధేయత; ఉండకూడనిది అహంకారం. అటువంటి విధేయతను తల్లే నేర్పాలిగాని ఇంకెవ్వరూ - ఆఖరికి ఉపాధ్యాయులు కూడా-నేర్పలేరు. పిల్లవాడు మంచివాడైనా, చెడ్డవాడైనా "ఏ తల్లి కన్న బిడ్డడమ్మా?" అని లోకం విస్తుపోతుంది, ప్రశ్నిస్తుంది. చెడ్డ పనులు చేసే పిల్లలను ఇతరులు తిట్టదలచుకొన్నప్పుడు వాళ్ల తల్లిదండ్రులను కూడా కలిపి తిడతారు. ఇది గమనించదగ్గది.

ఆహారం, చదువు ఎంత ముఖ్యమో బాలలకు ఆటలుకూడా అంతే ముఖ్యం. శరీరారోగ్యానికిగాని, మానసికారోగ్యానికిగాని ఆటలు ప్రధానమైనవి. అంతేకాదు-ఆటల్లో పడిపోయి అంతులేని ఆనందాన్ని పొందే సమయాలు కూడా ఎన్నో ఉంటాయి. అన్నం తినడం మర్చిపోయే అవకాశాలు కూడా ఉండకపోవు. ఆహారం కడుపు నింపితే, చదువు బుద్ధినిస్తే, ఆటలు హాయినీ, ఆరోగ్యాన్నీ ఇస్తాయి. ఆటలను దినచర్యలో ఒక భాగంగానే గ్రహించాలిగాని రోజురోజంతా వాటికోసమే గడిపెయ్యకూడదు. "అతి సర్వత్ర వర్జయేత్" గదా! ఏ విషయమైనా మితంగా ఉన్నప్పుడే అందం. అతి అయిందో అసహ్యమే. కొంతమంది పిల్లలు ఎవరు చెప్పినా వినకుండా స్కూలు కూడా ఎగ్గొట్టి ఆటలకో, సినిమాలకో పోతారు. దానివల్ల చెడేదీ, పైకి రాలేకపోయేదీ వాళ్లా? వేరే ఇంకెవరి పిల్లలా?

పిల్లల్లో చెడుఅలవాట్లు కలగటానికి పిల్లలూ బాధ్యులే; తల్లిదండ్రులూ బాధ్యులే. కొంతమంది తల్లిదండ్రులు పిల్లల్ని అతి గారాబంగా పెంచుతారు. దానితో వాళ్లు పూర్తిగా చెడిపోతున్నారు. ఎవరి పిల్లలు వాళ్లకు ముద్దే. ఎందుకు కాదు? "కాకిపిల్ల కాకికి ముద్దే". కాని హద్దు మీరి వాగినా, ఆగడాలు చేసినా పక్కవాళ్లు సహించరు. అప్పుడు ఆరంభమవుతుంది అసలు హంగామా. పిల్లల పిల్లల తగాదాలే పెద్దవాళ్లను విడదీసేటంతవరకు పెచ్చరేగిపోతాయి.

సంతానం కలగగానే తలిదండ్రులకు కలిగేది నిజమైన సంతోషం కాదు. అబ్బాయిలుగాని, అమ్మాయిలుగాని పెరిగి పెద్దవారై

అబద్ధమాడొద్దంటూనే
నాన్న ఇంట్లో వున్నా
లేడంటుందే మా అమ్మ !
చెడ్డమాటలు వద్దంటూనే
రంగిని
తిడుతుందెందుకు అమ్మ !
గోపికి, నాకూ
తేడా వుందని
అంటుం దెందుకు అమ్మ !
కాని
గోపిలాగే నాకు
ఆకలేస్తుందెందుకు ?

-జె. వెంకట్రావు

మంచి ఉపన్యాసాలిస్తుంటే, మంచి మంచి పనులు చేస్తుంటే, వాటిని చూసి నలుగురూ నానావిధాల మెచ్చుకుంటుంటే వాళ్లను కన్న తల్లిదండ్రులకు నిజమైన సంతోషం కలుగుతుంది.

"పుత్రోత్సాహము తండ్రికి
పుత్రుడు జన్మించునపుడు-పుట్టదు; జనులా
పుత్రుని కనుగొని పొగడగ
పుత్రోత్సాహంబు నాడు పొందును సుమతీ!"

ఈ పద్యం పిల్లలూ, పెద్దలూ జ్ఞాపకముంచుకోదగింది.

పిల్లలకు కొంత స్వేచ్ఛ యివ్వాలి. మరీ మనదేశంలో పిల్లల్ని అదుపులో పెట్టడమేగాని వారి మనసుల్లో ఏముందో ? వా రేవిధంగా ఆలోచిస్తారు ? వారి కోరికలేమిటి ? తమ పరిసరాలను గురించి వాళ్లేమనుకుంటున్నారు? -ఇలాంటి విషయాలేవీ ఆలోచించరు తల్లిదండ్రులు. ఆలోచించటానికి వాళ్లకు వ్యవధి ఉండదు. వాళ్ల పనులేమో ! వాళ్లేమో ! పిల్లల సంగతి పట్టించుకోవడానికి తీరికెక్కడిది ? కాని పిల్లలతో గడపడానికి కొంత తీరిక చిక్కించుకోవాలి. దానివల్ల పరస్పర అవగాహన, అభిమానం, ఆదరణ పెరుగుతాయి. పిల్లలు మంచి చదువులు చదవాలంటే తండ్రే కాకుండా తల్లి కూడా చదువుకున్నదయితే ఏ ఇబ్బందీ ఉండదు. కనీసం తల్లికి చదువు విలువ ఏమిటో, చదువు విలువ ఎలాంటిదో తెలిసి ఉండాలి.

పిల్లలు అంటే తల్లిపాలిటికి కనిపించని ఆభరణాలు, అలంకారాలు. అందుకే తన పిల్లలను తల్లి శుభ్రంగా ఉంచే ప్రయత్నం చేస్తుంది. వెకిలిగా మాట్లాడుతూ, బట్టలు చింపుకుంటూ అడ్డాదిడ్డిగా తిరిగే పిల్లలదగ్గరకు పోనివ్వదు. వాళ్లతో స్నేహం చెయ్యనివ్వదు. అది తన పిల్లలమీది శ్రద్ధతోనేగాని వెకిలి పిల్లల మీద ఉన్న అసహ్యంవల్ల కాదు. తల్లిలేని పిల్లలను చూసి మరో తల్లి జాలిపడుతుంది, చేతనైన సహాయం చేస్తుంది.

పిల్లలు అతిమంచిగా ఉండటంకూడా హాని కలిగించవచ్చు. నేను చాలా మంచిగా ఉంటాననిభీష్మించుకుంటే చెడ్డవాళ్లు తన్నక మానరు. చెడ్డపిల్లలదగ్గర కనీసం కోపంగానన్నా ప్రవర్తించాలి. వాళ్లు జోలికి రాకుండా మెలగడం నేర్చుకోవాలి.

పిల్లలమీద ఉండే అతి ప్రేమకొద్దీ వాళ్లకు చిన్నప్పటినుంచీ ఇంట్లోవారు వాళ్లలో కొన్ని భయాలు కలిగిస్తారు. పిల్లలను ఎవరు ఎప్పుడు ఎత్తుకుపోతారో అని భయపడి తల్లి "నాయనా! నువ్వెవ్వరిదగ్గరకూ వెళ్లవద్దు. ఎవరు పిలిచినా వాళ్లదగ్గరకు పోవద్దు" అని పసితనంనుంచి పిల్లాడికి భయం నేర్పుతుంది. దాంతో ముష్టివాళ్లంటేనూ, ఇతరులంటేనూ అమితంగా

భయం పట్టుకుంటుంది పిల్లవాడికి. సభా పిరికితనం అబ్బుతుంది. మరోతల్లి నీళ్ల దగ్గరకు వెళితే ఎక్కడ నీటిలో పడిపోతాడో అని నదుల దగ్గరకు, బావులదగ్గరకు పిల్లలను పోనివ్వదు. దాంతో వాళ్లకు నీళ్లంటే భయం ఏర్పడుతుంది. ధైర్యం, సాహసం అన్నవి ఏకోశానా వారిలో కనపడవు. తల్లి పిరికిదైతే పిల్లలూ పిరికివారవుతారు. కొంతమంది తల్లులు పిల్లలను అసలు ఒంటరిగానే బయటకు పంపరు. కొంత కాలమైన తరవాత సహజంగానే వాళ్లు బయటకు వెళ్లలేకపోతారు. పదిమందితో కలిసి మెలిసి తిరగలేకపోతారు. కొందరు పిల్లలు తండ్రిదగ్గరకు వెళ్లటానికిగాని, తండ్రితో ఏది ఐనా మాట్లాడటానికిగాని, ఆయన నేదైనా అడగటానికిగాని భయపడతారు ఇవన్నీ పిల్లలకు పెద్దలు నేర్పిన పిరికితనాలే. వాళ్లకు ఏది చేయవచ్చు, ఏది చేయకూడదు అనే తారతమ్యాన్ని అర్థమయ్యేట్లు చేయాలి. ధైర్యం నేర్పాలి. ఈదులాట నేర్పాలి. కాని అనవసరంగా ప్రతిదానికి భయపడేటట్లు చేయకూడదు.

పిల్లలు వేసే ప్రశ్నలు చూస్తుంటే చాలా తమాషాగా ఉంటాయి. ఒక్కొక్కప్పుడు పెద్దలే గతుక్కుమనేట్లు, జవాబుకోసం వెతుక్కునేటట్లు ఉంటాయి. పిల్లల్లో ఎన్నో ఆశలూ, ఊహాలూ తలెత్తుతుంటాయి. అమ్మ వలె తనూ చీర కట్టుకుంటే ఎంత బాగుంటుంది? భలే బాగుంటుంది. తనను గూడా "పిన్నిగారూ! అక్కయ్యగారూ!" అని పిలుస్తారు అందరూ-అనుకుంటుందొక అమ్మాయి. మగపిల్లల ఊహాలు మరోరకంగా సాగుతాయి. వాళ్ల ఆశలకూ, ఆశయాలకూ అనుగుణంగానే వారి జీవితమార్గాన్ని గూడా మలిస్తే చాలా బాగుంటుంది.



# పిల్లల కథలు ఎలా ఉండాలి?

— జి.ఎస్. సూరి

పిల్లల కథలు వారిపై మంచి ప్రభావం చూపించేవిగా వుండాలి. పెద్దవాళ్లు చదువుకుని ఆనందించే పిల్లల కథలు బాల సాహిత్యం అనిపించుకోదు.

బాలసాహిత్యం బాగా అభివృద్ధిచేయాలి అనుకున్నప్పుడు పిల్లలకు ఏరకం కథలూ-గాథలూ ఆకర్షణీయంగానూ, ఆసక్తిదాయకంగానూ ఉంటాయి అన్న విషయాన్ని కాస్త పరిశీలించవలసి ఉంటుంది. పిల్లల మనస్తత్వం బహు విచిత్రమైంది. వాళ్ళను ఆనందంగానూ, ఆహ్లాదంగానూ ఉంచగలిగినప్పుడే వాళ్లల్లో పెరుగుదల ఆరోగ్యదాయకంగా ఉంటుంది.

తేలికైన భాషతో, సునిశితమైన హాస్యంతో బాలలకు ఆశ్చర్యాన్నీ - ఆనందాన్నీ - ఆహ్లాదాన్నీ కలిగించే కథలైతే ఆసక్తిదాయకంగా ఉంటాయని చెప్పొచ్చు. కథ కుతూహలం కలిగించేదిగా ఉండాలి, ఏకాగ్రత కలిగించేది కావాలి. అటువంటి కథలలో అందరికీ తెలుసున్నదీ, అందరికి ఇష్టమైనది అయిన ఒక కథ తీసుకుని అందులో ఆసక్తికలిగించే విషయాలేమిటో పరిశీలిద్దాం!

ఉదాహరణకు :

అనగా అనగా ఒక రాజు...ఆ రాజుకు ఏడుగురు కొడుకులు కథలో-అనగా అనగా అనే దానితో పిల్లలను ఆకట్టుకోవటం మొదలుపెట్టి ఆ రాజుకు ఏడుగురు కొడుకులు అనటంతోనే వాళ్లని ఊకొట్టేలా చేస్తూ...ఆపైన ఆ ఏడుగురు కొడుకులు వేటకు వెళ్లటం...ఏడు చేపలు తేవటం వరకూ వచ్చేసరికి కథపట్ల ఏకాగ్రత కలిగేలా చేస్తూ వచ్చి, ఒకవిధమైన ఉత్సాహానికి కారణం అవుతుంది పిల్లలకు. అందులో ఒకచేప ఎండకపోవటం...అందుకు కారణం పరిశోధిస్తూపోతే చివర్లో చీమ చెప్పే చిన్న సమాధానం వినే పిల్లలకు చమత్కారంగా కనపడి నవ్వు రప్పిస్తుంది.

ఈ కథ పిల్లలకు ఎన్నిసార్లు విన్నా కుతూహలంగానే వుంటుంది. కారణం కథ అల్లిన విధానం- కథ పతాక స్థాయికి చేరుకునే తీరుతెన్నులు. ఒక ప్రశ్న-మరో జవాబుతో కథ ఒక్కొక్క మెట్టుగా సాగుతూ పతాకస్థాయికి చేరుకోవటం కథపట్ల ఒకవిధమైన ఆసక్తి కలుగచేస్తుంది. ఈ కథలో ఉన్న మరో విశేషం ఏమిటంటే ముందర ఏం జరుగుతుందో అన్న ఉత్కంఠత రేకెత్తించదు. అయితే- చివర్న చీమ చెప్పే సమాధానం కోసం ఎదురు చూడటం జరుగుతుంది.

ఈ కథలో పిల్లలను ఆకట్టుకునే ముఖ్య లక్షణాలు ఏమిటంటే:

1. కథా సంవిధానం...అంటే కథ అల్లిన తీరు,

2. భాష,

3. ఆశ్చర్యం, ఆనందం, ఆహ్లాదం కలిగించటం,

4. కథలో ఉన్న హాస్యం,

5. కొస మెరుపు.

ఇవన్నీ కలసి ఉండటంవలనే ఈ కథ బాలలకు అమితమైన ఆసక్తిని కలుగచేస్తుంది. కథలో అసహజత ఉన్నా- అది ఆసక్తికరంగా ఉండాలి. నిజానికి పై కథలో అంతా అసహజతే- అంతా అతిశయోక్తే! కనుకనే జీవం లేని వాటిచేత సమాధానం చెప్పిస్తూ కూడా బాలలకు కథపట్ల కుతూహలాన్ని కలిగించ కలగటం ఈ కథలోని గొప్పతనం. కథచెప్ప టంలో డొంక తిరుగుడేం ఉండదు. అంతా సూటిగా చెప్పేయటం జరుగుతుంది.

కథలో ఉపయోగించిన భాష కూడా అంతే! అతి తేలిగ్గా తేటతెల్లంగా ఉంటుంది. అర్థంకాని పద్ధతిలో ఉండదు. అసలు బాల సాహిత్యానికి కావలసిన ముఖ్యలక్షణమే అది. కష్టంగా ఉండేది ఏదికూడా బాలసాహిత్యంగా నిలవదు. చెప్పిందే చెప్పినా- విన్నదే విన్నా విసుగు కలిగించనిదే నిజమైన బాలసాహిత్యం అవుతుంది. అంటే ఆ కల్పనలో కాని, ఆ కథ నంలో కాని అంత అందం- ఆకర్షణ ఉండాలి.

పిల్లల కథలు నీతిదాయకంగానూ ఉండాలి. చిన్నారి మనసులకు సులభంగా పట్టే విధంగా కథ ద్వారా నీతిని చెప్పాలి.

ఒక కోతి వడ్రంగివారు కోసిపెట్టి సగంలో వదలి వెళ్ళిన ఒక వాసం చూడటం, అది ఆ వాసం మధ్యలో రెండు చీలికలు కలసి పోకుండా ఉండేటందుకు అడ్డం పెట్టిన ముక్కని లాగబోయి ఆ చీలికలు కలసిపోయి కాలు మధ్యలో చిక్కుకోగా గిలగిల తన్నుకుని చచ్చిపోవటం...ఈ కథ తనకుగాని పనికి పోరాదు అన్న నీతిని బోధిస్తుంది పిల్లలకు.



కథ విన్న పిల్లలకు కోతి స్థితి చూసి 'అయ్యో!' అనిపిస్తుందిముందర. ఆపైన అనవ సరంగా తనకు సంబంధంలేని పనికి పోవటం వల్లనే కదా కోతికి అలా జరిగింది అని అర్థం అయ్యి "అమ్మో!" అనిపిస్తుంది. ఈ కథలో ఉన్న విశేషం ఏమిటంటే ఒక విషయాన్ని చెప్పటానికి సరిపోయే స్వభావంగల జంతువుని ఎన్నుకోవటం. నిజానికి ఇక్కడ ఈ కథలో ఒక మేకనో, కుక్కనో పెట్టి చెప్తే అంత ప్రభావం చూపించకపోను. అది సరైనది కూడా కాదు.

కోతి స్వభావసిద్ధంగా అడ్డూ అదుపూ లేని అల్లరి రకానికి చెందినది. దాని చేష్టలూ, స్వభావం అంతా కొంటెతనం తోనూ, చంచ లత్వంతోనూ కూడి ఉంటుంది. అందుకనే అది అటువంటి కష్టానికి లోనైంది. అందుకనే ఎవరైనా అల్లరి చిల్లర పన్లూ అవీ చేస్తూంటే కోతి పన్లూ, కోతి చేష్టలూ అంటూ ఉంటాం.

ఉపకారానికి ప్రత్యుపకారం చేయటం విషయం పావురం - చీమ కథలో అతి చక్కగా పొందుపరచ బడింది. అటువంటి మంచి గుణాన్ని అలవరచుకోవాలి అన్న విషయం చాలా నేర్పుగా సూచించబడింది.

క్లుప్తంగా ఆ కథ ఏమిటంటే- నీటిలో కొట్టుకుపోతున్న ఒక చీమని చూసి జాలితో దాన్ని కాపాడేందుకు ఒక పావురం చిన్న పుడకని విరిచి నీటిలో వేస్తుంది. దాని సాయంతో చీమ ఆపదనుంచి బయటపడుతుంది. ఆ తర్వాత ఆ చీమ మరోసందర్భంలో ఒక బోయవాడు బాణంతో పావురాన్ని గురిచూసి కొడుతున్న సమయంలో చూసి, తనకి ప్రాణదానం చేసిన పావురానికి ప్రత్యుపకారం చేయదలచి బోయవాడి కాలిమీద కుడుతుంది - బోయవాడి గురి తప్పుతుంది - పావురం ఎగిరిపోతుంది.

ఈ కథలో పావురం చేసిన దానికంటే చీమ చేసినది హైలెట్‌గా కనపడుతుంది. అంత చిన్న చీమ పావురాన్ని రక్షించటం- అదీ సమయస్ఫూర్తితో - అన్నది వింతగానూ మెచ్చుకో తగ్గదిగాను కనపడుతుంది.

బాలల మనసుల్లో నిస్సందేహంగా ఈకథ చెరగని ముద్ర వేస్తుంది. ఆకారంలో చిన్నదైన చీమలాగే తాముకూడా ఎప్పుడైనా వ్యవహరించాలి అన్న ఆలోచనే దానికి కారణం. అంతటి ప్రభావం కలిగించాలి పిల్లల మనసులమీద మంచిని చెప్పే కథలు.

ఇక ఆహ్లాదాన్ని కలుగచేసే కథలు-ఆశ్చర్యాన్నికలిగించే కథలు కొల్లలుగా ఉన్నాయి. గలివర్స్ ట్రావెల్స్, సింద్‌బాద్ యాత్రలు వినే పిల్లల ఊహలు సాహసంవైపు, ఆలోచనా ప్రపంచాలవైపు పయనిస్తాయి. సింద్‌బాద్ యాత్రలు విన్న పిల్లలకు తాముకూడా అలా చేస్తే...అన్న ఆలోచన వస్తుంది; వచ్చి తీరుతుంది.

ఛత్రపతి శివాజీ, రాణాప్రతాప్, రుద్రమదేవి మొదలైనవారి వీరోచిత గాథలు వినే పిల్లల లేతమొహాలు కూడా ఎర్రబడుతూంటాయి. చిన్నారి పిడికిళ్లు బిగుసుకుంటాయి. అంటే వాళ్ళకి తెలియకుండా అంతర్గతంగా లోపల కదిలే ఊహాలే అందుకు కారణాలు. మనం కూడా శివాజీలా అయితే...అనుకోని పిల్లలు ఉండరు నా ఉద్దేశ్యంలో.

పిల్లల కథలు వారిపై మంచి ప్రభావం చూపించేవిగా ఉంటూ ఉండాలి. పెద్దవాళ్ళు చదువుకుని ఆనందించే పిల్లల కథలు బాల సాహిత్యం అనిపించుకోదు. బాలల కథలు బాలలకోసం రాసినవిగానే ఉండాలి. వీరోచితమైనవైనా, సాహసమైనవైనా, కల్పనలైనా ...ఏవైనా సరే!



# ఉత్తర భారత బాల సాహిత్యము

- పోలి విజయ రాఘవ రెడ్డి

ఉత్తర భారతదేశ మందలి భాషలలో ప్రతిదానిలోను బాల సాహిత్యము జానపద సాహిత్య మందొక ముఖ్య భాగముగా వర్ధిల్లుచు వచ్చినది. ఈ శతాబ్దారంభము నుండి ఈ సాహిత్యము బహుముఖముగా విస్తరించుచున్నది.

దక్షిణభారత భాషలైన తెలుగు, తమిళము, మలయాళము, కన్నడము మినహా మిగత దేశ భాషలను ఉత్తరభారత భాషలనుట మన పరిపాటి. మన రాజ్యాంగ మందు పొందు పరచిన ఉత్తర భారత భాషలు పది. అవి- తూర్పుదిశనున్న ఒరియా, బెంగాలీ, అస్సామీ పశ్చిమ దిశనున్న మరాఠీ, గుజరాతీ, సింధీ, ఉత్తర దిశనున్న పంజాబీ, కాశ్మీరీ, ఉర్దు, మధ్యదేశభాషయగు హిందీ. ఈ పది ఉత్తర భారతదేశ భాషలందు బాల సాహిత్యాన్ని గురించి చర్చించుట సంభవము కాదు, కావున సూత్రప్రాయంగా ఇచ్చట వివరించడం జరిగింది.

## ఒరియా బాల సాహిత్యము :

ఒరియా జానపద సాహిత్యంలో పిల్లలకు అనుగుణమగు సాహిత్యము గేయరూపంగాను, కథా రూపంగాను కలదు. ఈ సాహిత్యాన్ని ఎంతో శ్రమతో సేకరించిన, గోపాలచంద్ర ప్రహరాజ బాల సాహిత్యాన్ని శిశుగీతములు, గేయగీతములు, క్రీడాగీతములు అనిమూడు విభాగాలుగా విభజించి ప్రచురించారు. పదవాక్య పునరుక్తులతో పిల్లల మనస్తత్వమునకు సరియగు సరళశైలిలో నున్న ఈ సాహిత్యము పిల్లలను ఆట పాటలకు ప్రేరేపించుటే గాక వారిమానసిక వికాసానికి ఎంతైనా దారి తీస్తూ వచ్చినది. ఒరిస్సా జనాభాలో 1/5 వంతులు గిరిజనులున్నారు. వారి ఆచారాలు, నమ్మకాలు, దేవతలను గురించి మనం ఎంతైన ఈ సాహిత్యం ద్వారా తెలుసు కొనవచ్చును.

ఈ జానపద సాహిత్యం కోవకు చెంది కేసవ, కోయిలి మొదలగు వారి కృతులు పిల్లలలో అధిక ప్రచారంలో వున్నవి. క్రి. శ. 1803 న ఒరిస్సాలోని పాఠశాలలో ఒరియా భాషాబోధనలకు ఏర్పాట్లు గావించి నపుడు కొన్ని పుస్తకాలు పిల్లలకుగాను ఒరియా భాషలో ప్రచురింపబడినవి. కాని అవి పాఠ్య పుస్తకాలు గనుక బాల సాహిత్యపు శ్రేణిలో పరగణింపబడవు.

ఆధునిక నిర్వచనమునకు తగిన బాల సాహిత్య నిర్మాణ ఘనత గోపబంధు దాసుకు దక్కింది. వీరు పిల్లల కొఱకు ఎన్నో మంచి పుస్తకాలు వ్రాశారు. వీరి ఈసపు కథలు, హితోపదేశము, గ్రిమికథలు ప్రసిద్ధి చెందినవి.

ప్రథమ ప్రపంచ యుద్ధానంతరము 1920-21లో సబుజథశము అనెడి యొక క్రొత్త పంథాన బాలసాహిత్య రచన ప్రారంభమైనది. సబుజ మనగా పచ్చదనము-

పలుకు పలుకున తేనె లొలుకగ
కులుకు నుడుగుల తళుకు లుబుకగ
తెలుగువారి మోహ తమసము
కలగి కరగి తొలగి పోవగ
పాడుమమ్మా చెల్లెలా !
నేడు పడమటి గాలి విసరున
వాడి చెడి వ్యక్తిత్వ ముడిగి
మాడిపోయే తెలుగు తీవియ
గడియలోపల చివురు లెత్తగ.
కత్తిపోటుకు కలము వ్రాతకు
పొత్తు కలిపిన కృష్ణరాయలు
హత్తుకొని మన తెలుగువారి
చిత్తములలో చిందులాడగ.
-కోమలమ్మ

ఈ దశములో కాళిందీచరణ పాణిగ్రాహి ఒరియా బాలసాహిత్యానికి ఎనలేని సేవచేశారు. వీరు గద్య పద్యాలతో రకరకాలైన సాహిత్యాన్ని సృష్టించి ఒరియా బాల సాహిత్య భండారాన్ని సమృద్ధపరచారు. పంచామృత మనెడి బాలల మాసపత్రికను కూడా వీరు కొంతకాలము నడిపారు. ఈ కాలములోనే సిసుసంభావళి అను పేరుతో బాలలకు "ఎన్‌సైక్లోపీడియా" తయారు జేసి బాలకృష్ణకార్ ఒరియా బాలసాహిత్య చరిత్రలో చిరస్మరణీయులైనారు.

ద్వితీయ ప్రపంచ యుద్ధానంతరము బాల సాహిత్యము ఇతోధికాభివృద్ధి గాంచింది. బాల సాహిత్యపు ప్రత్యేకతను రచయితలే గాక ప్రభుత్వము గూడా గుర్తించింది. ప్రతి సంవత్సరము ఉత్తమ బాల సాహిత్యానికి ప్రభుత్వము బహుమతులు ఇస్తూ బాలసాహిత్య వికాసానికి ఎంతో ప్రోత్సాహ మిచ్చింది. చరిత్ర, భూగోళము, ఆత్మకథలు, విజ్ఞాన శాస్త్రము మొదలగు విషయాలకు సంబంధించిన ఆశేషసాహిత్యము ఈ యుగములోనే వెలువడింది. బాలంగియా, సచిత్ర కళింగ కథలు, మేడమ్ క్యూరి మొదలగు రచనలు ఈ కాలంలో చాలా ప్రసిద్ధి కెక్కినవి.

దేశానికి స్వాతంత్ర్యము వచ్చిన తర్వాత నుండి ఒరియా బాల సాహిత్యము అన్ని హంగులతో వికాసము జెందుచున్నది. ఇపుడు ఒరియా భాషలో కథలు, పౌరాణికగాథలు, చారిత్రిక గాథలు, దేశనాయకుల ఆత్మకథలు, జీవిత చరిత్రలు, దేశ విదేశ యాత్రా కథలు, దేశ విదేశ సంస్కృతులు, విజ్ఞాన శాస్త్రము, పశు పక్షులు మొదలగు విషయాలతో కూడిన నవలలు, నాటికలు విపులంగా ప్రచురింప పడుతున్నవి. అధిక ప్రచారం పొందిన కొన్ని రచనలు దిగువ పేర్కొనబడినవి.

కవితలు — ఛవిర కవిత, మోఖేలసాథి, పిళాంక పశు పక్షిపురాణ, నిశారాక్షసి, సిసు సైనిక, పిళాంక కర్మ సంగీత, ఆమకోణార్క. ఆమ బడదేవుల.

కథలు-ఖుసిగప్, శికార్ గల్ప్, భారతర్ గ్రామ్యగల్ప్.

జీవిత చరిత్రలు-పిళాంక బుద్ధదేవ, పిళాంక నెహ్రూ, గాంధి, పటేల్ అమరజాతక.

విజ్ఞానశాస్త్రము-ఆకాశకుసాతోటపాహాోచ, తరళవాయు, ధ్వనివిజ్ఞాన, జీవజగత, జల జంతు సీరీస్, జంగల్ సీరీస్.

## బెంగాలీ బాల సాహిత్యము :

రవీంద్రనాథ ఠాగూరు అన్నట్లు బాలసాహిత్యములోని పదలాలిత్యము బాలల మనస్సులను రంజింపజేయుటేగాక పెద్దలనుకూడా తన్మయులను చేయును. "పిల్లలను మభ్యపెట్టు

టకు బెంగాలీ తల్లులు పాడు జోలపాటలలోని రాగమాధురి నన్నెంతో పరవశుణ్ణి జేస్తాయి. ఇప్పటికి అవి నన్ను ఒక అలౌకిక ప్రపంచానికి తీసుకెళుతాయి" అని రవీంద్రనాథ ఠాగూరు బెంగాలీ బాలసాహిత్యాన్ని ప్రశంసించారు.

పందొమ్మిదవ శతాబ్ది ప్రారంభమున క్రైస్తవ మతప్రచారకులు ఇతర సాహిత్య ప్రచురణలతోపాటు బాలసాహిత్య ప్రచురణ కూడ ప్రారంభించిరి. ఈ ప్రారంభిక దశలోనే శ్రేష్ఠమైన బాలసాహిత్య నిర్మాణమునకు కారణము సాహిత్య నిర్మాణానికి ఆ మతప్రచారకులు ఏర్పరచిన కమిటీలో ఈశ్వరచంద్ర విద్యాసాగర్, రాధాకాంతదేవ మున్నగువారు సభ్యులుగా ఉండుటయే. ఈ కమిటీ సిఫారసు ప్రకారము వెలువడిన పుస్తకములలో 'ఉపదేశ కథ' ముఖ్యమైనది. ఈ శతాబ్దపు పూర్వార్ధాన వెలువడిన పుస్తకాలలో తారాచంద్ర దత్ వ్రాసిన మనోరంజన ఇతిహాస్, హితోపదేశ్, జ్ఞానచంద్రిక. నీతిదర్పణ్, జ్ఞానప్రదీప్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్ వ్రాసిన బైతాల పంచవింశతి, కథామాల, ఆఖ్యానమంజరి బహుళప్రచారము గాంచినవి.

పందొమ్మిదవ శతాబ్దపు ఉత్తరార్ధము బెంగాలీ బాల సాహిత్యానికి ఒక క్రొత్త మలుపు. అపుడు ప్రచురింపబడిన మొట్టమొదటి పిల్లల నవల 'విజయవసంత'. ఇదే సమయాన తారకగుప్తగారి 'ప్రాణివిద్య' ప్రసన్న ముఖోపాధ్యాయుని 'బాలబోధ' అనెడి రెండు విజ్ఞాన శాస్త్రపుస్తకాలు వెలిశాయి. ఈ దశలోనే బెంగాలీ దిన, వార, మాస పత్రికలు బాలసాహిత్యాన్ని గుర్తించి దాని ప్రచురణకుగాను తమతమ పత్రికలలో ప్రత్యేకస్థానాన్ని కేటయించాయి. ఈ పత్రికల ద్వారా విపులంగా బాల సాహిత్యము



వెలువడింది. పత్రికల ద్వారా బాల సాహిత్య ప్రచారము చేసినవారిలో పేరెన్నికగన్న ప్రముఖులు వీరేశ్వర పాండే, కృష్ణకుమార మిత్ర, స్వర్ణకుమారిదేవి.

ఇరువదవ శతాబ్దము పూర్వార్ధములో అవనీంద్రనాథ ఠాగూరు, రవీంద్రనాథ ఠాగూరుగార్లు బాల సాహిత్య రచనా వ్యాసంగములో పాల్గొనుట మూలాన బెంగాలీ బాల సాహిత్యము అన్ని విధాల అభివృద్ధి జెందింది. అవనీంద్రనాథ ఠాగూర్ బెంగాలీ బాల సాహిత్యములో ఒక క్రొత్త శైలిని ప్రవేశపెట్టిరి. వారిగద్యము కూడ పద్యము వలె సంగీత సరిగమలతో కూడి యుండెడిది. వారు వ్రాసినపుస్తకాలలో 'రాజకహిని' 'శకుంతల' 'ఖిరేర్ పుతీల' మున్నగువవి ఈ విశిష్టశైలి వల్ల సమస్త బెంగాల్ లో విపులఖ్యాతి నార్జించినవి. ఈ పుస్తకాలు రానున్న బాల సాహిత్యానికి ఒక గీటు రాయివలె తోడ్పడినవి. రవీంద్రనాథ ఠాగూరు కూడ తన తండ్రి ననుకరించి మొదట మొదట బాలల కుపకరించు అనేక రచనలు గావించిరి. 'ఖేలేఖేల శిశు', 'మకుట', 'డాక్ ఘర్' 'హాస్యకౌముది' మున్నగునవి వీరి ముఖ్య రచనలు.

> ఎవరమ్మా ఈ అందాల బాల
> మా కనుల వెలుగు భవిష్యదుజ్జ్వల తార
> సమస్తభారతీయసంస్కృతులకామె ప్రతీక
> సకల జగతీ నాగరికత కామె పతాక
> సర్వకళా నిలయ మామె అంతరాంతరం
> సుందర భావనలకామె రూపాంతరం
> ఆమే తానె తెనుగుబాల !
> ఐదుకోట్ల పూవుల మాల !
>
> -కె. అన్నపూర్ణ

ఈ కాలమందే బెంగాలీలో బాలలకు కవితలు, కథలు, నవలలతో పాటు, నాటకాలు, ఏకాంకికలు, విజ్ఞాన పుస్తకాలు మున్నగునవి వెలువడినవి. ఇదే సమయాన బెంగాలీ జానపద సాహిత్యము కూడ సేకరింపబడి, ప్రచురింపబడినది.

స్వాతంత్ర్యము తర్వాత జోగేంద్రనాథ సర్కార్, సుకుమారరాయ్ మున్నగువారు విపులంగా బాల సాహిత్యాన్ని సృజించి ప్రచురించారు. ఇదేసమయాన జోగేంద్రనాథ గుప్త 'శిశుభారతి' పేరుతో పిల్లల "ఎన్‌సైక్లోపీడియా"ను ప్రచురించారు. అనేక పిల్లల పత్రికలు ఇదేసమయాన వెలువడినవి.

అఖిల నియోగి 'సపనబురో' పేరుతో అనేక కథలు, నాటకాలు నవలలు ప్రచురించారు. బెంగాలీ బాల సాహిత్యానికి అనన్యసేవచేసి పేరుగాంచిన వారిలో ప్రేమేంద్ర మిత్ర అగ్రగణ్యులు. వీరి ప్రతి రచనలోని నాయకుని పేరు 'ఘనాద' అగుట వలన వీరిని పిల్లలు కూడ అదే పేరుతో పిలిచేవారు. బాలల నాటకాలలో 'కనాయిబల' ఎక్కువ పేరుగాంచింది. ఇది కలకత్తాలోని ప్రసిద్ధ థియేటర్ 'విశ్వరూపము' మొదలగు చోట్ల అనేక పర్యాయాలు ప్రదర్శింపబడింది. ఇపుడు నూర్లకొలది బాల పత్రికలు బెంగాలీలో వెలువడుచున్నవి. వాటిలో 'సందేశ్' 'శిశుభారతి' 'సుకతార' 'రోయినాయి' 'రామ్‌ధున్' 'ఝిలిమిలి' చాలా పేరెన్నికగన్నవి. ఈ బాల పత్రికలద్వారా అసంఖ్యాకమైన బాల సాహిత్యము ప్రతియేటా ప్రచురింపబడుచున్నది. ఇంగ్లీషు నుండే గాక ఇతర భాషలనుండి కూడ శ్రేష్ఠమైన బాల సాహిత్యము బెంగాలీలోనికి అనువదింపబడుచుండుట గమనార్హము. కొద్ది సంవత్సరాల క్రితము పిల్లా సుబ్బారావు శాస్త్రిగారి తెలుగు నవల 'పారి పోయినబఠాని' బెంగాలీలో అనువదింపబడి వేనోళ్ల ప్రశంసల నందుకొన్నది.

## అస్సామీ బాల సాహిత్యము :

అస్సాము ముందటి పేరు 'కామరూపము'. కామరూపము ప్రాచీన కాలమునుండి మంత్ర తంత్రాలకు ప్రఖ్యాతి గాంచింది. అస్సాము నందు కొన్ని వందల జాతుల గిరిజనులు వివిధ విధాల భాషలు, ఆచార విచారాలుగల వారు ఉన్నారు. అందువల్ల అస్సాము ప్రాంతము ఏ దృష్టితో చూచినను ఒక విలక్షణమైన ప్రాంతము. అందువల్లనే ఈ ప్రదేశము పేరు 'అసము' (సమము లేదా సమానత లేనిది). అస్సామీలోని జానపద సాహిత్యములో పిల్లలకు కూడ ఎంతో సాహిత్యము ముంది. ఆ సాహిత్యమంతా గిరిజనుల దేవీ దేవతలు, గిరిజనుల నమ్మకాలు, వారి ఆచారాలు, వారి ఉత్సవాలు, వారి అద్భుతమైన మంత్రతంత్రాలు, వాటి పరిణామాలు, అస్సాము రాజులచరిత్రలు, వారి వీరోచిత యుద్ధాలు అన్ని వర్ణింపబడియున్నవి.

స్వాతంత్ర్యము ప్రాప్తించువరకు అస్సామీ భాషలో చెప్పుకోదగ్గ బాలసాహిత్యము వెలువడలేదనే చెప్పాలి. స్వాతంత్ర్యానంతరము అస్సామీ బాలసాహిత్య వికాసానికై ఎంతో కృషి జరిగింది. తొలుత ఇంగ్లీషునుండి కొన్ని రచనలు అస్సామీలోనికి అనువదింపబడినవి. వాటిలో 'వాగనరార్ సాధు', 'ఈసపేర్ సాధు', 'అలిఫ్ లేల' ముఖ్యమైనవి. 'అరుణోదయ' మాసపత్రిక వెలువడుట, అందులో బాల సాహిత్యానికై ప్రత్యేక స్థానాన్ని కేటాయించుట అస్సామీ బాలసాహిత్య వికాసానికి చాలా ఉపకారము చేకూర్చాయి. ఈ పత్రిక ద్వారానే అనేక క్రైస్తవ మతప్రచారకులు 'బాయిబలేర్ సాధు', 'ఆఫ్రికర్ కోంబర్', 'మాపురి ఛోవాలి', 'ఈగలర్ బాహా' మున్నగు రచనలను ప్రచురించిరి. గడచిన రెండు దశాబ్దాలలో అస్సామీ బాలసాహిత్యము అన్ని విధాల అభివృద్ధి చెందినదని చెప్పవచ్చును. కథలు, నాయకుల జీవితచరిత్రలు, విజ్ఞాన శాస్త్ర కథలు, నాటికలు మొదలగునవి ప్రతియేడు ఎక్కువగా ప్రచురింపబడుచున్నవి.

దేవకన్యలకు సంబంధించిన వివిధ భారతీయ భాషల కథలుకూడ అస్సామీ భాషలో వ్రాయబడినవి. 'నిమాతి కన్య', 'సపోన్కువారి', 'పరీర్ దేశర్', 'అంజిమణి', 'రాణి హిమాణి', 'పింపిం పరువార్', 'అపేశ్వరీర్ దేశ్' మున్నగునవి ఈ కోవకు చెందినవి. 'లరార జాతక', (పిల్లల జాతకకథలు), 'రామాయణార్ రహఘర', 'పూరణ ఆఖ్యాన', 'ఉపనిషదర్ కహాని', రఘువంశర్ కథ' మున్నగునవి పురాణ గాథలు. 'జాపాని సాధు', 'ఎండర్ సనర్ సాధు', 'సుహరాబ్ రుస్తుమ్' మున్నగు విదేశీ కథలు అస్సామీ బాలకథా సాహిత్యములో అధిక ప్రసిద్ధి గాంచినవి. లోకప్రియ గోపీ



నాథ్ బరదలై (నవ అస్సామ్ నిర్మాత) 'లరార్ శంకర్ దేవ్' (శంకర్ దేవ్ అస్సామీలకు హిందీలో సూరదాస్‌తో సమానము), 'విశ్వార్ వరణీయ', 'శహీద్ కనకలత', 'లరార్ లచిత బరపుకన్' మున్నగువవి అస్సాము ప్రదేశపు నాయకుల జీవిత చరిత్రలు అస్సామీ బాలలకు ఎంతో స్ఫూర్తిని ప్రసాదిస్తాయి. కీర్తినాథ్ హాజారిక అనేక బాల నాటికలు వ్రాసి అస్సామీలో బాలనాటికలకు నాంది వేశారు.

'మయినా పారిజాత', 'చమనీయ సాహిత్య సంస్థ', 'చమనీయ శిల్ప సాహిత్య సంస్థ' మున్నగు బాలసంస్థల కృషివలన దీపక్, జోన్ బాయి, నతునబెలి మున్నగు బాలపత్రికల ప్రోత్సాహముతో అస్సామీ బాలసాహిత్యము దినదినాభివృద్ధి చెందుచున్నది.

### మరాఠీ బాలసాహిత్యము :

జానపద సాహిత్యములోనున్న పిల్లల సాహిత్యము తర్వాత మరాఠీలోని అతిప్రాచీన బాలసాహిత్య రచన 'పంచతంత్రము'. ఇది 15 వ శతాబ్దిలోనే అనువదింపబడింది. బ్రిటిషు

వారి పరిపాలనతోపాటు మరాఠీలో ఆధునిక బాలసాహిత్యము ప్రారంభమైందని చెప్పవచ్చు. క్రైస్తవ మతప్రచారకులు మరాఠీలో సురుచి పూర్ణ బాలసాహిత్య నిర్మాణానికి పూనుకొని 'బాంబె నేటివ్ ఎడ్యుకేషన్ సొసైటి'ని స్థాపించిరి. ఈ సొసైటి ఆధ్వర్యాన బాలగోష్ఠి, బోధకథ, బాలమిత్ర మున్నగు పుస్తకాలు ప్రచురింపబడినవి.

ప్రథమ ప్రపంచ యుద్ధము తర్వాత పిల్లల కొరకు 'ఆనంద' బాలపత్రిక వెలువడింది. ఈ పత్రికలో గోవింద ఆప్టే, నారాయణ హరి ఆప్టే, ఆచార్య అత్రే మున్నగువారి రచనలు ప్రచురింపబడేవి. ఈ రచనలలో 'సుఖచా మూలమంత్ర', 'ఇనాముదారచా బాలు', 'గురుదక్షిణ' మున్నగునవి ఎంతో పేరు గాంచినవి. 'ఆనంద' పత్రికలోని 'ఫూలోంకీ బగీచా' అనెడి శీర్షిక క్రింద పిల్లలద్వారా రచింపబడిన రచనలు గూడ ప్రచురింపబడేవి. ఇదే సమయాన 'శాల' పత్రిక 'బాలోద్యాన్', 'బచ్చోంకా మాసిక్', 'ఖేలోద్యాన్' మున్నగు బాలపత్రికలు మరాఠీలో వెలసినవి.

1947 తర్వాత మరాఠీలో బాలకథలు, కవితలు, నాటికలు, వ్యాసాలతో కూడిన అనేక పుస్తకాలు వెలువడినవి. పిల్లల మనస్తత్వాన్ని గుర్తించి వారికి బోధగమ్యమగు సాహిత్య రచన చేయాలన్న విషయము విస్మరింపక మరాఠీ సాహిత్యకారులు పిల్లలకు ఎంతో ఉపయోగకరమైన సాహిత్యాన్ని సృష్టించారు. భాషాప్రయుక్త రాష్ట్రంగా 'మహారాష్ట్ర' రాష్ట్రము ఏర్పడినప్పటినుండి ప్రభుత్వపక్షాన బాలసాహిత్య వికాసానికి చేపట్టిన అనేక కార్యక్రమాలలో బాల రచనాలయాల స్థాపన, బాలసాహిత్యానికి బహుమతు లివ్వడం, బాల సాహిత్య పోటీల నిర్వహణ, కొన్ని ప్రముఖ బాలపత్రికలకు, వాటి ప్రత్యేక సంచికలకు గ్రాంట్లు ఇవ్వడం, రాష్ట్రమంతట వ్యాపించి యున్న గ్రంథాలయాలకు బాలసాహిత్యం సరఫరా చేయడం మున్నగునవి ప్రశంసింపదగినవి. ప్రభుత్వ సహాయముతోపాటు మరాఠీ రచయితల వైజ్ఞానికదృక్పథమువలన ఈనాడు మరాఠీ బాలసాహిత్యము అత్యుత్తమస్థానాన్ని అందుకొన్నది. పిల్లలలో కూడ సాహిత్యరచన వ్యాసంగాలను పెంపొందింపజేయుటకు 'బాల రచనాలయాలు' చేయుచున్న కృషి వాస్తవంగా ఇతర భాషలవారికి కూడ అనుకరణ యోగ్యమైనది.

## గుజరాతీ బాలసాహిత్యము :

గుజరాతీ జానపద సాహిత్యంలో పిల్లలను రంజింపజేసే గేయాలెన్నో ఉన్నాయి. గుజరాతీల చరిత్ర, నాగరికత, వీరగాథలు మున్నగు జ్ఞానవర్ధక విషయాలు తెలిపే ఈ గేయాల పునాదిపైన నిర్మింపబడిన ఆధునిక గుజరాతీ బాలసాహిత్యము ఒక ప్రత్యేకతను రూపొందించుకొంది.

ఆధునిక గుజరాతీ వైతాళికుడు, కవియగు దలపతిరాయ్ పిల్లలకు అనేక గేయాలను రచించారు. వీరి ననుసరించి ఆకాలపు రచయితలు చాలా గేయసంపుటాలు ప్రచురించారు. 'మధుబిందు', 'సచనోపి ఆయి' అను కావ్యాలు ఈ కాలంలో చాలా పేరు పొందినవి. స్వతంత్రతా సంగ్రామములో గాంధీవాద ప్రవేశముతో గుజరాతీ బాలసాహిత్యంలో ఒక మలుపు వచ్చింది. బాలసాహిత్యంపైన అనేక గంభీర పరిశోధనలు జరిపి గిజూభాయి నవీన సరళ ఆధునిక శైలిలో పిల్లలకు ఎంతో సాహిత్యాన్ని సృష్టించారు. వీరు ఆధునిక గుజరాతీ బాలసాహిత్య రచయితలలో సర్వశ్రేష్ఠులుగా పేరుపొందారు. గిజూభాయి ననుసరించి

అనేక కవులు పిల్లలకు అనేక గేయాలు, కవితలు వ్రాశారు. అత్యాధునిక కవులుకూడ బాలసాహిత్య వికాసాని కెంతో తోడ్పడుచున్నారు. పిల్లలకు కావ్యాలు రచించే పేరెన్నికగన్న కవులలో సురేష్ దలాల్, బాలముకుంద దవె, మకరంద్ దవె, రమణ్‌లాల్ సోని అగ్రగణ్యులు.

పిల్లలకొరకు రచింపబడిన ప్రప్రథమ గుజరాతీ గద్యపుస్తకము 'కరనదేవి'. మందశంకర్, కాకాసాహెబ్ కాలేల్కర్, హంసాబేన్ మెహతా, ఝువేర్‌చంద మేఘానీ మున్నగువారి గద్యరచనలు పేరెన్నికగన్నవి. ఇతర భారతీయ భాషలనుండి విశేషించి బెంగాలీ, హిందీ, మరాఠీలనుండి ఎన్నో పుస్తకాలు గుజరాతీలోనికి అనువదింపబడినవి. విదేశీభాషలందు, భారతీయ భాషలందున్న జానపద గాథలు ఎన్నో సంపుటాలలో గుజరాతీలో ప్రచురింపబడినవి.

విజ్ఞానశాస్త్రానికి సంబంధించిన అనేక విషయాలపై గుజరాతీలో చాలా పుస్తకాలు వెలువడినవి. విజయకుమారగుప్త రచించిన వైజ్ఞానిక బాలల నవల 'కామియాగర్' హిందీ మున్నగు ఉత్తర భారతీయ భాషలలో అనువదింపబడినవి.

కాకా కాలేల్కర్, సి.సి. మెహతా మున్నగువారు రచించిన నాటకాలు ఎన్నోచోట్ల బాలల రంగస్థలాలలో ప్రదర్శింపబడినవి.

గుజరాతీ భాషలో బాలల పత్రికలకున్న ప్రత్యేకత మరేభాషలో లేదన్న అతిశయోక్తి కాదు. మాసపత్రికలే కాక పక్షపత్రికలు, వారపత్రికలు పిల్లలకొరకు వెలువడుచున్నవి. బాలజీవన్, కూమర్, గాండీవ, బాలసందేశ్, జగమగ, రసరంజన్, రమకణు, బాలమిత్ర మున్నగు పత్రికలు మంచి ఆర్టుపేపరులో



రంగురంగుల చిత్రాలతో ఆకర్షకరమైన సైజులలో కన్నుల పండువుగా వెలువడుచున్నవి.

**సింధీ బాలసాహిత్యము :**

దేశ విభజనకు పూర్వమే సింధీ బాలసాహిత్యానికి పునాదు లేర్పడినవి. ఆ సమయాన ఫతహచంద్ వాసవానీ బాలరామాయణ, బాల మహాభారత, బాల శ్రీకృష్ణ, వీరబాలక, అఖలాకి సబక మున్నగు రచనలు చేసి ఈ సాహిత్యానికి ఒక మార్గాన్ని చూపించారు. కాని దేశవిభజన కారణంగా సింధీ మాట్లాడువారు దేశమందు ఒక ప్రాంతములో స్థిరనివాసము ఏర్పరచుకొనలేకపోవటముచేత పది సంవత్సరాలవరకు బాల సాహిత్యానికిగాని, మిగతా సాహిత్య రచనకుగాని అవకాశాలు లేకపోయాయి. 1957వ సంవత్సరాన కేంద్ర ప్రభుత్వముద్వారా సింధీ బాలసాహిత్యానికి కూడ బహుమతులిచ్చెడి పథకము వలన కొన్ని సంవత్సరాల తర్వాత, మన రాజ్యాంగములో ఆ భాషకు స్థానము కల్పించుటమూలాన గత కొన్ని సంవత్సరాలలో ఈ భాషలోకూడ బాల సాహిత్య రచనలు వెలువడుచున్నవి.

> పారిజాతమంటే నా కెంతో ఇష్టం !
> జారి కిందరాలితే నుదికెంతో కష్టం !
>
> సత్య కోసం స్వర్గంనుంచి
> కృష్ణుడు తెచ్చిం దీ పూవేనా !
> కాకపోతే ఇంత గుమగుమలు
> రంగులు హంగులు ఉండేనా !
>
> మంచులో ఏమిచెప్పను దాని అందం ?
> కంచి పట్టు మెత్తదనం దాని చందం !
>
> ఎర్రని కాడలు తీడుతా
> నా పరికిణీ అంచులకు
> ఉదయరాగ సౌందర్యం
> ఉత్తది ! నా కెందులకు ?
>
> -కొరిడె నిర్మల

గులిస్తాన్ (అహమ్మదాబాద్ నుంచి వెలువడుచున్న పత్రిక), గుల్ ఫుల్ (బొంబాయి నుండి వెలువడిన పత్రిక), జోత్, శాంతి, ముఖిరియా (ఢిల్లీనుండి దేవనాగరి లిపిలో వెలువడు పత్రిక) అనెడి బాల మాసపత్రికలలో ఇప్పుడిప్పుడు పిల్లలకు రుచికరమగు సాహిత్యము ప్రచురింపబడుచున్నది. ఇతర భాషల నుండి ముఖ్యంగా హిందీనుండి అనేక రచనలు సింధీలో అనువదింపబడుచున్నవి.

సింధీ బాలసాహిత్య రచనలలో 'గోవర్ధన భారతి', 'జీవతగోగ్యా', 'లఖ్మణకోమల్', 'కిరత్ బాబాణీ, సుందరీ ఉత్తమ్ చందాణీ', 'కమల్ ప్యాసి', 'పారసమల్ జియా' మున్నగు వారు నవలలు, కథలు, జీవితచరిత్రలు, కవితలు వ్రాసి సింధీ బాలసాహిత్యాభివృద్ధికి ఎంతగానో తోడ్పడుచున్నారు.

**పంజాబీ బాల సాహిత్యము :**

ఈ శతాబ్దపు పూర్వార్ధములో పంజాబీ బాల సాహిత్యములో మాస్టర్ కరణసింహ్ గంగా వాలా ఒక విప్లవాత్మకమైన మార్పు తెచ్చారు. వీరు చూపిన మార్గములో బాల సాహిత్య సృష్టి కొఱకు బాల మాస పత్రికలు వెలువడినవి. ఈ బాల పత్రికలే పంజాబీ బాల సాహిత్యానికి కారణ మయ్యాయని చెప్పుకోవచ్చు. ఇప్పటి పాకిస్తాన్ ప్రాంత మందున్న గుజరాంవాలాలో 1934 న జ్ఞానీ లాలసింహ్ గుజరాంవాలా అనునతను 'బాలక్' అను మాసపత్రికను ప్రారంభించిరి. అమెరికా మున్నగు పాశ్చాత్యదేశాల బాల సాహిత్యం నుండి ప్రేరణ పొంది పంజాబీ బాలసాహిత్య అభివృద్ధి కొఱకు 1942లో గురుబక్షసింగ్ 'బాల సందేశ్' అను పత్రికను స్థాపించిరి. గురుబచన్ సింగ్ ద్వారా 1949లో ప్రారంభింపబడిన 'బాలక్', 1951లో వెలువడిన 'స్కూల్', తర్వాత వెలువడిన 'కణకణ', 'బాలసాహిత్య', 'బాల దర్బార్' మున్నగు పత్రికలలో విపులంగా బాల సాహిత్యం వెలువడింది.

ప్రారంభములోనే జ్ఞానీ లాలసింహ్ గుజరాంవాలా బాలలకు 15 పుస్తకాలు వ్రాసి ప్రచురించారు. కేంద్ర ప్రభుత్వము ద్వారా భారతీయభాషలందు వెలువడు బాలసాహిత్యానికి బహుమతులు ప్రసదాము చేయు పథకము మొదలైనప్పటినుండి పంజాబీ బాలసాహిత్య రచన ద్విగుణీకృతమైంది. ఈ శతాబ్దపు ఉత్తరార్ధాన ఒక్క ధనవంతసింహ సీతల్ అను సాహిత్యకారుడే కథలు,నవలలు, జీవితచరిత్రలు మొదలగు బాలల పుస్తకాలు 150 వరకు వ్రాసి ప్రచురించారు. రాజదులార్ పంజాబీలో పిల్లలకు అనేక కవితలు వ్రాశారు. వీరి కవితాసంకలనలు ఇప్పటి వరకు 13 అచ్చు అయ్యాయి. సుభచింతక్, గురుదయాల్ సింహ్

ఫూల్ మున్నగు వారు బాల నాటక కారులలో ప్రఖ్యాతికెంచారు గురుబచన్‌సింగ్ అధిక సంఖ్యలో వైజ్ఞానిక సాహిత్యాన్ని సృష్టించారు. అగ్గాదీ కహానీ (అగ్ని కథ), మోతీదీ కహానీ (ముత్యపు కథ), శహద్‌దీ కహానీ (తేనె కథ) మున్నగునవి వీరి పేరుగాంచిన రచనలు.

సుఖదేవ్ మాదపురి, జరీదా టపా శీర్షిక క్రింద చైనా, అమెరికా, గ్రీస్, కొరియా, టర్కీ, అరబ్, ఇటలీ, జపాను, రష్యా మొదలగు దేశాల జానపదగాథలను ప్రచురించారు.

ఈ శతాబ్దపు ఏడవదశాబ్దిలో మనమోహన్, చందన్, బఛారాణా అనెడి పత్రికలు వెలువడి పంజాబీ బాలసాహిత్యాభివృద్ధికి ఎనలేని సేవచేస్తున్నవి.

## కాశ్మీరీ బాలసాహిత్యము :

కాశ్మీరీ భాష జానపదగేయాలకు ఆటపట్టు. ప్రకృతిరమణీయత, అచ్చటి పశుపక్షులు మొదలగునవి ఈ జానపదగేయాల్లో వర్ణింపబడిన ముఖ్యవిషయాలు. వీరి నమ్మిక ప్రకారము 'హుామా' అనెడిపక్షి భాగ్యానికి చిహ్నము. గుడ్లగూబ మంత్రతంత్రాలకు చిహ్నము. చిలుక చతురతకు చిహ్నము. ఈ పక్షులను గూర్చి ఎన్నోపాటలు పిల్లలు పాడుకొంటుంటారు. ఈ పశు పక్షులకు సంబంధించిన కథలే గాక, అలీబాబా 40 దొంగలు, హాతింతాయి, మున్నగు ఇస్లామ్‌దేశాల కథలు గూడ ఇచట ప్రచారములో నున్నవి. స్వాతంత్ర్యప్రాప్తి తర్వాతనే కాశ్మీరులో బాలలకు పుస్తకాలు వెలువడినవి. మొదట జనపదగాథల సంపుటి, అటు తర్వాత జోలపాటల సంపుటి ఒకటి వెలువడినవి. ఇంత వరకు వెలువడిన బాలల పుస్తకాల సంఖ్య అతిస్వల్పము (దాదాపు 20). కేంద్ర ప్రభుత్వ బాలసాహిత్య పథకముక్రింద కొన్ని పుస్తకాలకు బహుమతులు లభించాయి.



రాష్ట్రంలో ఉర్దుస్థానే కాశ్మీరీ భాషాబోధన ఎక్కువైన కొలది బాలసాహిత్యనిర్మాణము పెరుగగలదని ఆశింపవచ్చును.

## ఉర్దూ బాలసాహిత్యము :

ఉర్దూ బాలసాహిత్య ప్రచురణ ముఖ్యంగా ఢిల్లీ, లక్నో, రాంపూర్ నుండి జరుగుతున్నది. 'ఖిలోనా' 'నూర్', 'ప్యామేతాలీమ్', 'మక్తబ జామేయ్', 'జామేయానగర్', 'కలియా', 'ఫుల్‌వాడే', 'గుంచ' ఉర్దూలోవెలువడుచున్న బాలపత్రికలు. ఈ పత్రికలలో ప్రచురింపబడు బాలసాహిత్యమేగాక వేరుగాకూడ కొంత జ్ఞానవర్ధకమైన సాహిత్యము పుస్తకాల రూపంగా ప్రకటింపబడినది ఉర్దూ బాలహిత్యానికి మాజీ రాష్ట్రపతి డాక్టర్ జాకీర్ హుసేన్ గారు చేసినసేవ ఎనలేనిది. వారి రచనలలో 'అబూఖాన్ కీ బకరీ ఔర్ చౌదహ్ కహానియా', 'దయాసల్' మున్నగునవి భావి ఉర్దూ బాలసాహిత్యరచయితలకు ఆదర్శప్రాయమైనవి.

ఇతరభారతీయ భాషలనుండి-ముఖ్యంగా హిందీనుండి చాలా బాలసాహిత్యము అను

కన్నులు లేని కబోదిలోన
వెన్నుని రూపును వెదకుము
కన్నులున్న కసాయీని
తెన్నుల దయ తరలింపుము.

వెల్లి విరిసి విరుల జిమ్మె
పిల్లల ప్రేమించుమయ్యా
తల్లడిల్లు జీవనాడి
యుల్లము మురిపింపుమయ్యా.

రోదించెడి సోదరులను
మోదింపగ చేయుమోయి
ఆదర్శము వీడకోయి
సాదరముగ చూడవోయి.

-పి. బి. అణ్ణంగారాచార్యులు

వదింపపడుచున్నది. శ్రీపిళ్లాసుబ్బారావు శాస్త్రి వ్రాసిన 'పారిపోయిన బతాని' తెలుగునుండి ఉర్దూలోనికి అనువదింపబడినది. ఇపుడు అనువాద సాహిత్యముగాక కథలు, నవలలు, నాటకాలు, విజ్ఞాన శాస్త్ర విషయానికి సంబంధించిన పుస్తకాలు ఎంతో ఆకర్షణీయంగా వెలువడుచున్నవి. ఢిల్లీలోని 'జామియా మిలియా ఇస్లామియా' అనెడి సంస్థ ఉర్దూలో పిల్లల సాహిత్య నిర్మాణానికై ఎంతో కృషి చేయుచున్నది.

## హిందీ బాలసాహిత్యము :

హిందీ పేరుతో పిలువబడు జానపద సాహిత్యము ఒక్క భాషలో నుండక వ్రజ, అవధీ, భోజపురీ, మైథిలీ, మాలవీ, రాజస్థానీ, బుందేల్ ఖండీ మున్నగు 18 మాండలిక భాషలలో నుండుట ఒక ప్రత్యేకత. ఈ 18 మాండలిక భాషల జానపద సాహిత్యములో నున్న బాల సాహిత్య ప్రత్యేకతలు కొద్దిగానైనా ఆధునిక హిందీ బాలసాహిత్యములో నుండుట సహజమే. ఈవిధంగా వివిధ మాండలికాల ప్రత్యేకతలను గ్రహించి ఆధునిక హిందీ బాల సాహిత్యంగా రూపొందిన ఈ సాహిత్య ప్రారంభం 1645 నుండి అని హిందీ సాహిత్యకారులు పేర్కొంటారు.

రాజా శివప్రసాద్ సితారే హింద్ 1845న ప్రప్రథమంగా హిందీలో పాఠ్యపుస్తకాలు వ్రాశారు. పాఠ్యపుస్తకాలేకాక పిల్లలకు మనోరంజనము చేకూర్చే పంచతంత్ర, హితోపదేశ్, కథాసార్ మున్నగు ఉపయోగకరమైన పుస్తకాలు ప్రచురించుటకు ఎంతగానో తోడ్పడినారు. ఇదే సమయాన అగ్రాలో స్థాపించబడిన స్కూల్ బుక్ సొసైటీ మున్నగు క్రైస్తవ మతప్రచారక సంస్థలు పిల్లలకొరకు సరళశైలిలో హిందీలో కొన్ని పుస్తకాలు ప్రచురించాయి. ఈ యుగంలో హిందీ భాషకు స్కూళ్ల పాఠ్యక్రమములో స్థానము ప్రాప్తించుట హిందీ బాలసాహిత్య వికాసానికి మొదటి మెట్టు అని చెప్పాలి.

1873 నుండి 1900 వరకు నుండు యుగము హిందీ సాహిత్య చరిత్రలో భారతేందు యుగమందురు. భారతేందు హరిశ్చంద్ర ఆధునిక హిందీ వైతాళికుడు. భారతేందు హరిశ్చంద్ర, భారతేందు మండ లనబడు వీరి సమకాలిక సాహిత్యకారులు హిందీ సాహిత్య వికాసానికి చేసిన సేవ అవిస్మరణీయము. వీరు ఆ యుగపు అవశ్యకతను గుర్తించి పిల్లలకు పాఠ్యపుస్తకాలే గాక పౌరాణిక గాథలు, పురాణ పాత్రలతో కూడిన అనేక బాల నాటికలు రచించిరి. ఇటువంటి నాటకాలలో భారతేందుగారు రచించిన సత్యహరిశ్చంద్ర ఎంతో పేరు హొందినది. ఇదే యుగమున భారతేందుగారు బాలబోధిని అనెడి బాల మాసపత్రికను

స్థాపించి హిందీ బాలసాహిత్యానికి ఎనలేని సేవ జేసిరి.

1900 నుండి 1930 వరకు గల నిర్మాణ యుగాన్ని ద్వివేదీ యుగమని పిలువవచ్చును. మహావీరప్రసాద్ ద్వివేదీ ఈ యుగనాయకుడు. హిందీ బాలసాహిత్యానికి ఈ యుగాన్ని ఒక విధంగా స్వర్ణయుగమని చెప్పవచ్చు. ద్వివేదీ గారు స్వయంగా రచయితలే గాక తమ సమకాలీన అసంఖ్యాక రచయితలను హిందీలో వ్రాయుటకు ప్రేరేపించారు. అనేకమందికి వ్యాకరణసమ్మతమైన హిందీ బాష వ్రాయుట వీరు తాము నడిపే 'సరస్వతి' పత్రికద్వారాను, వ్యక్తిగతంగా ఉత్తరాలద్వారా నేర్పిరి. భారతీయ సంస్కృతి పునరుద్ధరణ, భారతీయ రాష్ట్రీయతా వికాసము ఈ యుగమువారి ముఖ్యధ్యేయమై యుండెడివి. ఈ ధ్యేయాన్ని సాధించుటకే వీరు సాహిత్యాన్ని సాధనంగా చేపట్టిరి. (1) స్కూళ్లకు అనుగుణమగు పాఠ్యపుస్తకాల నిర్మాణము (2) బాలసాహిత్య నిర్మాణము (3) అక్షరాస్యతా వికాసానికి తగు పుస్తకాల నిర్మాణము ఈయుగపు అవసరాలై యుండెడివి. ఇదే యుగాన అప్పుడప్పుడే ఇంగ్లీషులో బాల పుస్తకాలు మనదేశమునకు వచ్చాయి. అవసరాలను పూరించే నిమిత్తమై ద్వివేదీగారు స్వయంగా బాలరామాయణ్, బాలమహాభారత్, బాలభాగవత్, పాండవ వివాహ మున్నగు పుస్తకాలు వ్రాసిరి. ఉత్తరోత్తరా సాహిత్యములో అధికకీర్తిప్రతిష్ఠ లందుకొన్న నూర్ల కొలది కవులు, రచయితలు ద్వివేదీగారి ఆహ్వానాన్నందుకొని వేలకొలది బాలసాహిత్య పుస్తకాలను రచించారు. మైథిలీ శరణ్ గుప్త, రామకుమార్ వర్మ, గులాబ్ రాయ్, కామతా ప్రసాద్ గురు మున్నగు వారు ఈ యుగములో బాలసాహిత్య నిర్మాణ



ప్రక్రియలోనే తమ రచనా వ్యాసంగాన్ని వికాసింప చేసుకొన్నారు. ఖేల్ తమాషా, ఖిలోనే, హమారీ ఛడీ, డాక్ ఘర్, మనోరంజన్ కహానియా, బాఘ్ అవుర్ భాలూకీ కహానీ, షేక్ చిల్లీకీ కహానియా, మహాపురుషోంకీ జీవనియా మున్నగు బాలల పుస్తకాలు ఈ యుగంలో అధిక ప్రసిద్ధి పొందినవి. ఈ యుగంలోనే బాలహితకర్, ఛాత్ర హితైషీ, బాలప్రభ, మానిటర్, విద్యార్థి, బాల మనోరంజన్, శిశు, బాలసఖ, బాలక్ మున్నగు ఎన్నో బాలపత్రికలు వెలువడి బాలసాహిత్య నిర్మాణానికి అనన్యసేవ జేశాయి.

1930 నుండి 1947 వరకు పరిశీలనయుగంగా భావించినకాలంలో-బాలసాహిత్యం అనగా నేమి? ప్రౌఢ సాహిత్యానికి, బాలసాహిత్యానికి భేదమేమి? బాల మనస్తత్వము, బాలసాహిత్యానికి సంబంధమేమి?-మున్నగు విషయాలపైన ఇష్టాగోష్ఠులు జరిగి మున్ముందు వైజ్ఞానిక బాలసాహిత్య సృష్టికి పునాదులేర్పడ్డాయి. 1945 లో అప్పటివరకు వెలువడిన బాలల పుస్తకాల సమగ్రసూచి తయారు

చేయబడినది. ఇదే సంవత్సరాన బాలసాహిత్యం పైన పరిశీలనాత్మక వ్యాసాలు గూడ ప్రచురింపబడ్డాయి. హిందీ బాలసాహిత్య రచనాకారుల సమ్మేళనానికి ప్రయత్నాలు జరుపబడ్డాయి. కొన్ని నగరాలలో-ముఖ్యంగా మధ్యప్రదేశ్ లోని జబల్ పూర్ నందు నర్మదాప్రసాద్ మిశ్రగారి ప్రయత్నాలతో రంగురంగుల చిత్రాలతో పిల్లల మనస్తత్వాని కనుగుణమగు ఎన్నో పుస్తకాలు ప్రచురింపబడ్డాయి. హిందీ ప్రాంతాలలోనేగాక ఇతర ప్రాంతాలలో గూడ హిందీ బాలసాహిత్య అభివృద్ధి కొరకు ప్రయత్నాలు జరగటం ఈ యుగంలోనే. వార్ధాలోని శిష్టార్థ సాహిత్య ప్రకాశన్ సంస్థ హిందీలో బాలసాహిత్యాన్ని ప్రచురించటం గమనార్హము.

వికాసయుగము (1947-1957)లో కథా సాహిత్యము అధికంగా వెలువడింది. జబల్ పూర్ నుండి టి. కృష్ణస్వామి గారు వ్రాసిన తెనాలిరామ్‌కీకహానియా (తెనాలిరామ లింగని కథలు) వెలువడుట ఈ యుగపు ప్రత్యేకత అనవచ్చును. ప్రప్రథమంగా తెలుగు తెనాలి రామలింగడు హిందీ బాలలకు పరిచయమగుట గమనార్హము. ఈయుగంలోనే చాల నవలలు ఇంగ్లీషు నుండి హిందీలోనికి అనువదింపబడినాయి. 1948 లో కేంద్ర ప్రభుత్వము బాల భారతి అనెడి పిల్లల మాసపత్రికను ప్రారంభించింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా హిందీ బాలసాహిత్య నిర్మాణానికి కొన్ని పథకాలు ప్రారంభించుటచేత లెక్కకు మించిన బాలసాహిత్య ప్రచురణ కర్తలు ముందుకు వచ్చారు. స్వతంత్రతాసంగ్రామము, స్వాతంత్ర్య సంగ్రామయోధులు, స్వాతంత్ర్య రక్షణ, గాంధీ వాదము మున్నగు విషయాలపైన నాటికలు, కవితలు, కథలు, నవలికలు వెలువడింది ఈ యుగంలోనే. హిందీ ప్రాంతము నుండే గాక ఇతర ప్రాంతాలనుండి గూడ ఈ యుగంలోనే చాల బాల పత్రికలు వెలువడినవి. పెక్కు స్కూళ్లలో హస్తలిఖిత పత్రికలుకూడ వెలువడినవి. తెలుగు, గుజరాతీ, బంగ్లా, మున్నగు ఇతర భారతీయ భాషల బాలసాహిత్య పరిశీలనతోపాటు హిందీ బాలసాహిత్య పరిశీలనపైన వ్యాసాలు పేరు పొందిన పత్రికలలో వెలువడినవి.

ఆధునిక యుగము (1957 నుండి ఇప్పటి వరకు) ప్రారంభంలోనే కేంద్ర ప్రభుత్వం హిందీ, ఇతర భారతీయ భాషల బాల సాహిత్యాభివృద్ధికిగాను శ్రేష్ఠమైనపుస్తకాలకు బహుమతులిచ్చు పథకాన్ని జారీచేయుట చేతను, ఉత్తర ప్రదేశ్, బిహారు, మున్నగు హిందీ రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా ఉత్తమ బాల సాహిత్యాభివృద్ధికై అనేక నూతన పథకాలు అమలు జరుపుటవలనను హిందీలో బాల సాహిత్య ప్రకాశకుల సంఖ్య ఇతోధిక వృద్ధి చెందుతున్నది. ఇప్పుడు హిందీ బాల సాహిత్య నిర్మాణానికి హిందీ భాషీయులే గాక ఇరత భారతీయ రచయితలు గూడ ఎనలేని సేవచేస్తున్నారు. శ్రీ బాలశౌరిరెడ్డి, మున్నగు దక్షిణ భారతీయులకు వారు వ్రాసిన హిందీ బాల సాహిత్య పుస్తకాలపై కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల నుండి బహుమతులు లభించినవి. ఈ యుగంలో హిందీలో బాలసాహిత్యం పెద్ద ప్రవాహమువలె వెలువడుచున్నది. ఇరత ఉత్తర భారతీయ భాషల నుండి గాక దక్షిణ భారతీయ భాషల నుండి కూడ ఎంతో బాలసాహిత్యము హిందీలోకి అనువదింపబడుచున్నది. కొన్ని సంవత్సరాల క్రితము పిల్లా సుబ్బారావు శాస్త్రిగారి 'పారిపోయిన బఠానీ' 'ఘర్ సేభాగా మట్రూ' అన్న పేరులో ఈ వ్యాసకర్త ద్వారా అనువదింపబడి ప్రచురింపబడినది.

# పిల్లల నవలలు

ఎ.కె. ప్రభా

కథలు వినడంలో రెండేళ్ళ పిల్లలనుండి పన్నెండేండ్ల పిల్లల వరకు ప్రత్యేక మైన ఆసక్తి చూపుతున్నారు. ఈ దశలో మనం బాల బాలికలకు నేర్పదలచుకొన్న ముఖ్యాంశా లన్నిటినీ కథల ద్వారానే నేర్పవచ్చు; నేర్పడం సులభం కూడ.

బాలసాహిత్యంలో నవలల రచన ఒక విశిష్ట మైన ప్రక్రియ. ఈ రచనాశిల్పం అత్యంత క్లిష్టమైనది.

అలాంటి నవలకు పిల్లల మానసికస్థితికి అను వైనది, వారి బుద్ధివికాసానికి దోహదమిచ్చేది, వారి విజ్ఞానతృష్ణను సంతృప్తి పరచేది కథా వస్తువు కావాలి.

కథలను వినడంలో రెండేళ్ల పిల్లలనుండి పన్నెండేండ్ల పిల్లలవరకూ ప్రత్యేకమైన ఆసక్తి చూపుతున్నారు. ఈ దశలో మనం బాలబాలికలకు నేర్పదలచుకొన్న ముఖ్యాంశా లన్నిటినీ కథల ద్వారానే నేర్పవచ్చు; నేర్ప డం సులభం కూడా. నేను ఉపాధ్యాయ వృత్తిలో ఐదేండ్ల పిల్లలనుండి పన్నెండేండ్ల పిల్లలవరకూ పదేహేనేండ్లపాటు బోధించిన అనుభవంలో ప్రయోగించిన కథల పద్ధతిని స్వానుభవంతో చెబుతున్నాను.

నవలలను ఎనిమిదేండ్ల పిల్లలనుండి పన్నెం డేండ్ల పిల్లలవరకూ బాగా అవగాహన చేసుకో గలరు. ఈ వయస్సులో ఎనిమిది నుండి పది సంవత్సరాలవరకూ, 10 నుండి 12 సంవత్స రాల వరకు వయఃపరిమితిని దృష్టిలో ఉంచు కొని రచనలను సాగించవలసిన ఆవశ్యకత ఉన్నది. ఈ అవసరాన్ని విస్మరించకుండా వ్రాసిన నవలలు ఎంతో ఆసక్తిదాయకంగా ఉంటాయి.

నవలలో కథానాయకులు నూటికి తొంభై వంతులు పిల్లలే ఉండితీరాలి. పిల్లలను గురించిన రచనలే పిల్లలను ఎక్కువగా ఆకర్షించగలవు. అట్టి రచనలలో వున్న ప్రత్యేకత అలాంటిది. నవల ఒక సంఘటన కావచ్చు; ఒక పిల్లవాడి జీవితం కావచ్చు. ఈ జీవితం పన్నెండేండ్ల వరకే సంబంధించినదైనపుడు బాలల ఆసక్తి ఇనుమడిస్తుంది.

పిల్లల నవలలలో శృంగారం అనవసరం. దాని ఆవశ్యకతే కన్పించదు. అవి సాహసా నికి, పరిశోధనకు, విజ్ఞానానికి, విద్యకు, వివేకా నికీ సంబంధించినవై ఉండాలి. తుంటరితనా లను ఉల్లేఖించవచ్చు. ఆ వెంటవెంటనే ఆ పరి ణామాలను చిత్రీకరించవచ్చు. ఈ నవలలు క్రత్రిమములే ఐనా అవి అత్యంత సహజంగా మానవ జీవితానికి సంబంధించినవై ఉండాలి. చైతన్యవంతములైన పిట్టలు, జంతువులు, చేపలు ఇంకా ప్రకృతిలో అతి సున్నితంగా

అవనిలో కెల్ల
ముద్దు లొలికేది
ఎవరంటె?
మా పాపే.

ఆ పాప పలుకులు
తీయని తేనియలు
ఆ పాప నవ్వితే
ఒలుకును రా రత్నాలు.

ముత్యాల కన్నా
రత్నాల కన్నా
మెచ్చినది నా పాప
వచ్చినది నా పాప

ఆ పాప కన్నా
జగతిలో నాకు
ఎవరెక్కు వున్నా
మరి తక్కు వే.

-కొదా పద్మ

కన్పించే పూలు, చెట్లు, వైరగా వచ్చ కావచ్చు. నదులు, తటాకాలు, పర్వతాలకు వ్యక్తిత్వా అను ఆపాదించి నడిపే నవలలు మరీ రసవత్తరములుగా ఉంటాయి.

నవలల ప్రక్రియలో ఉపయోగించే భాషను గురించిన జాగ్రత్త ఎంతో, మరెంతో ముఖ్యమైనది. అందులో మింగుడుపడని పదాలను పూర్తిగా నిషేధించాలి. పిల్లలు నవలను చదువుతున్నపుడు మహోతన్మయత్వంతో మరెంతో ఆసక్తితో చదవాలి. ఆ పదాలు కాస్త అక్కడొకటి అక్కడొకటి కఠినంగా కన్పించినా అవి పటికబెల్లం ముక్కల్లా ఉండాలికాని పాషాణాలవలె కచక్ మనరాదు. లలితంగా మరీ లలితంగా పనసతొనలవలె, పంచదారవలె, పాలకోవావలె తియ్యగా ఉండాలి.

రచనలో ప్రతి సన్నివేశమూ విషాదంగా ఉన్నా ఇబ్బందిలేదు, దైన్యంగా చిత్రించినా నష్టంలేదు. కానీ భయానకంగా, క్రౌర్యంగా, బీభత్సంగా ఉండవలసిన అవసరం లేదు. నవల ఒక నిండు పున్నమి వెన్నెలవలె మల్లెల కొండ వలె, పూల పల్లకివలె, అలా అలా కదులుతూ వెళ్లే కన్నె పెన్నవలె కమనీయంగా రూపొందాలి.

ఇట్టి నవలలు విజ్ఞానదాయకాలై విషయ సంపదలతో తులతూగుతూ కథాశిల్పంతో అలరారుతూ మన సాహిత్యవైభవోన్నతిని ఛాయా మాత్రంగానైనా గోచరింప చెయ్యాలి.

ఇదివరకూ కొన్ని మంచి నవలలు ప్రచురితమైనవి ఉన్నవి. ఎన్నో ప్రచురింపబడనివీ ఉన్నవి. వాటిని సమీక్షించడం కాదు ప్రధానం, ఇప్పుడే ఇప్పుడిప్పుడే ఈ సాహిత్యంపట్ల ప్రభుత్వం శ్రద్ధ వహిస్తున్నది. గత మూడుదశాబ్దాలుగా బహుమతులు పొందిన నవలలకంటే ఉత్తమమైన నవలలుకూడా ఉన్నవి. అందరూ పోటీలకు గ్రంథాలను పంపే అవసరమూ, అలవాటూ, నియమం ఈ దేశంలో లేదు. అంచేత పంపకపోయినవన్నీ తక్కువ స్థాయికి చెందినవనుకోవడం పొరబాటుగదా!

అంతా ఒక ఎత్తు; అగస్త్యుడొక యెత్తు అన్నట్టు రచన వేరు; ప్రచురణ వేరు. నవలను ముద్రించడంలో మన ప్రచురణసంస్థలెంతో శ్రద్ధ వహించినా అవి ఉండవలసిన తీరులో లేవు. చిత్రాల సంఖ్య తగ్గించినా వాటిని రూపొందించే విధానంలో లోపం కన్పించరాదు. ఏ రచనకు భాష ఏవిధంగా

నైతే పిల్లల వయఃపరిమితికి సంబంధించినవో చిత్రరచన కూడా అంతే; ముఖచిత్ర రచనా అంతే.

బాలల అకాడమీ అనుభవజ్ఞులైన రచయితల చేత కనీసం ఐదారు నవలలను వ్రాయించి ప్రచురించడం మంచిది. వ్రాసి పోటీలకు పంపమనే పద్ధతి ఉత్తమ రచనలను సృష్టించలేదని చెప్పలేము. కాని శాస్త్రీయమైన ప్రమాణానికి తూగే నవలలను పిల్లల సాహిత్యానికి సమర్పించడానికి కూడా ఒక క్రమబద్ధమైన విధానాన్ని అనుసరించడం మంచిదని నా సలహా.

డెమ్మీ 1/8 సైజులో 18 వ పాయింటు టైపులో అరవై పేజీలకు తక్కువకాని, వంద పేజీలకు మించని నవలలైతే రోజుకో నవలను లేదా రెండురోజులకో నవలను చదివే అవకాశం పిల్లలకు ఉంటుంది. ఇవన్నీ సూచనలు మాత్రమే. అనుభవజ్ఞులెందరో ఉన్నారు. వారి ఆలోచనలన్నీ అవగాహన చేసుకోవడం మంచిది.



# చలన చిత్రాలలో బాల గేయాలు

— జి.ఎస్. వరదాచార్య

నిజానికి పిల్లలు ఎంతో చక్కగా పాడుతారు. రేడియో బాలానందం కార్యక్రమాలు వినేవారికి ఈ విషయం బాగా తెలుసు. అయితే రిహార్సల్స్‌లో దర్శకులు కొంత శ్రమపడవలసి వుండవచ్చు.

ఆటపాటలంటే పిల్లలకు చాలా ఇష్టం. బొమ్మలతో ఆడుకోవడం వారికెంతో సరదా. కదిలే బొమ్మలు, రంగుల బొమ్మలంటే మరింత సరదా. సినిమాలు పిల్లలను అందుకే విపరీతంగా ఆకర్షిస్తాయి. సినిమాకు వెళ్లడమంటే పిల్లలు ఎగిరి గంతేసి సిద్ధమవుతారు. సినిమాలలో తెలుపు నలుపువి, రంగురంగులవి బొమ్మలేగాక ఆటలు, పాటలు చివరకు కొట్లాటలు సైతం బాలలను బాగా ఆకర్షిస్తాయి. సినిమాలలో కొట్లాటలు పిల్లలకు సంబంధించినంతవరకు హాస్యరసాన్ని అందిస్తుంటాయి. ఈమధ్య ఒక సుప్రసిద్ధ సినీ హాస్యనటుడు తమను చూడటానికే పిల్లలు సినిమాలకు వస్తుంటారని ఒక ప్రకటన చేశారు. అది చాలా వరకు నిజం కూడా. స్టంటు కళాకారులు కూడా కొట్లాటలలో పిల్లి మొగ్గలు వేయడానికి, సర్కస్ ఫీట్లు చేయడానికే ఎక్కువగా పాల్పడుతుంటారు గనుక అదికూడా భయభీతులను కలిగించడానికి బదులు లేచి నిలబడి చప్పట్లు చరుస్తూ ఆనందించడానికే ఎక్కువ దోహదం చేస్తూ ఉంటాయి. ఇటువంటి స్టంటుదృశ్యాలు వారి మనసుకు హత్తుకొని వారు సరదాకు అలాటి ఫీట్లు చేయబోయి దెబ్బతినే పరిస్థితి కల్పించచడం కూడా అప్పుడప్పుడు జరగకపోదు. అందుకే ఇవి పిల్లలపై దుష్ప్రభావాన్ని కలుగజేస్తున్నాయని, పిల్లల మనోవికాసానికి తోడ్పడే ప్రత్యేక చలనచిత్రాలను విడిగా నిర్మించాలని కొందరు అనుభవజ్ఞులు చెబుతూ ఉంటారు. విదేశాలలో వాల్ట్ డిస్నీ వంటివారు ఈ విషయంలో చాలా కృషి చేశారు. మన దేశంలో కూడా అబ్బాస్ వంటి కొందరు కృషి చేయకపోలేదు. తెలుగులో కోవెలమూడి సూర్యప్రకాశరావు 1954 లో బాలానందం అనే చిత్రాన్ని నిర్మించారు. దానిలో నటీనటులంతా బాలలే. బాలానందం, బూరెల మూకుడు, రాజయోగం అనే మూడు కథలను కలిపి ఆ పూర్తి నిడివి చిత్రాన్ని నిర్మించారు. ఆ తర్వాత పిల్లలకోసం చిత్రనిర్మాణ ప్రయత్నం ఏదీ తెలుగులో జరిగినట్టు లేదు.

ఇతర భాషారంగాలలో కూడా పరిస్థితి అంతగా ప్రోత్సాహకరంగా లేనందున కేంద్ర ప్రభుత్వం బాల చిత్రసమితి పేరిట ఒక

సంస్థను ఏర్పాటుచేసి తగిన ధనసహాయం ఇచ్చి బాలల మనస్తత్వాలకు సరిపడే చిత్రాల నిర్మాణాన్ని ప్రోత్సహించింది ఆసంస్థ చాలా చిత్రాలు నిర్మించింది. ఇప్పుడిప్పుడే మన రాష్ట్రంలోని చలనచిత్ర అభివృద్ధి కార్పొరేషన్ కూడా బాలలకోసం ప్రత్యేకంగా చిత్రాలు నిర్మించడానికి ఒక పథకం రూపొందించింది. సరే, అదెంత ఫలితాన్ని సాధిస్తుందో చూడవలసి ఉంది.

ఇప్పుడు వస్తున్న వాణిజ్య చిత్రాలలో సైతం నిర్మాతలు బాలబాలికలను ఆకర్షించే సన్నివేశాలు, పాటలు అవకాశం దొరికినప్పుడల్లా పెడుతూనే ఉన్నారు. హాస్యం, స్టంటుల గురించి ముందే ప్రస్తావన వచ్చింది. ఇక పాటల గురించి చెప్పుకుందాము. మన చిత్రాలలో పాటలు ప్రధానమైన ఆకర్షణ అన్నది దేశవిదేశాలలో గుర్తించబడిన విషయం. ఏ పాటైనా బాలలను ఆకర్షిస్తుంది. సినిమాలలో పాటలు విని లయజ్ఞానం అలవరచుకున్న బాలలెందరో ఉన్నారు; వాటి ననుకరించి ఆకర్షణీయంగా పాడటం నేర్చుకున్నవారు కూడా ఉన్నారు. ఇప్పుడు వస్తున్న కొన్ని చిత్రాలలో పాటలు అశ్లీల పదాలతో కూడి ఉన్నందున అర్థం తెలియక అమాయకంగా పాడుకునే బాలబాలికలు పెద్దలనుండి చీవాట్లు తినడం కూడా జరుగుతున్నది. ఇలాంటిదే ఒక పాట "ఇల్లు-ఇల్లాలు" చిత్రంలో ఉన్నది. ఈ పాటలో ఒక హాస్యనటి పాటరూపంలో చిన్ననాటి సంఘటన ఒకటి వివరిస్తుంటే మరో హాస్యనటుడు వచనరూపంలో గారాబపు మాటలతో ప్రశ్నలువేస్తుంటాడు. ఈమాటలే పిల్లలను బాగా ఆకర్షిస్తాయి. పాటలోని నిగూఢార్థం వారికేం తెలుసు? చివరకు "అంత కోపం ఎందుకయ్యా, అప్పుడు నా వయసారయ్యా, అవచ్చింది మాతాతయ్యా, తాతయ్యా తాతయ్యా తాతయ్యా తాతయ్యా" అంటూ పాట ముగుస్తుంది. రేడియోచుట్టూ చేరి పిల్లలందరూ కేరింతలు కొడుతూ "తాతయ్యా, తాతయ్యా" అని శ్రుతి కలుపుతారు. ఇలాంటి పాటలకు ఇదొక ఉదాహరణ మాత్రమే. ఇది బాలలకోసం ఉద్దేశించింది కాకపోవచ్చు కూడా.



"ఆకాశమంత పందిరివేసి
భూదేవంతా పీటవేసి"

సినిమాలలో బాలలకోసమని నిర్మాతలు ఉద్దేశించి పెట్టిన గీతాలలో ఎక్కువభాగం ప్రబోధ గీతాలు. ఉదాహరణకు "కోడలు దిద్దిన కాపురం" చిత్రంలో "నీ ధర్మం నీ సంఘం నీ దేశం నువు మరవద్దు, జాతిని నడిపి నీతిని నిలిపిన మహనీయులనే మరవద్దు" అనేది, "బలిపీఠం"లో కలసి పాడుదాం తెలుగుపాట, కదలి సాగుదాం వెలుగుబాట" అనే పాట, "అంతా మనమంచికే" చిత్రంలో "సరిగమప పాట పాడాలి, పాటలోనే పాఠాలన్నీ నేర్చుకోవాలి", "బడిపంతులు" చిత్రంలో "చదువూ సంపద అందరిదీ, పాడి పంటా అందరిదీ" మొదలగునవి. మొదటి పాటలో బాపూజీ, నేతాజీ, టంగుటూరి, అమరజీవి

ఒక ఒక్కటి-ఒక్కటి
జగమంతా ఒక్కటీ-
'నువ్వు'-వేరు; 'నేను'-వేరు;
"మనం"- మాత్రమే ఒక్కటి!

రష్యాలో, చందమామ-
లండన్‌లో, చందమామ-
ఎందున్నా-చందమామ
అందరికీ ఒక్కటి"

గ్రేపులైన, ద్రాక్షలైన-
రూపం, రుచి, ఒక్కటీ;
అంగూరుల తీయదనం
అన్నిచోట్ల ఒక్కటీ.

అద్దంలో-ఫోటోలో-
అగపడు నీ రూపమొకటి!
ఎన్నిటిగనొ కనిపించే
అన్నిటికీ మూలమొకటి!

-వద్దిపర్తి వేంకట్రావు

పొట్టి శ్రీరాముల గొప్పతనం, రెండవదానిలో వీరేశలింగం, గురజాడల సంఘసంస్కార ప్రయత్నాల వివరణ ఉన్నవి. చివరి పాటలో సోషలిజం ప్రస్తావన ఉంది. ఇవన్నీ కూడా ఒక బడిపంతులో, పంతులమ్మో పిల్లలను చుట్టూ నిలబెట్టుకొని పాఠంచెబుతూ బోధించినట్లు చిత్రంలో చూపారు. అంటే పిల్లల కోసం ప్రత్యేకంగా ప్రవేశపెట్టారన్నమాట. అయినా చిత్రీకరణవిధానం పదేపదే చూచింది కావడం మూలాన కొన్నిపాటలైనా ఆకర్షణను కోల్పోతున్నాయి. అలాగకాక చిత్రీకరణలో నవ్యత ఉన్నందువల్ల ఆకర్షణీయంగా రూపొందిన ప్రబోధ గీతాలు కూడ లేకపోలేదు. ఉదాహరణకు మళ్లీ "బడిపంతులు" లోనిదే "పిల్లలమూ బడిపిల్లలమూ...పలకా బలపం పట్టిన చేతులే పలుగూ పారా పట్టాయి, ఓనమాలను దిద్దిన వేళ్లూ ఒకటై మట్టిని కలిపాయి" అనే పాటను పేర్కొనవచ్చు ఈ పాటలో పిల్లల గురుభక్తిని చూపారు. గ్రామ పెత్తందారు ఒట్టమూలంగా ఆశ్రయం కోల్పోయిన గురువుకు పిల్లలంతా శ్రమదానంతో ఇల్లు కట్టి ఇచ్చిన దృశ్యమది. పిల్లల మనస్సులను రంజింపజేస్తుంది. ప్రబోధ గీతాలు కాకుండా హుషారైన వినోదాత్మక గీతాలు కూడా పిల్లలకోసం పిల్లలతో చిత్రీకరించినవి కొన్ని ఉంటున్నాయి. నిర్మాత రామానాయుడు ముఖ్యంగా తమ చిత్రాలలో వీలు చిక్కినప్పుడల్లా ఇలాంటి పాటలు ప్రవేశపెడుతుంటారు. ఉదాహరణకు "జీవన తరంగాలు" చిత్రంలో "ఉడుతా ఉడుతా హూత్" అనే పాటను, "సెక్రటరీ" లోని "ఆకాశమంత పందిరి వేసి" అనే పాటను పేర్కొనవచ్చు. బాలల మన స్తత్వాన్ని అర్థం చేసుకొని వ్రాసిన ఆత్రేయ సాహిత్యం, ఘంటసాల మధుర గాత్రం, జూలో పిల్లల రైలుతో చిత్రీకరించిన పద్ధతిలో సంతరించిన వేగం కలసి ఉడుత పాటను చిరస్మరణీయం చేశాయి. రేడియోలో ఆ పాట విన్నప్పుడల్లా బాల బాలికల హృదయాలు పులకరిస్తాయి.

పౌరాణిక, చారిత్రక చిత్రాలలో సైతం పిల్లల పాటలు రక్తికట్టనివి లేకపోలేదు. "బాలభారతం"లో "మానవుడే మహనీయుడు శక్తిపరుడు యుక్తిపరుడు" అనే ఆరుద్ర గీతం", రాజేశ్వరరావు సంగీతం, దృశ్య సౌందర్యంతో కలసి ఎంతో ఆకర్షణీయంగా రూపొందింది. "బొబ్బిలి యుద్ధం"లో అదే రచయిత, అదే సంగీతకర్త కలిసి అందించిన "ముత్యాల చెమ్మచెక్క, రతనాల చెమ్మచెక్క"

అనే పాటను ఆడపిల్లలందరూ హాయిగా పాడుకుంటూ ఉంటారు.

పిల్లలతో చిత్రీకరించిన కొన్ని విషాద గీతాలు కూడా పిల్లలు మరవలేనివి ఉన్నాయి. యాభైలలో తయారైన దీక్ష చిత్రంనుండి మొదలుకొని ముద్దుబిడ్డ, మా వదిన, పాపం పసివాడు వరకు ఎన్నో ఉన్నాయి. చివరి దానిలో "అమ్మా చూడాలి నిన్నూ నాన్నను" అనే పాట వినిపించినప్పుడల్లా పిల్లలముఖంలో కళలు మారడం చూడవచ్చు.

ఇవిగాక సన్నివేశంలో పిల్లలు లేకున్నా పిల్లలను ఆకర్షించే పాటలు కూడా ఎన్నో ఉంటాయి. ఇటీవల వచ్చిన "అమెరికా అమ్మాయి" చిత్రంలోని కృష్ణశాస్త్రి రచించిన "పాడనా తెలుగుపాట"ను, "ఉండమ్మా బొట్టు పెడతా" లోని హరిదాసు పాటను ఉదాహరించవచ్చు. "అంతులేని కథ"లోని "తాళికట్టు శుభవేళ" వంటి పాటలు పాడుకోడానికి వీలులేకున్నా దానిలోని మిమిక్రీ కారణంగా వినడానికి పిల్లలకెంతో బాగుంటాయి.

అయితే ఇక్కడొక విడ్డూరాన్ని గురించి పేర్కొనడం అవసరం. చిత్రంలో పిల్లలనోట వినబడినా, పిల్లలకోసం పెద్దలనోట వినబడినా పాడేది మాత్రం పెద్దవారే. పిల్లల పాటలను పిల్లలచేత పాడించే పద్ధతి లేదు. పర్ఫెక్షన్ కోసమని ఏ లీలచేతనో, సుశీలచేతనో, జానకి చేతనో పాడిస్తున్నారు. పిల్లలు ముద్దుముద్దుగా మాట్లాడే మాటలు కూడా తొలగించి పెద్ద వారిచేత డబ్ చేయించి కృతకంగా మారుస్తున్నారు హిందీలో "కాబూలీవాలా" చిత్రంలో సంగీతదర్శకుడు హేమంతకుమార్ పిల్లల పాట పిల్లలచేతే పాడించి చక్కని ఫలితాన్ని సాధించారు. నిజానికి పిల్లలు ఎంతో చక్కగా పాడతారు. రేడియోలో బాలానందం కార్యక్రమాలు వినేవారికి ఈ విషయం బాగా తెలుసు. అయితే రిహార్సల్సులో దర్శకులు కొంత శ్రమపడవలసి ఉండవచ్చు. ఇప్పుడు తెలుగు చిత్రపరిశ్రమ తెలుగు దేశానికి తరలి రాబోతున్న సమయంలో కనీసం రాజధానిలో పాటల రికార్డింగ్ సౌకర్యాలు ఏర్పడిన తర్వాతనైనా నిర్మాతలు, సంగీత దర్శకులు బాలలను ప్రోత్సహిస్తారని ఆశిద్దాం.



"పలకా బలపం పట్టిన చేతులే పలుగూ పారా పట్టాయి"

# బాలలకోసం దూరదర్శన్ కార్యక్రమాలు

— చెరుకుమిల్లి భాస్కరరావు

దూరదర్శన ప్రసారాలను కూడ పెక్కుమంది ప్రేక్షకులు వివిధ ప్రదేశాల్లో ఒకేసారి చూడవచ్చును; కొన్ని ప్రత్యేక ప్రదర్శన శాలలకు వెళ్ళనక్కరలేదు. తమ ఇండ్లలోనే, తమ తీరిక సమయాల్లో చూచి ఆనందించవచ్చును.

దృశ్య శ్రవ్య ప్రసార సాధనాలను గురించి మనం తలుచుకున్నప్పుడు మనకు చటుక్కున జ్ఞాపకం వచ్చేవి మూడు - రంగస్థల కార్యక్రమాలు, చలనచిత్రాలు, దూరదర్శన ప్రసారాలు. రంగస్థల కార్యక్రమాన్ని ఒక చోట ఒకేసారి తగుమాత్రం ప్రేక్షకులు చూడడానికి మాత్రమే వీలవుతుంది. చలనచిత్రాలను అనేకమంది ప్రేక్షకులు వివిధ ప్రదేశాల్లో ఒకేసారి చూడగలరు. కాని వాటి ప్రదర్శనకు ప్రత్యేకమైన ప్రదర్శనశాలలకు వెళ్ళవలసి ఉంటుంది. సాధారణంగా చిత్రం అంతంవరకు ప్రేక్షకులు తమ స్థానాలనుంచి వెళ్ళిపోవడం జరుగదు. దూరదర్శన ప్రసారాలను కూడా పెక్కుమంది ప్రేక్షకులు వివిధ ప్రదేశాల్లో ఒకేసారి చూడవచ్చును. కాని ప్రత్యేక ప్రదర్శన శాలలకి వెళ్ళనక్కరలేదు. తమ ఇండ్లలోనే, తమ తీరికసమయాల్లో చూచి ఆనందించవచ్చును. అయితే ఇందులో ఒక చిన్న ఇబ్బంది ఉంది. ప్రసారాలు నిజంగా ఆసక్తిదాయకంగా ఉంటేనేతప్ప ప్రేక్షకులు హర్షించరు. ఏమాత్రం విసుగు పుట్టించినా సెట్లు కట్టేసుకుంటారు. కాబట్టి దూరదర్శన కార్యక్రమాల ప్రయోక్తలు కార్యక్రమాల విషయంలో ప్రత్యేక శ్రద్ధాసక్తులు కనపఱచడం అవసరం. ఎటువంటి ప్రేక్షకులకోసం కార్యక్రమాలు ఉద్దేశించబడ్డాయో దృష్టిలో ఉంచుకొని, దానికి అనుగుణంగా కార్యక్రమాల రూపకల్పన జరగాలి. లేకపోతే అవి నిరర్థకం. చూసి, అర్థం చేసుకొని, ఆకళింపు చేసుకొనే శ్రమ ప్రేక్షకుల నెత్తిన రుద్దకూడదు. రంగస్థల, చలనచిత్ర, రేడియో కార్యక్రమాల సంవిధాన ప్రక్రియల మేళవింపే దూరదర్శన్.

ఈ దూరదర్శన ప్రసారాలు వివిధ ఆశయాలూ, ఆసక్తులూ, ఆచారాలూ, వ్యవహారాలూ, ఆదర్శాలూ, ప్రవృత్తులూకల ప్రేక్షకులను దృష్టిలో ఉంచుకొని రూపకల్పన చేయబడతాయి. ఇందులో కొన్ని ప్రత్యేక వర్గాలకోసం ఏర్పరుపబడిన కార్యక్రమాలు-వ్యవసాయదారుల ప్రసారాలు, యువజనుల ప్రసారాలు, స్త్రీల కార్యక్రమాలు, బాలల కార్యక్రమాలు వంటివి. వీటి నిర్మాణ నిర్వహణలో ప్రయోక్తలకు విశేష ప్రజ్ఞాపాటవాలూ, ప్రతిభా వ్యుత్పత్తులూ ఉండడం అవసరం. కార్యక్రమ ప్రసారసమయం, ప్రదర్శన విధానంతోపాటు ప్రేక్షకుల వయోవిద్యా పరిమితులు, సాంఘిక ఆచారాలు, కట్టుబాట్లు,

అవసరాలు, అవగాహనాశక్తి-ఇవన్నీ ముందే నిర్ణయం కావాలి. అప్పుడే ఆ కార్యక్రమాలు ప్రేక్షకుల అభిరుచులకు అనుగుణంగా ఉండగలవు; సార్థకాలుగా వెలుగొందగలవు.

ప్రేక్షకుల్ని మనం పట్టణవాసులుగానూ, పట్టణ పరిసర ప్రాంతాలవారుగానూ, గ్రామవాసులుగానూ విభజిస్తే ముఖ్యంగా పట్టణ పరిసర ప్రాంతాలవారిలోనూ, గ్రామవాసుల్లోనూ సాయంత్రంపూట దూరదర్శన కార్యక్రమాలపట్ల అభిరుచినీ కనబరిచేవారిలో 40 నుంచి 54 శాతం బాలలు, 20 నుంచి 25 శాతం వయోజనులు, 15 నుంచి 20 శాతం యువజనులు, 10 నుంచి 15 శాతం స్త్రీలు ఉంటారని పరిశీలకులు నిర్ణయించారు. బాలల్లో కూడా ముఖ్యంగా 8 నుంచి 14 సంవత్సరాల మధ్య వయస్కులే నూటికి 90 మంది ఈ కార్యక్రమాల్ని చూస్తున్నారు. అందుకే దూరదర్శన కార్యక్రమాల్లో బాలల కార్యక్రమాలకు విశేష ప్రాముఖ్యం లభించింది. సాధారణంగా సాయంత్రం 6 నుంచి 8 గంటల మధ్య ఈ కార్యక్రమాలపై బాలలు శ్రద్ధ చూపుతున్నారు. అందుకే దూరదర్శన ప్రసారకులు బాలల కార్యక్రమాలకు అనువైన సమయం సాయంత్రం 6½ నుంచి 7½ మధ్య నిర్ణయించారు.

పిల్లలు ఏ ప్రాంతంవారైనా సరే, వారిని ముఖ్యంగా మూడు తరహాలుగా విభజించవచ్చును. 4 నుంచి 8 సంవత్సరాలు వయస్సువారు సబ్ జూనియర్లు, 8 నుంచి 12 సంవత్సరాల వయస్సువారు జూనియర్లు, 12 నుంచి 16 సంవత్సరాల మధ్య వయస్సువారు సీనియర్లు. వీరికోసం నిర్ణయించబడే కార్యక్రమాలు కూడా ఒకేరీతిలో ఉండవు; ఉండకూడదు.



బాలల కార్యక్రమాల ముఖ్య ఆశయాలు విద్య, వికాసం, వినోదం. విద్యార్థుల కార్యక్రమాల ఆశయంకూడా ఇదే అయినా, ఆ కార్యక్రమాలు తరగతి ఉపాధ్యాయుల పర్యవేక్షణలో బడివేళల్లోనే ప్రసారం చేయబడతాయి. పాఠ్యప్రణాళికను అనుసరించి చాలావరకూ ఆ ప్రసారాలుంటాయి. పౌరశాస్త్రం, విజ్ఞానశాస్త్రం, చరిత్ర, భూగోళం, హస్తకళలు, భాషాబోధన ఈ ప్రసారాల్లో ముఖ్యస్థానం ఆక్రమిస్తాయి.

ఇక, అన్నివర్గాల పిల్లలకోసం ప్రసారం చేయబడే సాయంత్రం కార్యక్రమాల విషయంలో, పాఠ్యప్రణాళికా ప్రమేయం అసలు ఉండదు. ఇవి సాహిత్యపరమైన కార్యక్రమాలుగాను సాంస్కృతిక పరమైనకార్యక్రమాలుగాను ఉండవచ్చును. ఇందులో శేషభాగం పిల్లలకోసం పిల్లలు ప్రదర్శించే కార్యక్రమాలే కాగా, అప్పుడప్పుడు పిల్లలకోసం పెద్దలు ప్రదర్శించే కార్యక్రమాలు కూడా చోటు

పచ్చ పచ్చని పైరులతో
కళకళలాడుచు కనిపించేదే
ఊరంటే మా ఊరు
పేరడుగుచు వచ్చేరు.
గలగలమనుచు సెలయేరొక్కటి
పగలు రేయనక పారుమ నిత్యము
ఊరంటే మా ఊరు
మీరొస్తే తిరిగి పోరు.
కొండలు చుట్టూ దండిగ ఉన్నవి
సీతాఫలములు చాలగ దొరుకును
ఊరంటే మా ఊరు
పేరు చెప్పక మురిసేరు.
కోవెల యొకటి కొత్తగ గట్టిరి
రోజూ దానిలో పూజలు జరుగును
ఊరంటే మా ఊరు
రండి పూజింపను మీరు.

**-గంధం జోయెల్**

చేసుకుంటాయి. మీకెలాంటి కార్యక్రమాలంటే ఇష్టం అని పరిశీలకులు పిల్లల్ని ప్రశ్నించినపుడు వారు వివిధ అభిప్రాయాల్ని వ్యక్తం చేశారు. వివిధ కార్యక్రమాలనుంచి వారు చూచి ఎన్నికచేసినవాటిలో ముఖ్యమైనవి ; తోలుబొమ్మలాటలు, కార్టూన్లు, అమ్మమ్మ అక్కయ్యలు చెప్పిన కథలు, అనుకరణలు, తమాషాలు, పాటలు, నృత్యాలు, నాటకాలు. ఇవేకాక సాతురతా కార్యక్రమాల్ని, చర్చలని, ప్రశ్నోత్తర కార్యక్రమాల్ని కూడా పిల్లలకోసం పెద్దలు సూచించారు.

పిల్లల దూరదర్శన ప్రసారాల విషయమై పెద్దలపై జరిపిన పరిశోధన ఫలితంగా తేలిన విషయాలు :

1. పిల్లలలో చైతన్యాన్ని, సర్జనాత్మక శక్తిని, నైతిక మూల్యాలను పెంపొందించే కార్యక్రమాలు, నాగరిక దృక్పథాన్ని కలిగించే కార్యక్రమాలు ప్రవేశపెట్టాలి.

2. కార్యక్రమాల్లో విద్యకూ, శరీర వ్యాయామానికి కూడా ప్రాముఖ్యం ఇవ్వాలి.

3. ఆరోగ్యం, పారిశుద్ధ్యం వంటి అంశాలను స్వీకరించాలి.

4. చిన్న చిన్న యంత్రాల తయారీని గురించిన కార్యక్రమాల్ని కూడా ఏర్పాటుచేయాలి.

5. సాధారణంగా ఆయా ప్రాంతాల్లో వాడే పౌష్టిక ఆహారపదార్థాలను తయారుచేసే విధానం, వాటి ప్రాముఖ్యాన్ని తెలియ చెప్పాలి.

6. ఆదర్శ గ్రామాలు, వాటి తీరుతెన్నులు గురించిన కార్యక్రమాలను ప్రదర్శించాలి.

మనస్తత్వ పరిశీలకులు పిల్లల కార్యక్రమాలను గురించి కొన్ని పరిశోధనలు చేశారు. వారి సూచనలు :

1. అన్నిటికంటె ముఖ్యంగా పిల్లలకు ఆసక్తిని కలిగించేవి చలనచిత్రాలు, చిత్ర సంగీతం.

2 ప్రముఖ జాతీయ, చారిత్రక, పౌరాణిక నాయకుల పాత్రల చిత్రీకరణపై పిల్లలకు మక్కువ ఎక్కువ.

3. అడవి కథలు, జంతువులను చూడడానికి వారు ఇష్టపడతారు. పక్షులు, పూవులు కూడా వారికి ఆసక్తిని కలిగిస్తాయి.

4. తమ భాషాజ్ఞానాన్ని, గణితాన్ని అభివృద్ధిచేసే సాతురతా కార్యక్రమాలలాంటివి వారికి కావాలి.

5. రైల్వే ఇంజను, విమానం, కారు, టెలిఫోను, టెలిగ్రాం, టెలివిజన్, పోస్టాఫీసు-అవి పనిచేసే విధానం పిల్లలకి నేర్పాలి.

6. కాగితంపూలు చేయడం, పాతబట్టల తోను, దూదితోను, బంకమట్టితోను బొమ్మలు చేయడం, గాలిపటాల్ని తయారుచేయడం, కుట్టు, అల్లిక మొదలైన విషయాల్ని పిల్లలు చూచి నేర్చుకోవడానికి ఇష్టపడతారు.

7. రకరకాల ముగ్గులంటే పిల్లలకి ఇష్టం.

8. చిత్రకళ పిల్లలకు ఆసక్తిదాయకం.

9. సర్కస్‌ను దూరదర్శన కార్యక్రమాల్లో వారు ఉత్సాహంగా చూస్తారు.

10. తాముండే వాతావరణంలో తమకు సమకాలికులైన పాత్రలు ప్రదర్శించే కార్యక్రమాలు వాళ్లకి కావాలి.

11. చిత్రవిచిత్ర సంఘటనలతో ఊహాతీతమైన (ఫాంటసీ) కార్యక్రమాలంటే అందరికీ ఇష్టమే.

12. తమ పాఠ్యపుస్తకాలలోని అంశాలు వివరించే కార్యక్రమాలుకూడా పిల్లలు మెచ్చుకుంటారు.

ఇవికాక నృత్యాలు, నృత్యరూపకాలు, అప్పుడప్పుడు నాటకాలు పిల్లలకోసం ప్రదర్శిస్తూ ఉండాలి.

విద్యావిషయక కార్యక్రమాలను దూరదర్శన విద్యాప్రసార విభాగంవారు నిర్వహిస్తూనే ఉన్నారు. ఇక, వినోదానికి, వికాసానికి ప్రాముఖ్యమిచ్చే కార్యక్రమాలను సాయంత్రం ప్రసారాల్లో రూపొందించడం ఉచితం.

సత్ఫలితాలను రాబట్టడానికి బాలల కార్యక్రమ నిర్వాహకులు ముందుగా అందుబాటులో ఉండే పిల్లలను, వారి శక్తియుక్తులనూ, ఆసక్తులనూ బాలసంఘాల కార్యకర్తల సహకారంతో సేకరించాలి. ఆతర్వాత ఏవయస్సు పిల్లలకి ఎలాంటి కార్యక్రమాలు ఏరకంగా తయారుచేయాలో నిర్ణయించుకోవాలి. తదను



గుణంగా కార్యక్రమాలను రూపొందించాలి. ఈ కార్యక్రమాలు సఫలం కావాలంటే అనుక్షణమూ బాలల కార్యక్రమ నిర్వాహకులకు బాలసంఘ కార్యకర్తల, తలిదండ్రుల, అధ్యాపకుల సహాయ సహానుభూతులు ఇతోధికంగా లభించాలి.

దూరదర్శన కార్యక్రమాలు-ముఖ్యంగా పిల్లల కార్యక్రమాలు విషయ వివరణంతో నిర్దుష్టంగా ఉండాలి. నారికేళపాకాన్ని బాల ప్రేక్షకులకు పంచడం అర్థంలేని పని. ప్రేక్షకుల ఆశయాలు, ఆదర్శాలు, అలవాట్లు, అవగాహనశక్తి, సాంఘిక, సాంస్కృతిక మూల్యాలు ముందుగా తెలుసుకుని తదనుసారం కార్యక్రమాల రూపకల్పన చేయాలి. బాలల ప్రసారాలు అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినంత సులభగ్రాహ్యాలుగా ఉండాలి. కార్యక్రమాలపట్ల, నిర్వాహకులపట్ల ప్రేక్షకులకు ఒక విధమైన నమ్మకం, గురి ఏర్పడాలి. అది లోపించిననాడు కార్యక్రమాల సార్థకత లోపిస్తుంది. ప్రేక్షకుల వాతావరణానికి అనుగుణంగా వాస్తవికత లోపించకుండా కార్యక్రమాల రూపకల్పన జరగాలి; లేకపోతే కార్యక్రమాల్ని చూసి ప్రేక్షకులు నవ్వుకుంటారు. వారిలో ఏహ్యాభావానికి తావీయరాదు. నిర్వా

హకుల ఆశయం కార్యక్రమంలో సువ్యక్తం కావాలి. కార్యక్రమంద్వారా ప్రేక్షకులు కొత్త విషయాలను చూసి నేర్చుకోవడానికి అవకాశం కలగాలి. కార్యక్రమాలు కేవలం వినోదాన్నే కాక విజ్ఞానాన్ని, వివేకాన్ని, నవ చైతన్యాన్ని కలిగించేవిగా ఉండాలి. అయితే ఈ అన్ని ఆశయాలనూ ఒకేసారి ఒకే కార్యక్రమంద్వారా ప్రసారం చేయాలనే ఉద్దేశ్యంతో కార్యక్రమాన్ని కలగూరగంప చేసి ఏమీ సాధించలేకపోవడం నిర్వాహకుల అవివేకమే అవుతుంది.

కార్యక్రమాలలో వాడే భాష సరళంగానూ సుబోధకంగాను ఉండాలి. గోటితో పోయే దానికి గొడ్డలిని వాడడంలాంటి పనులు దూరదర్శన కార్యక్రమాల్లో భాష విషయంలోకాని, భావం విషయంలో కాని, వ్యక్తీకరణ విషయంలో కాని చోటుచేసుకోకూడదు. అనవసరమైన ప్రక్రియలు వాడి కార్యక్రమాన్ని మరింత జటిలం చేయకూడదు. సమయం, సందర్భం, అనేవి రెండూ దూరదర్శన ప్రసారాలపట్ల వర్తిస్తాయి. ఇన్ని జాగ్రత్తలు తీసుకుంటేనే కార్యక్రమాలు రాణిస్తాయి.



# నవంబరు 14 ప్రాశస్త్యం

~ పి. వి. కృష్ణంరాజు

బాలల తాత బాపూజీ. నేటి చిరంజీవుల నేత నెహ్రూజీ. సర్వమానవ కళ్యాణార్థమై శిశు సంక్షేమ. బాలల సంక్షేమ దినంగా పరిగణించి సర్వ ప్రపంచము పండుగ జరుపుకొంటున్నది - శ్రీ నెహ్రూ పుట్టిన నవంబరు 14వ తేదిని.

నవంబరు 14 సుదినం. ఇది మన నెహ్రూజీ జన్మదినమనే కాకుండా, అఖండ బాల లోక దినోత్సవంగా కూడ అధికమైన ప్రాముఖ్యం వహిస్తోంది. నెహ్రూ రాజకీయ దురంధరుడు. నిముసమేని విశ్రాంతి తీసుకొనుట కిష్టపడని పరిస్థితులు ప్రోత్సహించని నెహ్రూజీ పది మంది పిల్లలు కనబడుతే చాలు చిరునవ్వుతో వారిని చేరి, వారి వీపులు తట్టుతూ, వారిని ఉత్తేజితులను చేస్తూ తన బాధ్యతలను సైతం మరచి ఆ భావిలోక నేతలతో బాటు ఆడుకొనే వారు. నెహ్రూజీకి పిల్లలయందు గల యీ వాత్సల్యాన్ని గుర్తించిన ప్రపంచం శ్రీ నెహ్రూ పుట్టినరోజునే "శిశు సంక్షేమదినం" గా పరిగణించి పండుగ చేసికోవాలనుకొన్నది; చేసికొంటున్నది కూడాను.

దాస్య విముక్తిచెంది దశాబ్దములు గా ప్రపంచములో అన్నిటా మేటి యనిపించు కొంటున్న అమెరికా, రష్యా, చైనా మొదలైన దేశాలు తనుతమ రాజకీయ, జాతీయ సిద్ధాంతములకు అనుగుణంగా తమ పిల్లలను అభివృద్ధిచేసి, తమ సంక్షేమం పటిష్ఠం చేసుకొంటున్నాయి. అటులనే నెహ్రూచే పునాదులు వేయబడిన మనదేశ కాలాలను "స్వర్ణ యుగం" చేయవలసిన నేటి బాలబాలికల గుణగణాలను నిర్మలంచేసి దేశభక్తి, ధీశక్తి, శాంతితత్త్వం, ప్రేమాన రాగము లను పెంపొందింపచేసి వారి సంక్షేమంపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాల్సిన అవసరం మనకు ఎంతేనిగలదు. బడుల పాఠాలు, ఆటలకే పరిమితం కాకుండాను, నేటి మనదేశ రాజకీయ ముఠాల చపలచిత్త సిద్ధాంతములు, మతోన్మాదుల కుతంత్రములకు లోనుగాకుండాను మనదేశ సంప్రదాయాలకు అనుగుణంగా నాగరికతాభివృద్ధితో పయనిస్తూ, శరీర సౌష్ఠవంతోబాటు, స్వశక్తి, స్వయంకృషితో జ్ఞానాభివృద్ధిని సంపాదించుకొని, శాంతితత్త్వము అలవర్చుకొని ఐక్యముగా వుంటూ భావిభారతావనికి సుశిక్షితపౌరులై దేశసంక్షేమం కాపాడవలసిన బాధ్యత నేటి మనదేశ బాలలందరిపైనా వుందని పెద్దలంతా గుర్తించారు.

పర పరిపాలన పీడ వదలిన తర్వాత స్వతంత్ర భారతావనిలో ముసిముసినవ్వుల గాంధీగారి అనురాగపూరితమైన వాత్సల్యముతో, బాలలపట్ల ప్రేమానురాగపూరితమైన వాతావరణం ఏర్పడింది.

ఆ విధాన సహృదయపూరితమైన వాతా-

వరణాన్ని సృష్టించిన బాపూజీకి రాజకీయ ప్రియపుత్రుడైన నెహ్రూజీ నాయకత్వాన నడుస్తోంది సర్వ స్వతంత్ర స్వదేశం. "నేటి బాలల సంక్షేమమే-రేపటి దేశ సౌభాగ్యం"గా గుర్తించిన సహృదయులంతా, యీ వాతావరణాన్ని ఆసరాగా తీసుకొని, అనేకమైన స్వచ్ఛంద సేవాసంస్థలను నిర్వహిస్తూ శిశు సంక్షేమంపట్ల ఆసక్తితో సక్రమ కార్యకలాపాల్ని ఒకరికొకరు చేదోడు వాదోడుగా వుంటూ జరుపుకొంటున్నారు. దీనికితోడు కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘం వారి ఆర్థిక సహాయంతో కొంతవరకు నిలబడగలిగి, పటిష్ఠమైన పునాదులపై బాలల సంక్షేమం కొరకు ప్రణాళికలు తయారు చేసుకొంటూ కార్యక్రమాలను కొనసాగిస్తున్నారు.

పై నినాదం మన జాతీయ ప్రభుత్వం గుర్తించకముందే, దక్షిణాదిన ప్రప్రథమంగా బాలల సంక్షేమంకొరకు మద్రాసులో "ఆంధ్రబాలానంద సంఘం" స్థాపించబడింది. తొలుత అది రేడియో కార్యక్రమాలకే పరిమితం అయినా స్థానికంగా శాఖోపశాఖలు ఏర్పడి, వేలకొలది రూపాయిల స్థిరాస్తి సంపాదించుకొని, ఆంధ్రదేశం అంతటా కూడ ఎగ్రబాకి ఆంధ్రబాలల ఉత్తేజాన్ని శిఖరమెక్కించి, రాష్ట్రంలో ఎన్నో సంఘాలు ఉత్సాహంతో ఏర్పడటానికి ఆస్కారమయింది. ఈ బాల సంక్షేమోద్యమాన్ని ప్రచారంచేసి, వూరూరా సంఘాలు పెట్టించి నిస్వార్థంగా శ్రమించి, బాలల సంక్షేమంకొరకు పూర్తి కృషిచేయుచున్న సహృదయులుగా మన ఆంధ్రదేశంలో మొట్టమొదట పేర్కొనదగిన వారు శ్రీ "అన్నయ్య" "అక్కయ్య" గార్లు. జీవితకాలంలో సుమారు సగం వయస్సు పూర్తి అయి శారీరకంగా ముసలివారైనప్పటికి, ఎపుడు ఏమిచేస్తున్నా బాలల సంక్షేమం కొరకే ఉద్దేశించి ఆ పసిపిల్లలతో కలిసిపోయి వారి జీవితాలను తీర్చి దిద్దాలనే ఉత్సాహంతో పాటుపడుచున్న శ్రీ న్యాయపతి రాఘవరావు కామేశ్వరమ్మ గార్లకు ఆంధ్ర బాలలందరి కృతజ్ఞతలు. వారి అవిరళ కృషికి చేయూత నిస్తున్న కార్యకర్తలకు అభినందనలు.

అయితే మనకు ప్రత్యేక రాష్ట్రంవచ్చి కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘ అధ్యక్షురాలు మన తోబుట్టువే అయినప్పటికీ, అన్నయ్య-అక్కయ్య హైదరాబాదులోవుండి కూడా- ఆంధ్రరాజధానీ నగరంలో మన ఆంధ్రబాలల సంస్కృతి, ఉల్లాసం, ఉత్సాహం ప్రతిబింబించే నిత్య కార్యక్రమాలు, ఆ కార్యక్రమాలకు కావాల్సిన సాధన సంపత్తితో సంపూర్ణమైన కేంద్ర కార్యాలయం లేని లోటు, నిరుత్సాహం కల్గిస్తున్నాయి. అందుకు కారణం కులమత వర్గాలో, ప్రాంతీయ దురభిమానమో, రాజకీయ నాయకుల అశ్రద్ధో తెలియకుండావుంది. అందుచే-మన ప్రియతమ రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య, శిశుసంక్షేమ నిధికి ఆంధ్రశాఖ అధ్యక్షులూ, కార్యదక్షులూ అయిన మంత్రి శ్రీ పి. వి. జి. రాజు, సాంఘిక సంక్షేమ సంఘం ప్రతినిధులూ, అన్నయ్య, అక్కయ్య తదితర స్థానిక సాంఘిక సేవా ప్రముఖ కార్యకర్తలు అంతా సమష్టిగా ఆలోచించి మన ఆంధ్ర రాజధానీ నగరంలో సంపూర్ణమైన సాధన సామగ్రితో పక్తు బాలబాలికల వుత్సాహ కార్యక్రమాలకు వుద్దేశించబడిన రాష్ట్రకేంద్ర కార్యాలయం ఏర్పాటుచేసి దానికి కావలసిన సహాయ సంపత్తి చేకూర్చవలసినదిగా యీ సుదినాన విజ్ఞప్తి.

(ఆంధ్రప్రభ 14-11-1960 సంచికనుండి)

# బాల సాహిత్య వైతాళికులు

## — తిరుమల రామచంద్ర

గురజాడ, వావిలికొలను, ఆదిభట్ల, గిడుగు, వేటూరి, చింతా వారు వేసిన మూలబంధంపైన బాల సాహిత్య భవనం అనేక భూమికలతో ఆకసంవైపు ఎగసి పోతున్నది.

"క్రియాసిద్ధిః సత్త్వే భవతి మహతాం నోపకరణే" అని భర్తృహరి సుభాషితం. దీనిని పోలినదే కార్లైల్ సూక్తి. "షేక్స్పియర్ సైన్యంలో చేరివుంటే ఏమయి వుండేవాడు?" అని ఎవరో అడిగిన ప్రశ్నకు "మహాసేనాని అయివుండేవాడు!" అని కార్లైల్ సమాధానమిచ్చాడట.

19 వ శతాబ్ది చివరి పాదంలో జన్మించిన వాఙ్మయోద్ధారకులకు ఈ రెండు సూక్తులూ వర్తిస్తాయి. వారివి సాహిత్య ప్రక్రియలన్నిటిలోను అందెవేసిన చేతులు. కనుకనే బాల వాఙ్మయంలోను అగ్రగాములయ్యారు. ఇలాటి అగ్రగాములలో, వైతాళికులలో కొందరిని స్మరిస్తాను.

పుత్తడిబొమ్మ పూర్ణమ్మను గురించి వినని వారెవరూ వుండరు. నేస్తాలతో ఆటపాటలలో పొద్దుపుచ్చవలసిన పూర్ణమ్మ, తల్లీ దండ్రీ కాసుకులోనై ముసలి మొగుడికి కట్టబెట్టడంతో, ఆటలపాటల్లో తోడిపిల్లలు మొగుడు తాత అని గేలిచేయడం భరించలేక ఆత్మత్యాగం చేసిన కరుణరస నిర్భరమైన కథను గురజాడ వెంకట అప్పారావుగారు అజరామరం చేశారు. లవణరాజుకల, డామన్ పితియస్ కథలు కూడా బాలలకు అందుబాటులో వుండేట్లుగానే ఆయన వ్రాశారు. ప్రత్యేకించి బాలసాహిత్యంకోసమే నడుంకట్టుకొని కృషి చేయకపోయినా, అన్నిటా ఆధునికుడు కాబట్టి, వ్యావహారిక భాషావాదానికి ప్రాణతుల్యంగా పనిచేసిన వాడు కాబట్టి, పుత్తడి బొమ్మ పూర్ణమ్మ కథను వ్రాసినవాడు కాబట్టీ, ఆధునికులైన బాల-



సాహిత్య ప్రవర్తకులలో ఈయనకు కూడా చేర్చవచ్చు.

ఈయన (1861-1915) విశాఖజిల్లా ఎలమంచిలి తాలూకా రాయవరం గ్రామంలో జన్మించారు. బాల్యదశ విద్యాభ్యాసమంతా చీపురుపల్లిలోను, కళాశాల చదువు విజయనగరంలోను జరిగినవి. కొన్నాళ్లు కాలేజీలోను అటుతరువాత ఆనందగజపతి సంస్థానంలోనూ, విజయనగరంలోనే ఉద్యోగం చేశారు.

రెండవ గొప్పవ్యక్తి వావిలికొలను సుబ్బారావుగారు (1863-1939). ఈయన రివిన్యూ శాఖోద్యోగిగా పదకొండు సంవత్సరాలు పనిచేశారు. (1893-1904). అటు తరవాత చెన్నపట్నంలోని రాజధాని కళాశాలలో పదహారు సంవత్సరాలు తెలుగు పండితపదవిని దక్షతతో నిర్వహించారు (1904-1925). ఆంధ్ర వాల్మీకిగా, వాసుదాసుగా కీర్తి ప్రతిష్ఠల నార్జించారు. 'భక్తిసంజీవని' అనే పత్రి



కను చాలా కాలం నడిపారు. కుమారాభ్యుదయం, కౌసల్యా పరిణయం వంటి కావ్యాలను. సుభద్రావిజయమనే నాటకాన్ని కృష్ణావతారతత్త్వం అనే విమర్శన గ్రంథాన్ని రచించి, గొప్ప పండిత కవి విమర్శకులుగా ప్రసిద్ధికెక్కారు. పనిగట్టుకొని పిల్లలకోసం సులభ సుందరమైన శైలిలో బాలహిత చర్య, కుమార హిత చర్య, గర్భిణీ హిత చర్య వంటి హితోపదేశాలు రచించారు.

వాసుదాసు రచనలలో పిల్లలలో చాలా ప్రచారం పొందినది ఆర్యకథానిధి. దీనినాయన జేబుసైజులో దాదాపు 30 భాగాలలో రచించారు. ఇది నిజంగా పురాణేతిహాస చరిత్రలనుండి గ్రహించిన కథలకు, దయాదాన నీతి ధర్మ ప్రబోధకాలైన కథలకు నిధి. పిల్లలను అట్టే ఆకర్షిస్తుంది. ముఖ్యంగా శైలీ విన్యాసం చూస్తే బాల బాలికలను దృష్టిలో పెట్టుకుని ఈ కథల నాయన రచించినట్లుగా అనిపిస్తుంది. కథల కాయన పెట్టిన పేర్లు చాలా ఆకర్షణీయంగా వున్నవి. 'పదానము మేలనిన నిదానమే మేలు'- అన్న శీర్షిక కథలో చిరకారి కథను చెప్పారు. 'ప్రీతితో నిచ్చినది పిడికెడే చాలు' అనే కథలో ధర్మరాజు అశ్వమేధ యాగ సందర్భంగా ముంగిస చెప్పిన సక్తుప్రస్థుని కథ చెప్పారు. ఇదేవిధంగా అంబరీషుని కథ, ధర్మవ్యాధునికథ నాడీజంఘుని కథ. చిన్నవాళ్ళకు కూడా తెలిసే శైలిలో ఈ ఆర్యకథలు ఉంటాయి. ఈ సంపుటాలలో వాసుదాసుగారు చిత్రపటాలు చేర్చడం మెచ్చదగిన సంగతి.

ఆర్య కథానిధిలో కేవలం కథ చెప్పడమే ఆయన పరమార్థం కాదు. దయా ధర్మాలు, సత్యవర్తనం, పుణ్యాచింతనం, సౌశీల్యం, దైవ భక్తి, పరోపకారం, మొదలైన సుగుణాలు

బాల బాలికలకు ఒంటబట్టేట్లుగా కోమలమైన మనస్సుకు హత్తుకునేట్లుగా చెప్పడం ప్రత్యేకత.

పిల్లల భాషా వికాసానికి ఆయన ప్రథమ మధ్యమ ఉత్తమ పరీక్షలు నిర్వహించారు. ఆయనను సలహాకోరిన పిల్లలకు శ్రద్ధగా ఉత్తరాలలో సలహా లిచ్చేవారు.

సంగీతం సాహిత్యం సరితూచిన త్రాసు అన్నాడు అజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు గారిని శ్రీ శ్రీ. జన్మస్థానం శ్రీకాకుళం జిల్లా బొబ్బిలి తాలూకాలోని అజాడ. హరికథా పితామహుడనేది ఈయన అన్వర్థ బిరుదం. గొప్ప పండితుడు, చెప్పుకోదగిన కవి.

ఈయన ఈసఫ్ కథలను బాలబాలికలకు హృదయాకర్షకంగా తెలుగు చేశారు. ప్రతి కథచివరా ఒక పద్యంలో రెండు పాదాలు కథాసన్నివేశాన్నీ, కడమ రెండు పాదాలు, నీతినీ తెలిపేట్టు నూరు కథలదాకా అచ్చ తెలుగులో మనోహరంగా వ్రాశారు, కందుకూర వీరేశలింగంగారు కూడా ఈసప్ కథలు ఇదే పద్ధతిన వ్రాయడంవల్ల దాసుగారి యీ కథల కెక్కువ ప్రచారం వచ్చినట్లు లేదు.

భారతి వంటి ప్రౌఢ సాహిత్య మాసపత్రికలో 'బాలానందం' రచనలను ప్రవేశపెట్టిన పత్రికా రచయిత డా. గిడుగు సీతాపతిగారు (1885-1968). ఈయన జన్మస్థలం విశాఖజిల్లా భీమునిపట్నం. 1909 నుండి కూడా బాల సాహిత్యంలో కృషి చేసినవారు. ఆ కృషికి ప్రోత్సాహం లేక కొన్నాళ్లు మానుకోవలసి వచ్చిందని ఆవేదన పడినారు. 1940లో అనుకోకుండా భారతి మాసపత్రిక సంపాదకత్వం లభించడంతో, రెండు పుటలు బాలానందానికి ప్రత్యేకించి బాలసాహిత్యానికి ప్రోత్సాహం కలిగించామని వారే స్వీయచరిత్రలో వ్రాసుకొన్నారు.



1909 లోనే పాశ్చాత్య ప్రభావంతో చిలుకమ్మ పెండ్లి, రైలుబండి మున్నగు గేయాలు రచించారు. మరికొన్ని చేర్చి బాలానందంగా ప్రచురించారు. 1949 వ సంవత్సరంలో తెలుగు భాషాసమితి ద్వారా సీతాపతిగారి బాలానంద రచనలకు ప్రభుత్వ బహుమతి లభించింది. 1956 లో బాలానంద గేయాలకు కేంద్రప్రభుత్వ బహుమానం వచ్చింది. 1958 లో బాల వినోద గేయాలు ప్రకటించారు. ఈ పుస్తకానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ బహుమతి వచ్చింది. "ఇన్ని బహుమతులు బాల సాహిత్యంలో నాకు రావడంవల్ల మరి బాల సాహిత్య సంబంధమైన పోటీలకు నా రచనలు పంపించను. యువకులు ఆ పనిని సానుకూలం పడేట్లు చేయాలి" - అని స్వీయచరిత్రలో వ్రాసుకొన్నారు సీతాపతిగారు.

బాలసాహిత్య రచనాలయము అనేపేరుతో బాలసాహిత్యంలో అభిరుచి వున్న రచయితలకు శిక్షణ నిచ్చే తరగతులకు డైరెక్టరుగా ఆయన

కన్ను లెఱ్ఱగ నుండు
రాకాసి గాదు
తల నుండి పొగ వచ్చు
భూతమ్ము గాదు
చెర చెరా ప్రాకును
సర్పమ్ము కాదు
ఏమిటో తెలియదా
ఓ బాలలారా!
ఎన్ని క్రోసులనైన
ఇట్టె పోవుచు నుండు
పెద్ద నదులానైన
ఇట్టె దాటుచు నుండు
పెద్ద కొండల నైన
ఇట్టె దూరుచు నుండు
ఏమిటో తెలియదా
ఓ బాలలారా!

-సుగుణమణి

పనిచేశారు. 1956 మే, జూన్ నెలలలో రాజమహేంద్రవరంలోను, 1958 నవంబరు 24 వ తేదినుండి 1959 జనవరి వరకు హైదరాబాదులోను, మళ్ళీ 1961 అక్టోబరు 24 నుండి డిసెంబర్ 5 వ తేది వరకు హైదరాబాదులోను శిక్షణాలయ తరగతులు నిర్వహించి యువరచయితల కెందరికో ప్రోత్సాహం కలిగించారు.

పగిలిన పత్తికాయలవంటి తెల్లని గుబురు మీసాల వెనక అచ్ఛ స్వచ్ఛమైన ఆయన నవ్వు, పసిపిల్లల పవిత్రతను, సారళ్యాన్ని, అకళింపు చేసుకున్న ప్రవృత్తికి దృష్టాంతంగా ఆయన బాలబాలికలు మురిసిపోయే పాటలు, పద్యాలు, గీతాలు, గేయాలూ ఎన్నో వ్రాశారు.

ఏ విషయంలో నన్నా ఆయన శ్రద్ధకు మరొక విషయం చెబుతాను. కన్యాశుల్కం కర్తృత్వం గురించిన వివాదం చెలరేగిన రోజులలో ఆయన, నేను, అప్పారావుగారి సమకాలికులు, తమిళ నాటక పితామహులు అయిన రావుబహాదూర్ సంబంధముదలియార్ వద్దకు వెళ్లాము కర్తృత్వం గురించిన నిజానిజాలు తెలుసుకొందుకు. "కన్యాశుల్కం అప్పారావు గారు వ్రాసిందనే వినబడినానుగాని, గోమఠం శ్రీనివాసాచార్యులదని వినబడలేదే?" అన్నారు ముదలియారు. సత్యాన్వేషణలో అంతటి శ్రద్ధ సీతాపతిగారిది.

కలం పట్టినపుడెల్లా కలకాలం నిలిచే కొత్త విషయాలే వ్రాయాలనే ప్రతిజ్ఞ గల గురువర్యులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు (1888-1950) బాలసాహిత్య మూలపురుషులలో ఒకరు కృష్ణా జిల్లా, దివి తాలూకా పెద కళ్ళేపల్లి వీరి జన్మస్థానం. మద్రాసులోని కెల్లెట్ మిషన్ హైస్కూలులో పద్దెనిమిదేండ్లకే తెలుగు పండితులుగా చేరారు. రెండేళ్ళ ఉద్యోగం చేసిన తరవాత, చెన్నపట్నంలోనే ప్రాచ్యలిఖిత తాళపత్ర గ్రంథ భాండాగారంలో పండితులుగా ముప్పై ఏళ్ళు పనిచేశారు. అటుతరవాత పది సంవత్సరాలు తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యాసంస్థలో పరిశోధన కృషికి పూనుకొని తాళ్ళపాక కవుల గొప్పతనాన్ని లోకానికి చాటినారు. గొప్ప మ్యూజియం నిర్మించారు. అన్నమాచార్య చరిత్రకు పీఠిక, ఉత్తర హరివంశానికి వ్యాఖ్యానం, చాటుపద్య మణిమంజరి, క్రీడాభిరామం పీఠిక, బసవ పురాణ పీఠిక శ్రీ శాస్త్రిగారి పాండిత్య ప్రతిభకు తార్కాణాలు.

శాస్త్రిగారు గొప్ప పండితకవులు, విమర్శక పరిశోధకులూ అయినా, బాలసాహిత్యా

నికి అద్భుతమైన సేవ చేసినవారు. వారు సేకరించిన, రచించిన బాలగేయాలు భారతిలోను, తదితర పత్రికలలోను ప్రచురితాలయాయి. అలాటివాటి సంకలనమే 'బాలభాష'. ఇది ముద్దులొలికే బొమ్మలతో పిల్లలకు అన్ని విధాల విందు.

చాలాకాలం విద్యాశాఖలో పనిచేయడం వల్ల పసిపాళ్ళ ప్రవృత్తిని బాగా లగ్గపట్టిన వారు చింతా దీక్షితులు. జననం 1891. 'సూరీ సీతీ వెంకీ' అన్న ఈయన కథలసంపుటి బాలసాహిత్యంలో మేలి రచనగా మన్ననల నందుకొన్నది. 'లక్కపిడతలు' బాల సాహిత్యంలో ప్రశస్తమైన రచన.





'ధగధగ మెరిసే కాంతిని చల్లే
కళ్ళు నెమిలి కెవరిచ్చారో!
పురివిప్పుతు అది నాట్యమాడగా
తాండవకృష్ణుడు జ్ఞప్తికి రాడా?'

నెమలి ఈకలు తెచ్చి దాచుకొని, ఆనందించని పిల్లలెవరైనా వుంటారా? పిల్లల కత్యంత ప్రీతిపాత్రమైన నెమలికన్ను గూర్చి ఎంత చక్కని పాట వ్రాశారో ఈయన! మేఘాలందం, నీలాలందం, నెమలికన్నులో నాట్యం చేస్తవట.

'నిన్ను బాలకులు నిత్యము కోరుతు
నీతో ఆటలు ఆడేవేళల
వారు కృష్ణులను భావము పుట్టును
నిజమంటావా కాదా చెప్పవె'

అంటారు దీక్షితులుగారు. బాల సాహిత్య నిర్మాతలలో దీక్షితులుగారి స్థానం గొప్పది.

వేంకట పార్వతీశ్వరకవులు (1881, 1882–1978, 1955):- వీరు బాల గీతాలు అనే గ్రంథాన్ని ప్రచురించినట్లూ, అది అందరి

మెప్పునూ పొందినట్లూ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు 'ఆంధ్ర రచయితలు'లో వ్రాశారు.

గురజాడ, వావిలికొలను, ఆదిభట్ల, గిడుగు, వేటూరి, చింతావారు వేసిన మూలబంధం పైనే బాలసాహిత్య భవనం అనేక భూమికలతో నేడు ఆకసంవైపు ఎగసిపోతున్నది.

ప్రభాకరశాస్త్రిగారు చిన్ని బుడుతల చేష్టలను, మాతృ వాత్సల్యాన్ని చిత్రిస్తూ రచించిన పద్యంతో ఈ వ్యాసం ముగిస్తాను.

దూరానం దిలకించి చిర్నగవుతో
దోతెంచి పాదమ్ములం
దారోహించి మొగమ్ము గాంచి కయిదో
యల్లార్చి తాటించు చి
ర్నోరం గోరికలూర నెత్తికొనుమంచుం
దొక్కుపల్కాడు న
ల్లారుం బెల్లము బుత్రు జేకొననివా
డానంద మేమందునో!





# అక్షరాభ్యాసంలో కొత్త ప్రయోగం

— గంగిశెట్టి లక్ష్మీనారాయణ

'అ ఆ ఇ ఈ' అంటూ క్రమంగా అచ్చుల్ని, హల్లుల్ని అభ్యసించడం ఇంతవరకూ అక్షరాభ్యాసంలో మనకున్న సంప్రదాయం. స్థాన కరణ ప్రయత్నాలనుబట్టి ధ్వనివిధేయమైన క్రమంలో ఈ అక్షరాభ్యాసం జరుగుతున్నది. ఈ ధ్వనివిధేయ క్రమంలో తెలుగు వర్ణాలను కంఠస్థం చేయడానికి ఒక సులువు ఉంది. ఉదాహరణకు క-తర్వాత దాని మహాప్రాణ రూపమైన ఖ ను పలకడం తేలిక. కంఠ్యాల తర్వాత, తాలవ్యాలను, వాటితర్వాత దంత్యాలను, ఆ తర్వాత మూర్ధన్యాలను పలకడం తేలిగ్గానే ఉంటుంది.

అయితే తెలుగును మాతృభాషగా కలిగిన పిల్లవాడికి ఈ వర్ణమాలలో చాలాభాగం, పాఠశాలలో ప్రవేశించడానికి పూర్వమే పరిచితమై ఉంటుంది. పాఠశాలలో పిల్లలు, ధ్వని అభ్యాసాన్ని కాకుండా, ధ్వనికి మూర్త సంకేతమైన లిపిని అభ్యసించాల్సి ఉంది. ఆ లిపిని నేర్చుకోడానికి, రూపంలో సామ్యం ఉన్న అక్షరాలను ఒక క్రమంలో అందిస్తే. వేగంగా నేర్చుకోవడం జరుగుతుంది. ఈ భావనతో కొందరు రూపసామ్యమును ఆధారంగా తీసికొని వర్ణమాల క్రమాన్ని మార్చి ప్రయోగం చేశారు. ఈ ప్రయోగాలు మొదటగా చేసినవారు మైసూరులోని భారతీయ భాషల కేంద్రసంస్థవారు. ఆ సంస్థ తరఫున మొదటి స్థాయి పాఠ్యపుస్తకాన్ని రూపొందించిన శ్రీ జొన్నలగడ్డ వెంకటేశ్వర శాస్త్రిగారు ఈ క్రొత్త క్రమంతో వర్ణమాలను పరిచయం చేశారు. ఆయన ఇచ్చిన వర్ణమాల క్రమం :

1. గ ర ఠ ఈ ఝం
2. ట ల అ ఆ త ఱ
3. క ఙ శ శ ణ ఇ
4. ఉ ఊ డ ఢ ద ధ థ
5. స న వ మ య, ఎ ఏ ఐ ప ఫ ష హ
   ృ ౄ
6. ఒ ఓ ఔ జ జ, చ చ ఛ బ భ ఋ ౠ

ఇలా తెలుగు వర్ణమాలలోని అక్షరాలన్నిటినీ, ఆరువర్గాలుగా విభజించి, ఒక్కొక్క పాఠంలో ఒక్కొక్క వర్గం చొప్పున ఆరు పాఠాలుగా అందించారు. అయితే ఆయన ఇందులో ఖ, ఞ, ఞ లను వదలిపెట్టడం గమనించదగ్గ విషయం.

అదే సంస్థలో పనిచేస్తున్న శ్రీ కస్తూరి విశ్వనాథంగారు, మొదటి స్థాయికి సంబంధించిన అధ్యాపక కరదీపికలో, తెలుగు వర్ణమాలనంతటినీ పది వర్గాలుగా విడదీసి ఈ క్రింది క్రమంలో ఇచ్చారు.

1. ల ట అ ఆ త ఱ
2. గ వ స ం ర త ఈ య ఝ
3. ద ధ థ

4. ద ధ ఉ ఊ

5. ఒ ఓ ఔ జ జ జ

6. బ భ బు చ చ ఛ

7. ఎ ఏ ఐ ప ఫ వ

8. ష ఘ హ మ

9. ఇ ఈ ణ

10. క క్ష శ ళ ఖ

శ్రీ శాస్త్రిగారే 1975 లో Conversational Telugu అన్న పుస్తకాన్ని ప్రచురిస్తూ ఇంకో క్రమాన్ని పరిచయం చేశారు.

1. అ ఆ ల త ఱ ట

2. గ ర ఠ ఈ ఝం

1. ఎ ఏ ప ఫ మ య ఘ న వ స హ ష

4. ద ధ డ ఢ చ ఛ ఉ ఊ చ

5. ఒ ఓ ఔ జ జ బ భ బు బూ

6. ఇ ఐ ణ ఖ క క్ష శ ళ

ఇందులోని ఒక్కొక్క వర్గంలో ఉన్న అక్షరాలలో ఒక సామ్యం ఉందని, ఆ సామ్యం మూలంగా విద్యార్థులు త్వరగా అక్షరాలను నేర్చుకోగలరని రచయితల ఉద్దేశ్యం. ఇది కొంతవరకు నిజమే. ఉదాహరణకు ఎ ఏ లు వ్రాశాక ప వ్రాయడం, ప ఫ ల తర్వాత ష వ్రాయడమో ఘ వ్రాయడమో సులువు. దానివల్ల చిన్నపిల్లల్లో ఉన్న ఆసక్తికరమైన ప్రతిభ, అక్షరాభ్యాసంలో ఎక్కువకాలం వినియోగమైపోతూ, భాషాభ్యాసంలో కుంఠితం కాకుండా సాగుతుంది.

అయితే ఈ రూపసామ్య క్రమాన్ని ప్రతిపాదించడంలో, ఒక నిర్ణీత క్రమాన్ని రచయితలు ఏర్పరచుకొన్నట్లు కనిపించదు. అక్షరమాలలో, అంతస్సూత్రంగా వున్న కనీసపు రూపమేమిటి? ఏ కనీసపు రూపంతో మొదలుపెడితే అక్షరమాల మరింత సౌలభ్యదాయకంగా ఉంటుంది అన్న ప్రశ్నలగురించి రచయితలు ఎలాంటి ప్రసక్తి చేయలేదు. ఆ ప్రశ్నలతోనే మొదలుపెట్టి ఇంకోవిధంగా ఈ క్రమాన్ని ఇవ్వవచ్చు.

పిల్లలు అన్నింటికంటె ముందు సున్నను చుట్టడం సులువుగా నేర్చుకుంటారు. సున్నను మొదటి కనీస రూప ప్రాతిపదికగా తీసికొని ఈ క్రిందివిధంగా ఇంకా కొత్త అక్షరమాలను రూపొందించవచ్చు.

1. ం - ం ర ఠ ఈ ఝ య

2. ఎ - (1) ఎ ఏ ప వ మ
   (2) ఫ ఘ ష హ ఐ

3. ‿ - ల ట ఱ అ ఆ త

4. ω - (1) ఒ ఓ ఔ జ జ జ
   (2) బ భ బు బూ చ చ ఛ ఖ
   (3) ఉ ఊ డ ఢ ద ధ థ

5. ∩ - గ న స

6. ണ - ఌ ౡ ఇ ఈ ణ

7. క - క్ష శ ళ

లిపి బోధనలో ఒక కొత్త ప్రయోగం అంటూ పేర్కొనడం బాగుందికాని ఇది ఎంతవరకు ఆచరణసాధ్యం? అన్నది పెద్ద ప్రశ్న. ఇది ఒక పద్ధతిగా ఇంతవరకూ లేకపోయినా, కొద్దోగొప్పో అందరూ ఈ రూపసామ్య విధానాన్ని అవలంబిస్తూనే ఉంటారు. ఉదాహరణకు వ అన్న అక్షరం వచ్చిందనుకోండి. సామాన్యంగా నిపుణుడైన ఉపాధ్యాయుడు, విద్యార్థికి అంతకుముందే పరిచయమైన ప ను విద్యార్థి స్మరణలోకి తెచ్చి, ఇలా ఇక్కడ కలిపి వ్రాస్తే వ అవుతుందనో, మ ప్రక్కన

పెట్టే కొమ్ము పెట్టకపోతే వ అవుతుందనో నేర్పిస్తుంటాడు. అక్కడక్కడ 'అవసరార్థం' అంటూ వాడుకోవడమేకాకుండా, దాన్నే ఒక క్రమంగా రూపొందిస్తే, అక్షరాలను నేర్చుకోవడం ఇంకా శీఘ్రంగా జరుగుతుంది కదా !

అయితే ఎన్నిసార్లు నేర్పించినా, దిద్దడమైతే దిద్ది నేర్చుకోగలడు కాని, 'ఇదేం అక్షరంరా అబ్బాయ్' అంటూ ప్రశ్నించినప్పుడు చాలామంది పిల్లలు తప్పులుచెప్పడం ఇప్పటికీ అగుపిస్తున్న విషయమే. లిపిని నేర్చుకోవడంలో అక్షరాలను కుదురుగా వ్రాయడం ఒక ముఖ్యమైన భాగమైతే, ఫలానా అక్షరం ఫలానా ధ్వనికి సంకేతం అంటూ రూఢిచేసికోవడం మరో అతిముఖ్యమైన భాగం. అలాంటప్పుడు ఏ క్రమంలో నేర్పించినా, వేగం అన్నది సంపూర్ణంగా సాధ్యమౌతుందా అన్నది మరో ముఖ్యమైన ప్రశ్న. మైసూరు వాళ్ళ వర్ణక్రమాన్ని కేరళలో తెలుగును నేర్చుకొన్న ఆంధ్రేతర విద్యార్థులకు బోధించిన డా. ఎన్. శివరామమూర్తిగారు, ఈ విషయంగా ఈ క్రమం పెద్ద లాభదాయకంగా లేదంటారు. నిజానికి, వారు మైసూరు సంస్థ వారి ప్రకటనకు కొన్నేళ్ల ముందే, పూనా విశ్వవిద్యాలయానికి తాము సమర్పించిన సిద్ధాంత గ్రంథంలో ఈ రూపసామ్య లిపిని ప్రస్తావించారు. అలా ప్రస్తావించినవారే, అలాగన్నారంటే, కొంత ప్రయోగపూర్వకంగా దీన్ని పరిశీలించాల్సిన అవసరం ఉంది.

సామాన్యంగా అవసరాన్నిబట్టి లిపి క్రమాన్నే కాదు, లిపి మొత్తాన్నే మార్చుకొన్న సంఘటనలు ఉన్నాయి. ఈ లిపి మొత్తంమీద కుదురుగా వ్రాయడానికీ, వ్రాయడం వేగంగా నేర్చుకోవడానికీ సహాకరిస్తుంది అని సులభంగా ఊహించవచ్చు. కాని దాన్ని పాఠశాలల్లో ప్రయోగపూర్వకంగా ప్రవేశపెట్టి పరిశీలించాక కాని ఇదమిత్థంగా ఒక నిర్ణయానికి రావడం కష్టం. మైసూరు వాళ్ళ ప్రచురణలు, ద్వితీయభాషగా తెలుగును నేర్చుకోగోరే వారికోసం ఉద్దేశించినట్టివి తొలిభాషగా తెలుగును నేర్చుకొనే తెలుగు పిల్లల విషయంలో ఇదెలాంటి సత్ఫలితాలను ఇస్తుంది? అన్నది సశాస్త్రీయంగా, ప్రయోగపూర్వకంగా పరిశీలించి తేల్చాల్సిన విషయం. అంతదాకా ఈ క్రొత్త వర్ణమాల ఒక ఊహాగతమైన ప్రతిపాదన మాత్రమే.



# ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

పిల్లల సర్వతోముఖ వికాసం కోసం ఒక ప్రత్యేక సంస్థను నెలకొల్పుకున్న ఘనత మనదేశంలో ప్రప్రథమంగా ఆంధ్రప్రదేశ్‌కు దక్కింది. ఇదే ఆంధ్ర ప్రదేశ్ బాలల అకాడమి. ఈ అకాడమి నిర్మాణ స్వరూపాన్ని నిర్వహణ, విధానాన్ని నిర్వచిస్తూ ప్రభుత్వ విద్యాశాఖ 1976 మార్చి 14 వ తేదీన జి. ఓ. ఎమ్. ఎస్. నెం. 241 జారిచేసింది. ఈ బాలల అకాడమికి లాంఛనప్రాయంగా 1976 నవంబరు 14 వ తేదీన ఆనాటి రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహమ్మద్ హైద్రాబాదు పబ్లిక్‌గార్డెన్స్ జూబిలి హాలులో ప్రారంభోత్సవం చేశారు. అప్పటి నుండి ఈ సంస్థ పనిచేస్తున్నది. విద్య సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు దీనికి అధ్యక్షులు. రేడియో అన్నయ్య శ్రీ న్యాయపతి రాఘవరావు దీనికి కార్యదర్శి. అకాడమికి సంబంధించిన కొన్ని వివరాలను స్థూలంగా తెలుసుకొందాం.

**ఆశయాలు :-**

పిల్లల వ్యక్తిత్వాన్ని సర్వతోముఖంగా వికసింపజేయుడం దీని ప్రధానాశయం. బాలబాలికలలో సద్వర్తనను, క్రమశిక్షణను, స్వయంసహాయాన్ని, స్ఫూర్తిని, సామూహిక జీవన వైఖరిని పెంపొందించాలని కూడా ఇది సంకల్పిస్తున్నది.

**కార్యకలాపాలు :-**

ఈ ఆశయసాధన కోసం అకాడమి వివిధమైన కార్యకలాపాలను చేపట్టుతోంది. వాటిని క్రింది విధంగా వర్గీకరించవచ్చును.

1. పిల్లలలో సాహిత్యాభిలాషను ప్రోత్సహించి వర్ధిల్లచేయడం.

2. సంగీతం, నృత్యం, చలనచిత్రం, నాటకం, చిత్రలేఖనం, ఛాయాగ్రహణం వంటి కళారంగాల్లో పిల్లల ప్రతిభను ప్రోత్సహించి వాటిని పెంపొందించడం.

3. పిల్లలకు ప్రయోజనకరమైన రచనలను ప్రోత్సహించడం.

4. అకాడమి ఆశయాల సాధనకు దోహదపరిచే సంస్థల కార్యకలాపాలతో సహకరించి, వాటిని సమన్వయపరచడం.

5. అర్హమైన సంస్థలకు గుర్తింపు ఇచ్చి అవి చేపట్టిన పిల్లల కార్యక్రమాలకు సహాయం అందివ్వడం.

6. పిల్లల ఉత్సవాలు, మహాసభలు, పదస్సులు, పోటీలు, ఆటలు, సెలవు శిబిరాలు, విజ్ఞానయాత్రలు మొదలైన వాటికి అధ్యక్ష్యం వహించడం, వాటిని నిర్వహించడం.

7. ఇతరరాష్ట్రాలలోను, ఇతర దేశాలలోను జరిగే పిల్లల కార్యకలాపాలతో సహా బాలల సాహిత్యాన్ని గురించి, కళల గురించి అధ్యయనం, పరిశోధన జరపడం, అందుకు ప్రోద్బలం కలుగజేయడం.

8. పిల్లల సాహిత్యం కళలు, తత్సంబంధ కార్యక్రమాల్లో విశిష్ట కృషి చేసిన ఆంధ్యూ

రచయితలకు బహుమతులు, గౌరవ చిహ్నాలు ఇవ్వడం.

9. సాహిత్యంలోను, కళలోను ప్రతిభ చూపుతున్న పిల్లలకు స్కాలర్ షిప్పులు మంజూరు చేయడం.

10. సాంస్కృతికపరమైన కార్యక్రమాల వినిమయం ద్వారా పిల్లలలో జాతీయ, అంతర్జాతీయ అవగాహన సంబంధాలను పెంపొందించడం.

11. బాలల సాహిత్య గ్రంథాలయాలను నెలకొల్పడం.

12. పిల్లల కోసం పుస్తకాలు, పరిశోధన వ్యాసాలు, పత్రికలు ప్రచురించడం, అట్టి ప్రచురణను ప్రోత్సహించడం.

13. బాల సంఘాలు, ఫిలిమ్ సంఘాలు, బాల భవన్‌లు మున్నగు వాటి ఏర్పాటును ప్రోత్సహించడం.

14. ప్రభుత్వం గాని, ఇతరులు గాని కోరినప్పుడు పిల్లల సంక్షేమం గురించి సలహా లివ్వడం.

15. బొమ్మలు, ఆటవస్తువులు ఎరువు ఇచ్చే సంస్థల ఏర్పాటును ప్రోత్సహించడం.

16. పిల్లల కార్యక్రమాలను రూపొందించడంలో కేంద్ర రాష్ట్రప్రభుత్వాలతో సహకరించడం.

**నిర్వహణ :**

అకాడమి వ్యవహారాలను సమర్థవంతంగా నిర్వహించేందుకు వివిధమైన పాలనాంగాలు ఏర్పాటయ్యాయి. అవేమంటే - 1. సర్వసభ్య మండలి. 2. కార్యనిర్వాహక వర్గం 3. ఆర్థిక సంఘం 4. సర్వసభ్య మండలి గాని, కార్య నిర్వాహక వర్గం గాని ఏర్పాటుచేసే స్థాయి సంఘాలు.



పై చెందిన వ్యవహారాలను నిర్వహించేందుకు అకాడమికి ఈ దిగువ తెల్పిన అధికారుల నియామకం కూడా జరిగింది.

1. అధ్యక్షులు, 2. ఉపాధ్యక్షులు, 3. ఆర్థిక సలహాదారు, 4. కార్యదర్శి, 5. సంయుక్త కార్యదర్శి.

కార్యనిర్వాహక వర్గం పైన తెల్పిన అధికారులతోపాటు సర్వసభ్యమండలి ఎన్నుకొన్న ఆరుగురు సభ్యులు కూడా ఉంటారు.

**విశిష్టసభ్యులు :**

పిల్లల కళలు, సాహిత్యం గురించి ప్రముఖ కృషి చేసిన 55 సంవత్సరాలు పైబడిన వ్యక్తులను అకాడమి విశిష్ట సభ్యులుగా చేర్చుకుంటుంది. వీరి సంఖ్య 15 కు మించదు.

ప్రభుత్వం అకాడమికి 1975-76 సంవత్సరంలో లక్షరూపాయలు గ్రాంటు మంజూరు చేసింది.

ప్రస్తుత కార్యనిర్వాహక వర్గంలో ఈ క్రింది వారున్నారు.

1. శ్రీ మండలి వెంకట కృష్ణారావు,

చెట్టుపైన పిట్ట ఒకటి
చక్కనైన గూడు కట్టె
కట్టినట్టి గూటిలోన
పెట్టె నొక్క గ్రుడ్డు.
గ్రుడ్డునుంచి పిల్ల వచ్చె
పిల్లవచ్చి గూటిలోనె
ఆటలాడె పాటపాడె.
పాటపాడి ఆటలాడి
ఆడిపాడి పాడియాడి
అమ్మతోన ఆకసమున
రెక్కలెగుర వేసివేసి
ఎగిరిపోయె తుర్‌ర్ !

-ఎస్. వి. అప్పారావు

అధ్యక్షులు, విద్య, సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి.

2. శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య, ఉపాధ్యక్షులు, స్త్రీ, శిశు సంక్షేమ శాఖ మంత్రి.

3. శ్రీ న్యాయపతి రాఘవరావు, కార్యదర్శి (రేడియో అన్నయ్య).

4. డా॥ అంతటి నరసింహం, ఆర్థిక సలహాదారు.

5. శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్, సంయుక్త కార్యదర్శి.

6. శ్రీ (మసూనా) మండా సూర్యనారాయణ, విశాఖపట్నం.

7. డా॥ పి. తిరుమల రావు

8. శ్రీ బి. వి. నరసింహారావు

9. శ్రీమతి శాంతాబాయి, యం. ఎల్. ఎ.

10. శ్రీ జె. ప్రసాద రావు

11. శ్రీ యామర్తి గోపాలరావు, జవాహర్ బాల్ భవన్ డైరెక్టరు.

**సర్వసభ్య మండలి :-**

సర్వసభమండలిలో ఈ క్రింది వారున్నారు-

1. శ్రీ మండలి వెంకట కృష్ణారావు, విద్య, సాంస్కృతిక వ్యవహారాల శాఖ మంత్రి, అధ్యక్షులు
2. శ్రీమతి డి. కృష్ణవేణి సంజీవయ్య, స్త్రీ, శిశు సంక్షేమ శాఖ మంత్రి, ఉపాధ్యక్షులు
3. డా॥ అంతటి నరసింహం, ఆర్థిక సలహాదారు
4. శ్రీ న్యాయపతి రాఘవరావు, కార్యదర్శి (రేడియో అన్నయ్య)
5. శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్, సంయుక్త కార్యదర్శి.

**సభ్యులు**

6. శ్రీ చావలి శ్రీనివాసశాస్త్రి విద్యాశాఖకార్యదర్శి.
7. శ్రీ బి. వి. ఆర్. విఠల్, ఆర్థిక కార్యదర్శి.
8. శ్రీ పి. ఆదినారాయణ, పాఠశాల విద్యాశాఖ డైరెక్టరు.
9. శ్రీమతి సతీ నాయర్ శిశు సంక్షేమ శాఖ డైరెక్టరు.
10. శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి).
11. శ్రీ బి. కృష్ణంరాజు, (ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి).
12. శ్రీ పి. టి. రెడ్డి, (ఆంధ్రప్రదేశ్ లలిత కళా అకాడమి).
13. డా॥ ఎన్. భగవాన్‌దాస్, ఐ. ఏ. యస్. ఆంధ్రప్రదేశ్ ఫొటోగ్రఫి (అకాడమి).
14. శ్రీమతి శాంతాబాయి, యం. ఎల్. ఎ.

15. శ్రీ యామర్తి గోపాలరావు,
(జవాహర్ బాల్ భవన్)
16. శ్రీ బాపు (మద్రాసు)
17. శ్రీ బి. వి. నరసింహారావు (కృష్ణ)
18. శ్రీ బాబ్జీ (హైద్రాబాదు)
19. శ్రీ పదిద కామేశ్వరరావు,
20. శ్రీమతి అబిదా బిల్గ్రామి, (హైద్రాబాదు)
21. డా॥ పి. తిరుమల రావు, (హైదాబాదు)
22. శ్రీ పాలడుగు నాగయ్య (ఆదిలాబాదు)
23. శ్రీ మండా సూర్యనారాయణ
(మసూనా, విశాఖపట్నం)
24. శ్రీ మిరియాల రామకృష్ణరావు,
(తూర్పు గోదావరి జిల్లా)
25. శ్రీ కవిరావు (గుంటూరు)
26. శ్రీ జె. ప్రసాదరావు (ఖమ్మం)
27. శ్రీమతి పి. వసుంధరా దేవి, (కర్నూలు)
28. శ్రీమతి జయమణి దేవనాయగం
(అనంతపురం)
29. శ్రీ జి. మునిరత్నం, (చిత్తూరు)
30. శ్రీ కె. ఎల్. నరసింహారావు, (నల్గొండ)
31. శ్రీమతి టి. రత్నాబాయి, ఎమ్.ఎల్.ఎ.
(తూర్పుగోదావరి జిల్లా)
32. కుమారి ఎమ్. కె. దేవకి,
(రీసెర్చి స్కాలర్, శ్రీవెంకటేశ్వర
విశ్వవిద్యాలయం, తిరుపతి.

– బుడ్డిగ సుబ్బరాయన్



# ఆంధ్రప్రదేశ్ దర్శన

ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి చేపట్టిన కార్యక్రమాల్లో ఆంధ్రప్రదేశ్ దర్శన్ విశిష్టమైనట్టిది. రాష్ట్రంలోని ప్రజలలో భావ సమైక్యాన్ని పెంపొందించేందుకు ఈ కార్యక్రమం మిక్కిలి దోహదం చేస్తుంది.

12-15 సంవత్సరాల వయస్సు వుండి రాష్ట్రంలోని ఉన్నతపాఠశాల తరగతులలో చదువుకొంటున్న బాలబాలికలు వివిధ ప్రాంతాలు సందర్శించి అక్కడ కొనసాగుతున్న సాంఘిక, ఆర్థిక పురోగతిని ప్రత్యక్షంగా తెలుసుకొనే అవకాశం కలుగుతుంది. దీనితో పాటు వివిధ ప్రాంతాల్లో వుండే ప్రజల జీవన విధానాలు, సాంస్కృతిక మూల్యాలు వారు అవగాహన చేసుకోగలుగుతారు. అభివృద్ధి కార్యక్రమాలు అమలుజరుగుతున్న ప్రాంతాలను, సాంస్కృతిక ప్రాముఖ్యం గల ప్రాంతాలను కూడా వీరు సందర్శిస్తున్నారు.

దీనిలో పాల్గొనే బాలబాలికలకు నిర్ణయించేందుకు ప్రత్యేక వ్యాసరచన పోటీలు జరిగాయి. బాలల అకాడమి తరఫున జిల్లాలోని డిప్యూటీ విద్యాశాఖాధికారులు ఈ వ్యాసరచనలో పాల్గొన్న వారిని పరీక్షించడం కూడా జరిగింది. 48 కేంద్రాలలో జరిగిన ఈ పోటీలో దాదాపు 1500 బాలబాలికలు పాల్గొన్నారు. ఒకొక్క జిల్లా నుంచి ఇద్దరు పిల్లలు—ప్రతి జిల్లా నుంచి ఒకరు పట్టణప్రాంతానికి చెందిన వారు, మరొకరు గ్రామీణప్రాంతానికి చెందిన వారు వుంటారు. మొత్తం 44 మందిని చేర్చుకున్నారు. ఈ 44 మంది బాలబాలికలతో 1977 ఏప్రిల్ మూడవ వారంలో ప్రత్యేకమైన సూపర్ డీలక్స్ బస్సులో 'ఆంధ్రప్రదేశ్ దర్శన్' యాత్ర ప్రారంభమవుతుంది. ఈ బృందానికి ఒకరు నాయకత్వం వహిస్తారు. శిక్షణ పొందిన గైడ్లు కూడా ఈ బృందంలో వుంటారు. ఒక వైద్యుడు కూడా వీరి వెంట వస్తారు. వీరు కూడా ఈబస్సులోనే ప్రయాణం చేస్తారు. ఈ యాత్రను చలన చిత్రంగా తీసేందుకు ఏర్పాట్లు జరిగాయి. ఈ చిత్రం రంగులలో 35 మి.మీ.లలో తీస్తారు. పిమ్మట ఈ చిత్రాన్ని రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో ప్రదర్శించడం జరుగుతుంది. నాలుగు వారాలపాటు జరిగే ఈ యాత్రలో బాలబాలికలు దాదాపు ఆరువేల కి. మీ. ప్రయాణం చేస్తారు. మొదట హైద్రాబాదులో వివిధ ప్రాంతాలు సందర్శించి తరువాత రాష్ట్ర దర్శన కార్యక్రమానికి ఉపక్రమిస్తారు. ఈ యాత్రలో బాలబాలికలు చూచే ముఖ్య స్థలాలు ఈ దిగువ ఇవ్వబడినాయి.

1. రామచంద్రాపురం-హెచ్. యం. టి- ఫ్యాక్టరీ మొదలైనవి.

పటంచెరువు-ఇక్రిసాట్ మొదలైనవి.

2. సంగారెడ్డి-ఫలపరిశోధక కేంద్రం.

నిజాంసాగర్-ప్రాజెక్టు.

3. బోధన్ పంచదార ఫ్యాక్టరీ.

పోచంపాడు-ప్రాజెక్టు.

నిర్మల్-స్థానిక పరిశ్రమలు.

బాసర-ఘోండ్ నృత్యాలు, సరస్వతీ దేవాలయం.

రామగుండం-ఉష్ణ విద్యుత్కేంద్రం.

4. సిర్పూర్ (కాగజ్‌నగర్) - రయాన్ పరిశ్రమ.

కరీంనగర్:

వేములవాడ-రాజరాజేశ్వర దేవాలయం.

5. వరంగల్లు-వేయి స్తంభాల గుడి, వరంగల్లు కోట, కాకతీయ విశ్వవిద్యాలయం.

పాకాల-పాకాల చెరువు.

పాలంపేట-రామప్ప దేవాలయం, రామప్ప చెరువు.

6. కొత్తగూడెం-సింగరేణి బొగ్గుగనులు.

7. భద్రాచలం - శ్రీరామాలయం, పర్ణశాల.

దిగువ సీలేరు-విద్యుత్ కేంద్రాలు.

ఎగువ సీలేరు.

8. నర్సీపట్టణం.

అనకాపల్లి-చెరకు పరిశోధన కేంద్రం.

9. విశాఖపట్టణం - ఆంధ్ర విశ్వవిద్యాలయం, కింగ్‌జార్జి ఆసుపత్రి, బి. హెచ్. పి. ఎల్., నౌకా నిర్మాణకేంద్రం, హార్బరు, కోరమండల్ ఎరువుల కర్మాగారం, కాల్టెక్సు, సముద్రతీరం.

10. భీమునిపట్నం.



11. పాడేరు - గిరిజన గ్రామాలు, కాఫీ తోటలు.

బొబ్బిలి-పంచదార ఫ్యాక్టరీ.

విజయనగరం-రాజు కోట.

కోరుకొండ-సైనిక పాఠశాల.

12. శ్రీకాకుళం.

అరసవిల్లి.

శ్రీముఖలింగం.

సోంపేట.

కళింగపట్టణం.

13. బొర్రా గుహలు.

అరకులోయ-తోటలు, పట్టుపరిశ్రమ.

మాచ్‌ఖండ్.

14. పిఠాపురం - పంచదార ఫ్యాక్టరీ, కుటీర పరిశ్రమలు.

అన్నవరం - శ్రీ సత్యనారాయణ స్వామి దేవాలయం.

15. కాకినాడ-వైద్య కళాశాల, ఇంజనీరింగ్ కళాశాల, పండ్లు నిల్వ చేసే కేంద్రం.

రాజమండ్రి-గోదావరి ఆనకట్ట, కేంద్ర జైలు.

అమలాపురం-కోనసీమ హరితవిప్లవం.

తాడేపల్లిగూడెం-ఎరువుల ఫ్యాక్టరీ, ఆధునిక బియ్యపు మరలు.

ఏలూరు-జనపనార పరిశ్రమ, ఉన్ని తివాసీల పరిశ్రమ.

కొల్లేరు-సరస్సు, గూడకొంగలు.

16. మచిలీపట్నం - ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ.

చిలకలపూడి-పాండురంగస్వామి దేవాలయం, సముద్రతీరం మొదలయినవి.

17. చల్లపల్లి-పంచదార ఫ్యాక్టరీ, రాజుకోట.

18. అవనిగడ్డ.

మొవ్వ-క్షేత్రయ్య దేవాలయం.

కూచిపూడి-సిద్ధేంద్ర నృత్య పాఠశాల, స్థానిక దేవాలయం.

19. విజయవాడ-కనకదుర్గగుడి, సిమెంటు ఫ్యాక్టరీ, గాంధి కొండ, ప్రకాశం బ్యారేజి.

20. కొండపల్లి-కొండపల్లి బొమ్మల పరిశ్రమ.

ఉండవల్లి-గుహలు.

తాడికొండ-నివాస పాఠశాల.

21. గుంటూరు.

బాపట్ల-వ్యవసాయ కళాశాల, జీడిపప్పు పరిశ్రమ.

22. శ్రీహరికోట-రోదసీ కేంద్రం.

శ్రీకాళహస్తి-దేవాలయం.

తిరుపతి - వెంకటేశ్వరస్వామి దేవాలయం

23. చిత్తూరు.

మదనపల్లి-శానిటోరియం.

హార్స్లీ కొండలు.

ఋషివాలీ పాఠశాల.

24. అనంతపురం.

మహానంది దేవాలయం.

25. శ్రీశైలం - దేవాలయం, నాగార్జున సాగర్ ప్రాజెక్టు, మ్యూజియం.



# మహాసభల సమీక్ష

పిల్లల మనోవికాస కార్యక్రమాలకు చేయూత నివ్వడంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అగ్రగామిగా వున్నది. 1974 అక్టోబరులో ప్రథమంగా అఖిలభారత తెలుగు బాలల మహోత్సవాలు నిర్వహించింది. ఈ ఉత్సవాలు బాల లోకంలో నవచైతన్యాన్ని కలిగించాయి. ఆ సభలలో జరిగిన చర్చలందు బాలల సాంస్కృతిక వికాసానికి కృషిచేసే రాష్ట్ర స్థాయి సంస్థ ఏర్పాటు చేయాలని ప్రభుత్వాన్ని కోరడం జరిగింది. తత్పర్యవసానంగా ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ఆవిర్భవించింది. దానికి 1976 సెప్టెంబరు 14 న భారత రాష్ట్రపతి ప్రారంభోత్సవం జరపడం విశేషం.

ఒకసంవత్సరం గతించకముందే అకాడమీ పెక్కు కార్యక్రమాలు చేపట్టింది. అందులో నాలుగు రోజులపాటు రాజధానిలో బాలల మహోత్సవాలు జరపదలచడం ప్రత్యేకంగా పేర్కొనదగింది. విజ్ఞానం, వినోదం, వికాసం ధ్యేయాలుగా పెట్టుకున్న అకాడమీ ఆధ్వర్యంలో ఈ ఉత్సవాలు జరిగాయి.

కేశవ మెమోరియల్‌హాలు నగరానికి వడిలొద్దున వుంది. పైగా రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి బాల బాలికలు బసచేయడానికి అక్కడ చక్కటి వసతి వున్నది. చాలా ముందుగానే అన్ని ఏర్పాట్లు సిద్ధంచేశారు. కార్యకర్తలు అహర్నిశం శ్రమించి ఎట్టిలోటు రాకుండా ఏర్పాట్లు చేశారు.

1977 ఫిబ్రవరి 10 నుంచి 13 వరకు జరిగిన ఈ మహాసభలకు 22 జిల్లా కేంద్రాల నుంచి 408 మంది బాల ప్రతినిధులు. 191 మంది సహాయకులు, 90 మంది బాలసంఘాల ప్రతినిధులు, 9 మంది ప్రత్యేక ఆహ్వానితులు మొత్తం 698 మంది వచ్చారు.

కేశవ మెమొరియల్ ప్రాంగణంలో రంగస్థల వేదిక సిద్ధంచేశారు. ప్రతినిధులు, రాష్ట్ర స్థాయి పోటీలలో పాల్గొనేవారు 9 వ తేదీ నాటికే నగరం చేరుకున్నారు.

మంగళవాద్యాలతో 10 వ తేదీ సాయంత్రం 5-30 గం॥లకు ప్రారంభ సభ మొదలయింది. బాలల అకాడమీకి చిహ్నమయిన బాలుడు, బాలిక చిత్రాలు రంగస్థలానికి అటు యిటూ అమర్చారు. ముకుళితహస్తాలతో వారు ప్రేక్షకులకు స్వాగతం పలుకుతున్నారు- అకాడమీ కార్యదర్శి శ్రీ న్యాయపతి రాఘవరావు స్వాగతంచెప్పారు.

విద్య, సాంస్కృతిక వ్యవహారాలశాఖ మంత్రి, అకాడమీ అధ్యక్షులు శ్రీ మండలి వెంకటకృష్ణారావు సభకు అధ్యక్షత వహించారు. ఆయన ప్రసంగిస్తూ బాల బాలికలలో వుండే ప్రతిభావ్యుత్పత్తులను వర్ధిల్లచేసేందుకు అకాడమీ కృషిచేస్తున్నదని అన్నారు. పిల్లలలో విద్య, సాంస్కృతిక, నైతిక ప్రమాణాలు పెంపొందించేందుకు అకాడమీ ప్రత్యేకకృషి చేయగలదని చెప్పారు.

రాష్ట్ర ఆర్థిక, సమాచార శాఖల మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి జ్యోతి వెలిగించి మహాసభలను ప్రారంభించారు. పిల్లల మానసిక, భౌతిక, విద్యాది సమస్త విషయాల అభివృద్ధికి సర్వతోముఖ కృషి జరుగవలసి వున్నదని ఉద్బోధించారు. ముఖ్యంగా గ్రామీణప్రాంతాలందు పిల్లల అభివృద్ధిపట్ల ప్రత్యేక శ్రద్ధాసక్తులు చూపాలని చెబుతూ విద్యావ్యాప్తికోసం ప్రభుత్వం అన్ని చర్యలు తీసుకొంటున్నా పేదరికం, అజ్ఞానం మొదలైన కారణాలవల్ల గ్రామ ప్రాంతంలో తల్లిదండ్రులు తమ పిల్లలను పాఠశాలలకు పంపేబదులు పనులలో పెడుతున్నారని చెప్పారు. పట్టణ ప్రాంతంలోని పిల్లలలో వుండే నేరప్రవృత్తి గురించి, యాచకవృత్తి గురించి ప్రస్తావించి పిల్లల సమగ్ర అభివృద్ధి నిమిత్తం ఎంతటి బృహత్తర కృషి అవసరమో ఆర్థిక మంత్రి వివరించారు. పిల్లలకోసం మంచి చిత్రాలు తీసేందుకు గట్టి ప్రయత్నం అవసరమన్నారు.

స్త్రీ, శిశుసంక్షేమశాఖ మంత్రి శ్రీమతి డి. కృష్ణవేణి పంజీవయ్యా వస్తు, పుస్తక, చిత్రకళ ప్రదర్శనను ప్రారంభించారు. పిల్లలలో సర్జనాత్మక శక్తిని పెంపొందించేందుకు, నృత్య సంగీతాది కళలను ప్రోత్సహించేందుకు అకాడమీ చేస్తున్న కృషిని ఆమె అభినందించారు.

'బాపు బొమ్మల రామాయణా'న్ని విద్యామంత్రి ఆవిష్కరించారు. ప్రచురణకర్తలైన సంస్కృతి ఇంటర్నేషనల్ తరపున శ్రీ ఎం. ఎన్. రావు మాట్లాడుతూ ఈ పుస్తకం తెలుగులోనేకాక ఇంగ్లీషు, ఫ్రెంచి, స్పానిషు, హిందీ, తమిళ భాషలలోకూడ వెలువరించినట్లు తెలియజేశారు.

డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ 'బాలభారతి' అనే పుస్తకాన్ని ఆవిష్కరించారు. ఆ సందర్భంలో ఆయన చిన్ననాడు తాముపాడుతుండే గీతాన్ని పాడి వినిపించారు. ప్రకాశకులైన 'యువభారతి' సంస్థ తరపున శ్రీ వంగపల్లి విశ్వనాథం మాట్లాడుతూ లోగడ 'బాల' పత్రికలో వెలువడిన ప్రముఖుల రచనలు దీనిలో సంకలనపరిచామని చెప్పారు.

మహాసభలసందర్భంగా ప్రచురించిన ప్రత్యేక సంచికను అధికారభాషా కమీషను అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యా ఆవిష్కరించారు. ఒక బాలిక వేసిన చిత్రాన్ని దాని ముఖచిత్రంగా ఎన్నుకోవడం శ్లాఘనీయమని ఆయన అన్నారు. ప్రత్యేకసంచికా సంఘం అధ్యక్షులు శ్రీ తిరుమల రామచంద్ర సంచిక వివరాలు తెలియజేశారు.

జవహర్ బాలభవన్ డైరక్టరు శ్రీ యామర్తి గోపాలరావు ప్రతిభా పాటవ పోటీలు గురించి విశదీకరించారు.

అకాడమీ సంయుక్త కార్యదర్శి శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ వందనసమర్పణ గావించారు.

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి నాటికా, నృత్య, సంగీత పోటీలలో పాల్గొనేందుకు వచ్చిన బృందాలు మహాసభల రంగస్థల వేదికపైన సాంస్కృతిక కార్యక్రమాలు ప్రదర్శించాయి.

11 వ తేది ఉదయం బాలప్రతినిధులకు నగరదర్శన యాత్ర నిర్వహించారు. ఆనాటి ఉదయం సదస్సు ప్రారంభమయింది. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యా దానిని ప్రారంభించారు. 'బాలల సాహిత్యం త్రొక్కవలసిన క్రొత్త పుంతలు' అనే అంశంపై వక్తలు ప్రసంగిస్తున్నారు.

ఇంతలో పిడుగువంటి వార్త తెలిసింది. భారత రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ స్వర్గస్థులైన విషాదవార్త అందరిని స్థాణువులు చేసింది. అంతటా అత్యంత సంతాప వాతావరణం అలముకొన్నది. అన్ని కార్యక్రమాలు రద్దయ్యాయి. పెద్దలలోనేగాక భావిభారత పౌరులైన చిన్నారి పిల్లల వదనాలలో కూడ శోకముద్ర ప్రస్ఫుటమయింది.

శోభాయమానంగా అలంకరించిన అరుబయలు రంగస్థల వేదికను తీసివేశారు. ఉత్సవాలను, సభలను అన్నింటిని విరమించుకున్నారు. అయితే సుదూర ప్రాంతాలనుంచి వివిధ రాష్ట్రస్థాయి పోటీలలో పాల్గొనేందుకు వచ్చిన బాల బాలికలను తిరిగి ఒకచోట చేర్చడం కష్టతరమని భావించి భవనం లోపలే పోటీలు జరపాలని నిశ్చయించారు. బాలానంద సంఘంలో నాటికలు, కేశవ మెమోరియల్ హైస్కూలులోపల తక్కిన పోటీలు, సదస్సులు జరిగాయి. 13 వ తేదీ సాయంత్రం 5-30 గం॥లకు అతిసామాన్యమైన సమావేశం జరిపి విద్యామంత్రి, తదితరులు వచ్చి గెలుపొందిన వారికి బహుమతులు అందజేశారు.

కొన్ని బృందాలు ఆనాటి సాయంత్రమే తమతమ ప్రాంతాలకు వెళ్ళిపోయాయి. మిగిలినవారు మరునాడు ఉదయం బయలుదేరారు.

సదస్సులు :

మహాసభలలో బాలల వికాసానికి సంబంధించిన అనేక విషయాలపై సదస్సులు ఏర్పాటు అయ్యాయి. బాలల ఉద్యమంతో సంబంధమున్న అనేకమంది వ్యక్తులు తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు.

11-2-77 ఉదయం జరిగిన సదస్సుల ప్రారంభోత్సవానికి అధికారభాషా కమీషన్ అధ్యక్షులు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షత వహించి సదస్సులను ప్రారంభించారు. "బాలసాహిత్యం త్రొక్క-వలసిన క్రొత్త పుంతలు" అనే విషయంపై మొదటి సదస్సు ప్రారంభమయింది. సదస్సుల సంఘం సమావేశకర్త శ్రీ డి. వి. ఎస్. శర్మ తమ ప్రస్తావనలో సదస్సుల ఆశయాలను గురించి వివరించారు. శ్రీ మిరియాల రామకృష్ణ వ్రాసి పంపిన కీలకవ్యాసం శ్రీ వంగపల్లి విశ్వనాథం చదివారు శ్రీ కవిరావు "నేటి బాలసాహిత్యాన్ని మెరుగుపరచడ మెలా ?" అనే విషయాన్ని గురించి, శ్రీ వి.వి.ఎస్. రామారావు "బాలలు-విజ్ఞానశాస్త్రం" అనే విషయంమీద, డా॥ నాయని కృష్ణకుమారి, శ్రీమతి పరిమళా సోమేశ్వర్ "యాత్రాసాహిత్యం" అనే విషయంమీద, శ్రీ ఎల్. ఎస్. బాల్జీ "కళలు" అనే విషయంమీద, శ్రీ వాకాటి పాండురంగారావు "అనువాద సాహిత్యం" అనే విషయంమీద ప్రసంగించారు. రాష్ట్రపతి మరణవార్త తెలియరావడంతో సంతాపసూచకంగా నాటికార్యక్రమం రద్దుపరచారు.

12-2-77 ఉదయం రెండు సదస్సులు, మధ్యాహ్నం రెండు సదస్సులు జరిగాయి. మొదట జరిగిన "బాలసాహిత్య ప్రచురణ, పంపిణీ-బాల గ్రంథాలయాలు" అనేసదస్సుకు ప్రముఖ ప్రచురణకర్త అయిన శ్రీ ఎం. ఎన్. రావు అధ్యక్షత వహించారు. వారు తమ అధ్యక్షోపన్యాసంలో బాలసాహిత్య ప్రచురణలో ప్రస్తుతం ఉన్న పరిస్థితిని గురించి వివరించారు శ్రీ వెలగా వెంకటప్పయ్య కీలక వ్యాసం సమర్పించారు. "బాలసాహిత్య ప్రచురణలో ముద్రణ మార్పులకు సంబంధించిన ప్రత్యేక సమస్యలు" అనే విషయంపై శ్రీ జి. రామకృష్ణారావు మాట్లాడారు.

శ్రీ వంగపల్లి విశ్వనాథం "పంపిణీ సమస్యలు" అనే విషయంపై ప్రసంగించారు. బాలల అకాడమీ ఆర్థిక సలహాదారు అయిన డా॥ అంతటి నరసింహం "బాలసాహిత్యం విరివిగా వెలువడడానికి ఆర్థిక వనరులు-మార్గాలు" అనే విషయంపై తమ అభిప్రాయాలను వెలిబుచ్చారు. శ్రీ ఎం. రంగకృష్ణమాచార్యులు "ప్రాథమిక పాఠశాలలు-గ్రంథాలయాలు" అనే విషయంపై ప్రసంగించారు. శ్రీ అలపర్తి వెంకట సుబ్బారావు, శ్రీ వేజెండ్ల సాంబశివ రావు, శ్రీ అల్ల రాఘవయ్య ప్రచురణకు, బాల గ్రంథాలయాలకు సంబంధించిన సమస్యలపై ప్రసంగించారు.

ఆ తరువాత జరిగిన "ముద్రిత ప్రచార సాధనా"లకు సంబంధించిన సదస్సుకు శ్రీ మండా సూర్యనారాయణ (మసూనా) అధ్యక్షత వహించారు. తెలుగు అకాడమీ డెప్యూటీ డైరక్టరు క్రొత్తపల్లి వీరభద్రరావు ముఖ్య అతిథిగా వ్యవహరించారు. శ్రీ కె. సభా "పత్రికలలో బాలలకై ప్రత్యేక విభాగాలు" అనే విషయంపైన, శ్రీ కె. వేదగిరిరావు "లిఖిత పత్రికలు-బులెటిన్‌లు" అనే విషయంపైన, అకాడమీ సంయుక్త కార్యదర్శి శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ "పిల్లలకు విజ్ఞాన కోశాలు" అనే విషయంపైన, సదస్సుల సంఘం అధ్యక్షులు శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య, డా॥ క్రొత్తపల్లి వీరభద్రరావు "బాలభాష-బాలల నిఘంటువు" అనే విషయంపైన ప్రసంగించారు. "పిల్లలకై ప్రత్యేక పత్రికలు" అనే విషయంపై శ్రీ పి.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి వ్యాసంలోని ముఖ్య భాగాలను శ్రీ రెడ్డిరాఘవయ్య చదివారు.

మధ్యాహ్నం జరిగిన "శ్రవ్యదృశ్య ప్రచార సాధనాలు" అనే విషయంపై జరిగిన సదస్సుకు శాసనమండలి సభ్యులు శ్రీ వి. పి. రాఘవాచారి అధ్యక్షత వహించారు. శ్రీ బి. వి. నరసింహారావు ముఖ్యఅతిథిగా వ్యవహరిస్తూ "అభినయ గేయాలు" అనే విషయంపై మాట్లాడారు. శ్రీ పడిద కామేశ్వరరావు కీలక వ్యాసం సమర్పించారు. శ్రీ పాలడుగు నాగయ్య "బొమ్మలాటలు-బుర్రకథలు" అనే విషయంపైనా, శ్రీ రావాడ గోపాలరావు "ఛాయానాటకములు" అనే విషయంపైనా ప్రసంగించారు. శ్రీ న్యాయపతి రాఘవరావు (అన్నయ్య) "డిస్కులు-టేపులు" అనే విషయంపైన ప్రసంగించారు. అధ్యక్షులు శ్రీ వి. పి. రాఘవాచారి తమ తొలిపలుకులలోను తుదిపలుకులలోను అనేక విషయాలు చెప్పారు.

"బాల సంఘాలు" అనే విషయంపై జరిగిన నాల్గవ సదస్సుకు అకాడమీ సభ్యులు శ్రీ జి. మునిరత్నంనాయుడు అధ్యక్షత వహించి చిత్తూరు జిల్లాలో జరుగుతున్న కృషిని వివరించారు. శ్రీ మద్దిపట్ల వెంకటరావు కీలక వ్యాసం సమర్పించారు. "గ్రామాలలో బాల సంఘాల నిర్వహణ, ప్రత్యేక కార్యక్రమాలు-వనరులు" అనే విషయంపై శ్రీ కె. ఎల్. నరసింహారావు, "పట్టణాలలోని బాలసంఘాల ప్రస్తుత కార్యక్రమాల సమీక్ష-సూచనలు" అనే విషయంపై శ్రీ కవుల ఆంజనేయశర్మ, "తాలూకా జిల్లా స్థాయిలలో బాలసంఘాల కార్యక్రమాల సమన్వయం" అనేవిషయంపై శ్రీ కె వేణుగోపాల్, శ్రీ కె. జానికిరామరాజు, శ్రీ ఎ. ఎల్లయ్య తమ అభిప్రాయాలు వెలిబుచ్చారు. స్థానిక జవహర్ బాలభవన్ డైరక్టరు శ్రీ యామర్తి గోపాలరావుగారు "బాలసంఘాలను ప్రోత్సహించడంలో బాలల అకాడమీ పాత్ర" అనే విషయంపైనా, శ్రీ బి. కె. విశ్వేశ్వరరావు "బాలసంఘ కార్య-

"కర్తలకు శిక్షణ" అనే విషయంపైనా మాట్లాడారు.

సదస్సుల అనంతరం శ్రీయుతులు ఉత్పల సత్యనారాయణాచార్య, ఎం. ఎన్. రావు, డి. వి. ఎస్. శర్మ, వంగపల్లి విశ్వనాథం ఒక ఉపసంఘంగాను, శ్రీయుతులు బి. కె. విశ్వేశ్వరరావు, పడిద కామేశ్వరరావు, మద్దిపట్ల వెంకటరావు తదితరులు మరియొక ఉపసంఘంగాను ఏర్పడి సదస్సులలో చర్చించిన విషయాలపై కొన్ని సూచనలను తయారు చేశారు. ఆయా సమావేశాలు చేసిన సూచనలు దిగువ ఇవ్వబడినాయి :

### బాలసాహిత్యం తొక్కవలసిన క్రొత్తపుంతలు

1. చదవడంపై బాలలకు అభిరుచి పెరిగేలా, సరదా కలిగేలా, బాల సాహిత్య రచన, ప్రచురణ జరగాలి.

2. వినోదకరమైన కాల్పనిక సాహిత్యమే కాక, విజ్ఞానదాయకమైన రచనలు, వికాసాన్ని కలిగించే రచనలను వెలువరించాలి.

3. పై రెండు అంశాలను సాధించేందుకుగాను-అనుభవజ్ఞులైన బాలసాహిత్య రచయితల నుండి సూచనలు స్వీకరించడానికి, సదస్సులను ఏర్పాటుచేసి, ఆ సూచనలను బాల సాహిత్య రచయితలందరికీ అందచేసే ప్రయత్నం చేయాలి. కొత్త రచయితలను ప్రోత్సహించడానికి కార్యగోష్ఠి (Work shop) ఏర్పాటుచేయాలి.

4. యాత్రా సాహిత్యంవంటి సర్జనాత్మక సాహిత్యం సృష్టించడానికై రచయితలకు ఆర్థిక ప్రోత్సాహ మందించి, వారి రచనలను ప్రచురించడానికి పూనుకోవాలి.

5. బాలలలో శాస్త్రీయ దృక్పథాన్ని అలవర్చేందుకు, విజ్ఞానశాస్త్రవిషయాలలో ఆసక్తి కలిగించేందుకు, విజ్ఞానశాస్త్ర సంబంధమైన ప్రచురణలు వెలువరించాలి.

6. ఇతర భాషలలోని ఉత్తమ బాలసాహిత్యాన్ని తెలుగులోకి అనువాదం చేసి, తెలుగులోని ఉత్తమ బాలసాహిత్యాన్ని ఇతర భాషలలోకి అనువదించి ప్రచురించడానికి పూనుకోవాలి. ఇదివరలో ప్రచురింపబడి బహుళ ప్రచారం పొందిన అనువాద సాహిత్యాన్ని తిరిగి ప్రచురించాలి.

7. లలితకళలకు సంబంధించి - బాలలకు తామే స్వయంగా నేర్చుకునే పద్ధతిలో పుస్తకాలను ప్రచురించాలి.

8. బాలసాహిత్యంలో బహుమతి పొందిన లేదా ప్రసిద్ధి పొందిన పుస్తకాలను ముద్రింపించి పిల్లలకు అందుబాటులో ఉండే ధరల్లో వారికి అందజేయాలి.

### ముద్రిత ప్రచార సాధనాలు

1. అన్ని దిన, వార, పక్ష, మాసపత్రికలలో బాలలకై ప్రత్యేక శీర్షిక ఏర్పాటుకై బాలల అకాడమీ కృషి చేయాలి.

2. ప్రస్తుతం వస్తున్న బాలల పత్రికలవలె కాక, బాలల అకాడమీ ప్రచురించబోయే 'బాల' మాసపత్రిక, బాలల విజ్ఞానం, వినోదం, వికాసం కోసం కృషి చేయాలి.

3. బాలసంఘాల కార్యకలాపాలు తెలుపుతూ, బాల కార్యకర్తలకు సూచనలు అందిస్తూ సైక్లోస్టయిలు "బులెటిన్"లను వెలువరించాలి.

4. బాల విజ్ఞాన సర్వస్వాన్ని ప్రచురించడానికి పూనుకోవాలి. ఈ ప్రణాళిక దీర్ఘకాలిక ప్రణాళిక కాకుండా స్వల్పకాలిక ప్రణాళికగా - అంటే రెండు సంవత్సరాల వ్యవధిలో ప్రచురించాలి. అకారాదిగా కాక

విషయం వారీగా ప్రచురించాలి. ఇందుకై ఎన్ని సంపుటాలుగా దీనిని ముద్రించడానికి ఏర్పాటు చేసుకుంటామో, అన్ని సలహా సంఘాలను ఏర్పాటుచేసి, అవి ఏక కాలంలో కృషి చేసేలా చూడాలి.

6. వర్గానుక్రమణిక గల పర్యాయపద నిఘంటువులు బాలలకోసం ప్రచురించాలి. ఈ నిఘంటు నిర్మాణానికి ఒక సలహా సంఘాన్ని నియమించాలి.

## దృశ్య-శ్రవ్య ప్రచార సాధనాలు

1. బాల గేయాలను నిపుణులచేత డిస్కులు లేక టేపుల రూపములో రికార్డింగు చేయించి, వాటి అల్బములను బాలసంఘాలకు, బాల్ వాడిలకు పంపిణీచేసే సమగ్రపథకమును అకాడమీ చేపట్టాలి.

2. బొమ్మలాట, బుర్రకథ, ఛాయానాటకము, చలనచిత్రములు చూపించుటకు ఒక చిన్న బృందమును ఏర్పరచి, ప్రయోగాత్మకముగా నగరమందలి బాల సంఘములలో ప్రదర్శన లిప్పించి, ఫలితములను పరిశీలించి, విజయవంతమైన యెడల రాష్ట్రవ్యాప్తముగా ప్రదర్శన లిచ్చుటకు పై ప్రక్రియలలో ఇతరులకు శిక్షణ నిచ్చు ఏర్పాట్లు చేయాలి.

3. ఆకాశవాణి, దూరదర్శినిలో పిల్లల కార్యక్రమములకై కేటాయించే సమయమును పెంచవలసినదిగా ఆకాశవాణి, దూరదర్శిని అధికారులను కోరాలి.

## బాలసాహిత్య ప్రచురణ, పంపిణీ - గ్రంథాలయాలు

### ముద్రణ

1. బాలలకై పుస్తకాలను, రంగులలోను, తగినన్ని బొమ్మలతోను, ప్రచురించాలి అనేది నిర్వివాదాంశము. వయసువారీగా, పెద్దపై అక్షరాల కూర్పుతో, ప్రచురించాలి. ముఖ్యంగా శాస్త్రీయ సంబంధమైన పుస్తకాలలో బొమ్మలు విరివిగా ఉండాలి. దళసరి కాగితం వాడాలి. బైండింగ్ గట్టిగావుండాలి. బాలల అకాడమీ తన ప్రచురణలలో పైసూచనలను పాటిస్తూ ఇతర బాలసాహిత్య ప్రచురణలు వెలువరించే వ్యక్తులు, సంస్థలు, సంఘాలకు తగు సాంకేతిక, ఆర్థిక సహాయాన్ని అందించాలి. దీనికై ఒక సలహాసంఘం సాహాయ్యంతో ఒక ప్రణాళికను రూపొందించాలి.

(2) పై ప్రమాణాల స్థాయిలో ముద్రణ జరగడానికి ఖర్చు ఎక్కువవుతుంది అని అనిపించవచ్చుగానీ, ఎక్కువ ప్రతులు, ఆఫ్ సెట్ ప్రాసెస్‌లో ముద్రించడంవల్ల ఖర్చులు తగ్గే అవకాశం, నెగిటివ్‌ను జాగ్రత్త పరచడంవల్ల పునర్ముద్రణలు చౌకగా జరిగే అవకాశం దొరుకుతాయి. ఈ కారణంగా పుస్తకం ధర అందుబాటులో ఉండేలా నిర్ణయించేందుకు వీలుంటుంది.

(3) ఎక్కువసంఖ్యలో ప్రతులు అమ్ముడుపోయేలా తగిన ఏర్పాట్లు చేసుకోవడానికి ప్రయత్నించాలి. రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖ వద్దనుండి కొంత శాతాన్ని ఉదా : 1% గానీ, అందులో సగంగానీ, ప్రత్యేకంగా పుస్తక రూపంలో విద్యాలయ గ్రంథాలకు అందించేందుకై కేటాయించి, అందులో తగినమొత్తాన్ని బాల సాహిత్యాన్ని విరివిగా పంపిణీ చేసేందుకు వినియోగించాలి. ఇతర దేశాలలో తొలిదశలో, ప్రభుత్వపరమైన ప్రోత్సాహం, విద్యాలయ గ్రంథాలయాలకై పెద్దయెత్తున కొనుగోలు ప్రోత్సహించబడినట్లు గమనిస్తాము. అలాగే, మన రాష్ట్రంలో బాలల అకాడమీ

ప్రచురణలను, బాలల అకాడమీ ఆమోదించిన ప్రచురణలను పెద్దయెత్తునకొని, విద్యాలయాలకు అందించే ఏర్పాట్లు చేయాలి.

బాలల అకాడమీద్వారా బాల సంఘాలకు ఉత్తరోత్తరా అవకాశమునుబట్టి అందే సహాయంలో 10% బాల సాహిత్యాన్ని కొనడానికై కేటాయించాలి. 5% శాతాన్ని పిల్లల పత్రికలను కొనడానికి కేటాయించాలి.

## గ్రంథాలయాలు

(4) ప్రాథమిక పాఠశాలల్లోకూడా బాల సాహిత్య గ్రంథాలయాలు ఏర్పరచాలి.

ప్రస్తుతం ఉన్న గ్రంథాలయాల్లో బాల విభాగాలు ఉద్ధరించాలి.

గ్రంథాలయాలు వెచ్చించే మొత్తంలో ఓ నిర్ణీత శాతం ఉదా : 10% బాల సాహిత్యానికై విధిగా కేటాయించాలి.

ఇతర విద్యాలయాల్లో (upper primary and secondary schools) 50% బాల సాహిత్యం ఉండేలా చూడాలి.

## ఇతరములు

(5) విద్యాలయాల్లో జరిగే పోటీల్లో బహుమతులుగా బాల సాహిత్య పుస్తకాలను ఇచ్చేందుకు ఏర్పాట్లు చేయాలి.

(6) పుస్తకాల ప్రదర్శనలు, టూరింగ్ ప్రదర్శనలు, పుస్తకాలు చదివే అలవాటును ప్రోత్సహించేందుకు కావలసిన ప్రచారాన్ని ఉద్యమరూపంలో చేపట్టాలి.

(7) బాలల అభిప్రాయ సేకరణ జరిపి, వాటిని దృష్టిలో ఉంచుకొని భవిష్యత్ ప్రచురణ ప్రణాళికలను తీర్చిదిద్దాలి.

## రాష్ట్రస్థాయి బాలల ప్రతిభా పాటవ పోటీలు, ఫలితాలు

1976 నవంబరు 14 న జరిగిన జిల్లాస్థాయి పోటీలలో ప్రప్రథములుగా నెగ్గిన బాల బాలికలను రాష్ట్రస్థాయి పోటీలకు ఈ మహా సభల సందర్భంగా రాష్ట్ర రాజధానీ నగరానికి ఆహ్వానించటం జరిగింది. వీరిలోనుంచి రాష్ట్రస్థాయిలో సీనియరు, జూనియర్, సబ్ జూనియర్ డివిజన్లు ఒక్కొక్కదానిలోను ప్రథమ, ద్వితీయ, తృతీయ బహుమతులు ఏర్పాటు చేయబడ్డాయి. ఈ మూడు వర్గాలలోను నాటికలు, నృత్యం, లలిత సంగీతం, వక్తృత్వం, వ్యాసరచన, గేయరచన, చిత్రలేఖనం, ఫొటోగ్రఫీలలో పోటీలు నిర్వహించటం జరిగింది. ఆ విధంగా మొత్తం రాష్ట్రంమీద ప్రతిభావంతులైన బాల బాలికలకు బహుమతులిచ్చి వారిని ప్రోత్సహించటానికి అవకాశం ఏర్పడింది.

నాటక ప్రదర్శనకు వ్యవధి 30 నిముషాలు. 7 సంవత్సరాలనుంచి 15 సంవత్సరాల వరకు గల బాల బాలికలు ఈ నాటికల పోటీలలో పాల్గొన్నారు. ఇందులో సాంఘికాలు, చారిత్రకాలు, పౌరాణికాలుకూడా ఉన్నాయి. నాటికల సంఖ్య ఎక్కువగా ఉండటంచేత న్యాయ నిర్ణేతలను రెండు జట్లుగా విభజించవలసి వచ్చింది.

సీనియర్ డివిజన్ న్యాయ నిర్ణేతలుగా సర్వశ్రీ కె. జి. రామప్రసాద్, గఫూర్ బేగ్, చెరుకుమిల్లి భాస్కరరావు, జూనియర్, సబ్ జూనియర్ డివిజనులకు సర్వశ్రీ ఆంధ్ర సాంబమూర్తి, సి. యస్. రావు, కుమారి డి. శోభాకుమారి వ్యవహరించారు.

నాటికల తర్వాత నృత్యంపట్ల బాల బాలికలు ఎంతో శ్రద్ధ వహించినట్లు కన్పిస్తుంది. నృత్యపు పోటీలలో భరతనాట్యం, కూచిపూడి శైలులు రెండింటిలోను బహుమతులు ఏర్పాటు చేయడం జరిగింది. ఒక్కొక్క శైలిలోను మూడు డివిజన్లు ఉన్నాయి. అందులో ఒక్కొక్కదానిలోనూ మూడు బహుమతులున్నాయి. వచ్చిన బాల బాలిక అందరు జిల్లాలలో ప్రథములు కావటంచేత అందులో కొందరు ఇదివరకే అఖిలభారతస్థాయిలోనే పరిగణన పొందటంచేత బాల కళాకారు లందరూ చక్కటి నృత్యప్రదర్శన లిచ్చారు. ఈ పోటీలలో బాలికలే కాకుండా బాలురు కూడా పాల్గొనటం ఒక విశేషం. సబ్ జూనియర్ డివిజనుకు చెందిన చిన్నారి పాపల నాట్య విన్యాసానికి సభికులందరూ ఎంతో ముచ్చటపడ్డారు. ఈ పోటీలలో న్యాయ నిర్ణేతలుగా శ్రీమతి కె. ఉమామహేశ్వరి, కుమారి ఎల్. విజయలక్ష్మి, కుమారి మిక్కిలి స్వర్ణలత వ్యవహరించారు.

అనేకమంది బాల బాలికలు ఉత్సాహంతో పాల్గొన్న మరొక పోటీ - లలిత సంగీతపు పోటీ. సంగీతంలో అభిరుచి వుండి సాధన చేస్తున్న బాల బాలిక లెందరో ఈ పోటీలలో పాల్గొన్నారు. ఇందులో గిరిజన బాలికలు కూడా పాల్గొనటం ఒక విశేషం.

ఇందులోకూడా మూడు డివిజన్లకు చెందిన బాల బాలికలు పాల్గొన్నారు. ఒక్కొక్క డివిజనులో మూడేసి బహుమతులు ఏర్పాటు చేయబడ్డాయి. శ్రీమతి శారదాకృష్ణాజీ, శ్రీమతి కె. ఉమామహేశ్వరి, శ్రీ దేవరాజన్ న్యాయ నిర్ణేతలుగా ఉన్నారు.

బాలల ప్రతిభను వెల్లడించే మరికొన్ని పోటీలుకూడా ఉన్నాయి. అవి వక్తృత్వం, వ్యాస రచన, గేయ రచన, చిత్రలేఖనం, ఫొటోగ్రఫీ.

రాష్ట్రంలోని వివిధ జిల్లాలనుండి ఈ పోటీలకు వచ్చారు. సీనియరు, జూనియరు, సబ్ జూనియరు డివిజన్లకు చెందిన బాల బాలికలు ఇందులో పాల్గొన్నారు. ఒక్కొక్క డివిజను లోను మొదటి బహుమతి, రెండవ బహుమతి, మూడవ బహుమతి ఏర్పాటు చేయడం జరిగింది. పోటీలకు వచ్చిన బాల బాలిక లందరూ చక్కగా మాట్లాడి న్యాయ నిర్ణేతలను, సదస్యులను ముగ్ధులను చేశారు. సర్వశ్రీ పాతూరి శ్రీరామశాస్త్రి, లక్ష్మీనారాయణ, చెరుకుమిల్లి భాస్కరరావు న్యాయ నిర్ణేతలుగా ఉండి విజేతలను నిర్ణయించారు.

బాల బాలికలలో కవితా ప్రతిభను గుర్తించటానికి గేయ రచనలో పోటీ లేర్పాటు చేయబడ్డాయి. జిల్లాలలో ప్రథములుగా వచ్చిన బాల కవులు ఈ పోటీలలో పాల్గొన్నారు. ప్రతి ఒక్కరూ తమ కవితాశక్తిని ఎంతో చక్కగా వ్యక్తీకరించగలిగారు. మూడు డివిజన్లలో వుండే బాల బాలిక లందరూ పాల్గొని తమ కవితా శక్తిని అద్భుతంగా ప్రదర్శించారు. శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్య విజేతలను వారి వారి ప్రతిభలనుబట్టి నిర్ణయించారు.

కొందరు గేయ రచనపట్ల అభిరుచి వ్యక్తపరిస్తే మరికొందరు వ్యాసరచనపట్ల మోజు చూపారు. వ్యాసరచన పోటీలలో ఎందరో బాల బాలికలు పాల్గొన్నారు. ఇందులోకూడా మూడు డివిజన్లు, డివిజనుకు మూడు బహుమతులు ఇవ్వడం జరిగింది. వ్యాసకర్తల వ్యాసాలను చదివి విజేతలను నిర్ణయించారు శ్రీ తిరుమల రామచంద్ర.

ఇవి కలానికి సంబంధించినవైతే కుంచెకు సంబంధించిన కళ చిత్రలేఖనం. చిత్రలేఖనం పట్ల అభిరుచి కొందరికి పుట్టకతోనే వస్తే మరి కొందరు అలవర్చుకొని కళాజగతిలో తమ ప్రతిభను వ్యక్తపరుస్తారు. చిత్రలేఖనం పోటీ లకు బాలబాలికలు వివిధజిల్లాలనుంచి వచ్చారు. ఇందులోకూడా మూడు డివిజన్లు, ఒక్కొక్క డివిజనుకు మూడేసి బహుమతులు వున్నాయి. బాల కళాకారు లందరూ తమ ప్రతిభను చక్కగా వ్యక్తీకరించారు. వారి కళా ఖండా లను ప్రముఖచిత్రకారుడు శ్రీ కంచె రాజయ్య పరిశీలించి విజేతలను నిర్ణయించారు.

ఫొటోగ్రఫీ ఒక చక్కని కళ. ఈ కళ ఎక్కువ వ్యయంతో కూడుకున్నప్పటికీ ఎందరో దీనిపట్ల అభిరుచి వ్యక్తంచేయడం మనం గమ నిస్తూనేవుంటాం. మన బాలబాలికలు సయితం ఛాయా చిత్రకళలో తమ అభిరుచిని వ్యక్త పరుస్తూ పోటీలకు రావడం గమనార్హమైన విషయం. వీరు తీసిన ఛాయా చిత్రాలను రాష్ట్ర ఫొటోగ్రఫీ అకాడమీ అధ్యక్షులు డా॥ ఎన్. భగవాన్‌దాస్ న్యాయ నిర్ణేతగా వ్యవహరించి విజేతలను నిర్ణయించారు.

ఈ ఎనిమిది రంగాలలోనూ పాల్గొన్న బాల బాలికలు తమలో నిబిడీకృతమైవున్న ప్రతిభను ప్రదర్శించి తలిదండ్రుల, ఉపాధ్యాయుల ఆనందానికి కారణభూతు లయ్యారు.

తెలుగుదనం కొట్టవచ్చే చిట్టి అన్నయ్యా, పొట్టి చెల్లెలు వినమ్రులై నమస్కరిస్తూ మేము వినోదం, విజ్ఞానం, వికాసాలకు ప్రతీకలమని సూచిస్తున్న నిర్మల్ కళాఖండాన్ని చేత పుచ్చుకొని ఆనందంతో బయలుదేరిన చిన్నారి షాపలను చూస్తుంటే బంగారు భవిష్యత్తు కనులముందు సాక్షాత్కరించింది.

చిటికెన వ్రేలు చెల్లాయీ
ఉంగరం వేలు బంగారం
మధ్యన వ్రేలు నా యన్న
చూపుడు వ్రేలు నాకేసి,
బొట్టన వ్రేలు బొట్టెట్టి
ఐదు వ్రేళ్ళా అరచేయి
అరచే యరచేయి జోడిస్తే
దేమునికి దండం పెట్టొచ్చు.

-కె. యస్. గిరీశ్వరరావు

## బహుమతి పొందిన విజేతల వివరాలు

### గేయరచన

సీనియర్లు :

మొదటి బహుమతి-నెల్లూరు-
వి. రాజగోపాల్

రెండవ బహుమతి-హైదరాబాదుజిల్లా-
యస్. సుజాత

మూడవ బహుమతి-చిత్తూరు-
కె. విజయకుమార్

జూనియర్లు :

మొదటి బహుమతి-మహబూబ్‌నగర్-
వి. మాధవీలత

రెండవ బహుమతి-కరీంనగర్-
డి. గంగాధర్

మూడవ బహుమతి-చిత్తూరు-
బి. పావని.

సబ్ జూనియర్లు :

మొదటి బహుమతి-హైదరాబాదుజిల్లా-
చంద్రసేన

## వ్యాసరచన

సీనియర్లు :

మొదటి బహుమతి-విశాఖపట్నం-
బి. జి. ఆనంద్

రెండవ బహుమతి-వరంగల్-
డి. శ్రీనాథ్

మూడవ బహుమతి-చిత్తూరు-
టి. గిరిజ.

జూనియర్లు :

మొదటి బహుమతి-తూర్పుగోదావరి-
కె. వి. సత్యవాణి

రెండవ బహుమతి- మెదక్-
ఎమ్. హెచ్. శ్రీనివాస

మూడవ బహుమతి-అనంతపూర్-
జి. అలివేలు

సబ్ జూనియర్లు :

మొదటి బహుమతి-చిత్తూరు-
వి. ఆదినారాయణ

రెండవ బహుమతి-పశ్చిమగోదావరి-
డి. శ్రీరామ్

మూడవ బహుమతి-కరీంనగర్-
వి. ప్రహ్లాద్

## నృత్యం :

### భరతనాట్యం

సీనియర్లు :

మొదటి బహుమతి-కడప- కె. పద్మజ

రెండవ బహుమతి-మహబూబ్‌నగర్-
డి. సుజాత

మూడవ బహుమతి-లేదు.

జూనియర్లు :

మొదటి బహుమతి-చిత్తూరు-
అలకనందన

రెండవ బహుమతి-లేదు

మూడవ బహుమతి-లేదు

సబ్ జూనియర్లు :

మొదటి బహుమతి-గుంటూరు-
జె. అనూరాధ

రెండవ బహుమతి-హైదరాబాదు సిటీ-
మరాళి

మూడవ బహుమతి-లేదు

### కూచిపూడి నృత్యం

సీనియర్లు :

మొదటి బహుమతి-వరంగల్-
వై జయంతీమాల

రెండవ బహుమతి-హైదరాబాద్ సిటీ-
జీనత్ సుల్తానా

మూడవ బహుమతి-కృష్ణా-వి. పద్మ

జూనియర్లు :

మొదటి బహుమతి-కర్నూలు-శారద

రెండవ బహుమతి-ఖమ్మం-విజయశ్రీ

మూడవ బహుమతి-పశ్చిమగోదావరి-
నాయుడు అన్నపూర్ణ

సబ్ జూనియర్లు :

మొదటి బహుమతి-కర్నూలు-సునీత

రెండవ బహుమతి-కృష్ణా-వి. పద్మ

మూడవ బహుమతి-లేదు

## వక్తృత్వం

సీనియర్లు :

మొదటి బహుమతి-గుంటూరు-
వి. సి. హెచ్. వీరభద్రుడు

రెండవ బహుమతి-కర్నూలు-
కె. బూసమ్మ

మూడవ బహుమతి-కృష్ణా-
కె. వి. భానుమూర్తి

జూనియర్లు :

మొదటి బహుమతి-తూర్పుగోదావరి-
పి. వెంకటేశ్వర ప్రసాద్

రెండవ బహుమతి-గుంటూరు-
ఎన్. వీరభద్రశివకుమార్

మూడవ బహుమతి-కృష్ణా-
వి. వాణిశ్రీ

సబ్ జూనియర్లు :

మొదటి బహుమతి-కృష్ణా-
పి. సాయి సుధాకర్

రెండవ బహుమతి-అనంతపురం-
ఎల్. ఎస్. ఎన్. రామశ్రీ

మూడవ బహుమతి-కర్నూలు-
డి. సుబ్బారావు.

## వర్ణ చిత్రం

సీనియర్లు :

మొదటి బహుమతి-నల్గొండ-
ఇ. వెంకటేశ్వర్లు

రెండవ బహుమతి-గుంటూరు-
వి. శివ ప్రసాద్

మూడవ బహుమతి-అనంతపూర్-
ఎ. పద్మజ

జూనియర్లు :

మొదటి బహుమతి-పశ్చిమగోదావరి-
ఐ. ప్రభాకర రావు

రెండవ బహుమతి-మెదక్-
కిషోర్ కుమార్

మూడవ బహుమతి-నిజామాబాద్-
కె. బాబు.

> పొరుగు వారిని ప్రేమించు
> తార తమ్యాలను తొలగించు
> ఆశయాలకు సంకెళ్లు వేయకు
> చేరవలసిన గమ్యం వీడకు.
>
> కేవలం గతాన్నే ఆలోచించకు
> భవితవ్యాన్ని నిర్లక్ష్యం చేయకు
> నీ ధ్యేయం మరువకు
> కాలం వృథా చేయకు.
>
> -ఆరెమండ రామచంద్రరావు

సబ్-జూనియర్లు :

మొదటి బహుమతి-హైదరాబాదు సిటీ-
అపర్ణా ఖరే

రెండవ బహుమతి-గుంటూరు-
పి. రామకృష్ణ

మూడవ బహుమతి-పశ్చిమగోదావరి-
ఆర్. జి. మాధవి

## నాటికలు

సీనియర్లు :

మొదటి బహుమతి-కరీంనగర్-
శ్రీకృష్ణ రాయబారం

రెండవ బహుమతి-గుంటూరు-
బూరెలమూకుడు

మూడవ బహుమతి-అనంతపురం-
అమరావతిలో ఆంధ్రజ్యోతి

జూనియర్లు :

మొదటి బహుమతి-హైదరాబాదు సిటీ-
దురాశ

రెండవ బహుమతి-కృష్ణా-
జబ్బు కుదిరింది

మూడవ బహుమతి-గుంటూరు
మహారథం కదిలింది

**సబ్ జూనియర్లు :**

మొదటి బహుమతి-అనంతపురం-
అడ్డూదొంగ

రెండవ బహుమతి-కరీంనగర్-
కలసి ఉంటే కలదు బలం

మూడవ బహుమతి-వరంగల్-
పరమానందయ్య శిష్యులు

## లలిత సంగీతం

**సీనియర్లు :**

మొదటి బహుమతి-తూర్పుగోదావరి-
ఎమ్. కె. మోహన్

రెండవ బహుమతి-నెల్లూరు-
ఎస్. పి. శైలజాల

మూడవ బహుమతి-గుంటూరు-
పి. వి. రామారావు

**జూనియర్లు :**

మొదటి బహుమతి-ప్రకాశం-
టి. వి. ఎస్. వి. మూర్తి

రెండవ బహుమతి-పశ్చిమగోదావరి-
పి. హెచ్. డి. ఎస్. పద్మ

మూడవ బహుమతి-తూర్పుగోదావరి-
టి. ఎల్. బాలసుశీలాదేవి

**సబ్ జూనియర్లు :**

మొదటి బహుమతి-నెల్లూరు-
బి. వి సంధ్యాలక్ష్మి

రెండవ బహుమతి-కడప-
ఎ. హరికృష్ణ

మూడవ బహుమతి-హైదరాబాదు సిటీ-
గాయత్రి

## ప్రతిభా పాటవ పోటీలు-జిల్లాలవారీ ఫలితాల పరిశీలన

| సంఖ్య | జిల్లా | ప్రథమ బహుమతి | ద్వితీయ బహుమతి | తృతీయ బహుమతి | మొత్తం |
|---|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళం | 0 | 0 | 0 | 0 |
| 2. | విశాఖపట్నం | 1 | 0 | 0 | 1 |
| 3. | తూర్పుగోదావరి | 3 | 0 | 1 | 4 |
| 4. | పశ్చిమగోదావరి | 1 | 3 | 1 | 5 |
| 5. | కృష్ణ | 1 | 2 | 3 | 6 |
| 6. | గుంటూరు | 2 | 4 | 2 | 8 |
| 7. | ప్రకాశం | 1 | 0 | 0 | 1 |
| 8. | నెల్లూరు | 2 | 1 | 0 | 3 |

| | | | | |
|---|---|---|---|---|
| 9. చిత్తూరు | 2 | 0 | 3 | 5 |
| 10. కడప | 1 | 1 | 0 | 2 |
| 11. కర్నూలు | 2 | 1 | 1 | 4 |
| 12. అనంతపురం | 1 | 1 | 3 | 5 |
| 13. మహబూబ్‌నగర్ | 1 | 1 | 0 | 2 |
| 14. మెదక్ | 0 | 2 | 0 | 2 |
| 15. నిజామాబాద్ | 0 | 0 | 1 | 1 |
| 16. కరీంనగర్ | 1 | 2 | 1 | 4 |
| 17. ఖమ్మం | 0 | 1 | 0 | 1 |
| 18. వరంగల్ | 1 | 1 | 1 | 3 |
| 19. ఆదిలాబాద్ | 0 | 0 | 0 | 0 |
| 20. నల్లగొండ | 1 | 0 | 0 | 0 |
| 21. హైదరాబాదు జిల్లా | 1 | 3 | 1 | 5 |
| 22. హైదరాబాదు నగరం | 2 | 0 | 1 | 3 |
| | 24 | 23 | 19 | 66 |

గోవిందరాజు రామకృష్ణరావు
డి. వి. ఎన్. శర్మ
ఎస్. వి. రమణరావు



# ఆంధ్రప్రదేశ్ దర్శన

## విజేతలు

**1. శ్రీకాకుళం**

(పట్టణ)
కు. తిమ్మరాజు సీతాదేవి
10 వ తరగతి
ప్రభుత్వ బాలికోన్నత పాఠశాల
శ్రీకాకుళం-532001

(గ్రామీణ)
పీతాంబరం పండా
10 వ తరగతి
జిల్లా పరిషత్ హైస్కూలు
కాశీబుగ్గ

**2. విశాఖపట్నం**

(పట్టణ)
కె. వి. నాగేశ్వరరావు
10 వ తరగతి
యమ్. హెచ్. స్కూలు
అనకాపల్లి-531001

(గ్రామీణ)
చావలి సర్వేశ్వరశర్మ
10 వ తరగతి
గవర్నమెంటు జూనియర్ కాలేజి
నర్సీపట్నం

**3. తూర్పుగోదావరి**

(పట్టణ)
తోలేటి బాలాజీ
10 వ తరగతి
దానవాయిపేట, మునిసిపల్ హైస్కూలు
రాజమండ్రి-3

(గ్రామీణ)
మామిడిపల్లి సత్యవెంకట వేణుగోపాల్
8 వ తరగతి
యస్. ఎ. సి. జెడ్. పి. హైస్కూలు
ధవళేశ్వరం

4. పశ్చిమగోదావరి

(పట్టణ)

యన్. వీరేశ్వరస్వామి

9 వ తరగతి

యస్.యమ్.యస్. సంస్కృత పాఠశాల

కొవ్వూరు

(గ్రామీణ)

మాదపాటి శ్రీనివాసరెడ్డి

జిల్లా పరిషత్ హైస్కూలు

పిప్పర

5. కృష్ణా

(పట్టణ)

కె. శ్యామప్రసాద్

10 వ తరగతి

బిషప్ గ్రాస్సి హైస్కూలు

విజయవాడ-4

(గ్రామీణ)

కె. గిరిధర్

9 వ తరగతి

యస్.ఆర్.ఆర్.జెడ్.పి. హైస్కూలు

పాతపేట

నూజివీడు తాలూకా

6. గుంటూరు

(పట్టణ ప్రాంతం)

కు కాటూ ఆదిలక్ష్మి

స్టాల్ గరల్స్ హైస్కూలు

గుంటూరు-1

(గ్రామీణ)

ఎ. రామకృష్ణ

10 వ తరగతి

ఎ పి. ఆర్. స్కూలు

తాడికొండ

7. ప్రకాశం

(పట్టణ)

జి. శ్రీనివాసరావు

8 వ తరగతి

ఎ బి. యమ్. హైస్కూలు

మార్కాపురం

(గ్రామీణ)

పి. బ్రహ్మానందం

10 వ తరగతి

గవర్నమెంటు జూనియర్ కాలేజ్ స్కూలు

టంగుటూరు

8. నెల్లూరు

(పట్టణ)

డి. జగదీశ్వరరెడ్డి

10 వ తరగతి

ఎ.బి.యమ్. జూనియర్ కాలేజ్ స్కూలు

కావలి

(గ్రామీణ)

కొగ్గల వెంకటరమణయ్య

10 వ తరగతి

యమ్.ఆర్.యమ్.యమ్. హైస్కూలు

విడవలూరు

కోవూరు తాలూకా

9. చిత్తూరు

(పట్టణ)
సంగం దిలీప్‌కుమార్
9 వ తరగతి
మదనపల్లి

(గ్రామీణ)
కు కె. అన్నపూర్ణ
9 వ తరగతి
జిల్లా పరిషత్ గరల్స్ హైస్కూలు
కలికిరి
వాయిల్‌పాడు తాలూకా

10. కడప

(పట్టణ)
జి. వెంకటరామిరెడ్డి
10 వ తరగతి
యస్ యస్.యస్. హైస్కూలు
కడప

(గ్రామీణ)
జి. రెడ్డెయ్య
9 వ తరగతి
జిల్లా పరిషత్ హైస్కూలు
గంగాయపల్లి

11. కర్నూలు

(పట్టణ)
ఎ వసంతకుమార్
10 వ తరగతి
మున్సిపల్ హైస్కూలు
నంద్యాల

(గ్రామీణ)
టి. వి. సంతానగోపాల్
10 వ తరగతి
గవర్నమెంటు జూనియర్ కాలేజి స్కూలు
సుంగయ్యపేట
నందికొట్కూరు తాలూకా

12. మహబూబ్‌నగర్

(పట్టణ)
కు. కె. శోభారాణి
9 వ తరగతి
గద్వాల

(గ్రామీణ)
జె. రామిరెడ్డి
10 వ తరగతి
జిల్లా పరిషత్ హైస్కూలు
దరూరు-509125

13. హైదరాబాదు జిల్లా

(పట్టణ)
కు. యం. అనూరాధ
10 వ తరగతి
బోలారం
సికింద్రాబాదు

(గ్రామీణ)
వి. ఉపేందర్
జిల్లా పరిషత్ హైస్కూలు
ఘటకేశ్వర్ పోస్టు

## 14. హైద్రాబాదు నగరం

పి. లక్ష్మీనరసింహాం
10 వ తరగతి
పీపుల్స్ హైస్కూలు
వివేక్‌నగర్ (చిక్కడపల్లి)

బి. పురుషోత్తమసింగ్
10 వ తరగతి
గవర్నమెంటు హైస్కూలు
సీతాఫలమండి
సికింద్రాబాదు

## 15. మెదక్

(పట్టణ)
అర్. జగదీశ్వర్
10 వ తరగతి
రవీంద్ర మోడల్ హైస్కూలు
సదాశివపేట
సంగారెడ్డి తాలూకా

సి. కె. నారాయణ
రవీంద్ర మోడల్ హైస్కూలు
సదాశివపేట
సంగారెడ్డి తాలూకా

(గ్రామీణప్రాంతంనుండి పరీక్షకు ఎవరూ రానందువల్ల పట్టణప్రాంతం అభ్యర్థినే ఎన్నుకొన్నారు.)

## 16. నిజామాబాద్

(పట్టణ)
పి. విజయరత్నకుమార్
గవర్నమెంట్ జూనియర్ కాలేజి స్కూలు
నిజామాబాదు

(గ్రామీణ)
సంజయ్ కాలా
10 వ తరగతి
గవర్నమెంట్ జూనియర్ కాలేజి స్కూలు
బిచ్‌కుండ

## 17. ఆదిలాబాదు

(పట్టణ)
కు. యమ్. లక్ష్మి
10 వ తరగతి
గరల్స్ హైస్కూలు
ఆదిలాబాదు

(గ్రామీణ)
సి. అశోక్
జిల్లా పరిషత్ హైస్కూలు
ఖానాపూరు

## 18. కరీంనగర్

(పట్టణ)
యన్. శ్రీనివాసరావు
9 వ తరగతి
గవర్నమెంట్ న్యూ హైస్కూలు
జగిత్యాల

(గ్రామీణ)
బి. రవీందర్
10 వ తరగతి
జిల్లా పరిషత్ హైస్కూలు
కొడిమ్యాల

## 19. వరంగల్

(పట్టణ)

కు. యస్.సి.హెచ్. తిరుమలాదేవి
9 వ తరగతి
ఫాతిమా గరల్స్ హైస్కూలు
వరంగల్-4

(గ్రామీణ)

కె. భాస్కరరెడ్డి
9 వ తరగతి
జిల్లా పరిషత్ హైస్కూలు
నర్సంపేట

## 20. ఖమ్మం

(పట్టణ)

వి. రమేశ్
9 వ తరగతి
మౌంట్ ఫోర్ట్ హైస్కూలు
ఖమ్మం

(గ్రామీణ)

యమ్. కిరణ్ కుమార్
9 వ తరగతి
జిల్లా పరిషత్ హైస్కూలు
బెందుకూరు
(వయా) మధిర

## 21. నల్గొండ

(పట్టణ)

కె. రమేశ్ రెడ్డి
10 వ తరగతి
గవర్నమెంట్ హైస్కూలు
కొట్టుగూడ
నల్గొండ

(గ్రామీణ)

చార్మతి పట్టాభిరామం
10 వ తరగతి
జిల్లాపరిషత్ హైస్కూలు
కోదాడ-508206

## 22. అనంతపూరు

**గమనిక** :-జనవరి 22, 1977 వరకు పోటీలో పాల్గొనే అభ్యర్థుల పేర్లు నమోదు చేయకపోవటంవలన పోటీ నిర్వహింపబడలేదు.

# ఇందలి వ్యాసకర్తలు

1. డా॥ దివాకర్ల వేంకటావధాని
   ఎం. ఎ., పిహెచ్. డి.
   18/4RT. బర్కత్‌పురా
   హైదరాబాదు-500027

2. డా॥ తిమ్మావజ్ఝల కోదండరామయ్య
   ఎం. ఎ., పిహెచ్. డి.
   ప్రొఫెసర్ ఇన్ తెలుగు
   మధురై యూనివర్సిటీ
   మధురై-625021

3. డా॥ అక్కిరాజు రమాపతిరావు,
   ఎం. ఎ, పిహెచ్. డి.
   రీసర్చి ఆఫీసర్ - తెలుగు అకాడమీ
   హిమాయత్‌నగర్
   హైదరాబాదు-590029

4. డా॥ వేటూరి శంకరశాస్త్రి
   ఆర్ష రసాయనశాల
   ముక్త్యాల పోస్టు-521184
   కృష్ణా జిల్లా

5. డా॥ శకుంతలా దవే
   ఎం ఎ. బిఎల్. ఎంఎస్.
   లెక్చరర్,
   గవర్నమెంటు ఆయుర్వేద కళాశాల
   17-3-2, సూర్యార్ దేవిడి
   యాకుత్‌పురా
   హైదరాబాదు-500023

6. బి. వి. నరసింహారావు, బి. ఎ. బిఇడి.
   రాజేంద్రనగర్
   గుడివాడ-521301
   కృష్ణా జిల్లా

7. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి
   2-2-118/2, న్యూ నల్లకుంట
   హైదరాబాదు-500013

8. పిడిద కామేశ్వరరావు
   రేడియో అన్నయ్యవీధి, మాచవరం
   విజయవాడ-520004

9. వసంతరావు వేంకటరావు
   4-53, వి. ఎమ్. ఎస్. ఎమ్. కాలనీ
   జ్ఞానపురం
   విశాఖపట్నం-530004

10. మండా సూర్యనారాయణ
    ఎడిటర్ : "శుభోదయ"
    రామనగర్
    విశాఖపట్నం-530003

11. మిరియాల రామకృష్ణ
    23-7-25, బులుసు వారాస్
    దుగ్గిరాల వీధి
    కాకినాడ-533001

12. ఎ. వి. యస్. రామారావు
    ఆధునిక విజ్ఞాన గ్రంథమాల
    శ్రీరామనగరం
    కాకినాడ-533003

13. పాలంకి వెంకటరామచంద్రమూర్తి
17-1-391/44, సుబ్రహ్మణ్యనగర్
సైదాపేట కాలనీదగ్గర
హైదరాబాదు-500659

14. కె. యల్. నరసింహారావు
రేపాల గ్రామం పోస్టు
(వయా) సూర్యాపేట,
ఇండస్ట్రియల్ ఎస్టేట
నల్గొండ జిల్లా
508214

15. A. చాగంటి తులసి, ఎం. ఎ.
లెక్చరర్ ఇన్ హిందీ
ఉమెన్స్ కాలేజి
బెర్హాంపూర్

B. ఉపద్రష్ట అనూరాధ
లెక్చరర్ ఇన్ ఇంగ్లిష్
బాబాజీ తోట
బెర్హాంపూర్-1

16. మద్దిపట్ల వెంకటరావు
5-2-50, జాంబాగ్ రోడ్
హైదరాబాదు-500001

17. కె. యస్. ప్రకాశం
లైబ్రేరియన్,
స్టేట్ సెంట్రల్ లైబ్రరీ
అఫ్ జల్ గంజ్
హైదరాబాదు

18. వెల్లటూరి పూర్ణానందశర్మ
నవరంగ్ చిత్రకళా నికేతన్
వెల్లటూరు-522257
తెనాలి తాలూకా

19. వి. ప్రభావతి, ఎం. ఎ.
లెక్చరర్
మహిళా మహావిద్యాలయం
ఎగ్జిబిషన్ గ్రౌండ్స్
హైదరాబాదు

20. రెడ్డి రాఘవయ్య
1-98/2, బాలానగర్
హెచ్. ఎ. యల్. పోస్టు
హైదరాబాదు-500042

21. మార్పు గోపీనాథ్
సబ్ ఎడిటర్, ఆంధ్రభూమి
సరోజినిదేవి రోడ్డు
సికిందరాబాదు

22. పాలగుమ్మి విశ్వనాథం
లలిత సంగీత నిర్వాహకులు
ఆకాశవాణి, హైదరాబాదు

23. ఎల్లోరా
ఆంధ్రప్రభ వీక్లీ
దోమల్ గూడ, హైదరాబాదు

24. అలపర్తి వెంకట సుబ్బారావు
నందివెలుగు పోస్టు
522 306
తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా

25. డా॥ పి. తిరుమలరావు
శిశువైద్య నిపుణులు
263, సంజీవరెడ్డి నగర్
హైదరాబాదు-38

26. బి. ఎ. రెడ్డి
సెంట్రల్ స్కూల్
గోల్కొండ
హైదరాబాదు-500 008

27. కె. ఆర్. కె. మోహన్
ఎ. పి. యస్. (అకౌంట్స్)
జూబిలీపోస్టు అఫీసు
హైదరాబాదు-500 002

28. న్యాయపతి రాఘవరావు
10, బాలానందం
నారాయణగూడా
హైదరాబాదు-500027

29. డా॥ తిరుమరాజు రామరాజు
ఎం. ఎ., పిహెచ్.డి.
1-8-117/2. చిక్కడపల్లి
హైదరాబాదు-500 020

30. డా॥ అంతటి నరసింహం
ఎం. ఎ., పిహెచ్.డి.
సాంస్కృతిక వ్యవహారాల
ప్రత్యేకాధికారి
3-4-706,
నారాయణగూడ మార్కెట్
హైదరాబాదు-500 027

31. వెలగా వెంకటప్పయ్య
సెక్రటరీ
జిల్లా గ్రంథాలయ సంస్థ
కడప-516 001

32. రాపూరి భరద్వాజ
159-2 RT, విజయనగర్ కాలనీ
హైదరాబాదు-500 028

33. ఎమ్. ఎన్. రావు, ఎమ్. ఎ.
ఎమ్. శేషాచలం అండ్ కంపెనీ
24, సుంకురామచెట్టి వీధి
మద్రాసు-600 001

34. బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు
6-6-395/1, గాంధీనగరం
సికిందరాబాదు-3

35. గోవిందరాజు రామకృష్ణారావు
కార్యదర్శి, అధికారభాషా కమిషన్
సచివాలయం
హైదరాబాదు

36. యశ్వంత సిన్హా, యోగాసనరత్న
సెయింట్ మార్టిన్ రోడ్డు
సికింద్రాబాదు-3

37. గాలి ప్రభావతి
లైబ్రేరియన్
తెలుగు అకాడమీ
హిమాయత్‌నగర్
హైదరాబాదు

38. మండలి బుద్ధప్రసాద్
రెడ్ హిల్స్ పోస్ట్
హైదరాబాదు

39. ఉత్పల సత్యనారాయణాచార్య
1-9-321/1, విద్యానగర్
హైదరాబాదు-500044

40. డా॥ ముకురాల రామారెడ్డి
ఎం.ఎ., పిహెచ్.డి.
తెలుగు అకాడమీ
హిమాయత్‌నగర్
హైదరాబాదు-500029

41. డా॥ నాయని కృష్ణకుమారి
ఎం.ఎ., పిహెచ్.డి.
898/2. నాగార్జుననగర్ కాలని
హైదరాబాదు

42. వాకాటి పాండురంగారావ్
ఇన్ఫర్మేషన్ ఆఫీసర్
పోర్ట్ ట్రస్ట్
విశాఖపట్నం-530001

43. బొన్నలగడ్డ వెంకటేశ్వరశాస్త్రి
ఎం. ఎ.
లెక్చరర్, లింగ్విస్టిక్స శాఖ
నిజాం కాలేజి
హైదరాబాదు

44. కుమారి యం. కె. దేవకి
రీసర్చి స్కాలర్
తెలుగు డిపార్ట్ మెంట్
శ్రీ వెంకటేశ్వర యూనివర్శిటీ
తిరుపతి-517501

45. డా॥ చల్లా రాధాకృష్ణశర్మ
నెం. 5 నాగార్జున నగర్
రంగరాజపురం
మద్రాసు-600024

46. డా॥ జీనత్ సాజిదా,
ఎం. ఎ., పిహెచ్.డి.,
రీడర్, నిజామ్ కాలేజి
హైదరాబాదు

47. బి. వి. సత్యమూర్తి
బి. 68, ఎఫ్-5
విజయనగర్ కాలనీ
హైదరాబాదు-500028

48. ఎం. యస్. మహాంతయ్య
కన్నడ లెక్చరర్
విశ్వవిద్యాలయ మహిళా కళాశాల
కోఠీ, హైదరాబాదు

49. కవిరావు
రాజవోలు పోస్ట్
(వయా) కనగాల
రేపల్లె తాలూకా

50. కొరిదె కమలా రఘుపతిరావు
ఎం. ఎ.,
రీడర్, సంస్కృతశాఖ
నిజాం కాలేజి
హైదరాబాదు

51. యం. పశుపతి, బి.ఎ., బి.ఇడి.
16-6-1, రైల్వేగేట్
వరంగల్-506002

52. పులిగడ్డ విజయలక్ష్మి
పబ్లికేషన్ అసిస్టెంటు
తెలుగు అకాడమీ
హిమాయత్ నగర్
హైదరాబాదు

53. జి. యస్. సూరి
10 బి, న్యూబజార్
త్యాగరాయనగర్
మద్రాసు-17

54. పి. వి. రాఘవరెడ్డి
ఫాకల్టీ అసోసియేట్
కేంద్రీయ హిందీ సంస్థాన్
ఆగ్రా-282001

55. కె. సభా
రచయిత, జర్నలిస్ట్
చిత్తూరు-517001

56. జి. యస్. వరదాచార్య
న్యూస్ ఎడిటర్, ఆంధ్రభూమి
సరోజినీదేవి రోడ్డు
సికిందరాబాదు

57. చెరుకుమిల్లి భాస్కరరావు
దూరదర్శన్
సోమాజిగూడ, హైదరాబాదు-4

58. పి. వి. కృష్ణంరాజు
జనరల్ మేనేజర్
బలరామకృష్ణా ట్రేడర్స్
7, నేతాజీ రోడ్
తిరుపతి-517501

59. తిరుమల రామచంద్ర
69, ఆదర్శ నగర్
హైదరాబాదు-500483

60. గంగిశెట్టి లక్ష్మీనారాయణ
రీసెర్చి అసిస్టెంట్
అంతర్జాతీయ తెలుగు సంస్థ
బర్కత్‌పురా
హైదరాబాదు

61. బుడ్డిగ సుబ్బరాయన్
సంయుక్త కార్యదర్శి
బాలల అకాడమీ
బర్కత్‌పురా
హైదరాబాదు-27

62. డి. వి. ఎస్. శర్మ
లెక్చరర్
సైఫాబాదు సైన్స్ కాలేజీ
హైదరాబాదు-4

63. ఎస్. వి. రమణరావు
డిప్యూటీ డైరెక్టర్
ప్రభుత్వ అనువాదశాఖ
హిమాయత్‌నగర్
హైదరాబాదు-29

## ఇందలి చిత్రకారులు

1. బి. వి. సత్యమూర్తి
బి. 68, ఎఫ్-5
విజయనగర్ కాలనీ
హైదరాబాదు

2. శీలా వీర్రాజు
సమాచార పౌరసంబంధశాఖ
గృహకల్ప, నాంపల్లి
హైదరాబాదు

3. కుమారి బి. సుధారెడ్డి, విద్యార్థిని
సెంట్రల్ స్కూలు, గోల్కొండ
హైదరాబాదు

## బాల కార్టూనిస్టులు

1. జి. లలితకుమార్
కేరాఫ్ : జి. వి. యస్. కె. వి. ప్రసాదరావు
19/1/10 జిడ్డువారి వీధి
విజయనగరం-2

2. ఎ. వాణిశ్రీ
కేరాఫ్: తెలుగు భాషాసమితి
యూనివర్శిటీ కాంపస్
హైదరాబాదు-500007

3. పి. వి. యస్. రామకృష్ణ
కేరాఫ్: పి. పట్టాభిరామారావు
యమ్.యస్.ఆర్ జిల్లాపరిషత్ హైస్కూలు
గుండుగొలను-534427
పశ్చిమగోదావరి జిల్లా

4. జి. జి. కె. వి. చిరంజీవి
కేరాఫ్: జి. పి. రావు
గాడెవారి వీధి
గుండుగొలను-534427
పశ్చిమగోదావరి జిల్లా

5. తోలేటి బాలాజీ
46-22-1, దానవాయిపేట
రాజమండ్రి-3

6. వి. అనిల్‌కుమార్
8 వ తరగతి
సత్యవతీ శిశుమందిర్
ఫతేపూరు రోడ్
కరీంనగర్-505001

7. ఎన్. తరుణీధర్
కేరాఫ్: యన్. వి. ఆర్.
రామారావు
5/176, గాంధీరోడ్
ప్రొద్దుటూరు
కడపజిల్లా

8. పి. రమేశ్
కేరాఫ్: పి. కొమరయ్య
3-13-23
కుమార్‌పల్లి
హనుమకొండ-506001

9. వి. యస్. సత్యనారాయణ (చంటి)
46, సుబ్రహ్మణ్యంనగర్
సైదాబాదు కాలనీదగ్గర
హైదరాబాదు-500659

10. ఎ. బాలకిషన్
ఇంటినెం. 1-5-123
మార్కెట్ రోడ్
జగిత్యాల
కరీంనగర్ జిల్లా

11. అలపర్తి వెంకటేశ్వరరావు
కేరాఫ్: అలపర్తి వెంకట
సుబ్బారావు
నందివెలుగు పోస్టు
తెనాలి తాలూకా

12. కె. దిలీప్

13. జి. వి. పి.

14. కె. హెచ్. రావు

15. దుర్గారావ్

16. సోమనాథ్

17. కిట్టు.




1976 సెప్టెంబరు 14 వ తేదీన బాలల అకాడమీకి రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభోత్సవం చేస్తున్న దృశ్యం



అకాడమి ప్రారంభోత్సవం సందర్భంగా తీసిన చిత్రం. కూర్చున్నవారు కుడినుంచి : అకాడమి కార్యదర్శి శ్రీ న్యాయపతి రాఘవరావు, శ్రీ సి. ఎస్. శాస్త్రి, శ్రీమతి ఎం. లక్ష్మీదేవి, విద్యామంత్రి, అకాడమి అధ్యక్షులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు, రాష్ట్రపతి సతీమణి బేగం అబిదాఅహ్మద్, రాష్ట్రపతి శ్రీ ఫక్రుద్దీన్ ఆలీఅహ్మద్, రాష్ట్ర గవర్నరు శ్రీ ఆర్. డి. భండారే, ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, స్త్రీ, శిశు సంక్షేమశాఖా మంత్రి శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య, డా. అంతటి నరసింహం, అకాడమి సంయుక్త కార్యదర్శి శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్. నిల్చున్నవారు కుడినుంచి : శ్రీ బాబ్జీ, శ్రీ మిరియాల రామకృష్ణ, శ్రీ మండా సూర్యనారాయణ, శ్రీ బి. వి. నరసింహారావు, శ్రీ పడిద కామేశ్వరరావు, శ్రీ కవిరావు, శ్రీ మునిరత్నం నాయుడు. శ్రీమతి అబిదా బిల్‌గ్రామి, శ్రీమతి ఊటకూరి లక్ష్మీకాన్తమ్మ, శ్రీమతి పి. వసుంధరాదేవి, కుమారి ఎం. కె. దేవకి, డా. ఎ. వనజాక్షి, శ్రీమతి టి. రత్నాబాయి. శ్రీయామర్తి గోపాలరావు, శ్రీ బి. కృష్ణంరాజు




బాలల మహాసభలను ఆర్థికమంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి ప్రారంభిస్తున్నారు




బాలల మహాసభలను ఆర్థికమంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి ప్రారంభిస్తూ ప్రసంగిస్తున్నారు



బొమ్మల రామాయణ గ్రంథం ఆవిష్కరించి ప్రసంగిస్తున్న విద్యామంత్రి
చిత్రంలో ఉన్నవారు శ్రీ బాపు, శ్రీ ఎం. ఎన్. రావు, అన్నయ్య, ఆర్థికమంత్రి.



విద్యామంత్రి బొమ్మల రామాయణం ఆవిష్కరిస్తున్నారు.
చిత్రంలో ముందువరసలో ఉన్నవారు : స్త్రీసంక్షేమ శాఖామంత్రి శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య, డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ, శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య.



డాక్టర్ మంగళంపల్లి బాలమురళీకృష్ణ "బాలభారతి" గ్రంథం ఆవిష్కరిస్తున్నారు.



వస్తు, పుస్తక, చిత్రకళా ప్రదర్శనను ప్రారంభించిన అనంతరం స్త్రీశిశుసంక్షేమ మంత్రి శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య, వేదికపై ఆసీనులైనవారు రేడియో అన్నయ్య, విద్యామంత్రి.



ప్రత్యేక సంచికను ఆవిష్కరించి ప్రసంగిస్తున్న అధికార భాషాకమీషన్ అధ్యక్షుడు శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య. వేదికపై ఉన్నవారు : శ్రీ ఎం. ఎన్. రావు, శ్రీమతి న్యాయపతి కామేశ్వరి, శ్రీ న్యాయపతి రాఘవరావు, విద్యామంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు, స్త్రీశిశుసంక్షేమమంత్రి శ్రీమతి కృష్ణవేణి సంజీవయ్య.



మహాసభలో పాల్గొన్న ఆదిలాబాద్ జిల్లా బృందం.



అనంతపూర్ జిల్లా బృందం.



కరీంనగర్ జిల్లా బృందం.



ఖమ్మం జిల్లా బృందం.



మహబూబ్ నగర్ జిల్లా బృందం.



మెదక్ జిల్లా బృందం.



నిజామాబాదు జిల్లా బృందం.



ప్రకాశం జిల్లా బృందం.



వరంగల్ జిల్లా బృందం.



పశ్చిమగోదావరి జిల్లా బృందం.



దురాశ నాటిక



శ్రీనివాసాచార్య కూచిపూడి నృత్యం.



అనూరాధ
సబ్ జూనియర్ నృత్యం.



కురుక్షేత్రం నాటికలో పాల్గొన్న
బాలబాలికలతో విద్యామంత్రి



లడ్డూదొంగ నాటకములో పాల్గొన్న
బాలబాలికలతో విద్యామంత్రి. అన్నయ్య.



దురాశ నాటికలో పాల్గొన్న
బాలబాలికలతో
విద్యామంత్రి, అన్నయ్య ప్రభృతులు.



బహుమతి అందచేస్తున్న
శ్రీమతి చెల్లాయమ్మ కృష్ణయ్య.




శ్రీ కె. పుల్లయ్య నాయుడు.

(ఫొటోలు : జనతా స్టూడియో
లక్డీకాపూల్. హైదరాబాదు-500 004)





విద్యా మంత్రితో మహాసభల కార్యకర్తలు



అకాడమి కార్యదర్శి శ్రీ న్యాయపతి రాఘవరావు, శ్రీమతి న్యాయపతి కామేశ్వరి,
విద్యామంత్రి, శ్రీమతి రమణా సుబ్బరాయన్,
అకాడమి సంయుక్త కార్యదర్శి శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్.

# గొప్ప అవకాశం! త్వరపడండి!

బాలల మనస్తత్త్వం, అవసరాలు ఎరిగివున్న మేధావులు వినోదం, విజ్ఞానం సమ్మేళించి రచించిన పుస్తకాలు. 'నెహ్రూ బాలపుస్తకాలయం' అనే శీర్షికలో నేషనల్ బుక్ ట్రస్ట్ ద్వారా విఖ్యాత తెలుగు రచయితలు అనువదించిన పుస్తకాలు. ఆకర్షణీయమైన బొమ్మలతో పిల్లలూ పెద్దలూ కూడా చదివి ఆనందించతగినవి.

**పిల్లిజాతి**

మృగయావినోది ఎమ్. డి. చతుర్వేది పిల్లివంశంలోని జంతువుల్ని గురించి రమ్యంగా వ్రాసిన పుస్తకం, తిరుమల రామచంద్ర అనువాదం. పేజీలు : 64 వెల : రు. 1-50

**మన రైల్వేల కథ**

రైల్వేల పుట్టుపూర్వోత్తరాలు, అవసరాలు, ఆధిక్యత వివరిస్తూ జగజీత్ సింగ్ విజ్ఞాన సుబోధకంగా రచించిన పుస్తకం. పురాణం సుబ్రహ్మణ్యం అనువాదం. పేజీలు : 64 వెల : రు. 1-50

**విదేశీయుల భారత దర్శనం**

ఎన్నోవేల సంవత్సరాల క్రితం మనదేశంలో ప్రజలు ఎలా వున్నారో కళ్లకు కట్టినట్లు చెప్పారు కె.సి. ఖాన్నా ఈ పుస్తకంలో, ప్రఖ్యాత గేయకవి బాలాంత్రపు రజనీకాంతరావు మృదుభాషలో అనువదించారు. పేజీలు : 64 వెల : రు. 1-50

**కాశ్మీరు**

మనదేశంలో అందానికి, వినోదయాత్రకీ ప్రఖ్యాతిగాంచిన కాశ్మీరు ప్రజలు ఎలా జీవిస్తారు, వారి ప్రత్యేకత ఏమిటి వర్ణించే అందమైన పుస్తకం; మూలాసింగ్ రచించగా, వి. రాధాకృష్ణ అనువదించారు.

**బసాపాని**

అస్సాము ప్రకృతి సౌందర్యము, కొండప్రాంతాల నివసించేవారి జీవిత సరళి, సమస్యలు అతి రమ్యంగా వర్ణించే లీలా మజుందార్ రచన. వి. పతంజలి అనువాదం.
పేజీలు : 64 వెల : రు. 1-50

**రోహంతుడు - నందియుడు**

జంతువులలో వుండే అపారమయిన దయ, త్యాగం, వర్ణించే జాతకకథ. కృష్ణ చైతన్య రచించిన ఈ పుస్తకాన్ని వాకాటి పాండురంగరావ్ అనువదించారు. పేజీలు : 64 వెల : 1-50

**తపాలా బిళ్లల కథ**

తపాలా బిళ్లల రంగుల చిత్రాలతో, వాటి వింతలు, విడ్డూరాలు, సేవ, ముద్రణ ఆసక్తిదాయకంగా వివరించే ఎస్.పి. చటర్జీ రచన; 'నళిని' అనువాదం. పేజీలు : 64 వెల రు. 1-50

**వీరుల కథలు**

మన పురాణేతిహాసాలలో అపూర్వ ధైర్యసాహసాలు, త్యాగనిరతి కనబరచిన ఆరుగురి వీరుల కథలు రాజేంద్ర అవస్థీ రమ్యంగా రచించారు. వేమూరి రాధాకృష్ణమూర్తి అనువాదం.
పేజీలు : 64 వెల రు. 1-50

**ముఖ్య విక్రేతలు :**

విక్రేత అధికారి,
నేషనల్ బుక్ ట్రస్ట్,
ఎ-5 గ్రీన్ పార్కు,
క్రొత్తఢిల్లీ - 100 016.

**ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు,**
రాష్ట్రపతిరోడ్డు,
సికింద్రాబాదు.

## బాలలూ!

## కాస్త ఆగండి.

## జవాబులు చెప్పండి చూద్దాం!

★ మన దేశపు పెద్దరేవులన్నిటిలోను అతిలోతైన నది ఏది?

★ లక్ష టన్నుల నౌకలకు ఆశ్రయం ఇస్తున్న రేవుఏది?

★ ఆసియాలో కెల్లా - అతిపొడవైన 9 కి. మీ.
"కన్వేయర్ సిస్టమ్" వున్న రేవు ఏది?

★ వందకోట్లరూపాయల ఖర్చుతో నిర్మించి
ఇటీవలే ప్రారంభించిన మేటి రేవు ఏది?

★ దేశవాణిజ్యానికి తోడ్పడడమే కాకుండా
15000 మంది సిబ్బందికి ఆశ్రయం ఇస్తున్న రేవుఏది?

[illegible]

[illegible]

Advt. XII—Andhra Pradesh Children's Conference—1977.

